# విష్ణుమాయానాటకము

చింతలపూడి ఎల్లనార్యకృతము.

# పీఠిక.

—:o:—

ఆంధ్ర వాఙ్మయ చరిత్రములో శ్రీకృష్ణదేవరాయల కాలము స్వర్ణయుగ మని చరిత్రకారు లనేకు లభిప్రాయపడి యున్నారు. పలయున నాంధ్రమహాకవులలోఁ బెక్కురు ఆ రాజన్యుని పోషణముఁగాని యాదరణముఁగాని పెరిఁగి వినూతనగ్రంథరాజములను రచించి యాంధ్రసరస్వతిని బహుముఖజ్యోత్స్నానందమునఁ దేజరిల్లునట్లు చేసిరి. శ్రీకృష్ణరాయచక్రవర్తి స్వయముగ నొక యాంధ్రప్రబంధోత్కృష్టగ్రంథమును "ఆముక్తమాల్యద" యను పేర రచించి తన యాస్థానకవులకు దారిచూపెను. తన యాస్థాన కవులలో నగ్రేసరుఁ డగు అల్లసాని పెద్దన్నచే మనుచరిత్రమును రచింపించి దానిని తా నంకితము గొనెను. అట్లే తనయాస్థానమునందుఁ బ్రాముఖ్యము నొందిన మఱియొక కవివరుఁ డగు ముక్కు తిమ్మనార్యుఁడు రచించిన పారిజాతాపహరణ కావ్యమునకుఁ గృతినాయకుఁ డయ్యెను. ఇంకను మాదయ్యగారి మల్లన్న, ధూర్జటి మున్నగు కవిపుంగవులు తాము రచించిన గ్రంథములన్ను రాయలవారి కంకితమిచ్చియుండిరనియు, ఆచక్రవర్తి యాస్థానమం దుండి వారిచేఁ బోషింపఁబడినట్లు చరిత్రాధారములు గాన్పించుచున్నవి. ఈకవు లందఱును వారిగ్రంథరాజముల మూలమున నాంధ్రులకుఁ బరిచితులై తమ్ము దమపోలికను, ఆంధ్రుల హృదయపీఠములఁ జిరస్థాయులుగాఁ జేయఁగలిగిరి.

వీరికి సమకాలికుఁడై వీరివలనే శ్రీకృష్ణరాజేంద్రుని కొలువున నుండి, ఆ తేని మన్ననలకుఁ బాత్రుఁడైన యొక కవిశేఖరుఁడింతదనుక విధివిపాకమున నాంధ్రుల దృష్టిలోఁ బడక యజ్ఞాతవాసమును జేయవలసివచ్చెను. అతఁడు చింతలపూఁడి యెల్లనార్యుఁడు. ఎల్లనార్యుఁ డొక యాంధ్రమహాకవి. అతఁడు శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున నుండి తాను రచించిన రాధామాధవమను ప్రబంధరాజము నా కవిచక్రవర్తికి వినిపింప దాని యసదృశమనోజ్ఞత్వమునకు సచ్చెరువొంది యారసజ్ఞశేఖరుఁ డాకవికి "రాధామాధవకవి" యని యొక విశిష్టనామమును బిరుదముగా నిచ్చెను. అట్టి యద్భుతకావ్యప్రణేత ప్రాచీనగ్రంథాగార వివరములలో ననాదృతస్థితిలో నుండి కొలఁది కాలముక్రిందటివఱకు నాంధ్రుల యెఱుకలోనికి రాకుండుట మిక్కిలి శోచనీయమైన విషయము. భూగర్భమున నిక్షిప్తమైన కోహినూరువజ్రమును వెలికిఁ దీసినట్లు, ఈమహాకవిని చెన్నపురివిశ్వకళాపరిషత్తువారు తొలుదొల్త బయలుపఱచి యతని యుత్తమగ్రంథ మగు విష్ణుమాయానాటకమును విపులపీఠికతోఁ బ్రకటించిరి. అటుతర్వాత గోదావరీమండలమున నున్న కపిలేశ్వరపురాధనాయకుల యాదార్యమూలమున నీకవియొక్క ప్రథమప్రబంధ మని చెప్పనొప్పు రాధామాధవము ముద్రితమై ప్రచురింపఁబడినది. అంతట, విద్వత్ప్రభువులును, మనోజ్ఞకావ్యరసికశిఖామణులును అగు శ్రీపీఠికాపురరాజ్యరమాధవు లగు శ్రీరాజా రావు వేంకటకుమార మహీ

పతి సూర్యారాయబహద్దరు మహారాజులుంగారీ కవివరే ణ్యుని కావ్యరసాస్వాదనముఁ జేసి మరందబిందునిష్యందమంజరీ యుతము లగు నీకావ్యవల్లరుల కచ్చెరువొంది యిట్టియసమాన భాసమానకవితాప్రావీణ్యము గల కవి విశుద్ధయశఃప్రతిష్ఠ కర్హుఁడు గాక తక్కొరు లర్హు లగుదురా యని తలపోసిరి.

మదరాసు విశ్వకళాపరిషత్తువారు ముద్రింపించినదియు నీ కవీంద్రునిచే రచిత మైనదియు నైన విష్ణుమాయానాటకమును శ్రీ పిఠాపురము మహారాజావారు చదివి దానియందుఁ గొన్ని స్ఖాలిత్యము లుండుట గనిపెట్టి, యుత్తమప్రాచీనాంధ్రకవీశ్వరులలో నొకరిచే రచింపఁబడిన యీయుత్తమగ్రంథమున కిట్టి యవస్థ తగదని యోచించి వారి యాస్థానమందలి కవీశ్వరులగు శ్రీయుత ఓలేటి వేంకటరామశాస్త్రిలవారిచే సమగ్రపరిశోధనముఁ జేయించి యేతద్గ్రంథమును బునర్ముద్రితముఁ గావించి తమసంస్థానమునఁ సంగ్రథితమైనయాంధ్రగ్రంథమాలలో నొక నూతనప్రసూనముగఁ జేర్పించిరి.

శ్రీవారు ముద్రింపించిన యేతద్గ్రంథమును మదరాసు విశ్వకళాపరిషత్తువారు ముద్రింపించిన గ్రంథమును సహృదయులు పరిశీలించిన నుభయగ్రంథముల తారతమ్యమును దేటతెల్ల మగును. పైనఁజెప్పినరీతిని మదరాసువిశ్వకళాపరిషత్తువారు ప్రకటించిన ప్రతియందుఁ గాన్పించెడు తప్పులలోఁ గొన్ని ముద్రితపత్రముల నందందు సూక్ష్మపరిశీలనము చేయింపకపోవుటచే ఘటిల్లిన వని తెలియ

వచ్చినను గొన్నిదోషము లన్వయప్రమాదాదులవలనఁ గలిగిన వని స్ఫురింపక మానవు. ఈ పునర్ముద్రణమున సంస్కరింపఁబడిన తప్పులలోఁ గొన్నిటినిమాత్రము మచ్చున కిచ్చుటఁ జేర్చితిని.

ప్రథమముద్రణపాఠము:—

ఉ. ఇందు కులప్రభూతపృథివీశ్వరుఁ డొదల పట్టభద్రి ల
క్ష్మీందనరారి యొక్కఁగఁ బ్రసిద్ధికి నెక్కిన యాసముజ్జ్వల
త్సుందరరత్న సింహముల శోభిలుచున్న పసిండిగద్దెఁ బెం
పొందఁగ నింద్రులీలఁ గొలువుండె సమస్తనృపదీపితాంఘ్రుఁడై

ఆ౧. ౫౧

సంస్కరింపఁబడిన పాఠము:—

ఉ. ఇందుకులప్రభూతపృథివీశ్వరు లొందలఁ బట్టభద్ర ల
క్ష్మీం దనరారి యొక్కఁగఁ బ్రసిద్ధికి నెక్కినయాసముజ్జ్వల
త్సుందరరత్నసింహముల శోభిలుచున్నపసిండిగద్దెఁ బెం
పొందఁగఁ నింద్రులీలఁ గొలువుండె సమస్తనృపదీపితాంఘ్రియై

ప్రథమముద్రణము.

వ. ఇవ్విధంబున వినోదించుచు రుక్మిణీదేవి తనమనంబున నిట్లనియె.

ఆ౧. ౧౬౧

ఉ. నాకును బారిజాతము మనంబెసలారఁ గనిచ్చెఁ బ్రేమతో
నాకడనే యహర్నిశము నాయకుఁ డుండఁగ వంతఁగుందుచున్
వ్యాకులి తాత్మయై యెటులు వర్తిలుచున్నదొ సత్యభామనేఁ

డాకత చూతమంచు దరహాస విలాస విభాసితాస్యయై.
ఆగ. ౧౬౨

వ. ఒక్క చతుర సంచారికం బిలిచి క్రొవ్విరి పారిజాతమంజరులు
గొన్నికోయించి......... ఆగ. ౧౬౩

సంస్కరింపఁబడినపాఠములు:—

వ. ఇవ్విధంబున వినోదించుచు రుక్మిణీదేవి తన మనంబున

ఉ. నాకును బారిజాతము మనం బెసలారఁగ నిచ్చి ప్రేమతో
నాకడనే యహర్నిశము నాయకుఁ డుండఁగ వంతఁగుందుచున్
వ్యాకులితాత్మయై యెటులువ ర్తిలుచున్నదొ సత్యభామ నేఁ
డాకత చూతమంచు దరహాసవిలాసవిభాసితాస్యయై.

వ. ఒక్క చతురసంచారికం బిలిచి క్రొవ్విరిపారిజాతమంజరులు
గొన్నికోయించి.........

ప్రథమముద్రణము.

క. ఏమార్గంబున వచ్చెనొ
యీమాయావేషధారి యిచటికె నీకాం
తామణి నెప్పుడు దనిపెనొ
కామకుశల నింతహృదయకంజంబలరన్. ఆగ. ౧౬౪

సంస్కరింపఁబడిన పాఠము.

క. ఏమార్గంబున వచ్చెనొ
యీమాయావేషధారి యిచటికె నీకాం

తామణి నెప్పుడు దనిపెనో
కామకళల నింత హృదయకంజం బలరన్.

ఇట్లే యనన్వితమ్ములైన యనేకపాఠములు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందలి మాతృకనుబట్టియు నాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునందలి తాళపత్త్రప్రతినిబట్టియు మిక్కిలి జాగరూకతతోఁ బరిశీలించి సంస్కరింపఁబడినవి. మఱియును ముద్రణాదిదోషము లెన్నియో సవరింపఁబడినవి. గ్రంథవిస్తర భీతిచే స్థాలీపులాకన్యాయముగ నివిమాత్రమే చూపఁబడినవి కాని యింకను మఱి యెన్నియో కలవు. వాని నన్నిటిని బాఠక మహాశయులు పరికింతురుగాక !

చింతలపూఁడి యెల్లనార్యుఁడు శ్రీవత్స గోత్రమునకుఁ జేరిన విప్రవంశసంజాతుఁడు; కృష్ణభట్టారకుని పౌత్రుఁడును, కామనార్యునకును లచ్చమాంబకును జననమొందిన పుత్రుఁడును. ఈతని జన్మస్థానమునుగుఱించి పలువురు విమర్శకులు పలువిధముల నభిప్రాయపడుచున్నారు. ప్రథమమున మ॥రా॥రా॥ శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తాము వ్రాసిన విష్ణుమాయానాటకపీఠికలో నీ విషయమునుగూర్చి విపులముగాఁ జర్చించి సహేతుకముగా నీ కవి బహుశః తూర్పుగోదావరిజిల్లా అమలాపురముతాలూకాలో నున్న చింతలపూఁడిగ్రామస్థుఁడుగ నుండవచ్చు నని నిర్ణయించిరి. తరువాత కీ. శే. నడకుదుటి వీరరాజుగారు తమ రాధామాధవ ప్రబంధపీఠికలో నొక విచిత్రవాదము చేసియీకవీశ్వరుని మూఁడు

జిల్లాలకు ముడిపెట్టిరి. ఇట్లుండ మ॥రా॥రా॥ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తాము వ్రాసిన రాధామాధవగ్రంథ విమర్శన ములో *నీ కవి విశాఖపట్టణముజిల్లా వీరవల్లి తాలూకాలో నున్న చింతలపూఁడి గ్రామనివాసి కావచ్చునని యూహించిరి. ఈ నిర్ణయమునకుఁగాను వారు చూపిన యుపపత్తులు విజ్ఞులాదరింపఁ దగిన వని నా యభిప్రాయము. ఇది యిట్లుండ ఎల్లనార్యుని గ్రంథములనుండి మనము నిదర్శనములకొఱకు వెదకి చూచినచోఁ గొన్ని కాన్పించుచున్నవి.

ఎల్లనార్యుఁడు రాధామాధవములో శ్రీనాథుని స్తుతించి వ్రాయుచు:—

శా. సూనాస్త్ర ప్రమదామదస్ఫురిత వక్షోజాత కాఠిన్యమున్
బూనం జాలు వచోవిలాసముల నేర్పుల్ చూపి కర్ణాటక
క్ష్మానాథేంద్రుసభాంగవిత్వవిజయోత్సాహంబుఁ గైకొన్నమా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీలోన్నసన్.

అని "మా శ్రీనాథుఁ" డని నుడివెను. ఇట్లు చెప్పుటలో శ్రీనాథునితో బంధుసంబంధమే మైన నుండెనేమో యని యను

---

* ఆ. సా. ప. ప. సంపుటము 25 సంచిక 2.

చింతలపూఁడి యను నింటిపేరు గల బ్రాహ్మణ కుటుంబములు వేంకటరావుగారు చెప్పిన ప్రదేశములలో నున్నట్లు నా భోగట్టాకు రాలేదు.

మానము గలుగుచున్నది. శ్రీనాథుఁడు పుట్టుకచే గుంటూరు నెల్లూరు జిల్లాల వాఁడయ్యును గొంతకాలము గౌతమీతీరమున రాజమహేంద్రవరపట్టణమందు రెడ్డిరాజులకడఁ గడపినాఁడు గాన గోదావరిజిల్లావాఁడైన యెల్లనార్యుఁ డామహాకవితోఁ గొంత బాంధవ్య ముండినట్లు చెప్పుకొనుటయం దేమియు వింత యుండదు. ఈ కవి తన తారకబ్రహ్మరాజములోఁ గృతిపోషకుఁ డగు నంజ తిమ్మయను వర్ణించుచు నిట్లు చెప్పెను.

ఉ. నావుడు నీకు నంకితమొనర్పఁ దలంచినవాఁడ బంధుసం
భావన నీకు నిష్టముగ బ్రహ్మమయుం డగు రామభద్రధా
త్రీవరమౌళి కంకిత మిదే యొనరించిన మంచి పైఁడికిం
దావి ఘటిల్లె నేమి యన నంజయతిమ్మ వివేకభూషణా!

ఈ పద్యమందును నంజ తిమ్మయవలన 'బంధుసంభావనము' నొందినట్లుగాఁ జెప్పికొనెను. ఇచ్చటి బంధుత్వము రక్తసంబంధమైన దైనయెడలఁ గర్ణాటబ్రాహ్మణుఁ డగు నంజ తిమ్మయతోపాటు నీ కవియు బళ్ళారి సీమప్రాంతములవాఁడై యుండవలెను. బహుశః ఇచ్చట సూచింపఁబడిన బంధుసంభావనము బంధుత్వముతో సమానమైన మైత్రియే యని యూహించుట లెస్స.

వీనియన్నిటికంటె నెక్కువయైన యాధార మొకటి యాతని కడపటిగ్రంథ మగు విష్ణుమాయానాటకమునుండి మనము చూపఁగలము. ఆ గ్రంథమునందలి పంచమాశ్వాసమును బరిశీలించి చదివినచో నచటఁ గొంత సూక్ష్మాంశములతోఁ గూడిన స్థానికజ్ఞానము

మనకుఁ గాన్పించుచున్నది. ఆ స్థానికజ్ఞాన మచ్చట నివసించిన వారికిఁ గాని యితరులకుఁ గలుగుట దుర్లభము. ఏలయనఁగా నా స్థానికవిషయములు పురాణములందుఁ గాని మఱి యితరగ్రంథములందుఁ గాని చెప్పఁబడియుండలేదు. కావున వానియాధార మీ జన్మస్థాననిర్ణయములో నెక్కువగా నుపకరింపఁదగినదై యున్నది.

పంచమాశ్వాసములో నారదమహామునిపరాభవమును జెప్పునప్పుడు మహావిష్ణువు సర్పవరక్షేత్రమున నొక జడదారి వేషము ధరించి యొక యాశ్రమము నేర్పఱచుకొనె నని నుడువఁబడినది. ఆసందర్భమున సర్పవరక్షేత్రస్థానమును వర్ణించు నపుడీ కవి యీక్రింది విధముగ వ్రాసెను.

క. నేదిష్ఠదక్షిణాశా
ప్రాదుర్భూతార్ణతుల్యభాగాజలజా
మోదభరిత మామారుత
మాహాత్మ్యారాతిహృదయ మలరఁగఁ జేసెన్,

క. సవిధప్రాచీనమహా
లవణజలధిఘుమఘుమితకలధ్వని కెనయై
సవనాస్తుశ్రోత్రసుఖ
వివిధరవం బావనమున నీనులఁ దనిపెన్.

పైపద్యములందుఁ గ్రింద గీఁతలు గీచినపదములు చక్కఁగ యోచించుకొన్నిన సర్పవరక్షేత్రస్థలనిర్ణయము బహుసూక్ష్మపరిశీ

లనముతోఁ జేయఁబడిన దని స్పష్టముగ గోచరించుచున్నది. ఇది యేపురాణములనుండియు సంగ్రహింపఁబడినట్లు గాన్పించదు. కావున స్థలపరిచయము పూర్తిగాఁ గలిగిన మానవుఁడే యీ యథాస్థితి వర్ణనము చేయఁగలఁడు. ఈ హేతువున నీ కవీశ్వరుఁడు తూర్పుగోదావరిజిల్లావాఁడు గాని విశాఖపట్టణపు జిల్లావాఁడు గాని కావలయును. ఈ క్షేత్రవర్ణనమునకుఁ దోడు మఱియొక విశేషాంశము విష్ణుమాయానాటకమునఁ జూడనగును. మూఁడవ యాశ్వాసమునఁ బుండరీకుని కథ నభివర్ణించుచు యమునానదీతీర వాసియు నౌత్తరాహుఁడు నగుపుండరీకుఁడు మహాక్షామము తన దేశమును బీడించుచుండ సుభిక్షమగు నొండుదేశమునకుఁ దాను బోవ నుద్దేశించి యిట్లు వాక్రుచ్చెను.

గీ॥ పొలఁతి! విను పూర్వదక్షిణభూము లెల్ల
నెపుడు దుర్భిక్షదోషంబు నెఱుఁగ వందు
బహునదీమాతృకలు గాని ప్రతిదినంబు
దివి నిరీక్షించు దేవమాతృకలు గావు.

సీ॥ కర్ణాటరాజ్యంబు గంభీరతుంగభ
ద్రాజలౌఘంబులఁ దఱచు పండు
ద్రావిడదేశ ముత్తరళోర్మిరమ్యకా
వేరి కాలువల ముక్కారుఁ బండుఁ
ద్రైలింగ్యమధ్యభూతలము కృష్ణాగౌత
మీప్రవాహంబుల మిగులఁ బండుఁ

గాళింగమధ్యదిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలఁ బండు

గీ॥ వెండియును జిత్రి మి ట్లనావృష్టి యైన
నంబుజాక్షి ! నభోనభస్యద్వయమున
వర్ష మొప్పార గౌతమి వరద ముంపఁ
బార్శ్వములయూళ్లుఁ బదివేలుఁ బండు నెపుడు.

సీ॥ ఏతోఁవఁ జూచిన నేపొద్దు సలిలాన్న
సత్త్రశాలాజనసంభ్రమంబు
లేయూరఁ జూచిన నెల్ల ధాన్యంబులు
కోరుపట్టెడు ప్రజాఘోషణంబు
లేయిండ్లఁ జూచిన నిందిరాకరసంత
తోత్సవతోరణాభ్యుదయరేఖ
లెవ్వరిఁ జూచిన నివ్వటిల్లెడు దయా
దానసౌజన్యవిద్యానిరూఢి

తే॥ యెచటఁ జూచినఁ గనుపండు విందువదన !
నారికేళామ్ల పనస పున్నాగ ముఖ్య
భరితశృంగార వనపరంపరలచేతఁ
గోరికలు ముంచు గౌతమీతీరభూమి.

తే॥ దివ్యమై తగు గౌతమీతీరభూమి
భోగమోక్షంబులకు జన్మభూమి సువ్వె

జన్మసంస్కారఫలవిశేషంబు గలుగు
వారలకుఁ గాని గలుగ దవ్వసతిసుఖము.

భారతదేశమందలి పూర్వ దక్షిణ భాగములలో నున్న నదీ మాతృకప్రాంతములను జేరుకొని గౌతమీపరిపాలితదేశ మన్ని టికంటె సమస్తభోగభాగ్యములతోఁ దులఁదూఁగు చుండు నని నిశ్చయించి తన భార్య వనితను గుమారునిఁ దీసికొని గౌతమీ ప్రాంతమునకు వచ్చి యామహానదియం దవగాహనముఁ జేసి యెదుటిదరిఁ జేరి యచ్చట నున్న వేదగ్రామ మందు భిక్షుకోటికిఁ దిరుగాడె నఁట. ఈభాగమంతయుఁ జదివిన గోదావరీనదీప్రాంత పువా రెవ్వరో జన్మస్థలాభిమానులై యిట్లు రచించి యుందు రని యభిప్రాయము గలుగక తప్పదు. ఈ బలమైన రెండుపపత్తుల సాహాయ్యమున నీకవీశ్వరునిజన్మస్థానము స్థిరయించినచోఁ దూర్పు గోదావరిజిల్లాలో నున్న అమలాపురముతాలూకాయందలిచింతల పూఁడిగ్రామమువాఁ డేమో యని ప్రబలమైన యనుమానము గలుగుచున్నది. కృష్ణదేవరాయలు కళింగదేశమును జయింపఁ గోరి పురుషోత్తమగజపతితో యుద్ధము చేసి యోడించి సింహాచలమువఱకు వచ్చి యచ్చట పొట్నూరియొద్ద జయస్తంభమును బ్రతిష్ఠించిన విషయము చరిత్రాత్మకమే. ఆమహాపురుషుఁడు మగుడి తన దేశమునకుఁ బోవునపుడు కళింగదేశమునుండి పండితులనుఁ గవులనుఁ గొందఱిని వెంటఁ దీసికొనిపోయె నని కూడఁ జరిత్రాధారములవలనఁ దెలియవచ్చుచున్నది. అట్టివారిలో నీ

కవీశ్వరుఁ డొకఁడు కావచ్చును. విశాఖపట్టణముజిల్లాతోపాటు తూర్పుగోదావరిజిల్లాకూడఁ బూర్వమునఁ గళింగదేశమందలి యంతర్భాగమే. కావునఁ జింతలపూఁడి యెల్లనార్యుఁడు తూర్పు గోదావరిజిల్లాలో నున్న చింతలపూఁడి గ్రామస్థుఁ డై యుండె నేమో యని యభిప్రాయపడుట ప్రస్తుత ముపలబ్ధాంశములఁ బట్టి సమంజస మని తోఁచుచున్నది.

కృష్ణరాయ సందర్శనార్థమై యెల్లనార్యుఁడు తదాస్థానము నకుఁ బోవఁగా నాంధ్రకవితాపితామహుఁడును రాయలయాస్థాన మహాకవియు నైన యల్లసాని పెద్దన్న 'నగరు, తగరు, తొగరు, వగరు' అనుపదములను బ్రాసస్థానములం దుంచి రామాయణ భారత భాగవతపరములుగఁ బూరించు మని యెల్లనార్యుని గోరెనఁట. అంత నిండుయౌవనమున నున్న యెల్లన యీక్రింది విధముగఁ బద్యముల నాశువుగాఁ జెప్పె నఁట.

1. రామాయణము:—

చ. 'నగరు పగాయె,నింక విపినంబుల కేఁగుఁడు, రాజ్యకాంక్షకున్
దగరు కుమారులార!'యని తల్లి వగ ల్మిగులంగఁ దోఁపగాఁ
దొగరున రక్షఁ గట్టి మదిఁ దోఁచక గద్గదకంఠ యై
వగరుచుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

2. భారతము:—

చ. తొగరుచి కన్నుదోయిఁగడుఁదోఁచఁగఁగర్ణుఁడుభీమసేనుపైఁ
దగరు ధరాధరంబుపయిఁ దాఁకినభంగిని దాఁకి నొచ్చి తా

వగరుచుచున్ వెసం బరుగువాజీన నచ్చటిరాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁజేసి ధరాతలేశ్వరా!

3. భాగవతము:—

చ. వగరుపుమాత్రమే వరుఁడు వశ్యుఁడుకాఁడు సఖి!సఖత్వ మె
న్నగరుడవాహనుండు మము నాఁడటు దించుట యెల్ల నుద్ధవా
తగ రని కాక మోహపులతాతను వైన విడంగఁ జూతురే
తొగరుచి యోషధీశునకుఁ దోఁపఁగఁ జేయునె పీడనాడఁగన్

చింతలపూఁడి యెల్లనార్యుఁడు రచించిన గ్రంథములలో మన కిప్పటి కుపలబ్ధము లైనవి మూఁడుమాత్రమే. 1. రాధామాధవము 2. తారకబ్రహ్మరాజము 3. విష్ణుమాయానాటకము. ఈగ్రంథముల రచనాక్రమముగూడ నిదియే యని తోఁచుచున్నది. ప్రథమమున రాధామాధవము రచించి శ్రీకృష్ణదేవ రాయలను మెప్పించి యాతనివలన రాధామాధవకవి యను బిరుదము నొందెను.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి తా
మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రీపతిమానసత్కృవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవనామ మందినజగత్ప్రఖ్యాతచారిత్రుఁడన్.

ఈ బిరుదమునే మిగిలిన రెండు కావ్యములలోను చేర్చుటచే నా కావ్యములు దీనితర్వాత నితనిచే వ్రాయఁబడిన వని యూహింపవలసియున్నది. ఇంతియే గాక రెండవ కావ్య మగు

తారకబ్రహ్మరాజమందు, అచ్యుతదేవరాయలను జేర్కొను టచే నా గ్రంథము రాధామాధవము తర్వాతనే వ్రాయఁబడిన దని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. విష్ణుమాయానాటకరచనా కాలము నిర్ణయించుట కిట్టి చారిత్రకావకాశ మంతమాత్రము ను లేదు; గాని శైలినిబట్టియు శిల్పమునుబట్టియు నాగ్రంథ మీ రెంటికంటెఁ గడపటి దని నిర్ణయముచేయుట సరిగా నుండును.

రాధామాధవ మైదాశ్వాసములుగల శృంగారప్రబంధము. దానియందలి కథ రాధామాధవుల ప్రణయజీవితము. ఇట్టి కథనే గీతగోవిందము, లేక, అష్టపదులు, అను సంస్కృతకావ్యమున జయదేవుఁడను కవి యత్యంతమృదుమధుర మగుభాషతో నభి వర్ణించెను. ఆకావ్యముయొక్క శృంగారగీతాలాస్య మహత్త్వ కీర్తిని క్రీ. శ. పండ్రెండవశతాబ్దమందలి గౌడదేశప్రభు వగు లక్ష్మణసేనమహారాజు విని యా కవిని దన యొద్దకు రప్పించి తన సమక్షమున దానిని బాడించెను. అంతటఁ దన్మయుఁడై యా గ్రంథమందలి "పద్మావతీచరణచారణచక్రవర్తి" యను చరణ మునే యాకవికి బిరుదనామముగా నొసంగెను. అట్లే శ్రీకృష్ణ దేవరాయలుగూడ నీయాంధ్రజయదేవుఁ డగు ఎల్లనార్యునకుఁ దన గ్రంథనామమును బిరుదనామముగా నొసంగెను. ఎల్లనార్యు నకు జయదేవునియం దున్న గౌరవాభిమానములు రాధామా ధవమందలి యీక్రింది పద్యమువలన విదితము లగుచున్నవి.

క. నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబుఁ జెప్పిన విద్యా
చతురాననుఁ నీలాచల
పతిహితు జయదేవసుకవిపంచప్రదరున్.

అట్లైనను, ఎల్లనార్యుఁడు రచించిన రాధామాధవప్రబంధమునకును జయదేవకవి విరచితమైనగీతగోవింద మనెడు రాధామాధవమునకును * నామమాత్రసామ్యము తప్ప వేఱు సాదృశ్యము పొడఁగానము. గీతగోవిందములో నున్నరాధ గోపికాగణములోనిది యై మాధవునకు నిత్యానుసారిణియైన పరకీయ నాయిక. మాధవునియందలి యసదృశప్రణయమహిమచే నామె యాతనియందు జీవితతన్మయత్వము నొందినది. ఎల్లనార్యుని రాధామాధవమునందు రాధ కృష్ణుని పరివారగోపికాజనములోనిది గాక వేఱె యొకరాజకుమార్తె. సరస్వతీనారదుల

* గీతగోవిందము వ్రాసిన జయదేవకవి రాధామాధవ మను కావ్యమును రచించియుండునేమో యని యొకరూహించిరి; కాని యది సమంజసముగ నున్నట్లు దోఁపదు. గీతగోవిందమందు రాధను పరకీయకన్యగాఁ జిత్రించిన జయదేవకవి తాను రచించిన మఱియొక గ్రంథములో నామెను మాధవ వివాహితయగు స్వీయఁగాఁ జిత్రించుట పొసఁగదు. అట్లుచిత్రించినఁగాని యా గ్రంథము ఎల్లనార్యుని ప్రబంధమునకు మాతృకగా నుండదు. పోనీ, మఱియొక జయదేవకవిని యెల్లనార్యుఁడు పేర్కొనెనా యని యూహింతమన్న సాహిత్యలోకమునఁ గీర్తిఁగన్న జయదేవుఁ డొక్క గీతగోవిందకర్తయే. వేఱొకని కంత ప్రశస్తి లేదు.

దాత్త్యములవలనఁ బ్రేరితమై కృష్ణునియందు మోహ మగ్గల ముగ నొందెను. ఆకారణమునఁ దండ్రి స్వయంవరముఁ జాటించి నను, ఆస్వయంవరమున శ్రీకృష్ణునే వరించెను. కావున నీమె స్వకీయనాయిక. దీనినిబట్టి చూడ నెల్లనార్యుఁడు తనకథ నెంత మాత్రమును జయదేవకావ్యమునుండి సంగ్రహింపక మృదుభా వములను మధురభావను మాత్రమే గ్రహించికొనె నని తెల్లమగుచున్నది. ఎల్లనార్యుని రాధామాధవ కథయొక్క ఛాయ బ్రహ్మవైవర్తపురాణమున నున్నది; కాని యీకథాకథనమంతయు నాపురాణమునుండి సంగ్రహింపక కవి స్వయముగ శ్రీనాథ పోతనాదుల ప్రబంధములతీరునఁ బెంచి రచించెను.

ఎల్లనార్యుని రెండవ గ్రంథమగు తారకబ్రహ్మరాజము చాలవఱకుఁ దన్నామక మగుగీర్వాణకావ్యమునుండి యాంధ్రీక రణ మని కవివాక్యములఁబట్టియే నిర్ణయింపవచ్చును.

గీ. యతివరేణ్యుండు నారాయణాశ్రములు మ
హానుభావులు నొడివిరి యాగమాంత
పరిచితంబైన తారక బ్రహ్మరాజ
మఖిల (వేదాంతసారాంశమైనదాని)

క. ఆ ధీరునిగతిఁ దెనుఁగున
రాధామాధవుని సుకవిరత్నము చెప్పెన్
వేధోమునివరబుధ గం
గాధరజప్యంబుఁ దారక బ్రహ్మంబున్.

పరమ భాగవతోత్తముండును, ప్రయాగక్షేత్రవాసియు నగు 'నారాయణశాస్త్రులు' అను నొకమహాయతీంద్రుం డీ కావ్యమును సంస్కృతమున రచించె ననియు దాని నీతం డాంధ్రీకరించెఁ దత్కృతిసమర్పణమునకు నంజ తిమ్మరుసు తన్నుం బేఁడె ననియు నెల్లనార్యుఁడే తన గ్రంథపీఠికయందుఁ జెప్పుకొనెను. ఆ నంజ తిమ్మరుసు, అచ్యుతదేవరాయలయొద్ద కందాచారలేఖకుఁడును మంత్రియు నై యుండెనఁట. ఆతని ప్రేరణవలన నీకావ్యకృతి సమర్పణము రామభద్రునకే చేసెను. తారక బ్రహ్మరాజమం దలికథ ముఖ్యముగ శ్రీరామనామముయొక్క తారక ప్రభావమును జాటుచున్నది. శ్రీరామనామమంత్ర తారకమాహాత్మ్యమును విశదీకరించుటకు ననేకమునిపుంగవుల ప్రసంగములను రామేశ్వరతీర్థ యాత్రా ఫలము మున్నగు వాని ననేకములను జెప్పుచు సందర్భవశమున నొక విలక్షణ మైనకథనుగూడ నారాయణశాస్త్రులవారు తమగ్రంథమున రచించిన కారణమున నాకథనే యీకవియు సంగ్రహించి యభివర్ణింపవలసివచ్చినది. కథయందలి గుణదోషములెవ్వైయెనను నారాయణశాస్త్రులవారివే గాని మన కవీశ్వరునికిఁ జెందఁజాలవు. ఒక విప్రోత్తముఁ డొక బోయవనిత తగులములలోఁ బడి దానిని భర్తృగృహమునుండి లేవఁదీసికొని దేశాంతరమునకుఁ బోవ నాభర్త వారిని వెన్నంటి యాదేశపురాజుసమక్షమున వారిని విధింప నా రా జాబోయనాయకునికి మరణదండన విధించెను. మృతినొందిన వీరు ముగ్గు

రును మరణసమయమున రామనామ ముచ్చరించుచున్న చిలుక పలుకులు విని మోక్షము నొందిరి. ఈ కథ కొంత యేవగింపు గలుగఁజేయుచున్నను గథనాసామర్థ్య మద్భుతరసావహముగ నుండుటచే నెల్లనార్యుని కవితాశిల్ప మీప్రబంధమునం దెక్కు వ చాతుర్యముఁ గనఁబఱచుచున్న దని నిర్ణయింపవచ్చును. ఈగ్రంథ మిప్పటికిని యసమగ్రముగ దొరకి యముద్రితస్థితిలో నున్నది.

ఎల్లనార్యుఁడు రచించిన మూఁడవ గ్రంథము విష్ణుమాయానాటకము. ఈగ్రంథమున కవతారిక దొరకుటలేదు. కొందఱు విమర్శకు లీగ్రంథము నవతారిక లేకయే కవి రచించె నని యభిప్రాయపడిరి; గాని యది నాకు సమంజస మని తోఁచదు. ఏలయన మనపూర్వకవు లేగ్రంథము రచించినను వంశాదివర్ణన లున్నను లేకపోయినను దేవతాస్తుతి పద్యము లైనను వ్రాయక యుండలేదు. ఈప్రబంధమం దట్టి పద్యములును లేవు గాన నవతారికాభాగము లభ్యము గాలేదనియే యూహించుట సరియైన దని నానమ్మకము. ఈప్రబంధమును మొదటిదైన రాధామాధవమును మదనగోపాలాంకితములే. ఈరెంటిని యొకకవియే రచించె నని యనుటకు వానియందలి యాశ్వాసాది పద్యములును, ఆశ్వాసాంతగద్యమును సమానముగా నుండుటయే ప్రబల నిదర్శనము. ఈగ్రంథమును గడపటిదిగాఁగ విరచించి యుండు నని యోజించుటకుఁ దగు కారణములను వెనుకనే సూచించితిని.

దీనికి నాటకమని కవి పేరిడినను నిక్కముగా నిది ప్రబంధమే గాని రూపకభేదము గాదు. దీనియందు మహావిష్ణువు సూత్రధారియై విశ్వమాయానాటకము నెట్లు నడిపించుచు దేవమానవసంఘముల నెట్లాడించుచున్నాఁడో తెలుపుటకే యిట్టి పేరీయఁబడినది

ఇది యైదాశ్వాసముల ప్రబంధము. అన్నియాశ్వాసములందును విష్ణుమాయను నిరూపించెడి కథలు రసోచితముగ వర్ణింపఁబడినవి. ఈ గాథలు ప్రత్యేకముగ నేయొక్క పురాణము నుండియుఁ గవి గైకొనినట్లగపడదు. కొన్నిటిని స్థలపురాణములనుండియుఁ, గొన్నిటిని మహాపురాణములనుండియుఁ గవి స్వీకరించియుండునేమో యని తోఁచుచున్నది. అన్నిటియందును విష్ణుమాయ మాత్రము సామాన్యలక్షణమై యున్నది. కథలన్నిటిని వేఱువేఱు స్థలములనుండి సంగ్రహించినను వాని కూర్పును, రచనయుఁ బ్రత్యేకముగా నెల్లనార్యునిదే యని మనమురూఢిగా నమ్మవచ్చును. గీర్వాణ వాఙ్మయమున విష్ణుమాయానాటకమను కావ్యముగాని నాటకముగాని యెచ్చటను గాన్పింపదు. కావున నీ గ్రంథము తారక బ్రహ్మరాజమువలె భాషాంతరీకరణముగాక స్వతంత్ర గ్రంథ మనియే యూహింపఁదగినది.

ఎల్లనార్యునికిఁ బూర్వము గొంద ఱాంధ్రకవు లిట్టి కథాగుచ్ఛములను బ్రబంధములుగా వ్రాసిరి. శ్రీనాథుఁడు హరవిలాసమందును, నిశ్శంక కొమ్మన శివలీలా విలాసమందును, శివభక్తి ప్రతిపాదకములైన కొన్ని యద్భుతగాథలను స్థలపురాణ

ములనుండియు నితర గ్రంథములనుండియు సేకరించి వానికి శివ ప్రభావమే ధారణ సూత్రముగఁ జేసి కథాప్రసవమాలలుగా రచించిరి. కృష్ణదేవరాయలును, తాళ్ళపాక చిన్నన్నయుఁ దమ యాముక్తమాల్యదయందును బరమయోగివిలాసమునందు నిక్లే యాయాస్థలములనుండి విష్ణుభక్తి ప్రతిపాదకములగు కథల నేర్చి భక్తిసూత్రమునఁగూర్చి విష్ణుకథాస్తబకములగు ప్రబంధములను * రచించిరి. ఎల్లనార్యుఁ డాత్రోవనే పోయి తన విష్ణుమాయానాటకమును సమకూర్చెను. పైని జేర్కొనినవా రందఱి కంటెఁ గథా కథనమునఁ దాను మిన్నయని తోఁపించునట్లు కథా ప్రస్తావన మొక యసదృశ విధముగఁ గల్పించి కథలకు మఱి కొంత ప్రాణము పోసెను. ఆ విషయము ముందుముందు కథా నిర్మాణసందర్భమున విశదీకరింపఁబడును.

ప్రథమాశ్వాసమున రుక్మిణీ సత్యభామల సాపత్న్య విషయమును జూపుచు సత్యభామకు శ్రీకృష్ణుఁ డొసంగిన పారిజాత వృక్షకారణమున గర్వాతిశయము హెచ్చుగుటచే నామెకు గర్వభంగముఁ జేయుటకు సాక్షాత్తు విష్ణుస్వరూపుఁ డగు శ్రీకృష్ణుఁడు గావించిన మాయాపటల నిర్మాణమును దశాస్త్రాధనమున సత్యభామకుఁ గలిగిన గర్వపరిహారమును వర్ణింపఁబడినవి. రెండవయాశ్వాసమున మహావిష్ణువు తన ముఖ్యదేవియగు

* ఆంగ్లేయ వాఙ్మయమునఁగూడ నిట్టి గ్రంథము లున్నవి. టెన్నిసను ఆర్థరురాజు కథలు (Idiylls of King Arthor) మున్నగునవి.

నాదిలక్ష్మికిఁ గావించిన గర్వభంగ మభివర్ణింపఁబడినది. ఇందిరా దేవి యొకనాఁడు ద్యూతపరాజితయై కినిసి తన ప్రాణవల్లభునకుఁ గొంతయవమానముఁ గలిగింపనెంచి ముల్లోకములందు వ్యాపించియున్న తన ప్రభను దా నుపసంహరించుకొని చరాచరప్రపంచమంతయు దైన్యము నొందునట్లు చేసెను. అంతఁ బద్మాక్షుఁ డామెయుద్దేశముఁ గనిపెట్టి యొక కృత్రిమలక్ష్మిని సృజించి లోకముల కేమియు లోటువాటిల్లకుండ వానిని యథాస్థితిలో నుంచి తన మాయచే మహాలక్ష్మికిఁ గృత్రిమలక్ష్మియం దీర్ష్యాసూయలను గలిగింపఁజేసి యామెకుఁ బరాభవముఁ గావింపఁ గలిగెను. మూఁడవయాశ్వాసములో నహంకరించిన పితామహునకు గర్వభంగ మొనరించెను. కొండొకకాలమున హిరణ్యగర్భుఁ డహంభావమున నీచరాచరప్రపంచ మంతయుఁ దన శక్తిమహిమాతిశయమున సృజింపఁబడినది గాని మహావిష్ణువున కేమియు దీనియం దధికారము లే దనియుఁ దా నాతని కెంతమాత్రము నధీనుఁడు కా ననియు గర్వింపఁగా నారాయణుఁడు దా నావిరించికిఁ దన యప్రమేయసార్వభౌమత్వముఁ జూపింప నెంచి యొక మాయాసరస్వతిని గల్పించి యామె కృత్రిమమోహన విలాసములలోఁ జతురాననుని బడఁద్రోసి కొంతకాల మట్లు వినోదించి తరువాత బ్రహ్మకు నిజస్థితిని దెలియఁబఱచి తన యద్వితీయ త్రైలోక్యనాథత్వమును బ్రకటించుకొనెను. నాల్గవయాశ్వాసములో సదాశివునకు నట్టి భంగపాటే కావింపఁబడినది. మున్ను సాగరమథన

నసమయమున విష్ణువు మోహినీవేషమున నవతరించి యమృతము కొఱకుఁ దగవులాడుచున్న సురాసురుల కయ్యమును దీర్చుచు నసురులను భంగపఱిచి సురలను గాపాడిన తెఱఁ గంతయు ముక్కంటి విని తా నొక్కఁడే విష్ణునిమోహావిభ్రమములలోఁ బడక తన ధైర్యస్థైర్యముల నిలుపు కొనఁ గల నని యతిశయిం పఁగా నప్పుడు పుండరీకాక్షుఁ డాతనికిఁ దన మాయా వైచిత్ర్య ముల రుచిచూపి యాతనిని మోసగింపనుద్దేశించినవాఁడయ్యెను. రుద్రునికోరికమీఁదఁ దటాలున మోహినీవేషము ధరించి యా పార్వతీవల్లభుని బరమ ముగ్ధుఁ డగుకాముకునిగాఁ జేసి తన వెంటఁ జాలఁగాలము త్రిప్పుకొని మతిభ్రమ గావించి యంత ర్ధానమయ్యెను. అంతఁ బినాకపాణి యిది యంతయువిష్ణుమాయ యని గ్రహించి శ్రీమహావిష్ణునిప్రభావమును గీర్తించెను. కడ పటియాశ్వాసమున నిరంతరవిష్ణుభక్తుఁ డగు నారదమునికే యిట్టి యవష్టంభభంగము గావింపఁ బడినది. రుద్రునివలెనే నారదుఁ డును దా నొక్కఁడే విష్ణుమాయను గనుఁగొనఁగల నని ప్రగల్భ ములు పలుకఁగా నామునికిఁ దన మాయామోహనశక్తిని జూపఁ దలంచి సర్పవరక్షేత్రమున నొక జడదారివేసము ధరించి నారదు నచ్చటికి రావించెను. తన యాశ్రమముదగ్గఱ నున్నకొలనిలో నామునిని స్నానముచేయు మని కోరఁగా నతఁ డాకాసారమున దిగి వెంటనే యొక నారీమణిగా మాఱెను. అట్టిస్థితిలో నుండఁగా

చంద్రకేతుఁ డను రాజచ్చోటికి వచ్చి యామెను జూచి మోహించి పరిణయమాడెను. అంత వా రిరువురికి నూరుగురు సుతు లుద్భవించిరి. వా రందఱును వివాహములు చేసికొని సంతానములు గని సకల సౌఖ్యములు ననుభవించుచుండ నొక శత్రురాజు వారిపైఁబడి వారిని సంహరించి రాజ్యమును స్వాధీనము చేసికొనెను. చంద్రకేతువును, అతని సకల సంతానమును మరణించిరి. ఒక్క స్త్రీ రూపమున నున్న నారదుఁడు మాత్రమే మిగిలెను. ఆమె పతి పుత్రపౌత్ర నాశనమునకు శోకించుచు క్షుద్బాధకుఁ దాళఁజాలక యా సమీపమున నున్న మామిడి చెట్టున నొక ఫలముఁ జూచి దాని నందుకొనఁగోరి యా శవముల నొకదానిపై నొకటి చేర్చి యా దొంతిపై నిలుచున్నను ఫలము నందుకొనలేకపోయెను. అట్లాశాభంగము నొంది విలపించుచున్న స్త్రీచెంత కొకవృద్ధబ్రాహ్మణుఁడు వచ్చి యామె దుఃఖకారణ మంతయుఁ దెలిసికొని "ఓ వెఱ్ఱిదానా! యిట్టి స్థితిలో నీవు ప్రాణత్యాగము చేసికొనుటయే లెస్స" యని యుపదేశింపఁగా నామె దగ్గఱనున్న సరస్సులోనికి స్నానము చేయఁబోయెను. అవగాహనము చేసినవెంటనే నారదునకు స్త్రీరూపముపోయి నిజరూపము వచ్చెను. అప్పు డది యంతయు విష్ణుమాయ యని తెలిసికొని మహావిష్ణుని యద్వితీయప్రభావమును గుర్తెఱిఁగి వెనుకటివలెనే పురుషోత్తముని స్తుతించుచు నానందించెను.

థా ని ర్మా ణ ము :—

ఏతత్ప్రబంధనిర్మాణమందుఁ బ్రతిభాశాలి యగు నీ కవి ప్రస్తావన, లేక, పూర్వరంగ మన నొప్పువిధముగా నొక విచిత్ర కల్పనతోఁ గథాకథనముఁ బ్రారంభించెను. సామాన్యముగఁ బౌరాణిక గాథలను బ్రబంధరూపముగ వ్రాసిన యాంధ్రకవులు, ఏ శుక మహర్షియో, యే వైశంపాయనుఁడో యాకథలను జెప్పినట్లుగా వర్ణింతురు. ఈతఁ డట్లుగాక, పాఠకుని కెక్కుడు కౌతూహలమును బ్రమోదమును గలుగున ట్లొక గోవిందశర్మ యను నాజన్మబ్రహ్మచారిపాత్రను గల్పించి యాతఁడా శ్రీకృష్ణునకు నిత్యానువర్తియు నర్మసఖుఁడు నై యున్నట్లును, కృష్ణునియంతఃపురమున నిర్నిరోధసంచారి యైనట్లును జూపి యాతనిముఖమున నీకథలను జెప్పించెను. ఇట్లొక యపూర్వరంగమును గల్పించుటచే మనకు శ్రీకృష్ణుని యాంతరంగికరహస్యములను దెలిసికొనుచున్నా మనియుఁ గృష్ణుని శుద్ధాంత స్త్రీల పరస్పరానురాగ వైషమ్యముగూడఁ బ్రత్యక్షముగఁ గనులఁ జూచినట్లు తెలిసికొనుచున్నా మనియు మనయం దొక రసోత్సుకమగు కౌతుకము పుట్టుచున్నది. ఇట్లద్భుత ప్రమోదములతో మన మీకథలను జదువుటచే వానియందు రక్తియు భక్తియు నినుమడించుచున్నవి. ఈప్రకారముగఁ గథాముఖమును గల్పించుటలో నీ కవి యెవ్వరిని ననుకరించిన ట్లగపడదు.

ఈప్రబంధమందలి మఱియొక విశేష మే దన విష్ణుమాయాద్యోతకము లగు కథలు కొన్ని గుత్తిగా దీనియందుఁ గూర్పఁబడిన వని మున్నే తెలిసికొనియుంటిమి. ఈ కథ లన్నియు నొక్కవిధముగనే యుండక వేఱువేఱు మాదిరులుగా నిరూపింపఁబడినవి. అన్నిటియందు విష్ణుమాయయుఁ దన్మూలముగఁ బరాభూతిఁ జెందిన నాయికయో నాయకుఁడో సామాన్యలక్షణములు. ఈపరాభవము లన్నియు శృంగారరససాధనములతోనే చేయఁబడినవి. అన్ని కథలయందును శృంగారరసభావలక్షణములు సమానము లయ్యును బాఠకులకుమాత్ర మట్లు తోఁపక మనోహరమగు వైవిధ్యమునే యెప్పటి కప్పటికిఁ జూపుచున్నవి. ఏకథ చదివినను దాని కదియే ప్రత్యేకకల్పనలు గలిగి విసుఁగు పుట్ట నీయదు. మొదటి రెం డాశ్వాసములయందును దన దేవేరు లగు సత్యభామా లక్ష్ములను స్త్రీనైజ మగు నీర్ష్యాహంభావముల నాధారపఱుచుకొని మహావిష్ణువు మృదుమధురముగఁ బరాభవించెను. ఈ రెండుకథలయందును సాధనము లొక్కటే యైనను గల్పనలువేఱుగా నుండి మనోహరముగా నున్నవి. అట్లే మూఁడు నాలు గాశ్వాసములయందుఁ దనతో సమాను లై యహంకరించిన బ్రహ్మరుద్రుల యపజయములు వేఱువేఱు విధములుగ నిరూపింపఁబడినవి. ఆ నిరూపణలో నా జగదీశ్వరు లిరువురకును గౌరవ మొంతమాత్రమును జెడకుండ శృంగారరససాధనములో నైనను మృదుత్వము దప్పకుండఁ దనమాయ విదిత

ము గావింపఁబడినది. కొదువ భక్తాగ్రేసరు లగు పుండరీక నారదుల విషయములో నెక్కువ స్వతంత్రించి మహావిష్ణువు కఠిన పరీక్షలకు వారిని బాల్పడఁజేసెను. ఇట్లే దాఖ్యానములలోను మూఁడుజంట లగు కథలు గాన్పించుచున్నవి.

ఈ కథాప్రణాళికల కన్నిటికిని లక్ష్య మొక్కటియే యై నను బ్రతికథయందు నొక్కొక్క నూతన విధానమును గల్పించి కథావైవిధ్యముఁ జేకూర్పఁగలిగినశక్తి ఈ కవియం దున్నట్లు మఱి యొకనియందుఁ గానము. శ్రీనాథుని హరవిలాసమందుఁ గథలు స్వతః భిన్నరూపములుగానే యున్నవి. వానియందు లక్ష్య మొక్కటైనను స్వరూపము లన్నియు వేఱే. అట్టి సంద ర్భములో వైవిధ్య ముండుట స్వాభావికమే. కాని యట్టి యవ కాశములేని యీ కథావిషయములలో విసుఁగు గలుగఁజేయని నానాత్వమును గల్పించిన యీ మహాకవిశక్తి వర్ణనాతీతము.

రసము — నీతి :—

విష్ణుమాయానాటకము విష్ణుభక్తిప్రతిపాదకమైన ప్రబంధము. చింతలపూఁడి యెల్లన్నకవి మదనగోపాలోపాసకుఁడు. కాఁబట్టి యాతఁడు రచించినగ్రంథము లన్నియు వైష్ణవభక్తిస్ఫోరకములే. మొదటిగ్రంథ మగు రాధామాధవమందు, రాధాకృష్ణులగాఢప్రేమబంధమును వర్ణించి జయదేవునకు సమానుఁ డనిపించుకొనెను. రెండవ గ్రంథ మగు తారకబ్రహ్మ

రాజముగూడ విష్ణ్వంశసంభూతుఁ డగు శ్రీరాముని మాహా త్మ్యము వర్ణించుటచే నదియు వైష్ణవభక్తిని నిరూపించునదియె. మూఁడవగ్రంథ మగు విష్ణుమాయానాటకము ప్రత్యేకముగ విష్ణుస్వరూపమును, విష్ణుమాయను, కేవలవిష్ణుభక్తిని ఆద్యంత ముగ నుద్ఘోషించుచున్నది. అయితే యీ కవియందలి విష్ణుభక్తి స్వరూప మొక విశిష్టలక్షణమును వహించియున్నది. అది యే దన నీ కవిమతమందు విష్ణుభక్తి నాయికానాయక ప్రేమాను రాగముగ నుండవలె నని. కావుననే యీతనిగ్రంథము లన్నిటి యందును బంధుర మగు శృంగారరససంబంధమున విష్ణుభక్తి పరిణామము నిరూపింపఁబడుచున్నది. ఈవిధముగ శృంగారరస భక్తిరసములను రెంటిని, అవినాభావసంబంధమున జోడించి కథ లను నడిపిన కవిగ్రామణి మదనగోపాలోపాసకుఁ డగుటయం దాశ్చర్య మేమియు లేదు. ఈ కవిదృష్టియందుఁ బరమాత్మ స్వరూపుఁడగు కృష్ణభగవానుఁడు దుష్టజనశిక్షకుఁడును, శిష్టజన రక్షకుఁడును గాక మానవాత్మ యను నాయికయందు నిత్యప్రణ యోత్సేకము నుద్భవింపఁజేసెడు మహాశృంగారమూర్తి యగు నాయకుఁడే. కాఁబట్టి యీకథలయం దెచ్చటను నొక యుద్ధము గాని పోరాటముగాని యుండక యెచ్చటఁ జూచినను శృంగార ప్రాధాన్యము లగు మోహనలీలలు, ప్రణయకలహములు, మాయావిలాసినుల విభ్రమచేష్టితములు నిత్యాదులే కానంబడు చున్నవి. ఈ కవివరుఁడు నిక్కముగఁ గళింగదేశపువాఁడైనచోఁ

దన కాలమందుఁ గళింగదేశమున నూతనముగా వ్యాపించుచు న్న చైతన్యమతాభిమానియై తత్సంప్రదాయ మగు మోహన కృష్ణోపాసనకు నలవడి యుండును.

ఎల్లనార్యుఁడు రచించిన యితర గ్రంథములలో వలెనే యేతద్గ్రంథమందును భక్తిరసముతోపాటు శృంగారరసమును నిత్యానుసంధాయిగా మేళవించినను, ఈ గ్రంథమం దెచ్చటను శృంగారరసమునకుఁ బ్రత్యేకప్రాధాన్యముగాని యశ్లీలకరమగు నత్యాధిక్యముగాని యొనఁగుటలేదు. ఒకప్పుడు శృంగారవర్ణన లలోఁ బాఠకుని మనస్సుఁ జిక్కుకొని యానంద పారవశ్యముఁ బొందుచున్నను భగవద్భక్తి భావము లాతని డెందమున నాతఁడెని గూడఁ బ్రసరించుచునే యుండును. కాఁబట్టి శృంగారరస ప్రాధాన్యములగు రాధికాసాంత్వనము, రాధామాధవ సంవా దము మున్నగు గ్రంథములందువలెఁ దద్రస ముత్కటముగాక నీతి మర్యాదలకు లోఁబడి పండితులకు సంతతామోదము నొడఁగూర్చునదియై యున్నది. ప్రథమాశ్వాసమందలి సత్యభా మా శ్రీకృష్ణుల మాయా విడంబనము సతీపతుల సరస సంగ తులనే నిరూపించుచున్నదికదా. రెండవ యాశ్వాసమునందలి లక్ష్మీనారాయణుల ప్రణయకలహ మైనను మాయాలక్ష్మీకల్ప నచే, నుత్తమనాయికా నాయక సంబంధము నెంతమాత్ర ము నతిక్రమింపక పునీతమార్గమునే యనుసరించినది. మూఁడవ యాశ్వాసమందలి పరమేష్ఠిపరాభవకథయందు మాయాసరస్వతి

కల్పనచేఁ బద్మోద్భవుని శీలము పరమానందకరముగఁ బో
షింపఁబడినది. నాల్గవ యాశ్వాసమందు మాయామోహినీ
రూపధారి యగు మహావిష్ణువే పరమేశ్వరునికిఁ జిత్తసంక్షో
భముఁ గలుగఁజేసిన వినోదదృశ్యము శివకేశవసామరస్యమును
స్థిరపఱిచినది. అయిదవ యాశ్వాసమందు నారదుఁడును మూఁ
డవయాశ్వాసమం దానుషంగికముగఁ జేర్పఁబడిన పుండరీకుఁడు
ను భక్తులుమాత్రమే కాక లక్ష్మీసత్యలును బ్రహ్మరుద్రాదు
లవలెఁగాక విష్ణుని కఠినతరపరీక్షకు లోనైరి. కేవలమును శృంగార
మోహావశ్యు లగుటయేకాక స్త్రీయైన నారదుఁడు భర్తను సం
తానమునంతను గోల్పోయి యేకాకియై క్షుత్పిపాసావేదనముఁ
బరితపించినఁగాని మాయావిముక్తుఁడు కాలేకపోయెను. రెండవ
వాఁడగు పుండరీకుఁడు విలోమవివాహము చేసికొని సకుటుంబ
ముగ క్షామార్తిచే దేశాంతరమునకుఁ బోయి భిక్షాటనము చేయ
వలసివచ్చినది. ఇట్టి కడగండ్లు తక్కినవారి విషయములోఁ గల్పి
గింపఁ బడలేదు.

ఇట్లు ప్రత్యాశ్వాసమున నెవరో యొక రహంకరించిన
మాత్రమునఁ దత్తదుచితముగ విష్ణుమాయకు లోనై వాగాహ
పాశములలోఁబడి వ్యాకులచిత్తమున నుండఁగా మహావిష్ణువు ప్ర
సాదించి మాయామోహపటలమునుండి వానిని రక్షించి విము
క్తుని జేయుచుండెను.

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుఁడు చెప్పినవిధముగా—

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.
(౭ అధ్యా ౧౪ శ్లో)

అలాగున నీ విష్ణుమాయానాటకములో మహావిష్ణు సమాశ్రయణముకంటె యతిక్రమించిద్భిన్నముగ, రాజసమునఁ గాని, తామసమునఁగాని యహంకరించిన ప్రతివ్యక్తినిఁ దైవిగుణ్యమయమగు ప్రకృతిమాయలోఁ బడవైచి కామ క్రోధ మోహాది వర్గ పరవశునిగ మహావిష్ణువు చేయుచుండెను. ఎట్టకేల కన్నిబాధల ననుభవించి తిరిగి విష్ణుస్మరణముఁ జేసినవెంటనే వారి నంద అను మోహావిభ్రమమునుండి తొలఁగించి వారికి నిజవ్యక్తిత్వము ననుగ్రహించుచుండెను. దీనినే కృష్ణభగవానుఁడు భగవద్గీతా పరమరహస్యముగ నిట్లర్జునునకు నివేదించెను.

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.
(౧౮ అధ్యా ౬౬ శ్లో)

అను నీ గీతావాక్యమునకుఁ జక్కని దృష్టాంతములే యీ గ్రంథమందలి కథలన్నియును. కర్మజ్ఞానయోగములను స్పృశింపక భక్తియోగమునే ప్రతిపాదించుచున్న యీప్రబంధసారము నిత్యమును విష్ణుభక్తి మోక్షసాధన మనియు వేఱొండుసాధనము లే దనియు నుద్ఘోషించుచున్నది. ఈప్రతిపాదనమును మృదులముగాను మధురముగాను మనోజ్ఞముగాను సంతతసాత్త్విక

విధానముననే యీయెల్లనార్యుఁడు తన గ్రంథమున నిరూపించెను.

శైలి :—

ఎల్లనార్యుఁడు రాధామాధవప్రబంధమును జెప్పినదాదిగా నొక ప్రత్యేకవ్యక్తిత్వము గలిగిన మహాకవి యనిపించుకొనెను. ఈవ్యక్తిత్వమున రెండులక్షణములు ముఖ్యముగఁ గాన్పించుచున్నవి. ఒకటి, భావవిషయములోను, రెండు, భాషావిషయములోను. భావవిషయములో మదనగోపాలపరబ్రహ్మోపాసకుఁ డగు నీ కవి శృంగారమునకు నుత్కృష్టస్థాన మిచ్చుటయందు వైపరీత్య మేమియు లేదు. ఈప్రపంచ మంతయు నాయికానాయకానురాగసమన్విత మగు విష్ణుమాయ యని గోచరింపఁజేసికొని తాను రచించిన గ్రంథము లన్నిటిలోను శృంగారరసమునకు నున్నతస్థాన మిచ్చుచుఁ దానిని భగవద్భక్తికి ముఖ్యసోపానముగఁ జేసినవాఁ డయ్యెను. కావున నీతని భావానుభావములు శృంగార రసోచితములై మార్దవమును మాధుర్యమును గలిగి సమస్తావస్థలయందును స్నిగ్ధరసభూయిష్ఠములుగ నున్నవి. భావము లెట్లో భాషయు నట్లే; మృదుమధురపదములతో నలరారుచు వేణునాదమువలె సుకుమారసుస్వనముగలిగి శ్రవణపేయముగను హృదయానందదాయిగ నున్నది. తన యిష్టదైవ మైన మదనగోపాలమూర్తియే తనకు "సుఖసంపదాస్పదం బైన మధురపదం బిచ్చెద నని వరం బొసంగి కవి

[illegible]ప్పవల్లి యను ద్వాదశాక్షరకలితం బగు తన దివ్యమంత్ర రాజం బుపదేశించె నఁట." (రాధామాధవము ౧ ఆ.)

ఈతని శైలియందు నిమ్నోన్నతములు గాన్పింపవు. ప్రబంధాదియం దెట్లు భాషారమ్యతయుఁ బదగుంభనప్రావీణ్యమును ప్రకటితము లగుచున్నవో యట్లే ప్రబంధాంతమువఱకును జక్కని చిక్కదనమును నిండుసోయగమును గలిగి కమ్మచ్చునఁ దీసిన సువర్ణపుఁదీఁగలవలెఁ బద్యములు సరళవేగమున సాగి మధుర వాఙ్మరందరుచులను మన సుబ్బఁ జిమ్ముచుండును. గ్రంథమందేభాగము యాదృచ్ఛికముగఁ దీసినను శైలీసౌకుమార్యమును భావమధురిమయును దప్పక వీనులకు విందొనరించుచున్నవి. అల్లసాని పెద్దన్నయందును, కృష్ణరాయకవీంద్రునియందును ఇట్టి శైలీసమత సామ్యత గానఁబడ దని పెక్కురు విమర్శకాగ్రగణ్యులు నుడివియున్నారు. రాయలకాలమునాఁటి కవికుంజరులలో శైలీసౌభాగ్యము నిరవిచ్ఛిన్నవిద్యుల్లేఖలవలెఁ గావ్య మంతయు నావరించి యుండుట యీ యెల్లనార్యునియందును ముక్కు తిమ్మన్నయందును ముఖ్యముగఁ గాన నగును. ఈ యుభయ కవులును దమ కవిత్వమందుఁ బ్రసాదమాధుర్యగుణములకుఁ బ్రాధాన్య మొసంగి యొచ్చట నైనను దల్లక్షణములను విడనాడ లేదు. ముక్కు తిమ్మన్నయందుఁ బ్రసన్నతతో జాణతనమును జాలువాఱి యున్నది. ఎల్లనార్యునియందుఁ బ్రసన్నతతో విలాస సంపత్తి పరిపూర్ణతఁ బొందియున్నది.

రాధామాధవమందుఁ బ్రతిభగల యువ కవ్యుద్రేకమును దిలకించు మధురభాషావిజృంభణము, ప్రసిద్ధవీణానిక్వాణనిపుణు లగు కీ. శే. తుమురాడ సంగమేశ్వరశాస్త్రి యద్భుతరసావేశమున విపంచీతంతువులను మందాకినీమృదులోర్మి రేఖలవలె నుద్ఘోషింపఁజేయుచుండ నుద్భవించెడి మధురధ్వానపుంజమును స్ఫురింపఁజేయుచుండును. సుపర్వుల వాణియగు సంస్కృతవాణి తన మంజులభాషానిధి నంతయు నీ కవివర్యుని కైవసముఁ జేసెనో యనునట్లు సంస్కృతశబ్దమాధుర్య మమృతవర్షమువలెఁ గురియుచున్నది. తొంటిమహాకవుల యాదర్శకమార్గముల ననుసరించి వారి కల్పనలను గొన్నిటినిస్వీకరించి యీ పోకడలకుఁ దన యనుపమ వాగ్లహరీ మనోహరస్వరము మేళవించి యికావ్యమును మధురరసపూరితముగఁ జేసెను. కావున దీనిని బరిమళపుష్ప కరండ మనికాని, మధురఫలమంజూష యనికాని భావించినఁ దప్పు లేదు. కాలక్రమమున నభ్యాసానుభవముల నలవడు వచస్సమ్మితత్వమును రససంగతియందలి సమవ్యాప్తియు దీనియందుఁ జాల కున్నను, మహాకవి కుండవలసిన సకల శక్తులు నిస్సందేహముగ దీనియందుఁ గాన్పించుచున్నవి.

తారకబ్రహ్మరాజరచనాకాలమునాఁటికిఁ గొంత కావ్య పరిశ్రమచేసిన యభ్యస్తహస్తుఁ డగుటచే దానియందలి శైలి కొంతవఱకుఁ బక్వతఁ బొంది మంజులపదబాహుళ్యము తగ్గి రస

భావావిష్కరణ మెక్కువ సులభముగఁ గలుగుచున్నది. ఈ కావ్యమందుఁ దన్నుఁ గూర్చి:—

క. రాధాధరాధరోరుప
యోధర కాశ్మీర రస రసోదయ కవితా
మాధుర్యధుర్యు నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెన్.

అని కవీశ్వరుఁడే చెప్పుకొనినాఁడు. కావునఁ దన కవిత్వమందు మాధుర్యగుణమే ముఖ్యలక్షణముగా నున్న దని కవియే గుర్తించుకొనినట్లు స్పష్ట మగుచున్నది.

దండ్యాచార్యులు తన కావ్యాదర్శమున మాధుర్యగుణ లక్షణ మిట్లు నిర్వచించెను.

శ్లో. "మధురం రసవద్వాచి వస్తు న్యపి రసస్థితిః
యేన మాద్యంతి ధీమంతో మధు నేవ మధువ్రతాః."

దీనికి కీ. శే. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిలవారి తెనుఁగు సేఁత యిది:—

తే. గీ. రసయుతంబగు మధురంబు రసము సూక్తు
లందునున్ వస్తువుననుఁ బొల్పారుచుండు
మధువుచే మధువ్రతములమాడ్కి విబుధు
లలరుచుందు రెద్దానిచే నదియె రసము.

పై శ్లోకముయొక్క సారాంశ మేమనఁగా:—

"మాధుర్యగుణము రససంబంధ మైనది. ఆరసము శబ్దమునందును వస్తువునందునుగూడ నుండవలయును. తేనెటీఁగలు తేనెను గ్రోలి యెట్లానందించునో యట్లే పండితు లిట్టిగుణము గలకావ్యమును జదివి యానందింతురు."

కావున మాధుర్యగుణము ప్రత్యేకముగాఁ గథయందు మాత్ర ముండినఁ జాలదు; లేక ప్రత్యేకముగా శైలియందు మాత్ర ముండినఁజాలదు. ఈరెంటిసమన్వయము ననుకూలముగ నుండినఁగాని యాకవి మధురకవి యనిపించుకొనఁ జాలఁడు. గోపికాహృదయాపహారి యగు మదనగోపాలమూర్తి తన జగన్మోహన వేణుగానమునుండి యొక నాదబిందువుఁ బ్రసాదించెను గాన నీ మహాకవి తత్ప్రసాదఫలితముగ సంగీతమాధుర్యమున కెనయగు కవితామాధుర్యము నాంధ్రుల కర్పించెను.

విష్ణుమాయానాటకము కావ్యమాధుర్యగుణమున కొక యుత్కృష్ట నిదర్శనము. కథావస్తు వంతయు మధుర రస సమన్వితము. పైనఁ జూపిన విధముగ నన్ని యాశ్వాసములందును శృంగార రసానుప్రాణితము లగుభక్తి రస పూరిత కథలే యున్నవి. కావునఁ గావ్యవస్తువునందు మాధురీగుణము మెండుకొని యున్నది. దానికిఁదోడు, ఎల్లనార్యుని భాషాసంఘటన మంతయు మృదువుగను, శ్రవణీయముగను నున్నది. దానంజేసి కావ్యమాధుర్యమున కీగ్రంథ మామూలచూడముగ నొక దృష్టాంత మని చెప్ప నొప్పు.

రాధామాధవమున సంస్కృత పద జటిల మగు శైలి నెక్కువగఁ గవి యుపయోగించినను గ్లిష్టపదములను శ్రుతికటువు లగుపదములను వాడక శ్రావ్య మగుభాషనే యుపయోగించెను. విష్ణుమాయానాటక రచనాకాలమునకు సిద్ధహస్తుఁ డగుటచే సంస్కృతభూయిష్ఠ మగు శైలిని విడనాడి గీర్వాణాంధ్రసమ్మిశ్ర మగు శయ్యను వాడి చక్కని శిల్పచాతుర్యముఁ జూపఁగలిగెను. శ్రీనాథునికాలమునుండియు నాతని మూలముగ వాడుక లోనికి వచ్చిన పాండిత్యప్రకర్షితమగు కావ్యసాంకేతిక శైలిని బాటింపక సులభగ్రాహ్యము లైనవియు, సలక్షణము లైనవియు నగు దేశీయపదములను గవిత్వములోనికిఁ జేర్చుకొనెను. కావున నీ కవీశ్వరుని శైలి యప్రయత్నముగాను, నైసర్గికముగాను, హృదయమునుండి యూటఁ ప్రవహించుచున్న దని పాఠకులు సులభముగ గ్రహింపఁగలరు. ఈ విషయమున నాంధ్రకవు లందఱిలో నగ్రగణ్యుఁ డగు పింగళి సూరనార్యునకు దారిఁ జూపినవాఁ డీమహాకవి యెల్లనార్యుఁడే. ఆంగ్లేయవాఙ్మయమున "మార్లో" అను నాటకరచయిత నాటక శైలీశిల్పముల షేక్స్పియర్ మహాకవి కెట్లు మార్గదర్శి యయ్యెనో యట్లే మన యెల్లనార్యుఁడు కావ్య శైలివిషయమున సూరివరేణ్యుఁ డగు పింగళి సూరనార్యునకు మార్గదర్శకుఁ డయ్యెను.

సీ. హరియును నీవు నెయ్యముతోడ నిచ్చోట
నుండఁగాఁ గనుఁగొంటి నుల్ల మలర

నచ్చోటఁ గంటి నెయ్యముతోడ రుక్మిణీ
లోలుగాఁగ సరోజలోచనుండు
నచటి కెట్లరిగెనో యచటివాఁ డిచటికి
నేలాగు వచ్చెనో యే నెఱుఁగ
నీవ యెఱుఁగుదు నీలవర్ణుని మాయ
కాంత! యే మందు నీకంటె మిగుల

గీ. రాజసంబున రతిరాజరాజ్యకళయుఁ
గలిగి విభుతోడ నున్న యాచెలువచెలువు
మన్మథునిఁ గూడి రతి యున్న మహిమ దోఁచె
మగువ! యే మని నమ్మె దీ మాయకాని. ”

క. నీ కిచ్చెఁ బారిజాతము
లోకంబు లెఱుఁగ మున్ను లోలుండై నేఁ
డాకంజాక్షికి నిచ్చెను
నీకంటెను గూర్చు నావనిత కృష్ణునకున్.

క. ఆవెలఁది నీకుఁ బంపిన
పూవులనత్తావి చూడు బూమెలవలపుల్
గావించిన పతిఁ జూడుము
నావచనము కల్లగాదు నమ్మవయేనిన్.

క. చెలి నొకతె నంపు రుక్మిణి
నిలయమునకు నిపుడె యనఁగ నిశ్చయముగఁ బు

వ్వలు గొనిపోయిన యందఱు
చెలు లొక్కట వచ్చి యట్ల సెప్పిరి సతితోన్.

పింగళి సూరనార్యుఁ డీవిధ మగు ప్రాసంగిక శైలినే వాడి దానిని దన యద్వితీయప్రతిభ చే మఱింత రసవత్తరముగ నుండునట్లు చేసెను. అట్లయినను నూతన మార్గమును గని పెట్టిన కీర్తి యెల్లనార్యునికే చెందవలయును.

ఈవిధ మగు మా ర్పొక పద్యభాగముననే కాక గద్య భాగమందును నీకవిచేఁ జేయఁబడినది.

మన పూర్వకవుల కావ్యములలో నచ్చటచ్చటఁ జేర్పఁ బడిన వచనములయందలి శైలి కొంచె మెచ్చుతక్కువగ యతి ప్రాసలులేని పద్యశైలియే యని చెప్పవలసియున్నది. అట్టి గద్యశైలిని నిరసించిన మొదటి మహాకవి శ్రీకృష్ణదేవరాయలు. అటు తరువాత సులభశైలిని వచనభాగములు వ్రాసిన రెండవ కవి మన చింతలపూఁడి యెల్లన్న. ఈతని వచనములలోఁ దఱచు చిన్నచిన్న వాక్యములును విస్తారముగ సుగ్రాహ్యము లగుశబ్ద ములును గాన్పించుచున్నవి. ఇట్టి శైలి ముఖ్యముగ విష్ణుమాయా నాటకమునఁ జూడనగును.

" ఇ వ్వటుండు ద్వారకా నగరంబు వాఁడు. కృష్ణుని యంతఃపుర స్త్రీలకు రుక్మిణ్యాదుల కుబుసుపోవఁ గథలు చెప్పు గోవిందశర్మ యనువాఁడు. వీనియందు సత్యభామామహాదేవి

యనుగ్రహాం బతిసమగ్రం బై యుండు. కడమ నలువురును సనక సనందన సనత్కుమారనారదులు. మీా రెజెంగినవార. వారి రాక యు నిర్వ్యాడక యని తోఁచుచున్నయది. అనినఁ గృష్ణద్వైపాయ నుండు నట్లు నిశ్చయించి యీా గోవిందశర్మయనువాఁడు మహా తపస్వి, సకల కథాప్రవీణుండు, మన ముపక్రమించిన విష్ణు మాయారహస్యంబు లన్నియు విశదంబుగాఁ జెప్పనేర్చు, నిక్కడి కథాప్రసంగంబు తన దివ్యచిత్తంబున నెఱింగి వాసుదేవుండే పంపి నవాఁడు. తదనుమతంబునఁ దద్దేవమునులును వాని వాక్పాట వంబును దదీయమాయాప్రభావంబును విను వేడుకఁ జనుదెంచి నా; రనిన నందఱుం గుతూహలాయత్తచిత్తులై తదభిమతాగమన ప్రత్యుత్థాన ప్రయత్నాభిముఖు లగుచుండి రంత (వారు) ననంత మార్గంబు డిగ్గి తత్సభాసమీాపంబున నిలిచిన.''

రసప్రదీప్తియు, భావప్రకటనమును ముఖ్యలక్షణములుగా నుండు మధురకవితఁ జెప్పిన చింతలపూఁడి యెల్లన్న అయ్యల రాజు రామభద్రునివలె శ్లేషయమకాదిధుర్య మగు శుష్కకవి త్వమువంకఁ గి న్నెత్తక నిరంకుశ భావనోత్పాద్యము లగు నుత్ప్రేక్షాదుల వైపు బుద్ధిఁ జలింపనీయక యీాగ్రంథము నా మూలాగ్రముగ స్వాభావికకల్పనలతో రచించెను. ఏ యవస్థ యందు, నేసందర్భమందును గథాప్రణాళికకు దీర్ఘమగు నంత రాయములు గలుగనీయక కథాపురుషుల క్రియాకలాపములందుఁ గౌతుకము వృద్ధినొందున ట్లచ్చటచ్చట సమయోచితవర్ణనము

లను జొప్పించి యావర్ణనములను స్వభావసిద్ధములుగఁ జేసి తన యపారవిజ్ఞానానుభవమును వెలార్చుకొనెను. శృంగారవర్ణనల యం దీకవిది పెట్టినపేరు. ఆవర్ణనలయందు సందర్భమునుబట్టియు, నవసరమునుబట్టియుఁ, గథాపురుషుల గౌరవప్రతిష్ఠలనుబట్టియు సమయోచితముగ వానిని మార్చుచుండెను.

మాయాలక్ష్మి :—

సీ. "శుద్ధసువర్ణంబు సొబగు మించిన మేన
బాలసూర్యప్రభల్ ప్రజ్వరిల్లెఁ
పార్వణ చంద్రబింబముఁ బోలు మోమున
సుప్రసాదశ్రీల సొంపు నెరసె
వెలిదామరల మీఱు నెడఁద కన్గొనలపై
నైశ్వర్యకందళు లంకురించె
నమృతపూరముఁబోలె నలరు చిత్తంబునఁ
గరుణారసార్ద్రిత గడలుకొనియె
గీ. లలిత శుభలక్షణాంఘ్రిపల్లవములందు
దివ్యనారీ కిరీట సందీప్త రత్న
దీప్తి పుష్పోపహారముల్ దీటుకొనియెఁ
బతికృపాలబ్ధవిభవ కా పద్మముఖికి."

బోయవనిత :—

సీ. "పచ్చగాజులదొరయొప్పు పచరించు చేతుల
సంకటుంగరముల ఛాయ లెసఁగ

నిగనిగల్ దొలఁకాడు బిగువుచన్నులమీఁద
గురువిందపూసల సరము దనర
ధవళతాళపలాశతాటంకరుచి మించు
చెక్కులఁ జిఱునవ్వ జీరువాఱ
గొప్పున కందని కురుల నించుక దోఁచు
నుదుటి జేవురుబొట్టు కుదురుమెఱయ
గీ. సన్నవలిపెంపుటొల్లియ సగము గట్టి
సగము ముసుఁగిడి యొయ్యారముగ మెఱుంగు
కంచుమెట్టెలు మొరయంగఁ గడఁక వచ్చు
నవ్విలాసినిఁ దగ మెచ్చె నవనిసురుఁడు."

మోహినియందు రుద్రుఁడు ముగ్ధుఁ డగుట:—

సీ. "మదశిఖావళి యొక్కపొదలోనఁ దొలఁగినఁ
దొయ్యలి యని బోయి తొంగిచూచుఁ
గలకంఠనాద మెక్కడనైన వినఁబడ్డఁ
జెలువభాషణ మని చిత్తగించు
నెలదేఁటితండ మెయ్యెడ మ్రోలఁ బొలసినఁ
బడఁతుకనెఱు లని పట్టఁదివురు
గాడ్పునఁ బైవ్రాలు కలికిమై దీఁగె నం
గన వచ్చె నని పట్టి కౌఁగిలించుఁ
గీ. జెదరి పూఁదేనె వాతెఱఁ జెంద నిందు
వదనయధరామృతం బని వలసిగ్రోలుఁ

జేతనాచేతనజ్ఞానశిథిలహృదయుఁ
డగుచు మదనారి మిథ్యావనాంతరమున. ”

ఇట్లెన్నియైన దృష్టాంతములు చూపవచ్చును.

**ఉపసంహారము—కవి వ్యక్తిత్వము :—**

ఇట్లు శృంగార భక్తి రసబంధురంబును, నిక్షుకాండంబు వలె నామూలాగ్రమధురంబును నగు నొక యపూర్వప్రబంధమును రచించిన యీ యెల్లనమహాకవియొక్క వ్యక్తిత్వ మెట్టిదియో యించుక యరయుదము.

సరస సమస్యాపూరణముచేఁ గృష్ణదేవరాయభూవల్లభుని యాస్థానమునఁ బ్రవేశించి యాతనివలన భూషణశ్రేణితో రాధామాధవబిరుదము నందిన యీ కవితల్లజుఁడు రాయల యాస్థాన కవియై యుండుట కవకాశము గలిగెను గదా. పెద్దన్న, తిమ్మన్న, మల్లన్న మున్నగు కవులతోపాటు తానును నా రాజమహాళిపోషణలో నుండుట కేమాత్రము నంతరాయ ముండకపోవును. అట్లయినను రాజాశ్రయమును గుఱించి రాజసమ్ముఖముననే యా కవి చెప్పినపలుకుల నాలకింపుఁడు.

క. “నాయకరత్నము లక్ష్మీ
నాయకు హరి నిష్టదాత నాకృతికిఁ బతిం
జేయుదు భూముల కగు భూ
నాయకులను బరులఁ గైకొనక పటుబుద్ధిన్. ”

(రాధామాధవము. ఆ 1.)

ఈ పలుకులు "కవితాప్రావీణ్య ఫణీశుఁ" డగు కృష్ణరాయల కైనను, ములుకులవలెఁ జుఱుక్కున మనమున నాటియుండవా? ఇట్లు రాజసమక్షమున సాహసించి పలికిన కవి విరాగియో లేక వెంగలియో యై యుండనోపు. వెంగలి యైనఁ గడింది దిట్టయగు కావ్యప్రణేత యెట్లయ్యెను? కావున విరాగియే యై యుండవలయును. మఱియుఁ దన యైహికలాభ విముఖత్వమును, నాముష్మిక భాగ్యనిరీక్షణమును నింతమాత్రమునఁ బ్రకటించుటతోఁ దృప్తి నొందక స్వాతంత్ర్యాభిమానమున మఱియొక మెట్టెక్కెను.

చ. "సరసులు చిత్తగింపుఁ డని చాటను మామకవాణి సన్మనో
హర యగునేని వారి హృదయాబ్జములకు దా నెసఁగదే? యె
వ్వరు పిలువంగ వచ్చు నళివర్గము లాత్మలఁ జొక్కుచుం దేనియల్
గురియు ప్రసూనగుచ్ఛభరకుంచితమల్లిమతల్లి కావనిన్?"

(రాఘవాభ్యుదయము. ఆ 1.)

తా నొకరి నాశ్రయించి తన కావ్యమహిమఁ బ్రకటించుకొను నావశ్యకత లే దనియుఁ దన కావ్యమనోహరత్వమూలమున సరసులు తనకై వెదకులాడుచు వచ్చెద రనియు, రాజసమ్ముఖమున ఘంటారవముగ నీ కవి చాటెను.

ఇట్టి నిశ్చలనిర్భయధీమంతుఁడును సదా వసంతారామములలోఁ దిరుగాడు కోకిలవలె విహరించు స్వతంత్రుఁడును రాజాశ్రయమున కెట్లు లెదుర్కొనఁగలఁడు? కావునఁ గృష్ణ

రాయల కభిమాన మున్నను నీ మహాకవి రాజపోషణసౌఖ్యము ననుభవించియుండకపోవచ్చును. తరువాత " తారకబ్రహ్మరాజము "లో నైన, నంజ తిమ్మరసున కా ప్రబంధముఁ గృతినియ్యఁదలంచియు నామాత్రివలనఁ దాను బంధుసంభావనఁ బొందినట్లు చెప్పికొనెను గాని యాశ్రితుఁడు పోషకునియెడలఁ గనఁబఱచు. వినయసంపత్తిఁ గనఁబఱుపలేదు. ఈ రెండు దృష్టాంతములఁబట్టియుఁ దన గ్రంథముల నన్నిటిని భగవదర్పితములఁ జేయుటచేతను నీ మహాకవి పెద్దనాదులవలె రాజాశ్రయమున నుండక భగవదాశ్రయపరుఁడై యుండె నని స్పష్ట మగుచున్నది.

లోకోత్తర మనీషి యైన కాళిదాసునైతము:—

శ్లో. " ఆపరితోషా ద్విదుషాం
న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం
బలవ దపి శిక్షితానాం
ఆత్మ న్యప్రత్యయం చేతః. "

అని తన యాత్మసంశయమును, విద్యావినయములను జూపించుట యోగ్య మని తలంచెను. మన యెల్లనమాత్ర మట్టి సందేహమున కెడ మీయలేదు. తన కవిత్వము మనోజ్ఞమైనది కావునఁ దనయం దభిమానముగలవా రుండకపో రని దృఢమైన యాత్మవిశ్వాస మతనికిఁ గలిగి యుండెను. అంతియేగాక ప్రాపంచిక భాగ్యోన్నతియెడలఁ గొంత వైమనస్యము గలిగి సదా

విష్ణుభక్తి పరాయణుఁ డగుటచే నీతఁడు పరాశ్రయపరాధీనతలలోఁ జిక్కుకొనలేదు.

శ్లో. "నిరాశ్రయా న శోభంతే, పండితా వనితా లతాః."

అను చాటూక్తి యితనియందు వర్తింపలేదు. అట్లయినను, ఎల్లనార్యునిమాటలే తుదకు యథార్థములైనవి. సరస కవితా ప్రియులును, ఆధునికాంధ్రభోజులును, పీఠికాపురసంస్థానాధీశ్వరులును నగు శ్రీరాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు మహారాజులుంగారు తమంతటఁ దామే యీ మహాకవి కావ్యామృతసారస్యమును రుచి చూచి యాతనిని దమ యభిమానకవులలోఁ జేర్చి విద్వద్గౌరవసంభావనమును జూపిరి. కాన నాలుగు శతాబ్దములు గడచినను నీ మహాకవి పంతమే నెగ్గినది.

కరుణారసమూర్తి యగు పరమేశ్వరుఁ డీయాంధ్ర సరస్వతీప్రియుఁ డగు "రాజర్షిని" ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి చిరకాలము రక్షించుఁగావుత.

చేకుమళ్ల అచ్యుతరావు
ఎం. ఏ. యల్. టి.

---

శ్రీరస్తు

# విష్ణుమాయానాటకము

:o:

## ప్రథమాశ్వాసము

### కథాప్రారంభము

తే. భాగవతముఖ్యుఁ డగుశుకబ్రహ్మచేత
భాగవతసత్కథావరబ్రహ్మవిద్య
నెలమి వినుచుఁ బరీక్షిన్నరేంద్రచంద్రుఁ
డచ్యుతక్రీడ లాత్మ కింపారఁ బలికె. 1

చ. కనుఁగొన నింద్రనీలమణికాంతి నొకప్పుడు, పూర్ణచంద్రచం
దనరుచి నొక్కవేళ, నరుణద్యుతికుంకుమదీప్తి నొక్కచోఁ
దనరి గుణత్రయాత్ముఁ డయి తానె సమస్తము నైనదేవునిన్
వనరుహనాభుఁ బల్మఱు మనంబున భావనచేసి, వెండియున్.

సీ. అఖిలంబు నిండి ప్రహ్లాదప్రమాణోక్తి
వెలయంగ నిలిపినవిశ్వమయత
యాబ్రహ్మకీటశూన్యం బైనపెన్బైటి
నీటిలోఁ దేలెడుమేటితనము 2

కంసకారాగృహాంగణమున రుద్రాది
జయనాదములఁ గన్న జననకేళి
నిర్వికల్పస్థితి నిర్లేపుఁడై పర
బ్రహ్మంబు దా నైనభవ్యమహిమ
తే. దలఁప నచ్చెరు; వంబుజోదరునిగుణము
లన్ని వర్ణింపఁ దరమె పద్మాసనునకు ?
నిట్టిపరమాత్ము నాద్యుని నెఱుఁగునాతఁ
డతఁడు దా నౌట నిస్సంశయంబు మదికి. 3

వ. అని వెండియుం బుండరీకాక్షునియక్షయగుణంబు లొక్కొక్క సమయంబున నపార గంభీర పారావార తరంగ సంఘంబుల చందంబునఁ దండోపతండంబు లై పొడముచు, నొక్కొక్క వేళఁ గాళరాత్రినిబిడనీరంధ్రితమోనిశితాతపజ్యోత్స్నాది జ్యోతిఃకలాపంబులరూపంబున స్వకీయమాయాంతర్గతంబు లై నిలుచుచు, నొక్కొక్కకాలంబున జగత్ప్రాణ ప్రసరణప్రవీణత్వంబున దీపకత్వనిరూఢంబులై సకలంబునం బ్రవర్తించుచు నవాఙ్మానసగోచరప్రభావంబున నుండుటకు నరిదిపడి హర్షవిస్మయస్వరూపం బగుమనంబున నమ్మునీంద్రు నవలోకించి పరీక్షిదీశ్వరుండు ప్రాంజలియై యిట్లనియె. 4

మ. మునినాథోత్తమ! విష్ణుదివ్యకలనల్ మోదాద్భుతాపాదక
త్వనిరూఢిన్నిగమాంతభావితుఁబ్రభుఁదత్త్వస్వరూపున్విభున్
మననధ్యానసమర్చనాభిమతసన్మానస్థితిం బొల్చి యుం
డు నశేషక్రియలందు సన్మునిగరిష్ఠుల్ చాల సేవింపఁగన్. 5

వ. ఇవ్విధంబున ననన్యదైవసామాన్య తేజోవిలాసంబుల
వెలయు నిఖిల భువనైకనాయకుం డైన విష్ణుండు పరమ
పురుషుం డని యుపనిషన్మర్మంబులవలనఁ దెలిసి వేద
సిద్ధాంతరహస్య వేదు లగుమహామతులు, సర్గస్థితి ప్రళయ
వికారకలితంబులు నశేషప్రాణిగణసంకీర్ణంబులు నగు
లోకంబులం బ్రవర్తించు టుడిగి, తద్దివ్యవిష్ణుధ్యేయతేజో
రూపంబు తుదిముట్టం గాంచి,తదాత్మకత్వంబునుం బొందక,
మనంబు బహువిధకర్మవ్యాపారంబులకుఁ బ్రేరేఁచి, త్రివర్గ
ఫలభోగంబు లనుభవించునల్పసుఖానుసారు లగుచుందురు.
దీనికిఁ గతం బేమియో సర్వంబు నధ్యాహరించి సంశయ
విచ్ఛేదంబు గా నెఱింగింపవే మహాత్మా ! యని ప్రార్థించిన
నవ్వివేకనిధికి శుకబ్రహ్మ యిట్లనియె. 6

క. అవు నీవు చెప్పినట్లన
భువనైకస్వామి సకలపూజ్యుఁడు హరి వే
దవిచారణీయపరత
త్త్వవిలాసము సృష్టి నడుపువాఁడును నరయన్. 7

ఆ. అతని నైజతత్త్వ మగుతేజ మిట్టిది
యతనిగుణము లిట్టి వతనిక్రీడ
లిట్టి వని నుతింప నెఱుఁగవు వేదవే
దాంతములును నిశ్చయంబుగాను. 8

తే. శ్రుతు లనంతము లవి యెన్ని చూడ, నందు
నర్బుదాంశంబ యేమొ సహస్రగతుల

నాదిలో బ్రహ్మవక్త్రపద్మాంతరముల
నిండి ఘోషించు మధుకరనినదలీల! 9

క. అందొక పరమాణ్వంశము
నందైన సకృత్స్నముగఁ దదర్థము దెలియం
బొందుపడదు వ్యాసమహా
ర్షీందుప్రముఖులకు నైన నృపకులతిలకా! 10

ఉ. వ్యాసమునీశ్వరుం డపరవారిజనాభుఁ డతండు నిష్ఠ న
బ్జాసను దేవతోత్తము మహామతిమంతుని సుప్రసన్నునిం
జేసి తదీయశిక్ష నొకచేరికఁ గైకొని కొంతవేద మ
భ్యాసముచేసెఁదాను జతురాస్యములై చననాల్గువేదముల్.

సీ. ఆవేదములు నాల్గు నవగతంబులు గాఁగఁ
జదివి తదర్థముల్ వెదకలేమిఁ
దదనురూపముగ శాస్త్రము లాఱు నష్టాద
శపురాణములు నోలి సంఘటించె
వేదబీజాక్షరవిన్యాస సరణి గా
యత్ర్యాదిమంత్రంబు లనువుపఱిచె
మతశాస్త్రములు యోగమార్గశాస్త్రంబులు
నతిరహస్యములుగా జతనకట్టె

తే. నమ్మహాభాగుఁ; డిట్టి వేదాదులందుఁ
దనరునర్థంబు వివిధభేదముల నడచు
దాన మతములు పెక్కయ్యెఁ దన్మతంబు
లన్నిటికిఁ గల్గె నధిదేవతాంతరంబు. 12

క. తామసరాజసమతములు
భూమి ననేకములు, బహుళములు, తదధీనం
బై మెలఁగు జగము; సాత్త్విక
మామతములలోన సూక్ష్మమై వర్తించున్. 13

క. మతములు మంత్రంబులు *వాం
ఛితములు సేవార్చనములు శిష్టాచార
వ్రతములును బదవిభాగ
స్థితులును భిన్నంబు లగుచుఁ జెల్లు ధరిత్రిన్. 14

శా. ఈమార్గంబున శాస్త్రవాక్యములు ప్రత్యేకార్థయుక్తంబులై
భూమిం బెక్కు మతంబుల†న్నడుపఁగా బుద్ధిప్రకారోన్నమ
త్సామర్థ్యంబున నెల్లవారు బహువాదప్రౌఢి నాయామతం
బే మేలంచుభ్రమించుచుండ్రుతమకే దిష్టంబుతన్ముద్రతోన్.

క. అందఱకు నన్ని మతముల
నందముగాఁ దదధిదేవతాకృతులను గో
విందుఁడె యుచితఫలప్రా
ప్తిం దుదిఁ బొందించుఁ దద్విదితలోకములన్. 16

క. సారస్వతసంపద్భో
గారూఢము లగుచుఁ దలఁపు లావర్తించుం,
గోరికలతమకమున మో
క్షారంభము లేదు పద్మజాదుల కైనన్. 17

---

* వాం, ఛితములు సేవార్చనవ్రతంబులు దమకుం, గతి మెలఁగఁజేయు భోగస్థితులును—వ్రాఁతప్రతి. † నడపఁగా—పాఠాంతరము.

క. కేవల నిర్వాణమునకుఁ
దావల మది సాత్త్వికంబు, తత్పతి హరి, యా
త్రోవకు సేరికిఁ జిత్తము
ద్రోవదు తన్మతయుగంబుత్రోవకుఁబోలెన్. 18

క. కావున నుత్తమసాత్త్విక
ధీవిభవము గలిగి తదధిదేవత యగునా
శ్రీవిష్ణుని నతినిర్మల
భావంబున నిలుపవలయు భక్తి నిరూఢిన్. 19

శా. ఈరీతిన్ నిజసాత్త్వికక్రియలతో నేకాగ్రనిష్ఠన్ మహా
ధీరుండై హరిమూర్తి నాత్మ నిడునాధీమంతుఁ డామూర్తి సం
స్కారంబొప్పఁగనచ్చసంబ్రతిమ యోజంజెందుచందానఁదే
జోరూపంబున ముక్తుఁడై మెలఁగుఁ బో క్ష్మోణీతలాధీశ్వరా !

క. విను సహజసాత్త్వికత్వ
మ్మున నిర్మలహృదయపద్మమునఁ దిరముగ వి
ష్ణుని నిలుపుచుఁ దాదాత్మ్యం
బునఁ బొందుట దుర్లభంబు భూవరచంద్రా! 21

ఆ. అంతసాత్త్వికక్రియయు నంతనిశ్చల
సూక్ష్మదృష్టియును విశుద్ధమతియు
సంభవించు మానసం బన్యమతముల
వారికున్న పరమవైష్ణవులకు. 22

చ. కమలదళాక్షుఁ డింతటికిఁ గారణ మావెడగానియింద్రజా
లము భువనత్రియంబు, సకలక్రియలుం దదభీష్టకేళితం

త్రము లరయంగ, నాతనిమనంబున కెట్టులు దోఁచె నట్ల వి
శ్వముచరియించు, నెవ్వరికిశక్యము స్వేచ్ఛాభరంబునొందఁగన్?

వ. మహామాయానాటకసూత్రధారుం డగునప్పరమపురుషుండు
చూపుదివ్యకేళీకృత్యంబులు బహువిధవిచిత్రప్రహ్లాదకార
ణంబు లవి వినవలతువేని సావధానంబుగ నాకర్ణింపుము. 24

సీ. వాగీశ్వరుం డయ్యు వనరుహగర్భుండు
శ్రుతికదంబము లెక్క చూడఁగలఁడె?
భానుసహస్రసంపద గలభానుండు
తిమిర మంతయును భేదింపఁగలఁడె?
భువనత్రయము నేలుదివిజాధినాథుండు
చిత్తతృష్ణావధి సేయఁగలఁడె?
పటుగరుజ్జవరేఖఁ బరఁగుఖగేంద్రుండు
గగనంబుకడ యెఱుఁగంగఁగలఁడె?

తే. యట్ల తేజోగుణోత్కృష్టుఁ డై యనంతుఁ
డైనవిష్ణునిమాయావిహారకలన
నమరగంధర్వసిద్ధవిద్యాధరర్షి
యక్షరక్షోగణం బైన నరయఁగలదె? 25

మ. ఇదిమధ్యం బిదియాది యంతమిది చూపిబ్భంగి యిచ్చోటు త
త్పదమంచున్ హరియున్నచూపుశ్రుతులున్ భావింపలేవన్న నే
నిద మిత్థమ్మని చెప్ప నోపుదు నె భక్తిన్ కాననఖ్యాతు నా
సదయాత్మున్ మదినిల్పుశక్తిఁ బ్రతిభాసంయుక్తిఁ బ్రాపించెదన్.

వ. అని యంతర్నేత్రమనంతపరధ్యానయోగాధీనంబు గావించి

యుదంచదరోమాంచకంచుకిత దేహుండును, సంతోషరస స్రవదశ్రుధారామధూళీబిందుసుందరదృగరవిందద్వంద్వ పునః పునఃప్రకటీభూతహరిభక్తిసుధాప్రవాహుండును, గరతల ముక్తాఫలీకృతప్రాగ్వచశ్చూడాప్రౌఢరహస్యవాక్సహ్యాదు పదిష్టభావికైవల్యలక్ష్మీవిలాససర్వస్వసంగ్రహణవ్యగ్రుండును, మధురప్రబోధోదగ్రుండును నగునయ్యోగికులాగ్రణి రాజ కులాగ్రణి కిట్లనియె. 27

క. ధరణీశ్వర 'మమమాయా
దురత్యయా' యనియె నరునితో హరి మును ద
త్పరమోక్తికి ననుగుణమై
పరఁగెడు తన్మాయవిధముఁ బ్రకటింతుఁ దగన్. 28

వ. అని తత్ప్రకారంబు ప్రపంచించునప్పుడు. 29

—♦ విష్ణుమాయాప్రభావంబు శుకయోగి చెప్పంబూనుట. ♦—

సీ. క్రతుదీక్షితర్షిసంతతికి దుగ్ధరసంబు
గురియునాకనివాసిసురభివోలె
సస్యాభివృద్ధికిఁ జాలంగ వర్షించు
ప్రావృట్పయోధరపటలివోలె
వేలాతటంబున విబుధరక్షార్థంబు
ప్రభవించు నమృతకుంభంబువోలె
సత్యభామామనస్స్వామికి నభివాంఛి
తము నిచ్చు పారిజాతంబువోలెఁ

తే. పారికాంక్షి పరీక్షిన్నృపాలమౌళి
మధుకరస్వాంతసంతోషమయము లైన
కోరికల *నించె శుకముఖాంభోరుహంబు
నందనందనగాథామరందధార. 30

క. మనసునకు గోచరింపని
వనజోదరుతత్త్వకలన వాగ్వైఖరి వ
ర్ణనసేయ నొరుల కెట్లగు
సునిశితవిజ్ఞాననిధికి శుకునికిఁ దక్కన్?  31

వ. ఇట్లుచాటుకారవాక్పరంపరాసంపాదనకందళితముఖుండయ్యుఁ జతుర్ముఖ సహస్రముఖ జంఘాలకళాగర్వ నిర్వాపకం బగు శేముషీవిశేషంబున సరస్వత్సలిలాంతర్మగ్నంబు లగురత్నంబులుంబోలె నామ్నాయమండలగర్భస్థంబు లై నహరికథాసందోహంబులు గూడం దిగిచి, వసంతసమయ సమారంభ విజృంభమాణసురభికుసుమవిసరంబులపస నసలుకొన దెసలఁ బుణ్యగంధంబులు వెదచల్లుచు, సత్పురుష హృదయమధుపాయినికాయంబుల నాకర్షింప సమకట్టి చెప్పునప్పారికాంక్షి యిట్లనియె. 32

క. శ్రేయస్కరవిష్ణుమహా
మాయానిబిడాంధకారమండలి ఖద్యో
తాయితతేజోమూర్తులఁ
దోయజభవముఖులు దిరుగుదురు విను మధిపా! 33

* ముంచె, మించు—పాఠాంతరములు.

చ. జననసమృద్ధినాశములు చంద్రకళావళి కెట్టు లంబరం
బునఘటియిల్లు;నట్లన యమోఘదురత్యయవిష్ణుమాయయుం
దనవరతంబు లోకనివహంబునకుం బ్రహితంబు; గావునన్
జనవర! సర్వమున్ జలజనాభుని కైతవమగ్న మారయన్. 34

చ. ఉరగవరైకదండకలితోజ్జ్వలలోకపరంపరన్ సురా
సురముఖజంతుకోటి నిడి చూడ్కికి యక్షకరండమట్టులై
పరఁగఁగఁ జేసి యెల్లెడల భక్తమనోనిలయాంగణంబులం
దిరముగ నిల్పి వేడుకలఁ దేలుచు వైష్ణవమాయ భూవరా!

ఉ. నీలపయోధరావలి వినిర్భరదీధితు, లాడ కాడకుం
గోలమెఱుంగుతండములఁ గొల్పి గ్రహించెదుమాడ్కి భానుతే
జోలవచంద్రికాంశువులఁ జూపుచుమాపుచునుండువిష్ణుమా
యాలలితేంద్రజాలము నిజాశ్రితకోటికిఁ బ్రీతిసేయుచున్.

క. భూయోజ్యోతిర్వైష్ణవ
మాయానాటక*విధానమంజులపాంచా
లీ యవనిక, భాగవతని
కాయాంతర్నేత్రకౌతుకము †నొదవించున్. 37

తే. ఆచతుర్ముఖకీటపర్యంతజంతు
సంతతులు విష్ణుమాయోరుజాలపటలిఁ
‡దగులుకొనుచుండుదురు మత్స్యతతులువోలె
వితతతృష్ణాబ్ధి నీఁదుచు విను నరేంద్ర! 38

* విధానుమర్దర—ప్రా. ప్ర. † పాదలించున్—వ్రా. వ్ర.
‡ దగిలిపోచుండుదురు—వ్రా. వ్ర.

మ. అరిషడ్వర్గగుణత్రయేంద్రియధరణ్యాకాశవాహ్నిమ
న్మరుదాశాంతరవత్సరర్తుకలనామర్యాదలై జాతిక
ర్మరతిక్షాంతితిరస్క్రియాదురితధర్మఖ్యాతిపూజాదులై
చరియించున్ హరిమాయ ప్రాణిగతమైసర్వైకసేవోన్నతిన్
మ. హరిమాయావిభవంబు రాజ్యపదపద్మాక్షీసుతద్వేట్సుహృ
త్కరుణాశానుభవోత్సవవ్యయగృహోద్యానాదులై తృప్తియై
పరమాపత్సుఖ సంపదార్తిగతులై ప్రాపించు లోకంబులన్
సురమర్త్యాసురముఖ్యజంతుతతిఁ దేల్చున్ *దాల్చుఁ దూ
ల్చు న్నృపా. 40

—♦ ప్రకృతిపురుష స్వరూపంబులు. ♦—

ఆ. మానవేంద్ర! వినుము మాయ నాఁ బ్రకృతి, త
త్కర్త పురుషుఁ, డతఁడు దానె విష్ణుఁ
డతఁడె మొదలితేజ, మామీఁద మఱి లేదు
దాని నెఱుఁగు నిగమతత్త్వవేది. 41

సీ. పంచేంద్రియములకుఁ బరమంబులై యుండు
నర్థంబు లఖిలవిధార్థయుక్తి;
నర్థంబులకు నెక్కువై తనర్చు మనస్సు
నిఖిలప్రవర్తననియతి గలిగి
మనసున కధికమై మలయు సద్బుద్ధి ని
శ్చలసూక్ష్మదృష్టికి నిలయ మగుచు

*దూల్చుఁగూల్చున్ నృపా.—ప్రా. ప్ర.

చ. జననసమృద్ధినాశములు చంద్రికళావళి కెట్టు లంబరం
బునఘటియిల్లు;నట్లన యమోఘదురత్యయవిష్ణుమాయయుం
దనవరతంబు లోకనివహంబునకుం బ్రహతంబు; గావునన్
జనవర! సర్వమున్ జలజనాభుని కైతవమగ్న మారయన్. 34

చ. ఉరగవరైకదండకలితోజ్జ్వలలోకపరంపరన్ సురా
సురముఖజంతుకోటి నిడి చూడ్కికి యత్నకరండమట్లులై
పరఁగఁగఁ జేసి యెల్లెడల భక్తమనోనిలయాంగణంబులం
దిరముగ నిల్పి వేడుకలఁ దేలుచు వైష్ణవమాయ భూవరా!

ఉ. నీలపయోధరావలి వినిశ్చరదీధితు, లాడ కాడకుం
గోలమెఱుంగుతండములఁ గొల్పి గ్రహించెదుమాడ్కి భానుతే
జోలవచంద్రికాంశువులఁ జూపుచుమాపుచునుండువిష్ణుమా
యాలలితేంద్రజాలము నిజాశ్రితకోటికిఁ బ్రీతిసేయుచున్,

క. భూయోజ్యోతిర్వైష్ణవ
మాయానాటక*విధానమంజులపాంచా
లీ యవనిక, భాగవతని
కాయాంతర్నేత్రకౌతుకము †నొదవించున్. 37

తే. ఆచతుర్ముఖకీటపర్యంతజంతు
సంతతులు విష్ణుమాయోరుజాలపటలిఁ
‡దగులుకొనుచుండుదురు మత్స్యతతులుహోలె
వితతతృష్ణాబ్ధి నీఁదుచు వినుచు నరేంద్ర! 38

* విధానుమర్దర—వ్రా. ప్ర. † పొదలించున్—వ్రా. ప్ర.
‡ దగిలిపోచుండుదురు—వ్రా. ప్ర.

మ. అరిషడ్వర్గగుణత్రయేంద్రియధరణ్యాకాశవార్వహ్నిమ
న్మరుదాశాంతరవత్సరర్తుకలనామర్యాదలై జాతిక
ర్మరతిక్షాంతితిరస్క్రియాదురితధర్మఖ్యాతిపూజాదులై
చరియించున్ హరిమాయ ప్రాణిగతమై సర్వైకసేవోన్నతిన్
మ. హరిమాయావిభవంబు రాజ్యపదపద్మాక్షీసుతద్విట్సుహృ
త్కరుణాశానుభవోత్సవవ్యయగృహోద్యానాదులై తృప్తియై
పరమాపత్సుఖ సంపదార్తిగతులై ప్రాపించు లోకంబులన్
సురమర్త్యాసురముఖ్యజంతుతతిఁ దేల్చున్ *దాల్చుఁ దూ
ల్చు న్నృపా. 40

—♦ ప్రకృతిపురుష స్వరూపంబులు. ♦—

ఆ. మానవేంద్ర! వినుము మాయ నాఁ బ్రకృతి, త
త్కర్త పురుషుఁ, డతఁడు దాన విష్ణుఁ
డతఁడె మొదలితేజ, మామీఁద మఱి లేదు
దాని నెఱుఁగు నిగమతత్త్వవేది. 41

సీ. పంచేంద్రియములకుఁ బరమంబులై యుండు
నర్థంబు లఖిలవిధార్థయుక్తి;
నర్థంబులకు నెక్కుడై తనర్చు మనస్సు
నిఖిలప్రవర్తననియతి గలిగి
మనసున కధికమై మలయు సద్బుద్ధి ని
శ్చలసూక్ష్మదృష్టికి నిలయ మగుచు

*దూల్చుఁదూల్చున్ నృపా.—వ్రా. ప్ర.

బుద్ధికి నుత్కృష్టభూమి యై విలసిల్లు
నాత్మ విజ్ఞానసీమాంత మగుచు
తే. నాత్మ కతిరిక్త మగుచు మహత్తు వెలయు
నంతకంటెను నవ్యక్త మతిశయిల్లు
నవలఁ బురుషుండు పరకాష్ఠ యై వెలుఁగుఁ
బ్రకృతిలో నంబుధరగర్భభానునట్లు. 42

వ. ఇట్లు పరబ్రహ్మతేజంబున వెలుంగుపురుషుండు ఘటనిహితప్రదీపంబునుం బోలె నిబిడమాయావరణమధ్యస్థుండై నిజతేజంబు సకలంబున కగోచరం బని కేలీసంచారపరాయణత్వం బపేక్షించి, యేకైకకాలవళితంబై పరిభ్రమించుకులాలచక్రంబుకరణిఁ దిరుగు స్వకీయమాయాకాలచక్రంబున నావర్తించుబ్రహ్మములఁబోనఁ, బావక*రేఖాంకూరంబువలన నంకురించు దీపపరంపరలపగిది నిజతేజోలవంబున మత్స్యకూర్మవరాహనారసింహాదిబహువిధరూపావతారంబులఁ బ్రతిఫలించుచు, సౌందర్య వీర్య శౌర్య ధైర్యప్రతాపప్రభావనిగ్రహానుగ్రహదాక్షిణ్యంబు లత్యుత్కృష్టంబులై వెలయ శంఖచక్ర గదాపద్మపీతాంబర కౌస్తుభ వనమాలికాశ్రీవత్స ప్రముఖ లాంఛనంబులతోఁ జతుర్దశ భువనంబులం బ్రవర్తించుచు, సర్గస్థితిప్రళయ కర్తృత్వంబునఁ బ్రాణివర్గంబుల నడుపుచుండు, నయ్యవతారంబులలో మిక్కిలి, శ్రీకృష్ణావతారవిలసితుం డగువిష్ణుండు సహజ

* శిఖా—పాఠాంతరము.

మాయామానుషవేషధారి యై తత్పురుషప్రభావంబు గలిగి విహరించుచుండు, నతండకాఁడె కౌరవకులం బాహుతిగొని ధర్మనందనుఁ బట్టంబుగట్టి భవద్వంశంబు నిలిపినభక్తపర తంత్రుండు! తత్కపటకేళీకృత్యంబులు సున్నో మాయా విధానంబులు; నీకుం జెప్పనమకట్టిన కథాప్రసంగంబు నదియు; వినుము! 43

క. భూమిన్ "సర్వం హాస్తి ప
దే మగ్న" మ్మనెడుమాడ్కిఁ దెలియఁగఁ దన్మా
యామగ్నము శివ విధి ర
క్షోమరమాయావిధంబు నవనీనాథా. 44

— విష్ణుమాయాతిశయము. —

తే. దేవ గంధర్వ యక్షాదై తేయతతికిఁ
గలవు మాయలు విను మల్పకాలగతులు
సలిల*జని బుద్బుదాంబుదచ్ఛాయలట్లు;
లన్నిటిని మిగ్రింగి హరిమాయ యతిశయిల్లు. 45

క. జలరుహనాభుని మాయా
విలసనమున నుల్లుగొనినవిధ మది వినవే
జలజజ శివ వాసవముఖు
లలవడి సుడిగాలిఁ బడినయాకులువోలెన్? 46

తే. జాతిపుష్పంబునందు వాసనయుఁబోలె
దీపమునఁ బ్రభవోలె నా దేవదేవుఁ

* నిజ—వ్రా. ప్ర.

గలసి యన్యోన్య సౌభాగ్యగతిఁ జరించు
సిరియు గర్వించి హరిమాయఁ జిక్కువడియె. 47

వ. ఇవ్విధంబున ననవరత సన్నికృష్ట సాంగత్యంబున నద్దేవునికిఁ బ్రాణేశ్వరి యై విశాలవక్షస్థలకౌస్తుభరత్నసింహాసనంబున భాసిల్లు సంపద్విలాసినియును, నిరంతర సందర్శన పారాయణ ప్రారంభంబున నయ్యంభోరుహనాభునాభ్యంభోరుహంబున బంభరాయమాణుం డై యుండునంభోరుహసంభవుండును, నమేయ కల్యాణగుణ సాదృశ్యంబున వేఱులేనిమచ్చికలతో హరిహరు లేకాకృతియనుటకు నాదైత్యారిం గూడి దంటయై నిలిచిన ఫాలలోచనుండును, సతతంబును నారాయణాష్టాక్షరీ మంత్రసంస్మరణశ్రవణ కుతూహలలౌల్యంబున నప్పురాణ పురుషు నాశ్రయించి తన్మంత్రముఖరిత యగువీణం గైకొని పరమభాగవతుండై భవపంకంబునం బడక నిరాతంకసుఖ యోగంబునం జెంది, మోహాయత్తవిషయరససంజాతప్రభూత రోషకషాయితస్వాంతులై పొరలువారిం జూచి ప్రహసించుచు హర్షించుచుఁ జరియించు నారదమహామునీంద్రుండును, మొదలుగాఁ గలమహామహిమాఢ్యులు లోకంబుల నల్ప ప్రాణిమండలంబులతేజంబులం దమతమతేజంబులచేతం గుదియించుచు, నిశాసమయ జ్యోతిరింగణ గణద్యుతుల నయ్యైకొలంది మాయించునతిస్థూల సూక్ష్మ ప్రదీపాంకురం బులమాడ్కిం బ్రదీపించుచుఁ దమలోన లీలారూపధరుం డై తన మూలరూపంబు డాఁచి కలసి మెలసి వర్తించు

నయ్యచ్యుతుని నొరసి చూచి యనంతతేజోధాముం డగు పద్మాకరుసన్నిధింబోలె నిస్తేజు లగుదురు. మున్ను చన్న కథలు గలవు. చెప్పెద నాకర్ణింపుము. 48

—♦ ధర్మరాజప్రశంస. ♦—

క. మీతాత ధర్మనందనుఁ
డాతత*విఖ్యాతిఁ గౌరవాంతంబునఁ నే
కాతపవారణముగ వసు
ధాతల మొక్కరుఁడ యేలె ధర్మోన్ముఖుఁడై. 49

సీ. ధర్మదేవతకు నుద్భవ మొంది యత్యంత
ధర్మపరాయణత్వమున నిలిచె
రాజసూయ మహాధ్వర మ్మొనర్చఁగఁ బూని
§ గుఱుతుగా రాజులచెఱలు మాన్చె
సత్యప్రతిజ్ఞ విశ్వము నిండ బలవంతుఁ
డయ్యును వనవాస మాచరించె
†రాజిత ఖడ్గధారా జలౌఘంబునఁ
గౌరవవంశపంకంబు గడిగె

తే. నిఖిలదిఙ్మండలాధీశ నిత్యదత్త
వస్తువిస్తారపూరితవాజిమేధ
యాగభాగాదినందితేంద్రాదిదివిజ
నిర్మితఖ్యాతి నొప్పునాధర్మసుతుఁడు. 50

---

* విద్యాదిగౌరవాంతంబున—పాతాం. § గురుతర—వ్రా. ప్ర.
† తేజిత—వ్రా. ప్ర.

వ. అతం డొక్కనాఁడు. 51

ఉ. ఇందుకులప్రభూతపృథివీశ్వరు లాదలఁ బట్టభద్రల
క్ష్మిం దనరారి యెక్కుఁగఁ బ్రసిద్ధికి నెక్కినయీసముజ్జ్వల
త్సుందరరత్నసింహాముల శోభిలుచున్నపసిండిగద్దెఁ బెం
పొందఁగ నింద్రులీలఁ గొలువుండె నమన్నృపదీపితాంఘ్రియై.

సీ. కౌరవాధీశోరుకాండద్వయద్రోహి
పటుగదాహస్తుండు పవనజుండు
కర్ణవక్షఃపీఠఘట్టనచణబాణ
జనకగాండీవపాణి సవ్యసాచి
చటులకౌరవ్యపక్షక్షత్రనిగ్రహ
వ్యగ్రశౌర్యుఁడు మాద్రియగ్రసుతుఁడు
కైతవద్యూతవిగ్రహకారిసౌబల
హననధుర్యుఁడు నకులానుజుండు

తే. ననుఁగుఁదమ్ములు నలుగురు సర్థిఁ గొలువ
నిందునకు గీష్పతియుఁబోలె *నెలమిఁ దనకు
ధౌమ్యుఁ డుచితాసనమున సద్ధర్మకథల
వలన రాజర్షిమార్గముల్ దెలుపునప్పుడు. 53

—◆ వ్యాసముని ధర్మరాజునొద్దకు వచ్చుట. ◆—

ఉ. కౌరవపాండవేయకులకర్త, కళిందసుతాంతరీపవి
స్ఫారగతరాకరోద్భవ లసద్రుచిసాంద్రమహేంద్రనీల, మం

* నెనయ—వ్రా. ప్ర.

భోరుహసంభవాకృతి, విమోహతమోహరణప్రచండవి
ద్యారవిమండలోదయము, వ్యాసమహామునిదోఁచెముందటన్

సీ. జమున పుంభావ మై సాక్షాత్కరించెనో
లలిత మహేంద్ర నీలముల ప్రోవో
నవ్యసాలగ్రామనగశృంగ మెలసెనో
సుస్మేరనీలాబ్జసూనవనమొ
కోమలపల్లవాంకురితతాపింఛమో
ఘనతరామృతమేఘఖండభరమొ
సామాధిదైవతోద్దామవిలాసమో
హరిమూర్తి సచ్చిత్తినట్టి రూపొ

తే. యనఁగ దూర్వాంకురశ్యామలాంగదివ్య
కాంతిచకచకిలాశలఁ గడలుకొనఁగ
నిష్టదైవంబపోలె సమిద్ధకరుణ
నెదుటఁ దోఁచిన వ్యాసమునీంద్రుఁ జూచి. 54

క. మానసము నిండి వెలువడు
నానందరసంబువోలె నశ్రులు దనక
న్గోనలఁ దొరఁగఁగ గ్రిక్కన
నా నరపతి గద్దె డిగ్గి యంఘ్రుల కెఱఁగెన్. 55

మ. సకలక్ష్మావరసార్వభౌమపదవీసామ్రాజ్యపీఠస్థుఁ డిం
దుకులగ్రామణి ధర్మనందనుఁడు, చోద్యోఁ గూడి తత్సోదర
ప్రకరంబు న్నిఖిలోర్విపాలకసుహృద్వ్రాతంబులున్మ్రొక్క ర
త్నకిరీట ప్రసవార్చనం దనరెఁ దత్పాదద్వయుం బయ్యెడన్.

వ. ఇట్లు సహజన్మసామంతసుహృత్సంతానంబులతోఁ బ్రియమిల్లి
వినయ వినమిత శరీరముకుళీకృతహస్తారవిందద్వంద్వ సందర్శిత
భక్తితాత్పర్యంబులతోఁ దోడ్కొని వచ్చి సభామండప
మధ్యప్రదేశంబున సమున్నతకుశాసనంబున నునిచి పూజించి
తదనుమతంబున నిజసింహాసనాసీనుండై తగినవారల †నయ్యై
నెలవుల నుచితపీఠంబుల నుండ నియమించి ప్రాంజలియై
యభిముఖుం డగు నాధర్మతనయు నవలోకించి కృపాయత్త
చిత్తంబున నమ్మునికులోత్తముం డిట్లనియె. 57

—◆ వ్యాసుఁడు ధర్మరాజును శ్లాఘించుట. ◆—

మ. జననాథోత్తమ! ధర్మనందన ! హరిశ్చంద్రక్షమాభర్తతో
నెనయై నిల్చితి సత్యవాక్యమున ధాత్రీశోత్తమశ్రేణిలో
నని ‡నిన్నెంచెద; రట్లుకాదె, సుజనుం డైనట్టి వాఁ డార్యవ
ర్తన వర్తించినఁగీర్తియున్సుకృతముంబ్రాపింపఁడేయెయ్యెడన్?

శా. ప్రాలేయాంశుకులావతంసములలోఁ, భాస్వద్వయోద్భూతభూ
పాలశ్రేష్ఠులలోన రామునిక్రియన్ భాస్వద్ఘనబ్రహ్మవి
ద్యాలక్ష్మీవిభవంబు శౌర్యనయయుక్తభ్రాతృసాజన్యముం
ద్త్రైలోక్యంబున నెన్నికోఁ వెలసి తార్యస్తుత్య! ధర్మాత్మజా!

క. జలరుహసంభవముఖులకుఁ
గొలఁదియు నెఱుఁగంగరానిగోవిందుఁడు నీ
కులమునఁ గూర్మిచుట్టముఁ
జెలికాఁడును నయ్యె; నేమి చెప్పుదు నింకన్? 60

†తగిన నెలవుల,- ‡నని నిన్మెచ్చెద-అనియున్మెచ్చెద. పాఠాం.

వ. అని హరిం దలంచి తద్భక్తవత్సలత్వంబు నూహించి. 61

తే. భక్తపరతంత్రుఁ డైనయాపద్మనాభుఁ
డేడుగడయును దాన యై యెల్లకడల
మిమ్ముఁ బ్రహ్లాదుఁబోలె నమేయకరుణఁ
*దగిలి రక్షించె ఘోరదుర్దశలవలన. 62

సీ. కావఁడే మానంబు కౌరవసభలోనఁ
బాంచాలి కక్షయాంబరము లొసఁగి?
యాఁకొన్నదుర్వాసునలుకఁ జేపడకుండ
నరయఁడే నినుఁ బులాకార్థి యగుచు?
రవి గ్రుంకకుండ సైంధవుఁ ద్రుంచుసవ్యసా
చి ప్రతిజ్ఞ నిలుపఁడే చీఁకువెట్టి?
ధృతరాష్ట్రుకౌఁగిట మృతి మాన నుక్కుఁగం
బముచేతఁ బ్రోవఁడే పవనతనయు?

తే. †నాశ్వసింపఁడె నారాయణాస్త్రవహ్ని
బలము దెగకుండ? ద్రోణిశాపంబువలన
నుద్ధరింపఁడె మీవంశ ముర్వి నెడల
కుండఁ? గృష్ణునివంటి హితుండు గలఁడె? 63

వ. వెండియు, నాఖండలాదులయెడ నసురులుంబోలెఁ బాపవర్తను లైనధార్తరాష్ట్రులు మీమేలు సహింపఁజాలక యకారణంబ వైరంబు నూఁది కర్ణసౌబలుల దుర్మంత్రంబున మిమ్ముఁ గపటవ్యాపారంబున హింసింప సమకట్టి చేయుదుష్కృతంబు

---

* గలిగి రక్షించె ఘోరదుఃఖములవలన, †ఆదరింపఁడె. పాఠాం.

లన్నియు మీ రెఱుంగకుండ సర్వాంతర్యామి గావున నయ్యు నంతుండు దూరస్థుం డయ్యు నికటస్థుండునుంబోలె నిరర్థకం బులు గావించుచుండు. మీ రెల్ల నచ్చెరువడి చూడ భగ దత్తుండు వైచిన దేవాసురనిరంకుశం బగు వైష్ణవాంకుశంబు విజయునిం బొలియింపకుండ నడ్డమై ముందట నిలిచి దానిం దన కౌస్తుభగ్రైవేయక లక్షితం బైనవక్షస్థలంబున వైజ యంతికి దండ యగు పూదండగా ధరియించియు, నిందర్శ దత్త యగు నుగ్రశక్తిం బార్థునిమీఁద వైవకుండఁ గర్ణదు ర్యోధనాదులకు మఱపు పుట్టించియు, నారాధేయుం డలిగి యేసినయమోఘనాగాస్త్రంబు తాఁకునం బోకుండ రథంబు గ్రుంగ నదిమి ప్రత్యస్త్రశూన్యుం డైననరునితలఁ గాచియు, భీష్మద్రోణకృపాశ్వత్థామకృతవర్మప్రభృతిమహావీరపురుషు ల మంత్రవీర్యానంతంబు లగు ననన్యవార్యశౌర్యదివ్యాస్త్ర సంఘంబు లసంఖ్యంబులై విలయసమయధారాధరఖండం బులవలనం దొరంగు వేఁడిపిడుగులచందంబునఁ బైఁబడుచుం బడునప్పు డతనిదేహంబు దహింపకుండఁ దదీయతేజోవహ్ను లంతర్ధానంబు నొంది యుండం దోడ్తోన సంస్తంభింపఁ జేయుచుఁ, బోరితుది ధనంజయుం దొలఁగించి యయ్యనల శిఖాముఖంబులకుఁ దురగసహితం బగురథంబు నాహుతిగాఁ జేసియుఁ, బుత్త్రశోకార్తిం గుందు గాంధారి క్రూరశాప వ్యథాభారంబు మీయందఱకు లేకుండం బరిహరించి తానే వహించియు, నపారకౌరవకులపారావారంబు నిశ్శేషంబుగా

శోషింపంజేసియు నశేషసముద్రముద్రితవసుంధరాభారధౌరం
ధర్యంబు నీకుఁ బాపగహితంబుగా ననుగ్రహించి నిఖిల కీర్తి
సుకృతంబులకుం బ్రథమగణ్యునిగాఁ బ్రసాదించె నదియునుం
గాక, 64

మేనత్త యని గొంతి మ్రొక్కొని పూజించు
నెమ్మి మఱంది వై నీకు మ్రొక్కు
ననుఁగు నెచ్చెలికాని యట్ల పావని మెచ్చు
నర్జునుఁ దనప్రాణ మని తలంచు
కవల సాత్యకియందుఁ గలకూర్మిఁ బాటించుఁ
బాంచాలిఁ జూచు సుభద్రఁబోలె
నాత్మకృత్యములుగా నరయు నీపను లెల్ల
మేలు సేయనె కోరు మీకు నెపుడుఁ

తే. దల్లిదండ్రులమీఁద సోదరులమీఁద
ధర్మపత్నులమీఁద నాత్మజులమీఁద
లేదు మీమీఁదఁ గల్గు ప్రహ్లాదభరము
ధర్మనందన! దేవకీతనయునకును. 65

మ. అమరేంద్రర్షులచేత మ్రొక్కఁగొనునయ్యంభోజపత్త్రాక్షుఁ డ
య్యమరేంద్రర్షులు చూడ నెమ్మిఁ బ్రణతుం డై కంటికిన్ ఱెప్పచం
దమునన్ నీకు సహాయుఁ డై తిరుగుచున్నాఁ డట్టి నీవంటియు
త్తముఁ డాదివ్యులయందు నైనఁ గలఁడే ధాత్రీశు లింకేటికిన్?

వ. అని సాత్యవతేయుండు పలికిననత్యవచనంబులు విని ధౌమ్య
పురోగము లైన గురువిద్వజ్జనంబులును, భీమార్జుననకులు

సహదేవులును, సేవాగతులై యున్న సూర్యసోమవంశసం
భవు లగునుత్తమక్షత్త్రియులును, హితామాత్యవర్గంబులు
నట్ల యా నని పరస్పరాలోకనస్వీకృతాంగీకారులై యతి
హర్షంబునం బొంది దేవకీనందనుదయాదాక్షిణ్యంబుల నభి
నందించుచున్నం గొలువు భృంగసంగీతంబులతోఁ జెంగలువ
కొలను మెలంగినచందంబున నందంబయ్యె, నమ్మహారాజ
శ్రేష్ఠుండును మునిగరిష్ఠునిముఖచంద్రబింబంబువలనం దొరం
గిన పుండరీకాక్షునినామాక్షరంబు లనునమృతబిందుబృందం
బులు శ్రుతిపుటంబులం బడినయప్పటినుండియు నంతర్నిరీక్ష
ణంబున నుత్ఫుల్లపులకకలికాభిరామాంగఁబుతో నంతరం
గంబు నిరంతరానందరసనరసీతరంగంబుల నోలలార్చుచున్న
వాఁడై సుఖపారవశ్యంబువలనఁ గొండొక దెలిసి బ్రహ్మ
ధ్యానానంతరంబున యోగిపుంగవుండునుంబోలెఁ గన్నులు
విచ్చి యందఱం గలయ నాలోకించి యమ్మహాభాగున
కిట్లనియె. 67

—◆ ధర్మరాజు శ్రీకృష్ణప్రభావము వర్ణించుట. ◆—

క. ఆహా! కృష్ణునిసుగుణ
వ్యాహారము లింత యొప్పునా విన నవము
క్తాహారకలాపములకు
సాహాయ్య మొనర్చు మీవచస్సామగ్రిన్! 68

క. హరినామోత్కరములు శుభ
కరములు, త్రైలోక్యవిజయకరములు, శ్రేయ

స్కారములు, హితకార్యవశీ
కరములు, సత్పురుషసౌఖ్యకరములు వినఁగన్. 69

చ. కలమృదువల్లకీరవముకంటె వసంతవిహారచారుకో
కిలనినదంబుకంటె నళికీరరుతంబులకంటెఁ దాళసం
కలితమృదంగశబ్దములకంటె మనోహరకామినీవచః
కలనలకంటె నింపొసఁగుఁగా, చెవికిన్ హరినామవర్ణనల్! 70

క. మీ రానతిచ్చినట్లన
నారాయణుఁ డార్తరక్షణపరాయణుఁ; డా
ద్వారవతీపురపతియా
ధారము లేకున్న బ్రతుకఁ దరమే మాకున్? 71

క. జలరాశి మగ్నవసుధా
తల మెత్తిన క్రోడమూర్తి తాఁ గావున నా
కుల ముద్ధరించె హరి యి
మ్ములఁ గౌరవార్ణవమున మునిఁగినదానిన్. 72

ఆ. భక్తితోడఁ దన్ను భావించుదీనుల
నెమ్మితోడఁ బ్రోచు నెనరు గలిగి
కోరి తన్ను వెదకువారికిఁ బెన్నిధి
యట్లు తోఁచి ప్రోచు నచ్యుతుండు. 73

వ. అంతియకాదు; ప్రబలతరతృణస్తంబసముచ్ఛేదనానంతరం
బున వర్షధారాభిషేచనంబుచేత సస్యభరంబును, విషవృక్ష
కంటకలుంఠనానంతరంబునవసంతసమాగమంబుచేతనుద్యాన
వనంబును,సంసారసంకులవిషయభోగవైరాగ్యానంతరంబునఁ

జిదమలానందలహరిచేతంబరమయోగిహృదయంబును, బహు
శబహుదీర్ఘవ్యాధిమోచనానంతరంబున హితాన్నపానాదిక
ద్రవ్యవిభవంబుచేత శరీరంబును, దురహంకార కాకవి ద్విపా
త్పశుకంఠదారుణఘుంటాఘణఘణత్కారనిరాకరణానంతరం
బున రసిక సుకవి కావ్యప్రసంగ గంభీరవచ స్సారస్యంబుచేత
నాస్థానంబు నవ్విధంబున నభివర్ణింప నొప్పు నట్లన క్రూర
కౌరవ్యకులపంకకళంకక్షాళనానంతరంబునఁ జక్రధరునికరుణా
కటాక్షనిరీక్షణంబుచేత జగదేకపూజ్యంబైనకరినగరసామ్రా
జ్యంబు నాకు సిద్ధించినయది. అమ్మహాప్రసిద్ధియుఁ బ్రతి
యుగంబునఁ బ్రహ్లాదచరిత్రంబును, గజేంద్రమోక్షణప్రకా
రంబును, విభీషణపట్టాభిషేకపుణ్యకీర్తనంబును, ధ్రువోపా
ఖ్యానంబునుంబోలెఁ జంద్రసూర్యసాగరమేరుధరణీతలంబు
లుం గల కాలంబు నెలయ హరి సమకట్టినవాఁడు. మఱి
యట్టిప్రభావంబు బ్రహ్మరుద్రమహేంద్రగంధర్వయక్షరాక్షస
సిద్ధవిద్యాధరశ్రేణులలో నెవ్వరికైనం గలుగుట యెందును
వినియైన నెఱుంగుదుమే? యిమ్ముకుందుండే పరమపురుషుం
డది యెట్లంటేని. 74

చ. హరియును నేముఁ గూడినదియాదిగ నమ్మహనీయమూర్తి వి
స్ఫురదురుతేజ మాత్మఁ గని పొందుగఁ గేళి మనుష్యవేషసుం
దరుఁ డగునాదిపూరుషుఁ డితఁడని ముక్కుఁదలంచి, యాతఁడే
పరువడి మ్రొక్కసం బరమబాంధవుఁ డంచును గూర్మి
సేయుదున్. 75

ఆ. ప్రొక్కి నిలిచినపుడు మక్కువ మఱఁది గా
గారవించి శౌరిఁ గౌఁగిలింతు
వెనుక నితఁడు దైవ మనుభీతి వాటిల్ల
భక్తి నుతియొనర్తు భావవీథి. 76

మ. గురుభీష్మార్జునసూను లాజిఁబడినన్ క్షోభించి *మేమార్తిచేఁ
బౌరలం, జూచుచు మందహాసవదనాంభోజంబుతో నుండునె;
వ్వారు వడ్డం దుది మేలె కాఁ దలఁచు భావం♦బెట్లో! నేనామహా
పురుషుంజూచుచునుందునయ్యెడలుదాఁబోవుందదాలోకనన్

క. సంధి యొనర్పనె కోరుదు
బంధుక్షోభమున కోడి పల్మఱు; నది ని
ర్బంధపరియత్న మని యను
సంధింపఁడు; పెంచు నీరసమె యిరువాఁగున్! (వంకన్?) 78

ఉ. అన్నలుఁదమ్ములుంగురులునాప్తులుమిత్త్రులునాశ్రితాళియుం
బన్నినపోరు ఘోర మగుపాతక, మే లని మానఁ జూచినన్
మిన్నక సాక్షిమాత్రములు మీరలు; దీనికి మూల మేనె; కా
నున్నది కాకపో దనుచు నుల్లము†సేర్చుఁ దదీయబుద్ధికిన్.

చ. కురుకులసంక్షయంబు, నృపకోటులచావు, తదాప్తమిత్త్రిసం
హరణము, తత్కులాంగనలయార్తరవోత్కటవహ్నిపాతని
ష్ఠురరభసంబు చూడ నతిశోకభరం బగు మాకు; నమ్మహా
పురుషుఁడు భార‡మి ట్లడఁగిపోయెనటంచు హసించునవ్వలన్.

* మోహార్తిచే; ♦ భావంబెల్లు-వ్రా. ప్ర, భావంబుట్ట-పా ఠాం.
† దేర్చుఁ దదీయబుద్ధిచేన్—పా ఠాం. ‡ భార మెట్లడఁగి—వ్రా. ప్ర.

వ. అదియునుంగాక. 81

తే. కనకపీతాంబరంబులోఁ గౌస్తుభంబు
తోడ నానందలహరి నై తోఁచు నపుడు
కమలనేత్రుండు నాకన్నుఁగవకు నెదుట
నిఖిలరూపంబులను జెంది నీశవోలె. 82

చ. జలరుహకోమలావయవసంపదతోఁ, జెలిదమ్మిరేకులం*
గలకల నవ్వుచున్న తెలిగన్నులతోఁ హరి వచ్చి ముందటన్
నిలిచినఁ జూతుఁ గొండొకవినిశ్చలదృష్టులఁ;జూడఁ జూడ ను
జ్జ్వలరుచిరాశియా,నవయవంబులుసూపక, యేమిచెప్పుదున్!

శా. ఆతేజంబును నీలపీతసితవర్ణాయత్తమై, క్రమ్మఱన్
శ్వేతంబౌనరుణంబయానసితమా వేర్వేర; •నిద్దేదియో
చూతామంచుఁ దలంప, నెప్పటిగతిన్ సువ్యక్తకృష్ణాకృతిం
జేతశ్శ్రీలియొనర్చుఁ; దద్భ్రమపరిచ్ఛేదంబు నా నంతటన్. 84

క. ఇది యెల్ల నెఱింగియు నా
మదిఁ గృష్ణుం డాదిపురుషమయుఁ డనుతలఁ ప
ట్లాదవఁగఁ ||వతత్త్వజ్ఞానం
బది యేమొకొ యనుచుఁ దలఁతు ననవరతంబున్. 85

—• కృష్ణుని యాథార్థ్యము వ్యాసులవారిని ధర్మరా జడుగుట. •—

వ. ఇవ్విచిత్ర కృత్యంబు లెట్టివి, యమ్మహానుభావుండు నిగూఢ తేజుండై శాణోత్తేజితంబు గాని మాణిక్యంబుచందంబున నున్నవాఁడు. దర్శితాదర్శితప్రభావుండై జలధివిలోలవీచీ

* తోఁ; • నిక్లెట్టిదో-పా; నిక్లెన్నుచున్-వ్రా.ప్ర. || నీవిజ్ఞానంబది. పా.

నిచయప్రతిబింబితప్రభాకరు ననుకరించుచుఁ బ్రవర్తించు. దీని విభజించి కృష్ణునికలరూపంతయు మీ దివ్యదృష్టిం బరామర్శించి వచింపుఁడు. మీరు త్రికాలవేదులు, సకల విద్యాపారంగతులు, నిఖిల సచరాచర జగద్వ్యవహారవిజ్ఞులు నగువివేకనిధులు. మీకు నగోచరంబు లైనయవి లేవు, పెద్ద కాలంబునుంబట్టి నామనంబు తత్సందేహడోలాందోళాయమానంబై యున్నయది. మీసత్యవాక్యకౌశలంబునం, గైతవచ్ఛాదితం బైన సత్యస్వరూపంబు, రాజహంసముఖంబున నుదకసమ్మిశ్రితం బైనదుగ్ధరసంబునుంబోలె నేర్పడు నని ప్రార్థనాపూర్వకంబుగాఁ దన్ను ధర్మనందనుం డడిగిన యపూర్వతాదృక్ప్రశ్నంబునకు నచ్చెరువడి వేదవ్యాసమహామునీశ్వరుండు కొండొకదడవు నిష్కంప నిస్తరంగ తరంగమాలియుంబోలె నూరకుండి తనయంతర్గతంబున నిది విష్ణుమాయావిభ్రమం బని నిశ్చయించి యిట్లనియె. 86

—♦ సర్వము విష్ణుమూర్తిమాయ యని వ్యాసులవారు చెప్పుట. ♦—

క. ఈయెల్ల §యదియు నాతని
మాయానాటకము; విష్ణుమాయ యెఱుంగం
డోయజభవునకు నరిది; త
దాయత్తం బీజగత్త్రయంబును నధిపా! 87

చ. తనఘనమాయలోకము, నిదానముదానికిఁ దాన, కృత్యముల్
దనయువ, కర్త దాన, సఫలత్వముఁ బొందెడువాఁడు దాన,ధ

§ ఈయెల్లదియును—పాఠాం.

ర్మ నియమకారి దాన, పరమం బగు తేజము దాన యై జగ
ద్వినుతుఁడు లోకముల్ నడుపు విష్ణుఁడు, సర్వము దాన కావునన్.

చ. నెఱి నిజతత్త్వ మేరికిని నిర్ణయ మొందఁగ నీఁడు; లీలమై
మెఱపును బోలెఁ గొందఱకమేయ దయాకృతిఁ జూపుఁ; జూపి త
న్నెఱిఁగితి మన్న మాయ ఘటియించు; నహంకృతిఁ బాసి భక్తిమై
నఱగొఱ లేనివారికి నిరంతరముం గనుపట్టు భూవరా! 89

వ. అతండు కపటనాటకుండు, తనమాయానిర్మితం బగు జగం
బెల్లు నడపవలయు నట్లు నానారూపవర్తనంబులఁ గార్యసం
సిద్ధిం బ్రవర్తించు నీ నడిగిన సంశయంబు లెల్ల నేర్పరించెద
వినుము. 90

—♦ విష్ణుపరిభావము ♦—

క. వనజాక్షుఁడు నీరూపునఁ
దన తేజము నిల్పి కొంత దనపనిఁ దీర్పన్
నినుఁ బెద్దఁ జేసి మ్రొక్కును
జనవర! *సహచరతఁ గార్యసఫలతకొఱకున్. 91

చ. అనలరవీందురుద్రజలజాసనవాసవులందు నున్న య
య్యనుపమదివ్యతేజమును నాహరియంశము కాదె? వారి వం
దనములఁ దన్పఁడే యతఁడు తద్విషయంబులఁ గూడి మర్త్యవ
ర్తనమున నేరికిన్ సహజతత్త్వముఁ జూపక మాయ పెంపునన్?

వ. కావున నీకు మ్రొక్కుట బంధుభావంబున నని తలంప
కుము, తనకుఁ దాన సన్మానించుకొనుటగా వితర్కింపు

*సహచరితకార్యసఫలత... వ్రా. ప్ర.

మతనికి నీవు నే నని భేదంబు లేదు. పూజ్యపూజకపూజా
రూపంబులు విష్ణుండ. 93

క. ‖జనినిధనశాసనమ్ములు
తనమాయాకృతము లగుటఁ దాఁ బన్నినమే
లును గీడును జంతువు లొం
దినఁ బరహిత మహిత మనఁడు నియమస్థితికిన్. 94

వ. భీష్మద్రోణాదులయందుఁ బితృ*భ్రాతృపుత్రపౌత్రాది జంతు
సంతతియందు నెవ్వ రెట్లైన నది యతనికి సంతోషంబ
కాని దుఃఖకారణంబుగా; దమ్మహాపురుషుం డానందమ
యుండు గాని దుఃఖకలితుండు గాఁడు, మఱి మాయందు
ననుగ్రహంబు గలిగి మమ్ము సంరక్షించు చున్నవాఁ డని
పలికితి వది యె ట్లంటేని. 95

క. భక్తాధీనుఁడు గావున
భక్తుల నాపదలవలనఁ బనివడి కాచున్;
భక్తపరివరుల మిము నా
సక్తిన్ రక్షించు టెంత చక్రధరునకున్? 96

వ. తొల్లి ప్రహ్లాదాదుల నెవ్విధంబునం బ్రతిపాలించె వినవె
యతనికిఁ బ్రపన్నపరిపాలనంబు వ్రతంబు. 97

క. విను భూభారముఁ దీర్పఁగఁ
బనిఁ బూనినచక్రధరుఁడు పనిచినపని యె

‖ జననాధనశాసనములు. వా. ప్రి. వనజాసనశాసనములు-పాఠాం.
* పితృమాతృకళత్రపుత్రాది—పాఠాం.

ట్లొనరించినఁ బాపము లే
దనఘాత్మా! సేయువాఁడు నచ్యుతుఁడ యగున్. 98

క. మనుజుం డేచందంబునఁ
దనచేయునఘంబులైన ధర్మములైనన్
వనజాక్షుచేఁత లని మన
మునఁ దలఁచిన నుభయకర్మముక్తుఁడగుఁ దుదిన్. 99

క. *మారణకృత్యము విష్ణు
ప్రారంభము గానఁ ♦బరమపాతక మయ్యున్
గౌరవపాండవవీరుల
పో రుత్తమ మనఁగ నెగడు భువనములందున్. 100

ఆ. హరికిఁ గాని యజ్ఞమైన నవర్థంవుఁ
జేఁత; యచ్యుతునకుఁ బ్రీతి సేయు
బ్రహ్మహత్య యైనఁ బరమధర్మము, ధర్మ
శాస్త్రవాక్యమర్మసరణి వినుము. 101

వ. అత్యుత్తమసాత్త్వికజ్ఞానవంతుండవు గావున నీకు నట్లు కొంత కొంత నిజతేజోవిలసనంబు ప్రకాశంబుగాఁ జేయుట యను గ్రహంబు. 102

చ. జననసహస్రపుణ్యఫలశంబరధారల నూని సాత్త్వికం
బనియెడు విత్తున న్మొలచు నచ్యుతభక్తిసురద్రువల్లి స
జ్జనహృదయాలవాలములసారెకుఁ బ్రోది యొనర్చుచుండ నం
దునఫలమైజనార్దనుఁడెలోఁ చిఘటించుఁ దదీయసౌఖ్యముల్.

---

* తారణ;-వ్రా. ప్ర. ♦ పరమపావనమయ్యెన్—పాఠాం.

చ. అనుపమవిష్ణుభక్తియు సమంచితసాత్త్వికధర్మసత్తపో
ధనతయుఁ గల్గు నిన్ను హరి దాను దయన్ జగదేకపూజ్యుఁ గాఁ
గనియును నీకు నిట్లు పొడకట్టుట మోక్షము నీఁ దలంచి; యీ
యనువునఁ గాదె భక్తులఁ గృతార్థులఁ జేయుచునుండు నిచ్చలున్.

క. తగ "సర్వం విష్ణుమయం
జగ" త్తనుట వినవె *యతఁడు సర్వగతుఁడు త
త్త్వగరిష్ఠులకుం గనుపడుఁ
ద్రిగుణములై ♦యొందు నతని ప్రతిబింబంబుల్. 105

చ. త్రిగుణమయుండు గావునఁ బ్రదీప్తుఁడగున్ వివిధప్రభాప్తి ని
మ్మగ నొకవేళ; నొక్క యెడ మాఁటను §వేర్పడియుండు గేవలుం
డగు పురుషుండు గావునఁ; గ్రియాపరతంత్రుఁడు గావునన్ సమ
స్తగుణవిలాసమూర్తులఁ బ్రసక్తి వహించి నటించు నొక్కచోన్.

వ. అని సర్వంబునం దేటపడఁ బరాశరనందనుండు పలికిన ధర్మనందనుండు విని, మహాత్మా! మీ హృదయంగమప్రమాణవాక్యంబుల నా సందేహనివృత్తి యయ్యె. వాసుదేవుం డట్టి వాఁడ యౌ, నైన నింక నొకటి యడిగెద నప్పురుషోత్తముండు నిజతేజంబు డాఁచి మాయామానుషవేషధారియై జగంబులు నడుపుచుండుఁ దద్విలసనం ‡బెట్టిదియునుం గానక భ్రమసి తిరుగు మముబోంట్లు తుదిముట్ట నెఱింగి ముక్తి వడయం జాలరు గాక విజ్ఞానదృష్టిఁ బెక్కుదెఱంగుల నతని మొదలి తేజంబుఁ దెలిసి కృతకృత్యులైన మీ రిట్లు తత్ప్రకమ

* యట్లు; ♦ యుందు; § వేర్పడి; ‡ బెద్దియు—పాఠాం.

సాయుజ్య ముక్తిం బొందక యుంటకుం గారణం బేమియనిన నమ్మౌని యిట్లను. సకలంబు నతని మాయావలితంబు; తన్మాయాతిమిరంబు జగంబు లన్నియుం గప్పి సకలజనుల నజ్ఞానాంధులం గావించుచున్నయది; యది భేదింప నెవ్వరికి నలవి గాదు. దానంజేసి విష్ణుసాయుజ్యంబు దుర్లభంబు; క్రమక్రమంబున నతనియందు భక్తి యెక్కించిన పరమభాగవతులకు సిద్ధించు, నహంకారపరులైన వారు మాయాచక్రంబు నంద పరిభ్రమింతురు. వీరు వా రన నేఁడు. సకలజనులు * పరిశాంతిభావశౌర్యవిద్యాపరిభావంబుల నహంకరించుచుందురు; గావున ముక్తి వడయ నోపరు. సాత్త్వికగుణంబు గలిగి యతని నెఱుంగుటయు నరిది; యహంకారగ్రంథులై విష్ణుమాయం దిరస్కరించి బ్రహ్మరుద్రాదులు మోసపోయిరి మే మెంతవారము? మది యెట్లంటేని నే నెఱింగినకథలు గొన్ని చెప్పెద; విను మని పలుకుసమయంబున. 107

—•{ధర్మరాజసభకు గోవిందశర్మ యనెడు బ్రహ్మచారియును సనక సనందన సనత్కుమార వారదులును వచ్చుట.}•—

ఉ. ద్వారకనుండి వచ్చె వటువర్యుఁ డొకండు వినీలకంధరా
కారుఁడు, గోపిచందనవికస్వరఫాలుఁడు, పారిజాతమా
లారమణీయవక్షుఁడు, మిళత్తులసీనవమంజరీశిరో
హారి, ద్వితీయకృష్ణుఁ డన హాటకపుస్తకహస్తుఁడై దివిన్.

* పరిభాశౌర్య-పాఠాం.

క. సనకసనందననారద
సనత్కుమారులును వానిసంగతిఁ బిఱుఁదన్
జనుదెంచిరి తత్తను ది
వ్యనితాంతద్యుతులు పర్వ వడిఁ గోలు వెల్లన్. 109

ఉ. వాసవనీలజాలము లవారణ రాలెడు మింటనుండి యు,ద్భాసి
తలీల వానిపిఱుఁద న్నవపంకజరాగరత్నము, క్తాసముదాయ
ముం దొరఁగెఁ గన్గొనుఁ డంచు వటూత్తమాంబుజా,తాసన
జాంగదీధితుల కచ్చెరువందిరి సభ్యు లందఱున్. 101

వ. ఇట్లు తత్ప్రభాపటలంబులు కన్నుల మిఱుమిట్లు గొలుపుచు సొంపారుతద్భవన ప్రదేశం బాచ్ఛాదింపఁ గొలువువా రెల్ల నెద్దియు నిశ్చయింపఁజాలక, కొండొకప్రొద్దు హర్షవిస్మయరసంబున నున్న, నర్జునుండు గగనతలం బవలోకించి సాంద్రమహేంద్రనీలనీలాకారుం డొక *మహాభాగుండును సూర్యసంకాశులైన వారొక ముగ్గురును, బూర్ణచంద్రోపమానుం డొక్కరుండును నెవ్వరోకాని యేవురు దివ్యపురుషులు విజయంబుసేయుచున్నవా రని వెండియుం బరీక్షించి, యెఱింగితి నివ్వటుండు ద్వారకానగరంబువాఁడు, కృష్ణుని యంతఃపురస్త్రీ లగు రుక్మిణ్యాదులకు నుబుసుపోవం గథలు సెప్పు గోవిందశర్మ యనువాఁడు. వీనియందు సత్యభామామహాదేవి యనుగ్రహం బతిసమగ్రంబై యుండుఁ, గడమ నలువురును సనక సనందన సనత్కుమార నారదులు మీ

---

* మహాబాహుండును. వ్రా. ప్ర.; బాలుండును-పాఠాం.

రెఱింగినవార. వారిరాకయు నిర్వ్యాడక యని తోఁచుచున్న యది యనినఁ గృష్ణద్వైపాయనుండు నట్ల నిశ్చయించి యీ గోవిందశర్మ యనువాఁడు మహాతపస్వి, సకలకథాపరిచితుండు. మన ముపక్రమించిన విష్ణుమాయారహస్యంబు లన్నియు విశదంబుగాఁ జెప్ప నేర్చు, నిక్కడికథాప్రసంగంబు తనదివ్యచిత్తంబున నెఱింగి వాసుదేవుండు పంపినవాఁడు. తదనుమతంబునఁ దద్దేవమునులును వానివాక్పాటవంబును, దదీయమాయాపరిభావంబును వినువేడుకఁ జనుదెంచినా రనిన నందఱుం గౌతూహలాయత్తచిత్తులై తదభిమతాగమన ప్రత్యుత్థానప్రయత్నాభిముఖు లగుచుండి రంత (నయ్యేవురు) ననంతమార్గంబు డిగ్గి తత్సభాసమీపంబున నిలిచిన. 111

శా. పారాశర్యుఁడు దక్కఁ దక్కిన మహాభాగుల్ సభాసీను ల
వ్వారాన్యున్నమితోర్మిసంఘముల తేవన్నిల్చుడున్ సంభ్రమం
*బారన్ సానుజుఁడై సధర్మజుఁడు ప్రేమాయత్తచిత్తంబుతో
వారింవోడఁగ నితెచ్చియిచ్చెఁగడువిశ్వాసంబుతో నర్చనల్.

వ. ఇట్లు తగువిధానంబున నేవురం బూజించి సత్యవతీసుతుని సమీపంబున నబ్బాలుం డగ్రభాగంబునం గూర్చున్నఁ దక్కిన నలువురను సుఖాసీనులం గావించి తదనుమతంబునఁ గూర్చుండు సమయంబున. 113

---

* "బారం గద్దియ డిగ్గి పోయి ప్రణతుండై ధర్మజుం డర్థిమై— పాఠాం.

—◆ ధర్మరాజుసభకు ఋషీంద్రులు వచ్చుట. ◆—

సీ. కశ్యప కణ్వ మార్కండేయ భృగు వసి
ష్ఠ మతంగ జాబాలి జహ్ను పులహ
వాలఖిల్యాగస్త్య గాలవ మైత్రేయ
జమదగ్ని నారద శంఖకర్ణ
కపిల భరద్వాజ గౌతమ చ్యవన వి
శ్వామిత్ర మౌద్గల్య చండదమన
రౌమహర్షణి పైల జైమిని మాండవ్య
వరతంతు శరభంగ వత్స కౌత్సు
తే. లాదిగాఁ గల పరమసంయములు వచ్చి
రందు గోవిందశర్మ ధర్మాత్మజునకు
విష్ణుమాయాప్రభావంబు విస్తరించు
ధీరమతి నంచు విజ్ఞానదృష్టి నెఱిఁగి. 114

వ. అట్లు సరిత్సాగరపర్వతారణ్యాశ్రమంబుల నున్నవారలును, *దిక్పాలలోక బ్రహ్మలోకవాసులును దండోపతండంబులై పాటలజటాభారదండకమండలు దర్భసూత్రాక్షమాలికావల్కలాజినప్రముఖలాంఛనంబులతో నారాయణనామోచ్చారణపరాయణు లగుచు వచ్చి ద్వారప్రదేశంబునం దోఁచిన. 115

క. కని దౌవారికముఖ్యుఁడు
వినయాంజలితోడ వచ్చి విన్నప మొనరిం

* దిక్పాలభరిత—వ్రా. ప్ర; & పాఠాం. (దిక్పాలరహిత?)

చిన విని కృష్ణద్వైపా
*యనుఁడంపఁగ ధర్మపుత్త్రుఁ డతులప్రీతిన్. 116

క. అనుజులు దానును సంభ్రమ
మున నెదురుగఁ బోయి వినతిపూర్వకముగ స
ద్వినయమున నమ్మునీంద్రులఁ
గొని చని యర్చించి యునిచెఁ గుశపీఠములన్. 117

వ. తదనంతరంబ వారల యాశీర్వాదంబులతో సోదరామాత్య పరివృతుండై కూర్చుండి సిద్ధమంత్రి తంత్రి కళా ప్రత్యక్షీకృతనిజాభిమత దైవతంబులసన్నిధి సిద్ధపురుషుండునుంబోలె నొప్పుచుండె నప్పుడు. 118

— ధర్మరాజును నారదుఁడు శ్లాఘించుట —

క. అందఱు సముచితపూజా
నందితులై యున్నఁ బలికె నారదుఁడు జనా
నందకరు ధర్మనందనుఁ
జందురునం దమృతరసము జాఱెడుభంగిన్. 119

ఉ. గొంతికి ధర్మదేవతకుఁ గూరిమి‡పట్టివి పుణ్యమూర్తి వ
త్యంతదయావిధేయుఁడవు తాపసముఖ్యులు నీగృహంబునన్
సంతతముం బ్రియార్చనల సంతస మందుచు నున్నవారు నీ
యంతటిభాగ్యవంతుఁడగయన్ మఱిలేఁడుజగ త్త్రయంబునన్

* యనుఁ దుప్పొంగంగ నృపతి యతులప్రీతిన్—వ్రా. ప్ర.

‡ కూరిమిఁబుట్టినపుణ్యమూర్తి—వ్రా. ప్ర.

తే. దేవగంధర్వయక్షదైతేయరాజ
సభలు చూచితి నవియు నీసభకు సాటి
గావు; సురరాజుసభయేమొ కాని కొంత,
ధార్మికశ్రేష్ఠసంపూర్త! ధర్మతనయ! 121

సీ. వాసవదహనాంతకాసురవరుణమ
రుద్వ్యక్షనాయకరుద్రపూజ్యు
లనుచరభూతగుహ్యాకసిద్ధగంధర్వ
లేనోద్విపేంద్రమృగేంద్రమూర్తు
లమితశాపానుగ్రహప్రభావులు హారి
హారహేమ*గర్భాభు లఖిలవేద
శాస్త్రోపనిషదర్థసన్మంత్రదక్షులు
కల్పాంతరస్థు లనల్పమతులు

తే. సత్యసంధులు తత్త్వనిష్ఠాగరిష్ఠు
లిట్టిమును లిట్లు నీయింటి కేఁగుదెంచి
పూజ లందుచు నున్కి నీపుణ్యఫలము
తత్ఫలము నీకు హారి సువ్వే ధర్మతనయ! 122

సీ. అఖిలలోకైకనాయకుఁ డాదిపురుషుండు
త్రైలోక్యరక్షావిశాలబుద్ధి
శ్రీకృష్ణుఁ డనుపేరు చెవులకుఁ జల్లఁగా
భువి దేవకీదేవి కవతరించి

---

*గర్భాదు—వ్రా. ప్ర. & పాఠా.

యనఁగుముద్దులబిడ్డఁ డగుచు నందయశోద
లకు నిహపరసౌఖ్యలక్ష్మి నొసఁగెఁ
గంసాదిరాక్షసకౌరవ్యముఖపాప
కారులఁ ద్రుంచి భూభార మడఁచె

తే. వెలయ నక్రూరు ముచుకుందవిభుఁ గుచేలు
భీష్మ విదురుని మిమ్ము సంప్రీతి మనిచె
వెండియును నాపయోజనేత్రుండు మిమ్ముఁ
గూడి వర్తించుఁ బాయని నీడపోలె. 123

వ. అని నారదుండు పలికిన నట్ల యౌ నని యశేషమహర్షిపుంగవకులంబు సవిశేషభాషణంబుల ధర్మనందను భూషించిన (తదీయవచనఘోషంబు) శేషపన్నగసహస్రముఖనిర్ఘోషంబు ననుకరించెఁ దదనంతరంబ సనత్కుమారుండు తమయందఱ నడుమ నుత్కృష్టతేజోభిరాముం డగుచు గ్రహమండలమధ్యంబున బాలభానుండునుం బోలెఁ బ్రకాశించుచుఁ బ్రతిభావిశేషంబున సభానందకందం బై యున్న గోవిందశర్మం జూపి ధర్మనందనున కిట్లనియె. 124

ఉ. ఈమహచక్రవర్తి హరి కిష్టసఖుండు సమస్తశాస్త్రగా
థావిదుఁ డాత్మవేది సతతంబును నవ్విభురాణివాసముల్
భావము పల్లవించిబహుభంగులమెచ్చఁగఁజెప్పఁ*దత్కథల్
శ్రీవెలయన్ రహస్యకృతరీతుల మిక్కిలిఁ బ్రస్తుతించుచున్.

వ. ఇది యెఱింగి వినువేడుక మేము నలువురము శ్వేతద్వీపంబున

*సత్కథల్—వ్రా. ప్ర.

నుండి ద్వారకానగరంబునకు వచ్చి యచ్యుతునిచేత బహుమానంబు వడసి. 126

ఆ. కృష్ణ! నీవిచిత్రకేలివర్తనములు
కథలు చేసినఁట ప్రగల్భబుద్ధిఁ
గూర్మి నీసఖుండు గోవిందశర్మ; మా
కవి వినంగవలయు నాదరమున. 127

వ. అనిన మందస్మితవదనారవిందుండై నందకపాణి గోవిందశర్మం జూచి నీవు నామీఁదిసౌహార్దంబునం జెప్పిన కథ లన్నియు, మత్ప్రియబాంధవుం డగు పాండవేయాగ్రణియు నిప్పుడు కరినగరంబున నిండు గొలువుండి వ్యాసభట్టారకుం డచ్చటికిఁ జనుదెంచిన నతనితో నన్నుం బ్రశంసించి నామీఁది వాత్సల్యంబునఁ బ్రసంగవశంబున హరిమాయాకేలిచరిత్రంబులు విన వేడుక యయ్యెడుఁ గొన్ని చెప్పుం డని యడిగిన నమ్ముని యేమేనియుం జెప్ప నుపక్రమించియున్నవాఁడు, నీ విమ్మనులం దోకొని యక్కడకు నరిగి యారాజునకుఁ బ్రియంబుగాఁ జెప్పు మొమ్మని యానతిచ్చి వీడ్కొలిపిన వచ్చితిమి యిక్కడికథాప్రసంగంబు నట్లయున్నయది యతనిసర్వాంతర్యామిత్వంబు ప్రశంసింప నరిది యింక నతని నీవు ప్రార్థించి మాహృదయంబులు ముదంబునం బొంద నిమ్మునిబృందంబునకుఁ గర్ణానందంబుగా నడిగి విను మనిన, సంతసించి కృతార్థుండనైతి నని హరిదయావిశేషంబు దలంచి పులకించి సత్యవతీసుతుని యనుజ్ఞ వడసి ధర్మపుత్రుం డి ట్లనియె. 128

తే. అనఘ! భూసురతనయ! గుణాభిరామ!
యచ్యుతునియట్ల నీవు మా కరసి చూడ
నీదువృత్తాంత మంతయు నెమ్మితోడ
నాకు నెఱిఁగింపు మున్ను వినంగవలయు. 129

క. అహితల్పునకుం దక్క సు
మహితోజ్జ్వలపారిజాతమాల్య మొరునకున్
మహిఁ దాల్పరాదు నీకన్
వహింప నట్లాదవె చెపుమ వటుకులతిలకా! 130

—• గోవిందశర్మ తనవృత్తాంతము చెప్పుట. •—

మ. అనినన్ సంతసమంది,యానృపతియత్యాశ్చర్యముంబొంది క
న్గొనఁ, గర్ణామృతవాక్పరంపరల నాగోవిందశర్ముండు మ
న్ననఁజూడుండనియమ్మహామునులకున్ హస్తాబ్జము ల్మోడ్చిప
ల్కె నిశాంతపిప్రియగోపకాంత మురళీగీత ప్రబంధధ్వనిన్.

సీ. ఘనుఁడు *సాందీపని యనెడు విద్వాంసుండు
రామకృష్ణులకు గారాబుగురువు
అమహాభాగుని యగ్రపుత్త్రిం డైన
ధర్మశీలువకు నందనుఁడ నేను
నాజన్మవేళ వందకపాణి వినుచుండ
నాకాశవాణి, "ఏఁ డఖలశాస్త్ర
వేది యత్యాగ్రమవిశ్రుతకీర్తి గో
విందశర్ముండు గోవిందమిత్త్రిఁ"

* దీపుడు జనెడు, వాని ప్ర.

ఆ. తనుచుఁ బలికెఁ బలికి నట్లన బ్రహ్మాచ
ర్యాశ్రమంబుఁ జదువు నలరియుండ
మైత్రిఁ గృష్ణునగరు మరగి వర్తింతు గో
విందశర్మ యనఁగ వెలయువాఁడ. 132

క. చెప్పెదఁ గ్రొత్తలుగాఁ గథ
లప్పద్మదళాయతాక్షునబ్జాక్షులకున్
జొప్పడ నంతఃపురిలో
నెప్పుడుఁ దత్కేళికలన లేర్పడి యుండన్. 133

—♦ పారిజాత పుష్పమాలికాప్రాప్తి వృత్తాంతము ♦—

వ. మఱియుఁ బూవుదండ వచ్చినప్రకారంబునుం జెప్పెద నాక
ర్ణింపుము. 134

ఉ. ఆరయసత్యభామహృదయం బెటులుండునో యంచుమాయవి
స్తారముచేసి శౌరి ప్రమదంబున రుక్మిణి యాదియైనపం
కేరుహపత్త్రలోచనల కేళివనంబుల నొక్క టొక్క చే
పారఁగఁ బారిజాతనివహమ్ముల నిల్పె సమత్వ మేర్పడన్.

తే. అష్టమహిషులయిండ్ల సహస్రసంఖ్య
లైన గోపాంగనలయిండ్ల నందఱకును
నన్నిరూపంబులై కేళి నలరె విభుఁడు
పారిజాతప్రసూనసౌభాగ్యలీల. 136

క. ఇందీవరదళలోచన
లందఱుఁ దన్మాయ యెఱుఁగ కబ్జాక్షుఁడు నా

యంద యనురక్తుఁ డని యిం
పొంది తదాసక్త లగుచు నుండిరి ప్రేమన్. 137

వ. ఇవ్విధంబున నయ్యనంతుఁ డనంతరూపవిలాసంబుల దక్షిణ
నాయకత్వం బవలంబించి యందఱియెడల మనోవాక్కర్మ
విలాసకేళీలీల లొక్కచందంబుగా మెలంగుచు నుండె నంత
నొక్కనాఁడు. 138

చ. దళమగు రూపయౌవనమదంబునఁ బైకొని చంద్రపాదని
ర్మలకలధౌతసౌధమణిమండపకోమలపుష్పడోలికా
తలమునఁబద్మలోచనుఁడుఁదానురమించుచు సత్యభామదాఁ
దలఁచె మదీయకేళికె యితండు ప్రియుం డని నెమ్మనంబునన్.

వ. ఇట్లు దలంచి యనురాగంబు పెంచి. 140

క. తిలకించుచుఁ బులకించుచుఁ
గలుపించుచు నగుచు విభునిఁ గౌఁగిటఁ గోర్కెన్
నెలకొలుపుచుఁ గచభారో
ద్గళితోత్కట పారిజాతగంధం బెసఁగన్. 141

ఉ. చయ్యన శయ్య డిగ్గి యరజాఱెడువేణియు మందహాసమున్
బయ్యెదజీరుపాటు నవపాటలితాక్షులు మర్మసీమలన్
ప్రయ్యలువాఱియున్న నెలవంకలు నొప్పఁగ నాలతాంగి యొ
య్యొయ్యన వచ్చె వాకిటికి నుబ్బుచు నవ్విభుఁ గూడిక్రీడమై.

క. చను దెంచి వికచపంకజ
వనబంధురసురభిగంధవాసితమై యిం

పొనరించు కేళిదీర్ఘిక
ననువున మజ్జన మొనర్చి యభిమతలీలన్. 143

వ. కనకపీతాంబరంబులు ధరియించి తత్తీరపారిజాతప్రసూనంబు లు మనోహరమండనంబులుగా నలంకరించుకొని, పుష్పాడి యలంది మధురసంబులు గ్రోలి యానందలహరిం దేలి యాడుచుఁ దదంతికచంద్రోపలవేదికామధ్యంబునఁ బుష్పా స్తరణంబునం గూర్చుండి చంద్రికాశీతలంబు లగు మంద పవనకందళంబులచేత సురతఖేదం బపనయించుచుండి రప్పు డమ్మహాదేవి తనమనంబున. 144

శా. నాతోఁగూడి విభుండు సంతతము నున్నాఁ డిట్లు ప్రేమోల్లస
చ్చేతోమోద మెలర్ప దీనికి మదిన్ సిగ్గైన నెట్లున్నవా
రో తర్కింపఁగ రుక్మిణీముఖవరారోహల్; తదుద్యోగముల్
"చూతా"మంచు దరస్మితాంశుకలనాసుస్మేరవక్త్రాబ్జ యై.

తే. ఇంగితాకారచేష్ట లెఱింగి మనసు
లోన మెలఁగెడు సఖుల గారానఁ బిలిచి
యా సురద్రుమకుసుమచయములు గొన్ని
యేర్చి కోయించి వేర్వేఱ యేర్పరించి 146

తే. దివ్యమాణిక్యపాత్రికల్ దెచ్చి యిడినఁ
దత్ప్రసూనంబు లన్నియుఁ దగనకోలఁది
నోలిఁ బెట్టించి యిట్లనె నొకతెతోడ
నలిననేత్రుఁడు దనలోన నవ్వుచుండ. 147

క. ఈపువ్వులు గొని రుక్మిణి
కేపారుకడంకతోడ నిచ్చి తదీయ
వ్యాపారము తలఁపును గని
రా పొ మ్మని యానతిచ్చె రాజస మొప్పన్. 148

వ. అప్పుడు. 149

చ. సురతరులాభగర్వమును శోభనయౌవనగర్వమున్ మనో
హరనవరూపగర్వము ననంగవికారవిహారగర్వముం
బరమహితాత్ముఁడై విభుఁడు పాయనిగర్వము సత్యభామకు
న్సరిపుఁబోండ్లలోనఁ గడుసాగుటకున్మదిఁబొంగిరచ్చెలుల్.

వ. ఇట్లు పారిజాతప్రసూనదానవ్యాజంబున రుక్మిణ్యాదులకుఁ దనమహారాజసంబును, బ్రాణేశ్వరుతోడం గూడఁ యనుభవించుమదనసామ్రాజ్యవైభవంబును హృదయశల్యం బై యుండవలయు నని కాదె ననుఁబోంట్లఁ బంపుట యని యాసంచారికారత్నంబు తన్మనఃప్రసాదంబున నెఱింగి, చూపిన పుష్పపాత్రికం బుచ్చుకొని రుక్మిణీదేవి నగరికిం జనియెఁ గడమసవతులయిండ్లకు నట్ల యాదేవి నియోగించిన సఖీజనంబులుఁ బోయి రట మున్న పోయినది రుక్మిణీదేవి కేళీభవనద్వారంబు ప్రవేశించినఁ దద్ద్వారపాలాంగన వాకిటికి నడ్డమై నిలిచి దానితో నిట్లనియె. 151

క. ఏకాంతంబున దేవియు
శ్రీకాంతుఁడు నున్నవారు చిత్తజకలనా

వ్యాకులితేంద్రియు లై తమ
లోకంబై; పోవఁదగునె లోనికి నీకున్ ? 152

క. ఇవ్వీరు లెవ్వరు పంపిరి
యెవ్వరి చెలి వనిన నవ్వె యెఱుఁగవె యిన్నా!
ళ్లి వ్వీరు లెవ్వరికిం గల
*వవ్వారిజనేత్రునగరియతివలలోనన్ ? 153

వ. లేని యేకాంతంబులు గల్పించుచుఁ బువ్వు లెవ్వరు పంపి రెవ్వరిదాన వని నన్ను నిరాకరించి పలికెదు. పారిజాతప్రసూన సౌరభసౌభాగ్యంబు దేవేంద్రునినందనవనంబు చూఱవెట్టించి తెచ్చిన వీరపత్నీతిలకం బగుసత్యభామకుం దక్కఁ దక్కిన యానగరిమగువలకుం గలుగనేర్చునే యని గర్వించి పల్కిన నవ్వేలఁది న వ్వొ్వాయ ని ట్లనియె. 154

ఆ. పారిజాత మేమిబ్రాఁతి ? యందఱయిండ్ల
నుండఁ జూడవే ? పయోజనేత్ర !
ముదుతు రిట్టిపువ్వు లుడిగాలవారు మా
జననినగరిపారిజాత మొసఁగ ! 155

వ. అనిన నప్పలుకులకుఁ గసలి నవ్వుఁబలుకులుగాఁ దిరస్కరించి మాసత్యభామ మీరుక్మిణికిఁ బువ్వు లిచ్చిర మ్మని పంపినది. ఈ పువ్వు లిచ్చిపోయెదఁ బోవని మ్మని పలుకునమయమ్మున వా రిద్దఱసంవాదంబు నాలకించి యొక్కసంచారిక లోననుండి

---

* ఇవ్వారిజనేత్రునగరియింతు లలోనన్.

వచ్చి మహాదేవియానతియయ్యె ర మ్మని దానిం దోడ్కొని
పోయె నటమున్న యభ్యంతరమ్మున. 156

మ. సుమనోనిర్మితహర్మ్యనిర్మలశశిజ్యోత్స్నాంతరసస్వచ్ఛవ
జ్రిమరీచిస్ఫుటవేది లేఁజిగురుపర్యంకంబునన్ రుక్మిణీ
రమణీరత్నము శౌరిఁ గూడి రతిసంరంభంబు చాలించి యా
కమలానాథుఁడుడింప శయ్య డిగియెం గాఁదీఁగ వే సోలఁగన్.

సీ. అంకుశనిర్భిన్న హస్తికుంభములట్లు
కొనగోటినొక్కులకుచము లమరఁ
గీరంబువాయి సోఁకినబింబ ఫలమట్లు
దంతక్షతాధరదళము దనర
నెత్తుటఁ దోఁగిననిశితబాణములట్ల
కరవాఁడికెంజాయకన్ను లెసఁగ
మృగయాంతమునఁ జిక్కుదగిలినవెడవిల్తు
నురులట్ల చెదరినకురులు బెరయఁ

తే. గేళిమై నట్లు వచ్చి దీర్ఘికకు డిగ్గి
ప్రమదమున మజ్జనంబాడి పసిఁడిపచ్చ
పట్టు ధరియించి తత్త్రిరపారిజాత
కుసుమభూషణములు దాల్చి కోర్కి నిండ. 158

ఆ. పూవుఁదేనెఁ గ్రోలి పుష్పాడి యలఁది త
త్పారిజాతమండపంబులోన
నలరుఁబొమ్మమీఁద నాసీను లై యుండి
రింపుఁబవన మొలయ నెలమిఁ బొంది. 159

క. అక్కడ నక్కడ నాక్రియఁ
దక్కక హరిఁ గూడి సమ్మదం బెసలారం
జొక్కమయి యుండి రందఱు
నక్కట్టడ యేమి చెప్ప ? నచ్చెరు వెందున్ ! 160

వ. ఇవ్విధంబున వినోదించుచు రుక్మిణీదేవి తనమనంబున. 161

ఉ. నాకును బారిజాతము మనం బెసలారఁగ నిచ్చి ప్రేమతో
నాకడనే యహర్నిశము నాయకుఁ డుండఁగ వంతఁ గుందుచు
న్వ్యాకులితాత్మయై యెటులుపర్తిలుచున్నదొ సత్యభామ నేఁ
డాకత చూతమంచు దరహాసవిలాసవిభాసితాస్యయై. 162

వ. ఒక్క చతురసంచారికం బిలిచి క్రొవ్విరపారిజాతమంజరులు గొన్ని కోయించి పసిండిపళ్లెరంబునం బెట్టించి యవ్విరులు సత్యభామకుం గొనిపొ మ్మని దానితో నేకాంతంబున. 163

క. మాకు నొకపారిజాతము
మాకృష్ణుఁడు దెచ్చినాఁడు మగువా ! యిదిగో
నాకల్పకతరువిరు, లివి
యేకడ లే వనుచుఁ జెప్పి యేతేర నగున్. 164

వ. అని పలుకుచున్న సమయంబై యున్న నాసపత్నీసంచారిక డాయంబోయి. 165

మ. కనియెన్ రుక్మిణిఁ బూర్ణచంద్రవదనం గంజాక్షుతోఁ, బారిజా
తనవీనాభరణాభిరామ నభిజాతస్మేరతారుణ్యమం
డనలక్ష్మిన్ సురతాలసాంగి నతులానందస్ఫురన్మానసన్
ఘనపుష్పోదయపారిజాతసవిధగ్లారత్నవేదిస్థలిన్. 166

వ. కని వెఱఁగుపడి యవలోకించి.

క. ఏమార్గంబున వచ్చెనో 167
యీమాయావేషధారి యిచటికి నీకాం
తామణి నెప్పుడు దనిపెనో
కామకళలఁ? నింత హృదయకంజం బలరన్. 168

క. మాయింటి పారిజాతము
నీయెలమి నహించి యుండ దెన్నఁడు నిది దా
నీయతివ కెపుడు తెచ్చెనో
యీయధిపుఁడు సత్యభామ యెఱుఁగక యుండన్. 169

వ. అని ద్వారపాలిక చెప్పినమాట నిశ్చయం బని వెండియు
రుక్మిణిం గనుంగొని. 170

ఉ. తానును సత్యభామకు ముదంబున రుక్మిణి పంప నున్నదో
యీనవపారిజాతముల నిప్పుడు! సంభ్రమ మట్లు యున్న దా
నా నలదూతియుం గదిసి యల్లనఁ దా వినుచున్న దేటిపో
కా నొక్కకొన్నిమాటలు వికాసముతోఁ జెవిలోనఁ జెప్పఁగన్.

క. ఏ నీకొనితెచ్చిన విరు
లీనెలఁతకు నీగి మేలొ యీక మగిడి పో
తే నే మేలో యొకగతి
నే నెయ్యది యాచరింతు నీయుభయమునన్. 172

ఆ. ఇచ్చి యున్న; మాకు నెన్ని లేఁ? వేల తె
చ్చితివ? యనియెనేని సిగ్గు మిగుల;

నీక మగిడి చనిన నీసతి నగుఁ బోవ
నిమ్మటంచు; నదియు నెగ్గ కాదె? 173

వ. అని సందేహంబు మనంబున నూటాడఁ గొండొక వితర్కించి, మహారాజపత్ని నగర విహరించినప్రౌఢ గాన, నది యప్పుడు దెచ్చి యిచ్చినట్ల నిర్వికారంబున నవ్వుచు నీపువ్వు లిచ్చి పోవుటయు కర్జం బని నిశ్చయించి, కడంక చెడక యాదేవి ముందటంబువ్వులు వెట్టి మీకు సత్యభామ యంపించిన దనిన లక్షించి యవ్విరులు చూపి రుక్మిణి ప్రాణేశ్వరునితో నిట్లనియె.

క. నాళీకనయన! నీప్రియు
రా లంపినవిరులు గొనుము రతిరాజకళా
కేళికి లంచము సేయం
బోలు ననుచు నీరసంబు వొడమునగవుతోన్. 175

క. అది చూడఁగ నవ్విరు ల
మ్మదనతి వల్లభునిమౌళిమండలిఁ దుఱిమెన్
హృదయప్రియామర్షణ
సదమలదృగ్రాగసూత్రసంగతి మెఱయన్. 176

వ. అట్లు రుక్మిణి యారసికశిఖావతంసం బగు కంసారికిఁ బువ్వులు ముడిచి తన వయస్యచేతఁ బువ్వు లంపుట మాని యాపువ్వులు దానిపల్లెరంబునం బెట్టించి దానికిఁ దనపారిజాతంబు చూపి విభునిఁ గన్నుగీఁటి నవ్వుచు నిట్లనియె. 177

తే. ఇంతి యీపువ్వుఁజెట్టు మీయింటిపారి
జాతమట్టిదె యానేము చక్కఁ జూడు!

మిందు పువ్వుల నెత్తావి యెందుఁ జూడ
మన్న దని చెప్పుమీ మీవయస్యతోడ. 178

వ. అని వీడుకొలిపిన నమ్మాట వాఁడిగసికనై మనంబు గాడినం
గనలి వెడవెడనవ్వుతో నమ్మగువ యిట్లనియె. 179

చ. అలవుఁ జలంబుఁ జూపి నరకాసురు గెల్చిన వీరసంపదన్
బలరిపు వీడు సొచ్చి భువనంబులు మెచ్చఁగ సత్యభామ సొం
పలవడఁ దెచ్చి యాత్మనిలయంబున నుంచినపారిజాత మో
చెలువ! తలంప మీపెరటిచెట్టునకున్ సరిరాక పోయెనే.180

క. *నీ వేమి నేతు? మానిని!
యీవిభునాటకము గాక! †యిది కానీ! తా
నావెలఁదిఁబారిఁ బడినపు
డీవిధములు సూపకున్నె యివు డేమిటికిన్. 181

వ. అని పారిజాతంబునకై రుక్మిణి నెకసక్కియం బాడి నెఱవాది
తనమ్మున నమ్మురాంతకుఁ బంతంబులు వలికి యీపువ్వుల
దృష్టాంతంబులు చేసి యిచటివృత్తాంతం బంతయు నయ్యాది
గర్భేశ్వరికి విన్నవించి సేయంగల పనులు సేయింతు నని
మరలి శీఘ్రయానంబునం బఱతెంచె; నప్పు డక్కడ సత్య
భామయు, 182

క. దరహాసరుచులు నిగుడఁగ
గురుకుచములఁ బ్రియునురమ్ము గ్రుచ్చుచుఁ దోడ్పై

* నీ వేమి సేతు—పాఠాం. † ఇది కానీవే—పాఠాం.

నిరవుగఁ గూర్చుండి మద
స్ఫురణంబునఁ జెలికి నెదురుచూచుచు మదిలోన్. 183

ఆ. చెలియ రాక తడవు చేసె; రుక్మిణి, శౌరి
విరహభారవహ్ని వేఁగుచున్న,
నవసరంబు లేమి నట నుండెఁ గాఁబోలుఁ!
గాక పువ్వు లిచ్చి రాకయున్నె? 184

వ. అని వితర్కించుచున్న సమయంబున. 185

శా. విన్నంబోయినమోముతో హృదయనిర్వేదంబుతో సంభ్రమ
స్విన్నాంగంబులతో విరాగకలనావేశంబుతో సిగ్గుతోఁ
జెన్నంజేవయు లేక యల్లఁ జని చూచెన్ దూతి దాదవ్వులం
గన్నారం దమసత్యభామను హరిం గౌతూహలోదాత్తులన్.

వ. కని వెండియు నాశ్చర్యంబు నొంది. 187

క. కన్నులఁ నిచటికి నేమా
ర్గమ్మునఁ బ్రత్యక్షమయ్యె రసికుఁ డితఁడు? చో
ద్యమ్మయ్యె! నింద్రజాలమొ?
యెమ్మెయి నిది చిత్ర! మనుచు నెలనవ్వొలయన్. 188

వ. గమనసంభ్రమంబునం బదంబులు తడంబడ డగ్గఱ వచ్చి యమ్మచ్చకంటిముందటం బువ్వపాత్రిక పెట్టి యేమియుం బలుకక యెడ గలుగ నిలిచి నివ్వెఱపడి చూచుచున్న దాని ముఖవైవర్ణ్యం బుపలక్షించి సత్యభామ యిట్లనియె. 189

క. వెఱఁగుపడి భ్రమసి చూచెదు!
తెఱవా! యిది యేమివింత? ధృతి చాలక సొం

పఱియున్న దేమి నీమొగ ?
మెఱఁగింపుము! వింతపువ్వు లెచటివి నీకున్? 190

క. నావుడు నది యిట్లను నా
దేవికిఁ, "ప్రియునట్లు నిన్నుఁ దేలించెడు నీ
దేవరఁ గృష్ణుని నడుగుము
నీ వడుగఁగ నోపితేని! నీరజనేత్రా !" 191

వ. అనుచుఁ బతిసమ్ముఖంబునం జెప్ప నోడి తొలంగి పోవ నిది యేమొకో దీనిమాటలవలనఁ గొంత వింతచందంబు పుట్టె నని కలుషించి, యాదేవి, విభుని నెఱింబాఱంజూచి, యీ భావంబు చెప్పు మని యడుగంబోయి, రోషంబున నడుగక, మణికంకణమంజీరమేఖలాకలాపఝుణఝుణత్కారంబు తోరం బై మదనధనుర్భ్రంగ శింజినీ భయంకరటంకారారావంబు ననుకరింపంజేయఁ, దోయజాక్షుని హృదయంబు చెదర నుదరిపడి, తదంకపీఠంబు పరిత్యజించి లేచి, పృథునితంబ బింబభారంబునను గురుకుచకుంభంబులవ్రేఁగునను గమన వేగంబునకుం జాలక తొట్రుపడుచు, నిలునిలు మని దానిం డాయంబోయి కరం బవలంబించి యొక్క కాంచన స్తంభంబు దండగొని యడిగిన నది దాఁపక తనకన్నవిధం బెల్ల నల్లనం జెప్పి వెండియు నిట్లనియె. 192

సీ. హరియును నీవు నెయ్యముతోడ నిచ్చోట
నుండఁగాఁ గనుఁగొంటి నుల్ల మలర

నచ్చోటఁ గంటి నెయ్యముతోడ రుక్మిణి
యును నాసరోజలోచనుఁడు నుండ
నచటి కెట్లరిగెనో యచటివాఁ డిచటికి
నేలాగు వచ్చెనో యే నెఱుంగ
నీవ యెఱుంగుదు నీలవర్ణునిమాయ
కాంత !, యేమందు ? నీకంటె మిగుల
తే. రాజసంబును రతిరాజరాజ్యకళయుఁ
గలిగి విభుతోడనున్న యాచెలువ చెలువు
మన్మథునిఁ గూడి రతియున్న మహిమఁ దోఁచె
మగువ ! యేమని నమ్మె దిమ్మాయ కాని ?
క. నీ కిచ్చెఁ బారిజాతము
లోకంబు లెఱుంగ మున్ను; లోలుండై నేఁ
డా కంజాక్షికి నిచ్చెను
నీకంటెను గూర్చు నావనిత కృష్ణునకున్.
క. ఆవెలఁది నీకు నంపిన
పూవులనెత్తావి చూడు ! బూమెల వలపుల్
గావించినపతిఁ జూడుము !
నావచనము కల్లగాదు; నమ్మవయేనిన్. 195
క. చెలి నొకతె నంపు రుక్మిణి
నిలయమునకు నిపుడ యనఁగ, నిశ్చయము గఁ బు
వ్వులు గొనిపోయిన యందఱు
చెలు లొక్కట వచ్చి యట్ల చెప్పిరి సతితోన్. 196

చ. అనయము నేకవాక్యముగ నందఱు చెప్పినయప్డు నివ్వె సోఁ
కిన క్రియ వెచ్చి యంగలత కేవలతప్తసువర్ణమూర్తి యై
కనఁబడఁ గెంపుసొం పడరుకన్గవతోఁ దరళాక్షి మీనకే
తనమహితానలాస్త్రము విధంబున వచ్చె మురారిపాలికిన్.

వ. అట్లుమాయాజాతపరిభూతరోషకషాయితస్వాంత యై తన
తోన సకలసఖీవర్గంబు ననర్గళభంగిం బుష్పమణిపాత్రికలతో
నేతేర, వనదేవతాసంతతితో నచ్చినవసంతలక్ష్మి యన
నమ్మానవతీతిలకంబు హరిముందట నిలిచి, 198

క. విను! తాల్మి లేక యేడ్చుచుఁ
దనులత గంపింప గద్గదస్వరమున న
జ్ఞానిచేఁ బలికెదు వీణియ
కొనయై తడఁబడుచుఁ బలుకు లేర్పడకుండన్. 199

వ. ఇట్లనియె. 200

చ. నను నొక పెద్దచేసి భువనంబు లెఱుంగఁగఁ బారిజాతమ
య్యనిమిషనాథు గెల్చి నయమారఁగనిచ్చితి; నాఁటిమేలు, నా
వెనరుఁ గృపావిశేషమును నేఁ డొనరించితె పెద్దదేవికిన్?
మన మలరన్ వశీకరణమంత్రము క్రొత్తగ నభ్యసించితో?

తే. పారిజాతంబు భువి సత్యభామయింటఁ
గాని మఱి యెందొరులయిండ్లఁ గలుగ దనఁగఁ;
గలుగఁజేసితె తక్కినపొలఁతులిండ్ల?
నేమి మందుల వలపించి రింత నిన్ను? 202

ఆ. సత్యభామ పారిజాతపుష్పము లంపె
నంప సాటి కోరులు నంపువారె?
యింకఁ గడమమాట లేల? యీతరువు నీ
యిష్టసతికి లంచ మిచ్చుకొమ్ము! 203

వ. అని సపత్నీవిషయరోషవిషాదంబున శంకాతంకంబులు లేక యవ్విరు లన్నియు వెన్నునిపై దిగుఁబాఱంబోయించి చంచలహృదయంబునం గోపోద్దీపిత యై, తత్సన్నిధానంబు విడిచి తన కేళీమందిరంబు చేరంబోవ, నవ్విభుండు నవ్వుచు లేచి కూడముట్టి బోటికత్తె లవ్వ లివ్వలఁ దొలంగిపోవ నమ్మానిని పయ్యెదచెఱంగు పట్టినఁ బట్టువడక భ్రమణవేగంబున నవ్వలువ విడి జాఱ లోనికిం జని గ్రక్కునఁ గనకకవాటార్గళంబు బిగియించి వేఱొక్క చీనాంశుకంబు ధరియించి చెంగలువపాన్పున మేను వైచి పొరలుచు, ఘటనిహితక్షుధితపన్నగాంగనయుంబోలె రోఁజుచుండె, నట నొడుపు దప్పినపద్మలోచనుండును మగిడి యొక్కబహిర్మండపరచిత కుసుమశయనీయంబున శయనించి, తద్వయస్యలు సముచిత సేవావిధానంబు లొనరింప, నయ్యంతిసంతాపశాంతికై విరహధర్మం బవలంబించి యమ్మూర్తి నచట నుండి, రుక్మిణ్యాది ప్రధానదేవీజనంబులయందును, షోడశసహస్రసుందరీసందోహంబునందును ననురక్తిఁ దాల్చినరూపంబులఁ గ్రీడించుచుఁ జిత్రకౌశలంబుల నారాత్రి గడపి ప్రభాతంబున నామాయారూపంబు లన్నియు నుపసంహరించి యూరకుండె నప్పుడు.

క. ఆలీలామిథునము త
త్కాలోచితవిధులు దీర్చి కడువడి నన్యో
న్యాలోకననదుపాయం
బాలోకించుచును దహాతహాంపడు చుండన్. 205

సీ. ఆవేళ నేఁ బోయి యది యెల్లఁ దత్పరి
చారికాజనముచేఁ జక్కఁ దెలిసి
హరిఁ గాంచ, నమ్మహాపురుషుండు దనకేళి
మాయావిధానంబు మందహాస
మెసఁగ నానతియిచ్చి యీ చేఁత లన్నియు
వెడపోక లని యీర్ష్య విడువఁజేసి
సత్యభామకుఁ గోపశాంతి సేయుము పొమ్మ
నావుడు, నలరి యాదేవికడకు

తే. సముచితక్రియఁ జనిన, నాజలజనేత్రి
నన్ను మన్నించి, కనకాసనమున నుంచి
తాను నానతి యిచ్చెఁ దద్వర్తనములు
నాత్మసంచారఫణితియు నర్మభంగి. 206

క. చెప్పిన నంతయు విని నే
నప్పుడు తల యూఁచి యమ్మహాదేవిమొగం
బొప్పారఁ జూచి నవ్వినఁ
గప్పరపడి నన్నుఁ బలికెఁ గౌతుక మెసఁగన్. 207

వ. కుమారా! దుగ్ధసాగరంబున నమృతపూరంబునుంబోలె
నీనవ్వు మన్మనఃప్రసాదహేతువై యొక్కవిశేషంబు దోఁచె

నభిప్రాయంబు, చెప్పు మనిన, నంబా! యీసకలంబును నాకపటనాటకునిమాయానాటకంబు. ప్రీతిమందిరపారిజాత విలసనంబును బహురూపకత్వంబును హరియింద్రజాలంబు, నీహృదయస్థైర్యసామగ్రి చూడ సమకట్టినపని యింతప్రొద్దు నిన్ను భ్రమయించె, నింతియే కాని నిక్కంబు గా దని సంచారికలవలనఁ బరామర్శించి కల్ల చేయక దీనికై నీవంటి మహాధీరనాయికారత్నంబునకు సంచలింప నగునే? తొల్లియు శ్రీమహాలక్ష్మి దుహిణ రుద్రాదులు నీవిభుని మాయా నాటకంబున భ్రమసి తిరిగి, రక్కథలు చెప్పెద నాకర్ణింపు మని చెప్పిన, నద్దేవియు నచ్చెరువంది పరిణమించె. నంత నిజవల్లభుండు ప్రణయప్రీతిపూర్వకంబు లైనవిధానంబులం దన్ను మన్నించి కూడుకొనిన నలరి యద్దేవదేవుని యనుమతి నన్నుఁ బుత్రవాత్సల్యంబున నారాధించి యాజగజ్జనని నాకు నీపారిజాతమాలిక యనుగ్రహించె నని గోవిందశర్మ ధర్మ నందనునకుం జెప్పె ననిన విని పరీక్షిత్తుం డట మీఁదటి వృత్తాంతం బెట్లయ్యె నని శుకబ్రహ్మ నడుగుటయును, 208

క. నారాయణ! దేవ! కృపా
పారాయణ! భక్తలోకపాలక! విద్యా
కైరవచంద్రోదయ! మా
యారమణీరమణ! యక్షయానందనిధీ! 209

ఉ. శ్రీతులసీస్రగర్చిత! పరిస్ఫుటకౌస్తుభ పద్మరాగ ర
త్నాతతభద్రపీఠసముపాశ్రిత సింధుసుతాకటాక్షవీ

తూతుహినాంశుదీప్తి వికసత్త్రిజగత్కుముదవ్రినూనగం
ధాతిథిబంభరాయితనిజానుచరేంద్రముఖాఖిలామరా! 210

మాలిని. ప్రకృతిపురుషమూర్తీ! బ్రహ్మయోగానువర్తీ!
సకలనయనరమ్యా! సాధులోకైకగమ్యా!
ముకుటకలితపింఛా! ముక్తసంగాతివాంఛా!
వికచకమలనేత్రా! భ్రాజన్నీలగాత్రా! 211

ఇది శ్రీమదనగోపాలచరణకమలసేవాధురీణ, సత్కళాపారీణ,
కృష్ణభట్టారకపౌత్ర, చింతలపూఁడికామయప్రభుపుత్ర,
సుకవివర్య, రాధామాధవయెల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు
ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు

# విష్ణుమాయానాటకము

——:O:——

## ద్వితీయాశ్వాసము

———

క. శ్రీరాధాధరమధురసు
ధారసధారాప్రశాంతదారుణనిశిత
స్మారశరానల! ధీరో
దారగుణాలవాల! నవమదనగోపాలా! 1

తే. అవధరింపుము దేవ! సంయమివరుండు
సకలవేదాంతవిద్యావిశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మఱియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రుతోడ. 2

తే. ఈవిధంబునఁ బారిజాతావనీజ
కుసుమమాలిక తాఁ గయికొన్న తెఱఁగు
చెప్పి వెండియు నానృపశేఖరునకు
ననియె గోవిందశర్మ ప్రహ్లాద మెసఁగ, 3

క. ఆసాధ్వి చిత్తగించుటఁ
జేసి పవిత్రములు నతివిచిత్రంబులు నై

భాసిల్లె విష్ణుమాయో
ల్లాసచరిత్రములు విను మిలాతలనాథా ! 4

మ. హరిలీలామహనీయమై హరవిరించామర్త్యసంసేవ్యమై
పరమంబై బహుశాస్త్రసారతమమై ప్రామాణికగ్రాహ్యమై
నిరతానందసుఖైకహేతువయి యున్మేషించె మాయాప్రపం
చరహస్యం బగు తత్కథానివహ మశ్రాంతంబు లోకంబులన్

—♦ విష్ణుమాయావిలాస కథాప్రారంభము ♦—

క. శ్రీయుతమై విష్ణుమహా
మాయానాటకము నాఁగ మహి వెలసె మహీ
నాయక! తత్కథ లన్నియు
నాయతగతి నొకపరిబంధమై నా చేతన్.

మ. విను! విశ్వక్షితిపాలమౌళివలభీవిస్ఫారరత్నప్రభా
కనదుద్దామపదారవింద! త్రిజగత్కల్యాణచారిత్ర! పాం
డునరేంద్రోత్తమపుత్ర! యీమునిగరిష్ఠుల్ నీవునుంగూడియెం
దునకుం జిత్తముఁ బోవనీక హరియందు న్నిల్పి సంప్రీతితోన్.

వ. అని కొలువు సావధానంబు గావించి. 8

—♦ వైకుంఠ పురవర్ణనము. ♦—

సీ. పాలమున్నీటిలోఁ బ్రభవించునుదయరా
గంబుతోడిసుధాంశుబింబ మనఁగ
మంచుగుబ్బలిమీఁద మించునుదంచిత
కమనీయధాతుశృంగం బనంగ

నిండుఁగొలంకున నిండార బెరసిన
ప్రత్యగ్రహల్లకప్రసవ మనఁగఁ
బటికంపురాసానపైఁ బోవుగా నిడ్డ
కాశ్మీరకర్దమకబళ మనఁగ

తే. ధవళకర్పూరరాశివిధంబు గలిగి
యందమై యున్న తెలిదీవియందుఁ దనరు
దివ్యమాణిక్యరుచిపుంజదీప్రవజ్ర
గోపురోద్దామతరము వైకుంఠపురము. 9

ఉ. ఆరమణీయధామమున నాదిమవిష్ణుఁడు లక్ష్మియున్ మనో
హారిమణిప్రభాస్ఫురితహాటకకుట్టిమచంద్రశాలలో
భారతి యాదిగాఁ గలసుపర్వవధూటులు చేరి కొల్వ సొం
పారుచు జూదమాడుటకు నాత్మఁ దలంచిరి కౌతుకంబునన్

—♦ విష్ణుమూర్తియును లక్ష్మీదేవియును జూదమాడుట. ♦—

ఆ. చిత్తవృత్తి యెఱిఁగి యత్తఱిఁ బవడంపుఁ
బలకరత్నశారు లలవరించి
కనకరుచిరపాశకములు దన్మధ్యభా
గమున నునిచె దివ్యకాంత యొకతె. 11

క. సిరిచూడారత్నంబును
హరికౌస్తుభమణియుఁ బందెమయ్యె జయాశా
పరతంత్రబుద్ధి నపు డొం
డొరులకుఁ బెనఁగొనియె నేర్పు నుత్సాహంబున్. 12

క. గలగలసారెలమ్రోఁతయుఁ
గలకలకంకణరవంబుఁ గర్ణోత్సవ మై
చెలఁగఁగ, నాడిరి ద్రిస్త్రరి
పలుకులఁ బంతముల, నేర్పు పచరించి తగన్. 13

క. కాంతుఁడు జయ మందఁగ భూ
కాంతామణి గోరు; దివ్యకాంతాతతి, శ్రీ
కాంతజయము గోరును; వా
క్కాంత యుభయజయముఁ గోరుఁ గౌతుక మెసఁగన్. 14

సీ. అడిగిన దాయంబు లందంద పడుచున్న
నుల్లంబులో శౌరి యుల్లసిల్లు
నొంటిన సారెకు నొసర దాయము వడ్డఁ
జంచలేక్షణ మూదలించి పొడుచు
నాటఁ గొంచెంపుదాయమునఁ గూడక సారె
చచ్చిన వెడ నవ్వుఁ జక్రపాణి
తనయాట నయమయ్యుఁ దగు పందుసా ళ్లెత్తు
దాయంబు రాకున్నఁ దరుణి కనలు,
ఆ. నాట సమముచేసి యాడించు దనుజారి,
పిక్క సారె మొదటఁ బెట్టు నతివ
హరి తిరస్కరించు నంగన గలుషించు
నాట నాగ్రహంబు లగ్గలింప. 15

క. అవమతి సప్తవ్యసన
వ్యవసాయము వలదు సుజనవరులకు సరస

వ్యవహారహాని గావున
నవనీశ్వర! జూద మొప్ప దన్నిటికంటెన్. 16

— ◆ ద్యూతనింద ◆ —

సీ. స్వామిభృత్యన్యాయసరణి నాక్షేపించు
గురుశిష్యభావంబుఁ బరిహరించుఁ
బితృపుత్రవాత్సల్యగతి మిథ్యఁ గావించు
నన్నదమ్ములపాడి నపనయించు
బాంధవమిత్ర సద్భావంబు భంజించు
బహుమానవినయతత్పరత నడఁచు
ధర్మశీలంబుల మర్మంబు భేదించుఁ
గీర్తిధనంబులఁ గేరడించు
తే. మచ్చరముఁ బెంచుఁ గోపంబు నెచ్చరించుఁ
బ్రాణహాని ఘటించుఁ బాపంబు నించుఁ
గాన జూదంబు వల దభిమానధనుల
కాడికేన్ బన్నిదమునకు నాడఁ జనదు. 17

వ. అవ్విధంబున నలుకఁ గొని తలంపులు ధైర్యంబులుఁ గలంపఁ
బరస్పరవిజయకాంక్షల నీడంబోక యాడుచున్న సమయంబున
గలిమిబోటి యాట నయంబై (హారియాట) యోటు పన్ని
దంబునకు వచ్చిన మెచ్చుచు, మేలుచే యయ్యె నని
సంతోషించి యంతరంగంబు చెంగలింపం జేతివా టగుటం
జేసి పాచికలు వైచి గెలువం దలంచిన. 18

ఆ. ఆట డీలుపడిన యమ్మహామాయావి
చిత్తవృత్తి నగవు చెంగలింప
నీమృగాక్షిహృదయ మెట్లుండునో చూత
మంచు మాయ పన్నె నాక్షణంబ. 19

క. ఆ మాయావిభ్రమమున
నే మని చెప్పుదు నృపాల ! యిందిర వైవన్
భూమిఁ బడు పాచికలలో
నా మునుపటి లెక్క లుడిగి యన్యము లయ్యెన్. 20

క. లెక్కలు విపరీతము లై
యక్కామినిచేతిపందె మది దప్పిన నా
పెక్కువ సెడి వెలవెల నై
గ్రక్కున పాచికలు చదిచెఁ గనలుచుఁ జేతన్. 21

తే. నవ్వె భూకాంత, వాణి మౌనంబు దాల్చెఁ,
దద్వయస్యలు లజ్జించి తలలు వంచి,
రబ్జనాభుండు పరిహాస మాడె నపుడు
వానియన్నింట నుడికె నవ్వనితమనసు. 22

క. జననాథ ! జూదమున నో
డినవారిమొగంబు వ్రాయ డెవ్వర మని చె
ప్పినమాట నిజము; కమలం
బునుబోలెడు శ్రీముఖంబుపోలుపునుఁ దఱిఁగెన్. 23

వ. ఇట్లు పరాజయపరాభవంబులు వాటిల్లె ననుచుఁ జెక్కు
చేమర్పు, నేర్పరులై సపత్నీభర్త లొనర్చు కేళనంబునకు

సొలయుచు ధర్మదేవతను దూఱి, యంతఁ గొంత ధైర్యంబు దెచ్చుకొని యమ్మహాధీరనాయిక వివేకించి దాయంబు రాకుంటకుఁ గతం బేమని విభుండు వైవకుండఁ గ్రిమ్మఱఁ బాచికలు పట్టిచూచి వానియందు ముందటి లెక్కలున్నక్రమంబుగాక, తనయాటకుం గూడక నలువంకల నొక్కలెక్కయై యధిపునియాటకుం దగినపన్నిదం బగుచున్న తెఱంగు వెఱంగుపడి చూచి, యది యతనిమాయగా నెఱింగి, యమ్మృతక్రోధరసరంజితం బగుమొగంబునం గటికి నగవు చిగురుకొల్పి, యిట్లు కపటంబునేయం దగునే యని, మందస్మితవదనారవిందుండై యున్న వెన్ను నుద్దేశించి. 24

ఉ. జూదరి ! కానిచందములు చూపితి వన్నియు మేలుమేలు! నీ
గాదిలిభూమిదేవికి వికాసముగా, జను లెల్ల నెల్లెడం
జూదము వాదహేతువును జుల్కదనంబును బొంకు నంట దాఁ
గా దనరామి నిక్కముగఁ; గంటిమి నీవెడమాయ లచ్యుతా!

మ. నను వంచించి జయించినాశిరమురత్నంబుం బ్రయత్నంబునం
గొని యావల్లభ కీఁ దలంచితివొ! నీకుంబ్రేమ మట్లయ్యె నేఁ
గొను మే నిచ్చెదమాయలేల యిదినాకుంబ్రాఁతె రత్నాకరేం
ద్రునిపట్టిన్ సిరి నా కెఱుంగవె జగత్తుల్ గోరి సేవింపఁగన్?

క. అల్పుల ననురులఁ గొందఱ
వేల్పుల మానవులఁ గొన్ని వెడవెడమాయల్
గల్పించి త్రిప్పు నీసం
కల్పము చెల్లునె మదంతికంబునఁ? గృష్ణా ! 27

ఉ. కేవలమూఢజాతి నడకించెడు నేర్పులు చూపవచ్చితో!
నీ వెడమాయ నాయెదుట నీళులఁ బ్రాఁత, హిమంబు పెంపు, మే
ఘావరణంబు, బుద్బుదఘటావళి, వేసవియెండమావులై
పోవునకాక, నిల్చునె యపూర్వవిశేషమె? శేషతల్పకా!

వ. ఆఁటవారిని భ్రమయింపనే నీమాయలు, నీమాయ కొలఁది
గాదు నామాయ లవి యెట్లంటేని వినుము. 29

సీ. హరవిరించిపురందరాదిబృందములకు
సిద్ధవిద్యాధరశ్రేష్ఠులకును
యక్షగంధర్వగుహ్యకకులాధిపులకుఁ
బన్నగకిన్నరపరివృఢులకుఁ
జారణఖచరరాజన్య వర్గములకుఁ
గనకాద్రి ముఖనగగ్రామణులకు
దైతేయదానవాధ్యక్ష సంఘములకు
విశ్వవిశ్వంభరాధీశ్వరులకుఁ

తే. బదవు లైశ్వర్యములు మహాప్రాభవములు
మత్కటాక్షమహామాయమహిమఁ గాదె
విస్తరిల్లుట? త్రైలోక్యవిభుత నీకుఁ
గలుగుటయు నీకు నేఁ గలుగంగఁ గాదె? 30

సీ. చంద్రబింబంబునఁ జంద్రిక, రవిమండ
లంబునఁ బ్రభ, యనలమున దీప్తి,
రత్నజాలంబున రంగు, సరోరుహ
వనముల శృంగారవైభవంబు,

పురమహోత్సవములు, కరి హయ రథ భట
సామ్రాజ్య సామగ్రి, చారుభూష
ణాంబర లావణ్యహావభావ విలాస
కలనలు, త్యాగభోగములగరిమ
తే. శ్రీమహాలక్ష్మి కళయున్న చెలువ యనఁగ
వినవె ? నామాయ లోకైకవిలసితంబు
నిఖలమిథ్యాకరోపాయ నీదుమాయ
కంటివే రెంటి మేలును గమలనేత్రి ! 31
వ. అని యీర్ష్యాజనిత లజ్జావిషాదక్రోధంబుల సంతాపించి
యంతట నిలువక. 32
శా. నీవైకుంఠమహోత్సవాభ్యుదయముల్, నీమందిరాంతఃపురీ
లావణ్యాతిశయంబు, నీమణిగణాలంకారసౌభాగ్యమున్
నావిస్ఫూర్తులు, నే గ్రహించెద, భవన్మాయా విలాసంబు తె
ల్లైవర్తించునొ చూత మంచు నిజదివ్యాకార మేపారఁగన్.

—♦ లక్ష్మీదేవి కోపముచే వైకుంఠ విలాసము హరించుట ♦—

తే. ధరణి గంపింప లోకముల్ దల్లడిల్ల
భూతపంచక మాక్రోశమునఁ జలింప
శారదాదేవిప్రార్థన సరకుగొనక
మ్రింగె వైకుంఠసామ్రాజ్యరేఖ, లక్ష్మి. 34
సీ. ప్రాకారగోపురప్రాసాదమండప
చంద్రశాలలపెంపు చటులువడియెఁ

పర్యంకభూషణాంబరపరీమళవస్తు
విస్తారములమేలు విన్నఁబోయె
సౌవర్ణమణిమయచ్ఛత్త్రచామరకేత
నంబులబిరుదచిహ్నాంబు లెడలె
వారణహయభటవాత్రిరథానేక
సైన్యసంకులగర్వచయము డిందె
తే. రంగవల్లీవితానతోరణవిచిత్ర
దీర్ఘికారామవాటికాదివ్యకేళి
పర్వతప్రోల్లసత్త్వంబు పాడువాఱె
నట్టి వైకుంఠమున సిరి యాగ్రహింప. 35
తే. అవ్విధంబున సిరి తనయమృతదృష్టి
మరలఁ దిగిచిన వైకుంఠపురవరంబు
కువలయప్రియరుచి లేని కుముదసూన
మట్లు శూన్యత్వ మొందెఁ జంద్రాన్వయేంద్ర! 36
వ. వెండియుఁ జండక్రోధంబున భువనత్రియ విలాసంబును
గ్రహింప నుద్యోగించిన. 36
సీ. అంతయుఁ గని కడు నాత్మలోఁ గలుషించి
వేగిరపడక యావిశ్వకర్త
మాఁటవారల నాగ్రహం బింత సేయునే
యక్కటా యీఫలం బనుభవించుఁ
గా కేమి యని భావికపటకృత్యము గాన
రాకుండ మాయానురాగలీల

ననుపారc బరిరంభణముచేసి, కోపమి
ట్లేcటికి? లోకంబు లేమి సేయు?

తే. నవ్వులాటలకై నీకు నివ్విధంబు
చనునె? యిcకc జాలు, నీచిత్రజాతవహ్ని
శాంతిcబొందింపు భూతపంచకము బెదర
కుండc, గరుణామృతము చల్లు ముత్పలాక్షి! 37

క. కోపము వచ్చిన నాపైc
జూపవలెం గాక మిగుల సుందరతరమై
చూపట్టెడు వైకుంఠమ
హాపురసౌభాగ్య ముడుప నగునే నీకున్? 38

క. కంటివె వైకుంఠము నీ
కంటికృపాశ్రీలc బాసి కడు శూన్యంబై
యుంట? యిది చాల కర్యో!
గెంటింపం దలcచెదవు నిఖిలలోకములన్.! 39

వ. సర్వమంగళాధిదేవతయును లోకమాతయు నని బ్రహ్మాదులు సేవింప నుండిననీకు లోకంబులపై నలుక దగునే? మనము వినోదార్థం బాడ సమకట్టినజూదం బింత చేసె, సరసంబు విరసంబయ్యె. నీ దేమి దోషంబు? జూదంబుదోషంబుగాక! దీని కేమి? యింకc బ్రసన్నురాలవు గమ్మ; నీవ గెలిచితి వనుచుc దన కౌస్తుభగ్రైవేయకంబు నయంబున నయ్యింది రాదేవి సమున్నతకుచకుంభమధ్యంబున నలంకరించి కలంకc దేర్చి, "యీదుర్ద్యూతవ్యసనదోషఖేదంబులు మానc గొంత

పొద్దు సరస్వంతంబు పొంత విహరింతము రమ్మనుగ్రహంబు గలయప్పుడు వైకుంఠదివ్యమందిరంబు వెలింగెడుం గాక, శూన్యగృహంబున నుండఁ దగ" దని యెలయించి, కైదండ యిచ్చి తోడ్కొని యంతఃపురోద్యానమార్గంబున వెడలి చనియె నంతఁ గొంతదూరంబున. 40

—♦ లక్ష్మీదేవియు విష్ణుమూర్తియు క్షీరసముద్రముఁ జూచుట. ♦—

ఉత్సాహ. కమలయుం జనార్దనుండుఁ గాంచి రుర్వరా వచః
ప్రమదలున్ సురాంగనాళి పజ్జఁ దోడఁ గూడి రా,
విమలఫేనకాంతికాంతవిస్ఫురత్కళానిధిన్
ఘుమఘుమత్తరంగసంఘఘోషభీషణాంబుధిన్. 41

వ. కని హరి నిజప్రియ కిట్లనియె. 42

మానిని. నీ దగుసోదరభావముఁ జెంది
యనిందితకీర్తి వహించె; సుధా
పాద సుధా తులసీ నవభాస్కర
భాస్వరకౌస్తుభరత్న మరు
త్పాదపపంచకకామగవుల్ బహు
భంగుల నెల్లజనుల్ పరమా
మోదముఁ జెందఁగ నీయమృతాంబుధి
ముద్దియ ! చూడుము వేడుకతోన్! 43

స్రగ్విణి. నీరజాతేక్షణా ! నీకటాక్షాంచలా
ధీరతాఖ్యాన మర్థించి కాఁబోలుఁ జూ !

చేరి మీనాళి వే చిత్రమై దాఁటెడుం
గోరికల్ మీఱఁ గన్గొంటివే వారిధిన్ ? 44

వనమయూరవృత్తము.

వేల్లితనవీనతరవిద్రుమలతోద్య
త్పల్లవవిలగ్న మయి భాసిలెడు ముత్తెం
బల్లదె ! మృగాక్షి ! కలశాంబునిధిలో, నీ
యుల్లసిలుమోవికడ నొప్పుచెలువొప్పై. 45

కుసుమితలతావేల్లితవృత్తము.

రాకాచంద్రాస్యా ! యమృతనిధి సం
రంభ మొప్పం బయోదా
నీకం బప్పూరంబులు గడువడిన్
నిల్చి పానంబుసేయన్
వే కంటే నీవిభ్రమరసము నే
వేడ్కఁ నేత్రద్వయం బా
లోకశ్రీలం గోరెడు స హితా
లోలసంప్రీతిఁ జూపెన్. 46

ఉ. శాతకటాక్ష! చూచితివె శంఖ మొకండు నితాంతయాతనా
యాతతిరంగహస్తముల నావల నీవల నొచ్చుచున్నద
త్యాతురవృత్తిఁ దావకగళాభ మటన్న సహింపరామి మీ
తాత బహిష్కరింపఁగఁ బదంపడి పోవఁగ లేకయుంబలెన్.

వ. వెండియు మదభరంబున మదనమదనోన్మదనాదినిశితశరపరం
పరాకంపమానమానస లగుచు నేటిమదిరాక్షులు చక్షు

రుత్సవంబు లైన మదకలకలహంసరశనాక్రేంకారసంకులపులిన ఘనజఘనబింబంబులును, వర్తులావర్త గంభీర నాభీతలంబులును, కోమల శైవాల రోమరాజిలతలును, సముత్తుంగరథాంగకుచకుంభంబులును, నాళీకనాళహస్తంబులును బ్రశస్త విలాసరేఖల మెఱయఁ, బుష్పంధయావళీధమ్మిల్లబంధంబులుం జెదరఁ, దీరదరుసురభికుసుమసౌరభ్యప్రవాహంబులతో డిండీరఖండసుందరమందహాసచంద్రికల కలంకారం బై లేఁదరఁగకఱివంకబొమల మురిపెంబుల నలరుకలికిగలువ రేకుల కనుంగవకెలంకులం దళుకు లెసంగు బేడిసచూపులఁ దీపులు పుట్టించుచుఁ బాయక పైకొనిన, దక్షిణనాయకత్వంబున నందఱ నొక్కచందం బగుప్రేమంబున నుద్దామదీర్ఘతరంగ బాహుదండంబులు సాఁచి కౌఁగిలించి, తదీయపద్మవదన తదధరనిర్గళితమధుమధురామృతపానంబున నుప్పొంగు లీలా సంగతివలన శృంగారరసంబును, నిఖిలభువనైకసంభావితం బగుప్రాభవంబున విశ్వవిశ్వంభరా చక్రం బాక్రమించి సమున్నతాయతోర్మిహస్తస్ఫార పరిస్ఫాలనవిపాటితదిగంత దంతావళకుంభకూటం బైనపాటవంబువలన వీరరసంబును, నాఖండలదోర్దండమండితచండధారాకూరభిదురదురాపాత సంజాతప్రభూతభీతిం గ్రచ్చఱ శరణుసొచ్చిన శిలోచ్చయ నాయకుం డగుమైనాకుని రక్షించుదాక్షిణ్యంబువలనఁ గరుణ రసంబును, ప్రావృషేణ్యపయోవాహంబు లభ్రంబున నద భ్రనీలమణివిభ్రమంబులు నింద్రచాపదీపితదిగ్వాటంకంబులు

నుం గళితనిర్ఘాతపాతప్రకంపితజంతులోకంబులును విద్యు ద్దండమండితాజాండ ఖండంబులును, దుర్జయగర్జాఘర్ఘరీ రావతాండవితశిఖండిమండలంబులు నై కుంభద్రోణవర్షం బులు వర్షింప, మొల్లం బైన యన్నీటివెల్లువ యెల్లకడలం గడలుకొని యుప్పొంగి తరంగిణీముఖంబులం బ్రవేశించు నప్పుడును, నిదాఘసమయ దీర్ఘదివసకరకిరణసహస్రస్వీకృత సరస్వత్సరోవాపీకూపపానీయంబై యుండి మహీమండలంబు వ్రయ్యలువాఱునప్పుడును జెప్పరాని యగాధజలగాంభీర్యం బున నుబ్బుసుక్కులులేక యొక్క చందంబున నుండు నఖండమహిమవలన నద్భుతరసంబును, సురాసుర పరివార పురాకృత మందరధరాధర మంథానమథన సంభ్రమణంబున గంభీరగుణంబు చెడి వికలజీవనభంగప్రయాసజాతనిశ్వాస యాతాయాతసర్వతోముఖంబులంబొరలంబడుచుఘోషింప నెఱి దప్పి దెప్పరంబున నాఁటనుండియు మొఱపెట్టుచున్నదో యనునాడికవలన హాస్యరసంబును, నిరంతరంబును ద్వీపం బులు నివాసంబులు చేసికొని కినుక ననేకపట్టనగ్రామవర్ణా శ్రమవాసుల గోవృషభశిశుస్త్రీలోకంబులఁ జీకాకుపడఁ గసిమసంగి యనువులకుం బాపి రక్తమాంసమేదోమస్తిష్క పంకపంకిలంబు లగుశవనివహంబులు దెచ్చుకొని విచ్చలవిడి నిచ్చలుం బ్రమత్తు లగు నక్తంచరులు బుత్తులు గొనఁ దదీయ పూతిగంధబంధురంబు లగు గంధవహాప్రసరణంబులవలన బీభత్సరసంబును, బరస్పరవిగ్రహపరిగ్రసనరనరభాసక్రోధ

ధావనసంకులంబై నిశ్శంకంబు కుంభీరకుంభీనస తిమి తిమింగిల కమఠకర్కటాది*యాదఃపరంపరలు తెంపున విహరించు దుర వలోకభీకరత్వంబువలన భయానకరసంబును, విలయకాల రుద్రవినిద్ర జగదాభీలమహోత్కీలఫాలనయనానల జ్వాలాక రాళంబై విశాలజిహ్వాసంహతులం బయఃపూరంబులు గ్రోలుచుఁ బొగలఁ దగులక తెగలుపడి భగభగ నిగుడు పొగరుచిగురుమంటలవెంట మింటికి నుప్పరం బెగయు నిప్పుల కుప్పలు చదలతుదలం జెదరి చామరధ్వజచ్ఛత్త్రాకారంబుల ప్రకారంబున నలువంకలం దూఱి గ్రాలుచుండం బ్రచండ తేజంబున, బ్రహ్మాండమండలోర్ధ్వకర్పరపర్యంతంబు శత యోజన సమీపసంచరద్దివ్యవిమాన విహంగముఖ ఖేచర నిచ యంబుల భస్మసాత్కరించుచు ననవరతంబు నీడంబోక బలోత్కృష్టం బగు బడబాగ్ని వ్యగ్ర తాపోద్రేకంబువలన రౌద్రరసంబును, జంద్రచంద్రికాధవళశీతలస్వభావంబును నమృతరూపంబును నతివిమలాంతరంగంబును, ననేక సాధు బుధ స్తవ్యమానస్థానంబును నగు సౌజన్యంబువలన శాంత రసంబును దనయందుఁ బ్రకాశింపం బెంపారు నపారగుణ వారం బగుపారావారంబున వారాకర కుమారికి ననేకవిధ విచిత్రసుందరతరపదార్థసందోహంబులు సూపుచు నవ్వన మాలి లీలావిహారంబునం గొండొకదవ్వు చని. 47

---

* యాథపరంపరలు—వ్రా. ప్ర. పాఠాం.

—◆ వనధితీర వనవిహార వర్ణనము. ◆—

ఆ. తాళ పూగ నారికేళ హింతాల కే
తకి రసాల సరళ వకుళ కదళ
పనస సింధువార పారిజాతాది కా
వనిజ రాజి నొప్పు వనము వొచ్చె. 48

వ. అంత. 49

సీ. నిండారుపొన్నలనెత్తావిఁ గైకొని
పసిఁడి సంపెంగలపైకి నెగసి
నెఱిమించు పొగడల నెత్తావి చేకొని
లీలమై బొందు మల్లెలకు నుఱికి
నిగుడుగొజ్జంగల నెత్తావి హరియించి
పొదిగొన్న చేమంతి పొదల కరిగి
నింపారుజాజుల నెత్తావి సవరించి
నవపారిజాతసంతతుల వ్రాలి

తే. మెలమిఁ దద్దివ్య గంధంబు లేర్పఱించి
మెలపుతో వాని నన్నింటి మేళవించి
యింపు మినుగాడ్పు కానుక యిచ్చె వారి
కాత్మగంధవహత్వంబు సార్థకముగ. 50

చ. పరభృతసద్భటార్భటియు భాసురకీరతురంగహేషలుం
దరు రథవిభ్రమంబు సమదభ్రమరద్విరదోగ్రబృంహిత
స్ఫురణయు మీఱఁ బుష్పశరభూపతి సర్వజగజ్జయార్థమై
యురుగతివచ్చిదండువిగియున్నటులవ్వనమొప్పెఁజూడఁగన్.

సీ. ఈఱంబు లగుపాదరిండ్ల నీడల వలి
గ్రిమ్మఁచో శీత లక్షణము దోఁచఁ
బూఁదేన తుంపురుల్ పొరిఁ బొరి రాలుచోఁ
బ్రాలేయసమయసంపద గనడ్చ
సహకారకిసలయాస్వాది కోకిలనాద
మెసఁగుచో నామని యింపు చూపు
నగరుకాశ్మీరగంధాన్వితోష్ణానిల
మడరుచో గ్రీష్మర్తు వతిశయిల్లు
తే. నమరు మధుకరగతుల మేఘాగమంబు
నెరయు విచికిలకిరణచంద్రిక శరర్తు
వవ్వనంబున; నట్టిమహావిభూతి
నాత్మ మెచ్చిరి సిరియు నయ్యచ్యుతుండు. 52
సీ. కమలాకమలగంధి కచబంధమున దోఁపెఁ
బారిజాతద్రుమప్రసవభరము
తనరుమహీమహీధరకుచ కుచముల
హరిచందనపరాగ మలఁదెఁ గలయ
రాణ వాణీశుకవాణి యాస్వాదించె
మందారమధురమరందధార
నెలమి సుపర్వపర్వేందువక్త్రిలు దాల్చె
రసలారు సంతానకిసలయములు
తే. కల్పకమునీడ భక్తసంకల్పదాయి
యయ్యనంతుఁడు గ్రోలె మందానిలంబు

మహితరతిరాజరాజసామ్రాజ్యలక్ష్మి
నలరు జలనిధి సవిధ వనాంతరమున. 53

క. కుసుమాపచయరసంబునఁ
గుసుమాయుధగురుఁడు వలపు గొలుపుచు లీలన్
గుసుమ*కుమారిన్ సిరి నవ
కుసుమిత తరు లతల వెంటఁ గూడి చరించెన్. 54

సీ. సఫలపూగశ్రేణిసౌభాగ్య మగ్గించి
యురగవల్లులదండ నుండి యుండి
గురివెందపందిళ్ల పరువంబు గొనియాడి
మల్లెపూఁబొదరిండ్ల మలసి మలసి
ద్రాక్షాఫలస్రవద్రసధార గొనని
గొజ్జంగపూఁదేనెఁ గ్రోలి క్రోలి
సహకారచారుమంజరులకుఁ దలయూఁచి
పొన్నపుప్పొళ్లు మైఁ బూసి పూసి
తే. భృంగభయదంబు లైన సంపెంగవిరుల
మురువు ప్రకటించి జాజులు ముడిచి ముడిచి
వెలయువనలక్ష్మిగారాపువిందు లనఁగ
హరియు సిరియును గ్రీడించి రభిమతముగ. 55

సీ. ఘనవేణికాబంధమునకుఁ జుట్టపు శిఖా
వళి యంచు వనశిఖావళులు గేర

* సుకుమారి.

నయనవిస్తారమ్మునకు సయిదోడు సా
రంగి యటంచు సారంగు లొలయ
మధురసల్లాప సంపదలకు ననుఁగుఁగో
కిలబాల యంచుఁ గోకిలలు మలయఁ
గనక తులాకోటినినదంబునకుఁ దోడి
యంచ యటంచు రాయంచ లలర
తే. నెలమి వనదేవతాలతాంగులు చెలంగి
చిగురుఁజేతులఁ బైఁ బుష్పసేస చల్ల
నవ్విలాసిని చరియించు నవ్వనమునఁ
బద్మనాభునికన్నులపండు వగుచు. 56

మ. లవలీపుష్పసుగంధము ల్మరగి యేలాలాస్యముల్ చూచుచు
న్రవిదీప్తిప్రతిమానవిద్రుమవితానచ్ఛాయ రంజిల్లుచున్
ధవుడుం దాను సఖీసమూహములతో దవ్వేఁగె లీలాగతిం
జివురుంగైదువుజోదుతల్లి జలరాశిప్రాంత వన్యావలిన్. 57

— విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వంచింపఁదలంచుట —

వ. ఇవ్విధంబున నయ్యమృతపయోనిధాన సవిధ వనమార్గంబున ననేకవిధక్రీడారసపరాయత్తచిత్తయై యత్తమ్మివటారుమిటారికత్తె సవతియుఁ గోడలును మొదలయిన సఖీజనసమూహంబులతో విహరింపఁ దదీయకౌతుకలీల లాలోకించి వైకుంఠవల్లభుండు నెయ్యంపుజూదపుసయ్యాటంబునకై వైకుంఠంబు శూన్యంబు గావించిన నిర్దయురాలిని మోసపుచ్చుటకై

యెడరువేచి యున్నవాఁడు గావున నొక్క కపటకృత్యంబు సంస్మరించి. 58

క. బలసంపత్పౌరుషములు
గలిగియు వినయంబు లేనిగర్వాంధులు త
ద్బలసంపత్పౌరుషములు
పొలిదఱుఁగక పశులు గారు బుద్ధిఁదలంపన్. 59

క. సతి యైనను సుతుఁ డైనను
హితుఁ డైనను మేరఁ దప్పి యెఱుఁగక కడు దు
ష్కృతిఁ గావించిన వారిం
బ్రతివిధిఁ గుదియింపవలయుఁ బ్రాభవ మొప్పన్. 60

వ. అట్లగుటం జేసి. 61

ఉ. ఈయెలనాఁగ గర్వము త్రిభువనత్రయరాజ్యలక్ష్మి యా
త్మీయవిలాసలేశ మని యింపున నన్ను గణింప కగ్రితం
బాయక, పద్మజాండములు భస్మము లైనను విన్నఁబోనిశో
భాయతనంబుమద్భవనమంతయుశూన్యముచేసెదుష్కృతిన్.

క. తానును దనయైశ్వర్యక
ళానయసామర్థ్యములుఁ దలంపఁగ మన్మా
యానిర్మాణంబని మదిఁ
గానదు తా లక్ష్మి నసిదుగర్వముచేతన్. 63

క. ఈరసమును నిర్దయతయుఁ
గ్రూరత్వము సతులసహజగుణములు మిగులన్

వారిజాలోచ జంచల కడు
నారయ సిరి దుర్మదమున కాళ్రియ మగుటన్. 64

—♦ {విష్ణుమూర్తి లక్ష్మికిఁ బ్రతిలక్ష్మిని గల్పించి వైకుంఠము మిగులఁ బ్రకాశింపఁజేయుట.} ♦—

క. కావున నీదుర్మద గ
ర్వావిర్భావంబు మాన నతిచిత్రముగాఁ
గావింతు వేఱె యొక ల
క్ష్మీవిభ్రమకల్పనంబు కేవలమాయన్. 65

క. ము న్నున్నకంటెఁ గ్రమ్మఱ
వన్నెకు నెక్కంగఁ జేతు వైకుంఠము దాఁ
గ్రిన్నన హరియించితి నని
యున్నమహత్త్వము గుదింతు నొకనిముసమునన్. 66

వ. అని యనంతగుణగణవిలాసుండును బ్రహ్మాండనిర్మాణకర్మకుశలుండును, బ్రకృతిపురుషాధీశ్వరుండును, బరమేశ్వరేశ్వరుండును, నానారూపపవ్రర్తకుండును, సర్గస్థితిప్రళయవికారకారణుండును, జగత్ప్రపంచనాకపటనాటకసూత్రధారుండును, బ్రహ్మాండకోటిబహిరంతర్వ్యాప్తుండును, సురాసురగంధర్వబలపరాక్రమమాయోపాయనిరాకరిష్ణుండును నగు సవ్విష్ణుండు దన తేజంబు ప్రకటించిన. 67

—♦ వైకుంఠపురవర్ణనము ♦—

క. ఘోటకకరిరథభటసే
నాటోపము పౌరకలకలారంభము ను

ఘ్రాటింప నాఁటికం టెను
మేటిగ వైకుంఠపురము మెఱసెన్ సిరులన్. 68

సీ. పద్మసంభవు లెల్లఁ బ్రభవించుపురుటిల్లు
ప్రళయదుర్దశ లంటఁబడనిభూమి
కాలాహి కోడిసి మ్రింగఁగరానివాకట్టు
తలఁప నచ్చెరు వైన తానకంబు
ప్రాకృతుల్ చొరరాని యేకాంతదుర్గంబు
మహితసాత్త్వికకోటి మనికిపట్టు
కైవల్యలక్ష్మి చక్కని కేళిభవనంబు
పంచభూతములఁ గల్పించుగుఱుతు

తే. సహజతేజోలవగ్రస్తచంద్రసూర్య
పావకం బమ్మహాదివ్యపదము నైజ
లక్ష్మిఁ బాయునె యాకేళిలక్ష్మిచేత?
నిత్యలక్ష్మీశ్వరుఁడు హరి నిలుచునెలవు ! 69

వ. ఇట్లమేయ కళ్యాణ గుణ సుందరం బగు వైకుంఠమందిరంబు షడ్గుణైశ్వర్యసంపన్నుం డగు వెన్నునిమహాప్రసాదసామర్థ్యం బున సిరికి నచ్చెరు వగుసిరిఁ దొలంకుచుఁ బంకజహితమం డలంబునుంబోలెఁ దొల్లింటికంటెఁ గన్నులపండు వై తేజ రిల్లుటకు సంతోషాద్భుతరసంబుల జొత్తిల్లుచిత్తంబుల బ్రహ్మ రుద్రాదిదివిజసిద్ధచారణగంధర్వజయజయనాదంబులతో దివ్య కాంతలు పుష్పాంజలులు సమర్పించిరి వెండియు. 70

ఆ. సహజకఠినవజ్రసారమై విలయాంధ
కారనిబిడమై యగమ్యమహిమ
మహితదివ్యవిష్ణుమాయావిలాసంబు
పద్మనిలయఁ బెక్కు భ్రమలఁ గప్పె. 71

—◆ లక్ష్మీదేవి విష్ణుమాయామోహితయై పరిభ్రమించుట ◆—

క. హరిమాయామోహిత యై
పరమజ్ఞానంబు దివ్యభావము నెడలన్
సిరి ప్రాకృతసతి కైవడిఁ
దిరిగెన్ వనవీథిఁ బెక్కు తెఱఁగుల భ్రమలన్. 72

వ. అంత నవ్వనాంతరంబునఁ దన్మాయావశంబున. 73

క. కనుఁగొనియె నగ్రవీథిన్
వనజాలయ యొక్క దివ్యవనజాకరముం
దనుపు సెడి వాడఁబాఱిన
వనరుహకహ్లారకైరవంబులతోడన్. 74

సీ. నిండారఁ జిగిరించి నిగనిగల్ చాలక
వాడిన నవపల్లవములతోడఁ
గలయంగఁ బూచి తేనెలు చిందు నెత్తావిఁ
బొరయక కందినవిరులతోడఁ
బరిపాకమునఁ బండి సరసమాధురి లేక
పద నింకి పోయిన పండ్లతోడ

మెలఁకువ లూని కొమ్మల విన్ననై యున్న
యలిపోత శుకపికావలులతోడఁ

తే. జిన్నవోయిన వనము వీక్షించి, లక్ష్మి
యనుఁగుఁ జెలులకుఁ జూపుచు, నరుదుపడుచు
నెన్నఁడును జూడ మిటువంటి హేమవనము
శూన్యమై యున్న దిది యేమిచోద్యమొకో! 75

వ. అని యాదివ్యవనంబుఁ గలయ నాలోకించి యిది యపూర్వ సిద్ధాశ్రమం బని మనంబున నభివర్ణించుచుఁ బ్రవేశించి శంకిం చుచు నెట్టకేలకు నందఱితో నకొలంకు దగ్గఱి. 76

ఉ. నిండి తొలంకునాకొలని నెన్నడుమం గనకాంబుజాత మొ
†క్కొండు వికాసహీనమయి కొప్పరరేకులువాసి శూన్యమై
యుండఁ దదీయకర్ణిక ననూనహిమావృత బాలభానుమ
న్మండలివోలెఁ గొంత ప్రభ మాసినదేవతఁగాంచె నొక్కతెన్

క. ఒకచేత నక్షమాలయు
నొకచేఁ జిన్ముద్రయును సమున్నతదోర్ద్వం
ద్వకలితముకుళీకరణముఁ
బ్రకటిల్లఁగ ధ్యాననియతిఁ బరఁగెడుదానిన్. 78

క. పరివేష్టించి సరోజాం
తరములపై నిలిచి దివ్యతరుణులు సేవా
పరికరములతో నయత
త్పరలై తనుఁ గొలువ నున్నపాభవమూర్తిన్. 79

† మొ,క్కొండు...కప్పరరేకులు వాసి; వాసి—పాఠాం.

సీ. పద్మాసనాంకాగ్రభాగాంఘ్రిశుభరేఖ
లఖిలలోకేశ్వరి యగుట నొడువఁ
జిన్ముద్రిచేత మించినసమాధిక్రియ
కైవల్యలక్ష్మినిల్కడ వచింప
దీవ్యన్మహాతప స్తేజోవిభూతి ని
జాభిమతావాప్తి యదను దెలుప
నాపూర్ణపరమయోగానందకళ మది
నిష్టదైవం బున్న యింపు చెప్పఁ
తే. గన్నులకు వెక్కసం బైన కాంతి గలిగి
మనసునకు నద్భుతం బైన మహిమ గలిగి
యైహికాముష్మికశ్రీవిహారభూమి
యగుచు నొప్పారు బ్రహ్మవిద్యావిధేయ. 80

వ. కని విస్మయం బందుచు నందఱుం గరారవిందాభినయంబునఁ
గ్రందుపడకుండ వారించి వారితో నిట్లనియె. 81

చ. ఉరుపరమాత్మయోగముననున్నదియీశుభమూర్తిఁగంటిరే!
యరుదగువిభ్రమాభ్యుదయమంగజుఁదాఁగనినట్లయొప్పెడున్
బరిణతతాపసప్రతిభ బ్రహ్మముఁ దాఁ గనినట్ల యొప్పెడున్!
నిరుపమనవ్యదివ్యరుచి నిండి తొలంకెడు *నట్ల యొప్పెడున్.!
మ. సలిలాంతఃప్రతిబింబితార్కరుచియోజం బోల్చి ధూమచ్ఛటా
కుల†కృశ్యత్సవహేతియ ట్లడరుచున్ గుప్తప్రభావంబు, మైఁ

* వంగకంబులన్. †కాంతిన్నవ, కార్శన్నవ—పాఠాం.

మలినత్వంబును గల్గి యోగనిరతిన్ బ్రహ్మం బ్విలోకించునీ
యలఘుప్రక్రియఁ దొల్లి యేసతులయం దైనంగనుంగొంటిరే?

వ. అని వెండియు వాగ్దేవతకరం బవలంబించి యించువిలుకానితల్లి
యిట్లనియె. 84

క. ఈయుగ్రతపము సేయఁగ
నీమెలచిగురాకుఁబోఁడి కేమిటికో ము
న్నేయుగమునఁ జూడము లేఁ
బ్రాయంబునఁ దప మొనర్చుపాభనమూర్తిన్. 85

సీ. ఈరేడుజగముల నేలుటకో, యది
తనమహారాజనంబునకు నెంత!
రతికంటె విభ్రమోన్నతిఁ జెందనో, యది
తనమోహనాకారమునకు నెంత!
యఖిలాంగనారత్నమై యుండనో, యది
తనదివ్యసామర్థ్యమునకు నెంత!
బ్రహ్మంబు తానయై పరిణమింపనో, యది
తనచిన్మయానందమునకు నెంత!

తే. యేలకో యింత తపము వహించి సేయ!
నింత నిర్బంధమునఁ బొందనేలొ తనకు!
యక్షగంధర్వసిద్ధవిద్యాధరర్షి
తరుణులం దెవ్వరొక్కొ? యీ పరమసాధ్వి! 86

సీ. బ్రహ్మాదిదేవతల్ ప్రణమిల్లరే! తన
కేఁటి కంజలి ఘటియింపఁ దాను!

దన కేది యభిమతార్థము కాని! యభిమతా
ర్థమునకు నభిమతార్థంబు దాను!
తనమెచ్చు నొక దైవతంబును గలదొకో!
యఖిలైకదైవత మరయఁ దాను!
దనుఁగూర్చి యందఱు తపముసేయుట గాక!
యొరుఁగూర్చి తపము సేయుననఁ దాను!
తే. ఈమహానిష్ఠఁ గ్రాలింప నేల తనకు!
నవశిరీషప్రసూనంబు నవఘళించు
మృదులతనువల్లి నేఁటి కిమ్మెయి నలంప!
సర్వకల్యాణియైన యీ చంద్రముఖికి! 87
ఉ. ఈలలనాశిరోమణికి నీశుభమూర్తికి నీలతాంగిక
య్యాలరి దైవ మేమిటికి నచ్చెరువైన తపోగ్ని కీలలం
దూలఁగఁ జేసెఁ? జేసియును దూకొని దీనితపంబు పేర్మికిం
బాలనవృత్తి నీవలదె పాల్పడి కన్యకు వాంఛితార్థముల్?
తే. హరిహరబ్రహ్మలకు నవ్వలైన దైవ
మెవ్వరో కాక, వారైన నీరె కోర్కె!
కోర్కె త్రైలోక్యమును నేలుకోలుఁదికంటె
నెక్కువై యుండఁబోలు నీ యిందుముఖికి! 89
క. నాకేశ్వరుసతికంటెను
భూకామినికంటె నద్రిపుత్రికకంటెన్
నీకంటెను నాకంటెను
లోకోత్తరచరిత యిది విలోకింపఁ దగన్. 90

వ. అని వెండియు వనం బవలోకించి. 91

ఉ. ఈవని పూచి కాచి ఫలియించి, శుకాన్యభృతాళిజాతితో
నీవిధిఁ జిన్నవోవుటకు నేమికతంబొకో! యీకొలంకు ప
ద్మావళియేలవాడె? నిది యచ్చెరు! వెన్నఁడుఁ జూడ మిట్టు లే
దైవము శాపమిచ్చెనొకదా యలుకన్ సతితోడఁ గూడఁగన్

వ. ఈ దివ్యవనదివ్యాంగనలకు నీదురవస్థ దైవశాపంబ కానోపు,
దైవశాపం బగునేని యింత యంతర్వికాసతేజంబు లెట్లు
సిద్ధించు? నీయపూర్వసిద్ధాశ్రమంబున నిప్పరమపావని నిగూఢ
పరిభావంబున నుగ్రతపస్సామగ్రి నుండుట యద్భుతకథా
ప్రసంగంబు. మున్నెన్నఁడు విన్న కన్న యది గాదు. చతు
ర్దశభువనంబుల నెక్కాలంబుల నిక్కట్టడ యెఱుఁగము. దీని
విధం బంతయు నీ కాంతామణిచేత ధ్యానానంతరంబున నడిగి
తెలిసికొని పోవుదము గాక' యొంటొకదడవునిలువుం! డని యా
జలధికన్యక పలుకునవసరంబున. 93

గీ. బ్రహ్మయోగంబు చాలించి పద్మగంధి
యూర్ధ్వబాహుత్వచిన్ముద్ర లుజ్జగించి
వెడఁదకనుదమ్మి లల్లన విచ్చి చూచె
నిందిరాముఖలలితపూర్ణేందుముఖుల. 94

క. ఆచంద్రవదన సుమధుర
లోచనరుచిచేత నావిలోలాక్షులు సొం
పేచిరి నవశిశిరాంశుమ
రీచి మహౌషధులువోలెఁ బ్రియయోగమునన్. 95

వ. అట్లు పరబ్రహ్మయోగంబు చాలించి యా పద్మాక్షి యక్షీణ
తపఃప్రభావాతిశయంబునం జేసి త్రైలోక్యపూజ్యలైన శ్రీభూ
నగస్వసృతుల నగ్రభాగంబున నిరీక్షించి సామాన్యస్త్రీలుగా
బరిగణించుచుం దనయున్న పద్మాసనంబు డిగక యాది గ
ర్భేశ్వరీత్వంబు వహించి సాదరంబుగ వారితో నిట్లనియె. 96

ఉ. ఎవ్వరుమీరు? మీయునికియెక్కడ? నామములెవ్వి మీకు? మీ
రివ్విపినాంతరంబునకు నేఁటికి వచ్చితి? రింతులార! మీ
మవ్వము వింత! యచ్చరలొ! మానవకాంతలొ! యక్షకన్యలో!
యివ్వనదేవతామణులొ! యెవ్వరొ నా కెఱిఁగింపుఁడా తగన్.

వ. అని యయ్యుత్తమస్త్రీరత్నంబు పల్కినం జిత్తజాతజనని మా
ఱుత్తరం బిట్లనియె. 98

క. ఏ మమరస్త్రీలము మా
నామము లట్లుండనిమ్ము, నలినాక్షి! భవ
త్సామర్థ్యము విన వలతుము
ప్రేమంబునఁ జెప్పు నీదు పేరు మునుపుగాన్. 99

క. నీదీర్ఘతపముకలిమికి
నీదివ్యవిలాసమునకు నీదృఢమతికిన్
బైదలి! యచ్చెరు వయ్యెడు!
గాదిలివై యెఁ జెప్పవమ్మ! కల తెఱఁగెల్లన్. 100

ఆ. మలినవస్త్రగుప్తమాణిక్యమునుబోలె
నీఱు గప్పి యున్న నిప్పువోలె

వెలఁది! నీమరూపు వెలి మాసి, లో నింపు
గలిగి యుంట కేమి కారణంబు? 101

క. నీవంటి దివ్యకామిని
కీవిధిఁ దప మాచరింప నేఁటికి వలసెన్?
దైవకృతం బే మన?; నీ
భావముఁ దెలియంగవలయుఁ బల్కు లతాంగీ! 102

వ. అని యాదిలక్ష్మి పలికిన నమ్మాయాలక్ష్మి యిట్లనియె. 103

—◆ మాయాలక్ష్మీవృత్తాంతము ◆—

ఉ. ఏమని చెప్పుదానఁ దరళేక్షణ! నాదుపురాణవృత్తముల్?
తామరసాస నేందుధర తామరసాక్ష పురందరాది స
ర్వామరకోటి కాత్మనయనాంచలమే విభవాధికారి నా
నామములక్ష్మియం ద్రుభువనంబు లెఱుంగ మహావిభూతితోన్.

తే. హరికిఁ బ్రియురాల నై భువనైకదివ్య
విభవముల కెల్ల మూలమై వెలయు నేను
దత్ప్రసాదంబు కలిమిగాఁ దలఁపలేక
ముదిత! గర్వించి యతనిచే మోసపోతి. 105

వ. అది యెట్లం టేని, తత్పరమరహస్యంబు నెఱింగించెద నాకర్ణింపుము. 106

చ. అరయఁగ మూఁడుమూర్తులకు నవ్వలిమూర్తియుఁ దానయై
మహాపురుషవరేణ్యుఁడై ప్రకృతిఁ బ్రోచుచుఁ జిద్విమల
స్వరూపుఁడై। పరఁగెడు విష్ణుదేవుఁడు ప్రపంచమునన్ బహు

రూపధారినై! తిరుగుచు నుండు లోకములఁ ద్రిప్పుచు సర్వ
మ్మునకు నేకసేవ్యుఁడై. 107

ఆ. అతనివలనఁ బుట్టు నఖిలంబు; నాతని
యందు డిందు; నతఁడె యాదికర్త;
భూతపంచకపరిభూతపద్మభవాండ
మండలంబు నతనిమాయ సూవె. 108

వ. పరమేశ్వరుం డైన యద్దేవదేవుండు కల్పాదియం దనంతకోటి
సూర్యచంద్రపావకప్రకాశంబున నతిశీతోష్ణం బై నయఖండ
జ్యోతినై వెలుంగుచుఁ బెక్కువేలు దివ్యవర్షంబులు నిలిచి
తదనంతరంబ యవ్వెలుంగు సంస్తంభింపఁజేసి శుద్ధస్ఫటిక
సంకాశం బైన రూపంబునఁ దానును, నీలజీమూతశ్యామల
కాంతి యైన యొక్కవిలాసినియుఁ గవగూడి సాక్షాత్కరించి
సృష్టి ఘటియించి దాని సంరక్షింప నప్పువ్వుఁబోఁడిం జాలించె.
నదియ విష్ణుమాయ; యవ్విష్ణుండు పరమయోగానందంబునఁ
గొంతకాలం బేకాకినై తిరిగితిరిగి, క్రమ్మఱ, లోకరక్షణార్థంబు
నిలిపినయవ్వెలందియందు నేను నుదయించిన నన్నుం బరి
గ్రహించి నామీఁది యనుగ్రహంబున, సకలంబును మ
త్కటాక్షవీక్షణంబున బహువిధసంపద్విలాసం బై వెలయ
సమకట్టి లక్ష్మియను పేరు సుప్రసిద్ధంబు గావించి తన తోడు
నీడగా మెలఁపుచు ననేకబ్రహ్మాండకోటులయందు యదృచ్ఛం
జరించుచు నుండ నొక్కనాఁడు, 109

సీ. రుద్రుఁడు పద్మగర్భుఁడు గంధర్వులు
దిక్పతుల్ మునులు దైతేయయక్ష
పన్నగాదులు మహీపతు లాదిగాఁ గల
వారల పాలిభ వైశ్వర్యములకు
నేన నిదానమై నిఖిలనిధానాధి
దేవతాధీశ్వరి నై వెలయుచు
నఖిలదివ్యాంగనాభ్యర్చితమహిమాతి
శయమహారాజసశక్తు లమర
తే. నందఱకు నెక్కువై భువనైకవంద్య
నగుచుఁ బతిపెన్నురంబు సింహాసనముగ
సకలజగములు నేలుచు సర్వమంగ
ళాధిదేవతనై యుందు నబ్జవదన! 110
క. మానిని! యెక్కువవానికి
నేనిక గు జ్జంట నిక్క; మీఁగతిఁ బతి స
న్మానింప నుండి కన్నులఁ
గానఁగ లే నైతి నాదిగర్భేశ్వరి నై. 111
తే. అన్నిటికి నన్నుఁ జాలించి యధిపుఁ డూర
కున్నయనురాగ మెఱుఁగక యుత్పలాక్షి!
ధిక్కరించితి విభునిఁ దత్తేజ మదియు
నస్మదీయప్రభావంబ యని మనమున. 112
ఉ. ఆ జగదేకభర్తకుఁ బ్రియాంగన నైనమహానుభావతం
బూజకు నెక్క యాదిమవిభూతికి నే నెలవైతి నాక నా

తేజము గాం దలంచితి మదిన్ భువనైకవిలాససిద్ధికిన్
రాజసదుర్మదంబునం గరం బభిమానముం దాల్చి యుగ్మలీ!

క. నాతలంచిన తలం పది నిజ
మై తోంచున్ సంతతంబు నంభోరుహానం
జాతప్రముఖసుపర్వ
వ్రాతంబులు నాకు మ్రొక్క వనరుహనేత్రా! 114

వ. అట్టి సమయంబున నొక్కకల్పాదియందు. 115

చ. భువనము సృష్టికై కమలభూ కమలారి కళాధరుల్ మహా
ర్ణవమున వంతుకుం దప మొనర్చిరి నిష్ఠ ననేకవర్షముల్
వివిధవిధిప్రయుక్తు లయి విష్ణుహితంబుగం దత్తపోగ్ని నిం
డి వెలుంగంజొచ్చెం బెన్ బయిట నిష్ఠురకీలలు గ్రాల నెల్లెడన్.

క. దానికి నించుకయేనియు
నానాథుండు కరుణ పూని నలినభవార్యా
జానులవర మొసంగండు యో
గానందసుధాబ్ధిమగ్నుం డై యెలనాంగా! 117

తే. భువననిర్మాణశక్తికై పూని విభునిం
గోరి తప మాచరించుట వీరితలంపు,
వల్లభుం డేలొకో వీరివర మొసంగం
డనుచుం దద్దివ్యచిత్తంబు నరయలేక. 118

క. వర మీంజాలకయో, ని
ష్కరుణాత్మకుం డయ్యొ, వేళ గాదో! తనకున్

హారిభావ మేమొకో యని
పరికించితిఁ గొంతతడవు భావమునందున్. 119

వ. అట్లు పరబ్రహ్మయోగానందరసపారవశ్యంబునం దన్నుఁ దాన భావించుకొనుచు నాతపోధనులదెసఁదలంపులేక యూరకున్న విభుని యాలస్యంబును, వారల తపఃప్రయాసంబు నుపలక్షించి, వరదానసామర్థ్యంబు చాలక తడయుచున్నవాఁడని తన్మాయామోహితనై తలంచి వెండియు నాదు మహిమాతిశయంబున నింతవాఁ డయ్యెం గాక యితనియందు దైవసామర్థ్యం బేమి యున్న దనుచు నాసంపద్గర్వంబునఁ బతిం దిరస్కరించి నగవు దొలంకు నెమ్మొగంబుతో వారలకడకుం బోయి మీ యిష్టం బైన వరంబు నిచ్చెద వేఁడుం డనినఁ గపర్దికనకగర్భులు నాతో నిట్లనిరి. 120

క. కారుమెఱుంగులుఁ బోలెన్
శారీరప్రభలు నిగుడ సమధికతేజ
శ్శ్రీరేఖఁ దోఁచితివి నీ
వే రెవ్వరు చెప్పవమ్మ! బిసరుహనేత్రా! 121

ఉ. ఎన్నఁడు జూడ మిట్టిప్రభ కెక్కినదేవత నర్కమూర్తి న
త్యున్నతవైభవాభ్యుదయ నూర్జితకారుణికాంతరంగ; న
స్మన్నియమాధిదేవతవొ మా కెఱిఁగింపఁగదమ్మ! నిన్ను నో
పున్నమనిండుఁజందురునిఁ బోలెడు ముద్దులమోముకోమలీ!

శా. కారుణ్యామృతవీచికల్ దొలఁకునీక్రాల్గన్గొనల్ సొంపు నిం
పారం గోర్కులవెల్లి పెల్లడరు శ్రేయశ్శ్రీలు శోభిల్లఁగా

నో రాజానన! యస్మదీయవరదానోత్సాహవై తెల్లు నీ
వేరుం జెప్ప వినంగఁ గోరెదము సంప్రీతాత్మవై చెప్పవే. 123

క. మా వర మొసఁగఁగఁ జాలు ప్ర
భావము విష్ణునకుఁ గాక భామిని! తన్మా
యావిద్ధమతులకుం బెర
దేవతలకుఁ గలుగునే మదిం బరికింపన్? 124

తే. అయినఁ గరుణావిధేయవై యమిత తేజ
మొప్పఁ బ్రత్యక్షమై మాకు నోడ కిట్లు
వర మొసంగుదు నని నీవు వచ్చినపుడ
యఖిలలోకైకజనని వీ వగుట దోఁచె. 125

వ. దేవీ నీదివ్యచిత్తంబునం గరుణించి త్వద్వృత్తాంతం బెఱింగించి
మాకోరినవరం బొసంగు మనిన నవ్వి యవ్వారిజాసనశశాంక
కళాధరుల కిట్లంటి. 126

సీ. న న్నెఱుంగరె భువనమ్ములు సృజియింప
మనుప మర్దింప సమర్థ నగుచు
సౌభాగ్యభోగరాజ్యకళావిభూతిప్ర
భావంబులకు మూల మై వసించి,
మీ రెల్ల నాకృపాశ్రీలఁ గావించుచు
నిగ్రహానుగ్రహనిపుణ నగుదు
నాదిలక్ష్మిని బంకజోదరు జీవితే
శ్వరి జగన్మాతను శంభులార!

తే. మీావరంబులు కరుణింప మేటి నేన
కాక దైవంబు మఱి వేఱె కలదె జగతి?
విష్ణుఁ డరిదియె మీాకు నవ్విష్ణునకును
మత్కటాక్షంబు సువ్వె సామర్థ్యమునకు. 127

క. వావిరి బహూన్సృష్టిభవ
ద్దేవాసురమర్త్యపక్షితిర్యఙ్ముఖజీ
వావలి కలిమియు సొబగును
నావిలసన మగుటఁ గనరె నానాగతులన్? 128

క. జలరుహా ఫుల్లాఫుల్లత
జలరుహామిత్రోదయాస్తసంప్రాప్తులచే
బలెఁ ద్రిజగత్కలనాకల
నలు సంధిల్లును మదీయనయవంచనలన్. 129

ఉ. ఆదిమశక్తి నేన పరమార్థవిలాసనివాస మేన, బ్ర
హ్మాదిసురేంద్రకోటులకు నాదరు వేన, సమస్తలోకసం
పాదనకర్త నేన, మది భావనసేయుఁడు, వేఁడుఁ డిష్టః మా
హ్లాద మెలర్ప, విష్ణునకు నద్భుతభంగిగ, నిత్తు సత్కృపన్.

క. అని పలికిన నాపలుకులు
విని జయజయనాద మెసఁగ వినుతించి ననున్
జననీ! మహాప్రసాదం
బని భక్తివిధేయవినతులై సంప్రీతిన్. 131

వ. మహాసంభ్రమంబున నన్ను వలగొని నిలిచి రప్పుడు బ్రహ్మ
దేవుండు ప్రాంజలియై యంబా! నీవు సర్వలోకశరణ్య వగు

దేని నావిన్నపం బాలకించి జగత్సృష్టికరణవిద్యయు సకల సంపత్ప్రదాయిని యైన సీకళయును మదీయశాసనంబున నం బ్రవర్తించుచుండవలయు, నివ్వరంబు కరుణింపు మని యడిగిన నట్ల యనుగ్రహించితి, నంత రుద్రుండును నవ్వరంబును వేడిన వివేకంబు లేక నిలుకడ దప్పి సీకును నిచ్చితి నని పలికితి. నావాక్యప్రమాణంబున నవ్విద్యాకళలు రెండును నొకరియందును నిలుకడ వడయరాక చంచలించి మూర్తిమతులై యిద్దఱిదెస నడయాడుచున్న, వారు విఫలప్రయత్నులై దీనులై యున్నం గనుంగొని దీని కేమి సేయుదాన, బ్రమసి యిద్దఱకు నొక్కచందంబు వరం బుపన్యసించితి నని తెరవు లేక చీకాకుపడు చున్నసమయంబున దేదీప్యమాన మహేంద్రనీలమాణిక్యపుత్త్రియుంబోలె లీలామందహాసం బెసంగ విష్ణుమాయ సాక్షాత్కరించి నాతో నిట్లనియె. 132

మ. త్రిగుణాధారుఁడు విశ్వలోకఘటనాదీక్షాసమర్థుండు స
ర్వగతుం డాదికి నాది విష్ణుఁ డని నిర్వ్యాజంబుతో నిద్దఱుం
దగ నీదివ్యులు భక్తి నాహరికిఁ జేతఃప్రీతి సంధిల్ల దు
ర్లభగణిం జేయుచునున్నవారు తప, మిష్టావాప్తికై నిష్ఠతోన్.

ఆ. ఉగ్రతపము సేయుచున్న యీయిద్దఱ
యభిమతంబు నేక మరసి చూడ
వీరితమకు మడిపి వేర్వేఱ వరము లీ
నెదురుచున్నవాఁడు విష్ణుఁ డిపుడు. 134

వ. ఇట్లున్నచోటఁ దద్దివ్యచిత్తంబు గావక యతండు లీలార్థంబు సహచరిగా ననుగ్రహించి యనురాగంబునం బెద్దసేయుటం జేసి యాప్రియునందు మందమేలంబున మందబుద్ధివై లక్ష్మీగర్వవిభవంబునఁ బతిం దిరస్కరించి. 185

క. భావింపఁగ నీవును నొక
దేవతయునుబోలె మీఁదు దెలియక వర మె
ట్లీ వచ్చితి విచ్చినవర
మీవిధమున వ్యర్థమయ్యెః నిది యిట్లుండెన్. 186

చ. పతి యసమర్థుఁ డంచు మతి భావనఁ జేసితి బ్రహ్మ రోహిణీ
పతిశకలావతంసులతపస్సులు విఘ్నముచేసి తద్వర
ద్వితయము వీటఁబుచ్చితివి విష్ణుహితంబుగ లక్ష్మి నంచు దు
ర్మతివయి;యాత్మవల్లభ పరాభవమంఖముఁ గందుగాఁ గిఁకన్!

వ. అని పలికి నీయందు దుర్మదకారణంబులైన రాజసతామసగుణంబు లుత్కృష్టంబులై యున్నయవి; దానంజేసి సదసద్విజ్ఞానంబు పుట్టదు, శుద్ధసాత్త్విక ప్రబోధసుధాసారస్యంబు గల్గుదాఁక నీలక్ష్మీగర్వవిభవంబు మాని, యంతస్తేజంబుతోఁ గొన్నిదివ్యవర్షంబులు తపంబు సలుపుము, నీవు వసించిన తపోవనంబు కిసలయకుసుమఫలలలితశుకపికభ్రమరసంకీర్ణంబయ్యును శూన్యంబై, చిత్రరూపంబు కైవసి నుండు; నెప్పు డేని యవ్వనంబు వికాసంబు నొందు, నప్పుడు నీకు శాపావధి యగుఁ, దత్క్షణంబ క్రమ్మఱఁ ద్రిజగత్సేవ్యంబైన వైభవంబులో నిజప్రభావసామగ్రి గలిగి యెప్పటి

యట్ల యాపరమేశ్వరుం గూడి యుండఁగలవు. నీకు సహాయ పరిచారిక లై శూన్యనిధానాధిదేవతలు ప్రవర్తింతురు. నీకు నిది విష్ణుశాసనం బలంఘనీయంబు, పొ మ్మని పలికి, బ్రహ్మదేవునిం గని మీ రిద్దఱు నేకాభిలాషంబునఁ దప మాచరించుట తగదు. నీవు లోకంబు సృజియించుచు స్రష్టృనామధేయుండ వగుము; శివుండు జంతులోకంబుఁ గాలపరిపాకంబున హరించుచు హరుం డగు; విష్ణుండు దాను సర్వంబును రక్షించుచు జగద్రక్షకుం డనుదివ్యనామంబున వెలయం గలవాఁ డని యాజ్ఞాపించి విష్ణుమాయ మాయమయ్యె, న మ్మాయాశాసనంబున నమ్మువ్వురు నట్ల ప్రవర్తించుచున్నవారు, నేను నవ్విధంబున నాఁటనుండియుఁ దపంబు సేయుచున్నదాన,నివ్వనంబును నట్లన నావచ్చినయది మొదలు వికాసరహితం బై యున్నయది, యీకాంత లానిధానాధిదేవతలు,కరుణావిధేయుం డగునప్పరమేశ్వరుం డింక నెన్నఁడు ప్రసాదించునో కాని యిది మదీయవృత్తాంతంబు వినుమని యమ్మాయాలక్ష్మి యాదిలక్ష్మికిం జెప్పుచున్న సమయంబున.

మ. కలపుంస్కోకిల గర్వధూర్వహకుహూకారంబు, కీరాళిసం
కులనాదంబు లెసంగ నవ్వనము చక్షుష్ప్రీతి గావించె మం
జు లతా పల్లవ వల్లరీ ఫలరసస్ఫూర్తుల్ ప్రవర్తింప నా
జలజాక్షీనిజదివ్యభాగ్యకలనాసంప్రాప్తి సూచించుచున్. 189

క. అవన నవ వికసన ల
క్ష్మివిభవము చూచి మేలు చేకుఱె నని మా

యావనరుహావాసిని మో
దావహామతి యయ్యె లక్ష్మి యద్భుత మందన్. 140

శా. 'ఓలోకేశ్వరి! యోజగజ్జనని ! యోయోగీంద్రవంద్యప్రభా
వాలంకార! భవత్తపోమహిమకున్ హర్షంబులో నిప్పుడే
నాళీకేక్షణుఁ డాదిపూరుషుఁడు నీనాథుండు నీ కిచ్చెఁ, దా
నీలక్ష్మిప్రభ యంచు నాగగనవాణీదేవి పల్కెం దగన్. 141

వ. అంత. 142

క. గంధర్వమధురగానము
బంధురదుందుభిరవంబుఁ బైపై నాశా
సంధుల మొరయఁగ దక్షిణ
గంధవహాము వీచె దివ్యగంధంబులతోన్. 143

చ. సురతరుపుష్పమంజరులసోనలు ముంచె మదాళిజాలఝం
కరణ పయోధరప్రకటగర్జనతాండవితాప్సరోవధూ
త్కర నవకేకిసంఘసముదంచితకిన్నరసిద్ధసాధ్యని
ర్జరఫణిచారణాశ్వముఖచాతకసంచరణాభిరామముల్. 144

క. కోరికలు వెల్లివిరియఁగ
నారదముని కుంచె విసరి నాట్యము సలిపెన్
స్వారాట్ప్రముఖదిశాధిప
వారిజలోచనలు గొలువ వచ్చిరి వేడ్కన్ 145

చ. జలరుహగర్భముఖ్యసురసంఘము గొల్వఁగ విష్ణుమాయ,యు
జ్జ్వలగరుడధ్వజంబు ధృతచామరలాలసదివ్యకామినీ

తిలకనిషేవితంబు నగుదివ్యవిమానముఁ దెచ్చి నిల్పె నా
నెలఁతుకవండ మండితమణిప్రభ లాశల నాక్రమింపఁగన్.

ఆ. ఆవిమానపూజితామరతరుపుష్ప
దివ్యగంధములకుఁ దేఁటు లెగసె
లక్ష్మి యున్న యాకొలంకుక్రొవ్విరిదమ్మి
పువ్వుఁదేనెఁ గ్రోలి పొదలి పొదలి. 147

సీ. దండముల్ వెట్టి రాఖండలాది దిగంత
నాయకుల్, ప్రణమిల్లె నాగకులము,
మ్రొక్కిరి గంధర్వమూర్ధాభిషిక్తులు,
ప్రాంజలు లైరి సుపర్వవరులు,
వందనం బొనరించె వాచంయమశ్రేణి,
యానతిచేసె గుహ్యకగణంబు,
అభివందనముచేసె యక్షనాయకకోటి,
కరములు మోడ్చిరి గరుడపతులు

తే. చారుకరుణాకటాక్షవీక్షావిభూతి
పాలితాశేషభువనకు, బ్రహ్మముఖ్య
దివిజపూజ్యకుఁ, బరమసాత్త్వికమతల్లి
కాదిలక్ష్మికి, నిత్యకల్యాణవతికి. 148

వ. ఆ సమయంబున నమ్మహావిష్ణుమాయ తో యజాసనాదులు
విన, దేవీ ! నీతపంబు ఫలించె, నీ వల్లభుం డగు విష్ణుండు
ప్రసన్నుండై నిజలక్ష్మీతేజంబు నీకు ననుగ్రహించె, నీకు

దివ్యవిమానంబు పుత్తెంచినవాఁడు. విజయంచేయు మని
పలికినఁ దద్వచనప్రమాణంబున, 149

తే. పంచభూతంబులును సముదంచితాభి
జాతనిర్ఘోష మొనరించె సకలదిశల;
దిశలు విశదప్రభలఁ బొందె దివ్యమహిమ
నమ్మహాలక్ష్మి నిజతేజ మాశ్రయింప. 150

క. హరికరుణాసంప్రాప్తిన్
సరసీరుహానయన యపుడు సంతోషరస
స్ఫురణమునఁ జూడ నొప్పెను
ఖరకరరుచిఁ బొదలు నబ్జకలికయుఁ బోలెన్. 151

సీ. శుద్ధసువర్ణంబుసొబగు మించినమేన
బాలసూర్యప్రభల్ ప్రజ్వరిల్లెఁ
బార్వణచంద్రబింబముఁ బోలుమోమున
సుప్రసాదశ్రీల సొంపు నెరసె
వెలిదామరల మీఱువెడఁదకన్గొనలపై
నైశ్వర్యకందళు లంకురించె
నమృతపూరముఁబోలె నలరుచిత్తంబునఁ
గరుణారసార్ద్రత గడలుకొనియె

తే. లలితశుభలక్షణాంఘ్రిపల్లవములందు
దివ్యనారీకిరీటసందీప్తరత్న
దీప్తిపుష్పోపహారముల్ దీటుకొనియెఁ
బతికృపాలబ్ధవిభవ కా పద్మముఖికి. 152

తే. నవనిధానాధిదేవతల్ వివిధకళలఁ
బొంది సేవించి రప్పు డప్పుప్పుఁబోణి
నల వసంతాగమమునఁ బుష్పాభిరామ
లతలు వనలక్ష్మి నవరించులాగు దోఁప. 153

క. ఆమాయాలక్ష్మిమహా
సామర్థ్యము నిజమపోలె సమధికతేజో
ధామంబై త్రైలోక్య
ప్రేమాస్పద మైనఁ, గమల బెగడుచు మదిలోన్. 154

క. నేనే లక్ష్మికాంతను
నానాథుఁడు విష్ణుఁ డఖిలనలినభవాండ
ప్రాణిగణరక్షకుం డని
మానసమునఁ దలఁతు దివ్యమాన్యవిభూతిన్. 155

ఉ. ఆదికి నాదియైన పరమాత్ముఁడు విష్ణుఁడు నీవిభుండు, నీ
వాదిమలక్ష్మి వంచును గృతానతులై యనిశంబు బ్రహ్మరు
ద్రాదులు వీరు, దివ్యులు నిజాభిమతార్థము లర్థిఁ గోరి న
న్నాదటఁ గొల్వవత్తు రిదియంతయు లోకమెఱుంగు నేర్పడన్.

మ. అది మిథ్యాకథనమ్ము చేసి యిదిగో నాదేవతాధీశ్వరుల్
మది నుప్పొంగుచు నీశుభాంగిని మహాలక్ష్మి! జగన్మాత! మ
మ్ము దయం జూడు మటంచు మ్రొక్కెదరు నా ప్రోలన్
మహాసంభ్రమం! బాదవన్! వేఱొక విష్ణుఁడున్ సిరియు నె
ట్లున్నారొకో మాపయిన్ ? 157

మ. కనినైనన్ వినినైన నే నెఱుఁగ నెక్కాలంబు నీపద్మలో
చన దా లక్ష్మినటంచుఁ జెప్పినకథాచ్ఛాయాప్రకారంబుచూ
చిన సత్యంబయితోఁచుచున్నయది;లక్ష్మిన్నేనమైయున్నదా
న, ననేకక్రియలం దలంప నిది గానన్ రాదు నిక్కంబుగాన్.

క. కలగంటినో! బ్రిమసితినో!
కలవరమో! యింద్రజాలకరపరికలనా
కులతయొ! యివి యన్నియు వృథ
యలవడునే యింత నిక్కమై, యట్లైనన్ ? 159

క. నాలక్ష్మికలనలు మి
థ్యాలీలలు గాని యీలతాతన్విజయ
శ్రీ లన్నియు నిక్కము ల
క్ష్మిలావణ్యప్రభావిశేషము లగుటన్. 160

క. ఇన్నియు నిట్లుండఁగ ని;
మ్మెన్నఁగ వేఱొక్క విష్ణుఁ డీసతివరమీా
నున్నాఁడో! నావిభుఁడై
యున్నజగత్కర్త విష్ణుఁడో! భావింపన్. 161

ఉ. ఈనలినాక్షి యాత్మ గుఱియించిన విష్ణుఁడు నావిభుండయా
నేని, జగత్ప్రిసిద్ధముగ నిమ్మహనీయవిభూతిసంపదన్
దీని వరించెనేని యిది దివ్యులు గొల్వఁగ నమ్మహాత్ము నిం
పూనఁగఁగూడి లక్ష్మియయియుండిన, నేమగుదాననేనికన్ ?

మ. నను మీాఱ న్నుతి కెక్కునీవనిత నానాదివ్యనారీజనం
బును దద్వల్లభులుంగరంబువినయంబుల్ సేయుచుం గొల్వ,లో

చనపద్మాంచలచంద్రికారుచులచే సంపత్కళల్ నింపుచు
న్మనుచున్ లోకములింతయున్ని జమయై నావిష్ణునింగూడినన్.

తే. పెక్కువేలేండ్లు విష్ణునిఁ బ్రేమఁ గూడి
లక్ష్మినై యుంటిఁగాక! యీలక్ష్మిలీల
నిల్లు భువనైకచిత్రమై యెసఁగుమహిమ
కెక్కి యుంటినె గుఱుతుగా నెన్నఁడైన? 164

ఉ. ఇంతయు నేమి గాఁగలదొ యేర్పడఁ జూచెదఁగాక! చిత్రమై
యింతకు నచ్చునట్టిపని యెక్కడఁ బోయెదు నంచు నయ్యుద
న్వంతునిపుత్రిమానసమునం బెగడొందుచుఁజూడ మ్రోసె నా
శాంతములన్ జయానకము లావెడలక్ష్మివిమానమెక్కఁగన్.

క. కాంచనపంకజ మెక్కెడు
కాంచనకలహంసివోలెఁ గమలాలయ యా
కాంచనపుష్పక మెక్కన్
గాంచనమయదేహగౌచులు గడలుకొనంగన్. 166

—♦ ఆదిలక్ష్మి తేజస్సును మాయాలక్ష్మి హరించుట ♦—

క. ఇమ్మెయిఁ బుష్పక మెక్కుచు
నమ్మాయాలక్ష్మి లక్ష్మి యందలి తేజం
బిమ్ములఁ హరియించెను లో
కమ్మెల్లను విస్మయంబుగాఁ గనుచుండన్. 167

ఆ. ఉదయభానుదీప్తి యెడిసిన సారంబు
దెరలి యున్న యోషధియునుబోలెఁ

గపటలక్ష్మి సహజకాంతి హరింప న
య్యాదిలక్ష్మి విన్ననయ్యె నపుడు. 168

వ. వెండియు నమ్మిథ్యాలక్ష్మి, లక్ష్మి కనుంగుఁజెలులై కూడి యున్న భూకాంతాసరస్వతులఁ జూచి నే నయ్యాదివిష్ణుం గూడి చతుర్దశభువనసామ్రాజ్యంబునుం బ్రీతిపాలించుచు వైకుంఠనగరంబున వివిధోపభోగంబు లనుభవించుచుండుదు, నింక మీరు నాసఖులై యాదివ్యస్త్రీలు పరిచారికలై సేవింప నుండవలయు నాయనుజ్ఞఁ గైకొని రం డని వారిద్దఱ నవ్విమానం బెక్కించుకొని బ్రహ్మరుద్రాదిబృందారక సందోహంబులును విష్వక్సేనప్రముఖదండనాయకులును బరివేష్టింప గంధర్వ మధురగానంబులు నప్సరో నృత్తావధానంబులు నాదరించుచు శంఖకాహళభేరీమృదంగపటహవీణా నాదంబులు చెలంగఁ ద్రైలోక్యమహోత్సవంబుగా గగన మార్గంబున వైకుంఠపురంబునకుం జనియెఁ, దదనంతరంబ.

తే. అట్లు తేజోవిహీనయై యబ్ధికన్య
నిబిడనిర్వేదదైన్యముల్ నివ్వటిల్ల
నొంటిఁ బడియుండె విగతతారోగ్రతిమిర
జలధరాలీఢయామినీలలనవోలె. 170

క. త్రైలోక్యవినుతసాధ్వికి
శ్రీలక్ష్మికి నీయవస్థ సిద్ధించెఁ బలిన్
మేలమున నెన్నకుంటుట;
నేలా గణియింప నింక నితరస్త్రీలన్? 171

మ. చెలులుం దేజమునుం దొలంగిన మహాచింతాపరిక్రాంత యై
పటుమాయా న్వధిదూఱి యద్భుతభయప్రచ్ఛన్న యై యవ్వలి
వ్వల నెవ్వారును లేక యొంటిఁబడి యవ్వామాక్షి పద్మాక్షుని
న్నలుచోట్లం బరికించి కానక మదిన్ శంకించి తా నిట్లనున్.

చ. కటకట! కూర్మి యైనచెలికత్తె లటంచును వీరి నమ్మి నే
నిటువలె నేల వచ్చితి నిజేశ్వరుసంగడిఁ బాసి యొంటి మై
నిట? కిదె నన్నుఁ డించి చని రిందఱు వెంటనె వచ్చి; విష్ణుఁ డె
చ్చటవసియించె నొక్కొ సుమసౌరభ సంభృత*కుంజవాటికన్?

వ. అని కొలంకు కెలంకులఁ గలయ నాలోకించి తనవచ్చినత్రోవఁ
గొంచుఁబోక మరలి వచ్చి యయ్యెడఁ దొక్కి చూచి క్రమ్మఱి
కొలంకుదాపలికిం బోయి వీక్షించి నెండియు మగిడి మార్గ
తరురేఖ లన్వేషించుచు, నిక్కంబుగాఁ బ్రాణేశ్వరుం గానక
శోకంబునం జీకాకుపడుచు నేకడకుం బోవఁ గాల్దురాక
యా కలశసాగరకుమారిక దనమనంబున. 174

సీ. ఆ తపస్విని దివ్య లర్చింప లక్ష్మి యై
యాదివిష్ణునిఁ జెంద నరిగెఁ గడఁక
నాదేవి పిలిచిన ననుఁగు సైదోడు లై
నా సఖుల్ పోయిరి నన్ను విడిచి
యివ్వని ననుఁ గూడి యేతెంచి వంచించి
ప్రాణేశ్వరుఁడు డాఁగె నడవిలోనఁ

* పుష్పవాటికన్—పాఠాంతరము.

దొల్లింటితేజంబు దొఱఁగి విభ్రాంత నై
యొకటియు నెఱుఁగక యున్నదాన

తే. నమ్మహాలక్ష్మి కవగూడు నాదివిష్ణుఁ,
డాత్మభర్తయ కానోపు, నవ్విధమున
సఖులఁ జేకొని యాసాధ్వి చనఁగ నిచట
విభుఁడు కనఁబడకున్న యవ్విధము చూడ. 175

క. నను నీయుగాంతవి విడి
నెనరు విడిచి పోయె విభుఁడు నిష్ఠురుఁడై; నె
మ్మనమున నిండారెడు తమ
యనురాగము విడిచి రావయస్యలు దామున్. 176

ఉ. దూరమువచ్చితిన్ మిగుల, దుర్గమహాటవి నొంటి డించి యం
భోరుహలోచనుం దరిగెఁ; బోటులు దామును వింతలక్ష్మి నిం
పారఁగఁ గూడి వేడుక దదర్థితదివ్యపదంబు చేరి; రె
వ్వారికిఁ దోడునీడ యగువారు తలంపఁగ నాకు నీయెడన్?

క. పతియాశ చెలులయాశయు
గతజలసేతువు దలంపఁగా, నిఁకఁ దద్వ
ర్జితమతి వైకుంఠపురీ
గతిఁ బోయెదఁ గాక యొంటిఁ గానల వెంటన్. 178

తే. ఎవ్విధంబున నైన నే నివ్వనంబుఁ
బాసి పురిఁ జేరి యుండఁగాఁ బ్రభుఁడు వచ్చు
నపుడు నా పడ్డపాట్లెల్ల నడలు గదురఁ
జెప్పి తనువు విసర్జింతుఁ దప్ప దిట్లు. 179

తే. చోరుఁడు నే లేని వైకుంఠపురము భర్త,
యదియుఁ గాదు మహాశూన్య మగుటఁ జేసి;
విన్ననై యున్నదాన నవ్వీడువోలె
నేను నిఁక నంద యుండెద నేకతంబ. 180

వ. అని మోహాతిశయంబున నవ్విష్ణుమాయాసముద్రంబు దరి యింపంజాలక యాలోకమాత, మిథ్యాలక్ష్మీమహోత్సవ సంభ్రమంబును, ప్రియసఖీజనంబు వాసి పోవుటయును, వల్లభుండు వియుక్తుం డగుటయుఁ దన మనంబున కసహ్య దుఃఖకారణంబు లగుటంజేసి పరితపించి. 181

సీ. దవ్వు నచ్చుటయు మార్దవముచే నోర్వక
చరణముల్ పొక్కనఁ బొరలఁబడుచు
వ్రేఁగు పిఱుఁదుల, వీఁగు చన్నుల వడిఁ
దూఁగని నడకలఁ దొట్రుపడుచు
ధృతిలేమిఁ గడు నుప్పతిల్లెడు శోకాగ్నిఁ
బొడము నిట్టూర్పులఁ బొనుఁగుపడుచుఁ
దగు సహాయత లేక దైన్యసంభూతాశ్రు
ధారలఁ జన్నులఁ దడుపఁబడుచు

తే. దుష్టమృగ దర్శనంబులఁ దొలఁగఁబడుచు
బ్రమసి మార్గము దప్పి సంభ్రమముపడుచు
నెట్టకేలకు నిబ్బంగి నేఁగుదెంచెఁ
దెఱవ వైకుంఠనవిధాబ్ధితీరమునకు. 182

వ. ఇట్లు బహువిధప్రయాసగమనఖేదజనితస్వేదపూరాభిషిక్తం బై సత్త్వంబు సడలిన మేనుదీఁగెతో నల్లనఁ జనుదెంచి. 188

—•{ వైకుంఠపట్టనవిలాసముఁ జూచి యాశ్చర్యపడి యాదిలక్ష్మి యోజించుట. }•—

ఉ. అచ్చటనుండి చూచెఁ గలశాంబుధికన్యక నాఁటికంటెఁ గ
న్నిచ్చకువచ్చు తత్పురసమీహితలీలలు, సాల చంద్రశా
లోచ్చయరత్నతోరణసమున్నతకేతనహేమకుంభముల్
మెచ్చొదవించుచు న్దిశల మించుల ముంచుచుఁ దేజరిల్లఁగన్.

ఉ. చారుమృదంగభేరిజయశంఖవినావము లాసికాంఘ్రిమం
జీరఝుళంఝుళధ్వనివిశేషము గానకళామనోజ్ఞవీ
ణారవముం దురంగభటనాగచరద్రథపౌరలోకగం
భీరరవంబునుం జెవికిఁ బెక్కువ చూపెఁ బయోధికన్యకున్.

ఉ. నాలుగువంకలన్ సురలు నమ్రశిరంబులతో సమస్తది
క్కూలవిజృంభమాణజయఘోషముతో హరిపూజనార్థమై
పోలఁగ వచ్చుచున్ మగిడిపోవుచు నుండెడు సందడిం దివిన్
గ్రాలెడు రత్నభూషణపరంపర చిత్ర మొనర్చె లక్ష్మికిన్.

మ. హరిపూజాసమయార్పితాగరుముఖోద్యద్ధూపధూమోత్కరం
బురుసౌధోపరిజాలమార్గములయం దుద్భూతమై వీథులం
బరిసర్పించుచు గంధబంధురపురప్రాంతస్థలోద్యానసుం
దరవాతాహతిఁ దూలుచుం బురికిఁ జిత్రశ్రీయొనర్చెం గడున్.

వ. వెండియు ననంతలక్ష్మీవిలాససదనం బై రాశీభూతదివ్యతేజః పూరం బై యపరిమితమహోత్సవాభిరామం బై యపూర్వ

మణిమాలికాలంకృతం బై దివ్యనారీనరసేవ్యమానం బై వికచ కనకారవిందసుందరం బై త్రిభువనానందకరం బై యొప్పు నా వైకుంఠపుటభేదనంబు చూచి లక్ష్మి విలక్షహృదయ యై తలయూఁచి నే నివ్విధము పాడుచేసి పోయితిఁ గ్రిమ్మఱ నింత యైశ్వర్యవంతంబు గావించిన దివ్యప్రభావు లెవ్వరొకో యని యిది జగదేకాశ్చర్యంబు. నే నెలవుకొనియున్ననాఁడు నిట్టి సంపద యెఱుంగ, దీని తెఱం గెఱుంగవలయు ననుచుఁ దన్నికటపరిదేశంబునఁ బరివాళకిసలయచ్ఛేదం బొనర్చుచుఁ బారిజాతకుసుమమంజరులు గోయుచు నమృతసాగరతీర భూములం దొట్టినముక్తాఫలంబు లేఱుచు లీలావిహారణంబులఁ బరిభ్రమించుచున్న తీఁగెఁబోండ్లఁ గొందఱ నాలోకించి వారి డాయంబోయి యిట్లనియె. 188

తే. ఏమి సేయుచు నున్నారు? భామలార!
యెంతదడ వాయెఁ బురినుండి యేఁగుదెంచి?
వార్త లే మంద్రు? నగరిలో వనజవాస
యును ముకుందుండు నేలాగు నున్నవారు ? 189

వ. అని యయ్యిందిరాదేవి పలికిన నయ్యిందీవరాక్షు లిట్లనిరి.

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివె? *యీపురిదానవు కావె, యైతివే
నెయ్యెడ మమ్ము నిట్లడుగుదే? మఱివార్తలు మంచివన్నియున్,
నెయ్యములో జనార్దనుఁడు నేఁడొకనూతనలక్ష్మిఁ దెచ్చినాఁ
డయ్యెలనాఁగ విభ్రమమహత్త్వము లెన్న వశంబె యేరికిన్?

---

*యీపురిదానవో కావో—పాఠాం.

ఉ. లోకలోకలక్ష్మిఁగూడి పతి తోరపుకేలుసమండియుండి, యా
పల్లవపాణిపై వెఱిగి బ్రహ్మముఖుల్ దనుఁ గోరి కొల్వఁగా
నుల్లము సంతసిల్లఁ దన కొప్పఁ దపం బొనరించె నంచు నేఁ
డెల్లజగంబులుం బొగడ నింపులఁ గూడె నవాబ్జమందిరన్.

క. ఆ లక్ష్మీతిలకంబు మ
హాలక్షణవతి యటంచు నతిభక్తిఁ బుర
స్త్రీ లర్చించిరి పతితోఁ
జాలఁగ దీవించి భాగ్యసంపద వెలయన్. 193

తే. అమ్మహాదేవి దివ్యాంగనాళి గొల్వ
భూసతీరత్నమును దాను బొత్తుగూడి
ముద్దుఁగోడలు వాగ్దేవి ముద మొనర్ప
నేలు వైకుంఠసామ్రాజ్య మేకహేళి. 194

—♦ మాయాలక్ష్మి వృత్తాంతము విని యాదిలక్ష్మి విచారపడుట ♦—

క. ఇవిగో వార్తలు విను మని
యువిదలు తనదండఁ బాసి యొండొడ కరుగన్
నవలక్ష్మీలీలలకున్
ధవుఁడుం బురజనముఁ బ్రేమఁ దగిలి రటంచున్. 195

చ. మనమునఁ గుందికుంది పలుమాఱు విశేషవియోగవహ్ని *పై
కొనఁ గడు క్రందిక్రంది పటుకోపమహాజ్వరపీడ దట్టమై

* తాఁకునఁ—పాఠాం.

మొనసినఁ గంది కంది యతిమోహాతమంబునఁ గానదయ్యె న
మ్మనసిజుతల్లి, యవ్విభునిమాయలఁ జిక్కనివార లేరికన్?

వ. అట్లు మాయాలక్ష్మీవిలాసలాలసుండై విభుం డున్నవాఁడ కాఁ దలంచి దృగంచలంబులం గన్నీరు వెడల నిట్టూర్పు నిగిడించి వెండియు నాదివ్యమందిరసౌందర్యంబు సందర్శించి యింక నవ్విభుని ముందఱికి నే మని పోవుదానఁ, బోఁటులె నేని క్రొత్తబిత్తరిం దగిలిన యవ్విలాసి పరిహాసంబు సేయుంగాక నన్ను సమ్మానించునే, దీనికిఁ బరితపింప నేల, తపంబున మెప్పించి కాదె యీసాధ్వి యింత వైభవంబు వడసె, నట్లన యనాథనాథుండును కరుణాసాగరుండును భక్తవత్సలుండును నగు నవ్వైకుంఠవల్లభు నుల్లంబున నారాధించి తదీయతపస్సిద్ధిక్షేత్రంబై పొగడొందిన యాకొలనిపసిండి కెందమ్మిపువ్వునంద నేనునుం దపంబుచేసి మెచ్చువడసెదం గాక యని నిశ్చయించి మగిడి కొలంకుఁజేరి కృతస్నానయై తత్కర్ణికాపీఠంబునఁ బద్మాసనబంధంబు దృఢంబు గావించి.

సీ. వేదాంతనూపురాన్వితచరణాంభోజు
హాటకపీతాంబరాభిరాముఁ
గౌస్తుభగ్రైవేయకమనీయకంధరు
శంఖచక్రగదాబ్జచారుబాహు
మకరకుండలవజ్రమణికిరీటవిలాసు
సురభిమాల్యాలేపసుందరాంగుఁ

గుందమందస్మితాంకురలోచనాంచలుఁ
గారుణ్యరససుధాగారహృదయు

తే. హృదయమున విష్ణు నాత్మేశుఁ బదిలపఱిచి
చిదమలానందబంధురసింధులహరి
నోలలాడుచు వసియించె నొక్క కొంత
తడవు శ్రీకాంత యేకాంతతత్త్వనిష్ఠ. 198

క. తోయధితీరవిహారము
మాయాలక్ష్మీవిలాసమయకృత్యములున్
మాయము గావించి విభుం
డాయెడ నొకవింతచంద మందముచేసెన్. 199

క. విను! ధర్మతనయ! కాంచన
వనరుహపీఠాగ్రియోగవర్జితయై య
ల్లనఁ గొంత పొద్దునకుఁ దన
కనుఁదమ్ములు విచ్చి చూచెఁ గదుఁ జిత్రముగాన్. 200

శా. ఆ వైకుంఠమునందు నెప్పటి మహాహర్మ్యంబున న్వేడ్కతో
నావిశ్వంభరునంకపీఠమున నెయ్యం బారఁ గూర్చున్న య
ట్లావారాకరపుత్రి యొప్పెఁ; గల గన్న ట్లయ్యె నమ్మాంతయు, లీ
లావిర్భూతదరస్మితుం డగుచు దైత్యారాతి మోదింపఁగన్

క. కురిసెం బువ్వుల వానలు
వరుసం దుందుభులు చెలఁగె వైకుంఠమహా
పురి లక్ష్మీనారాయణు
లురులీలల నట్లు గూడి యుండినవేళన్. 202

క. ఈ లక్ష్మీనారాయణ
కేళీమాయావిలాసకీర్తనము యశః
శ్రీ లొసఁగు వినినవారికి
నాలవపురుషార్థసిద్ధి ననుపారంగన్. 203

వ. అని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పె ననిన విని పరీక్షితుం
డటమీఁదటి కథాప్రసంగం బెట్లుండె నని శుకబ్రహ్మ
నడుగుటయు. 204

ఉ. నందకశంఖచక్రనలినప్రతిభాసిత ! నందసుందరీ
నందన! నందనద్రుహరణప్రియ! గోపవధూసహస్ర గో
బృందకనత్కదంబవిటపి వ్రజకేళివిహార! చారుసం
క్రందనచాపదీపితశిఖావళపింఛకిరీటలాంఛనా! 205

క. శ్రీవిభవ! బ్రహ్మవిద్యా
భావిత! బ్రహ్మస్వరూప! పరమపురుష! శ్రీ

గోవింద! నందనందన!

గోవర్ధనధర! ముకుంద! గోకులరమణా! 206

మత్తకోకిల. ధీర శంఖ సుదర్శనామృతదీధితీనయుతాంబరా!

చారుశార్ఙ్గ సురేంద్రకార్ముక సంచరజ్జలదోదయా!

హారిహాటకచేల సాంధ్యమహా స్ఫురద్రజనీముఖా!

మారకోటివిలాస పుష్పసమగ్ర నందనకాననా!

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ

కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభు సుపుత్ర

సుకవివర్య రాధామాధవయెల్లనార్య ప్రణీతం

బైన విష్ణుమాయానాటకంబునందు

ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు

# విష్ణుమాయానాటకము

---:o:---

## తృతీయాశ్వాసము

---

క. శ్రీరాధా సఖర క్షత
తారేశకళా నిరస్త దర్పక దర్పో
దారాంధకార! జగదా
ధార గుణావాల! నవమదనగోపాలా! 1

తే. అవధరింపుము దేవ! సంయమివరుండు
సకల వేదాంత విద్యా విశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మఱియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రుతోడ. 2

వ. అవ్విధంబున శ్రీమహాలక్ష్మీకథఁ జెప్పి గోవిందశర్మ ధర్మ
నందనునకు, బ్రహ్మదేవుండు విష్ణుమాయవలన మోసపోయిన
తెఱంగు విశదంబుగా నెఱింగింప సమకట్టె. 3

మ. విను! విశ్వక్షితిపాలమౌళివలభీవిస్ఫారరత్నప్రభా
శనదుద్దామపదారవింద! త్రిజగత్కల్యాణచారిత్ర! పాం

దునరేంద్రోత్తమపుత్ర! యీమునిగరిష్ఠుల్ నీవునుంగూడియెం
దునకుం జిత్తముఁ బోవనీక హరియందు న్నిల్పి సంప్రీతితోన్.

వ. అని కొలువు సావధానంబు గావించి.

క. లోకవిహీనం బై జల
మాకాశము మోచియున్న యపు డంబుధిపై
నేకాంతంబున హరి పెనుఁ
జీకటిఁ బవళించి యుండెఁ జిన్మయలీలన్. 6

తే. అట్లు సకలంబు నణఁచి యేకాంతరూఢ
పరమయోగాభిరతిఁ బరబ్రహ్మ బోధ
నవసుధాధార నానంద మవధరించి
లీలమై నుండఁగాఁ గొంతకాలమునకు. 7

—◆ విష్ణు నాభీకమలమునందు బ్రహ్మ యుద్భవించుట ◆—

మ. హరినాభీ జలజాతరేణు పరమాణ్వంశంబునన్ బ్రహ్మ భా
స్వర హేమద్యుతిఁ బుట్టె నాత్మకృతపూర్వప్రాజ్యపుణ్యోదయ
స్ఫురణ న్దన్మహనీయమాయ కెనయాచు న్సాధనం బై జగ
త్పరినిర్మాణవిధేయత న్నిగమతత్త్వజ్ఞానవిశేషమై 8

తే. ఇవ్విధమ్మున జనియించి య వ్విధాత
బిసమహోన్నతకర్ణికాపీఠ మెక్కి
దేవదేవునిముఖమున దృష్టి నిలిపి
ప్రస్తుతించెఁ గరాంజలిబంధ మొప్ప. 9

శా. ఓనారాయణ! యోజగద్వరద! యో యోగీంద్ర! యోగీం
ద్రహృద్ధ్యానధ్యేయఫలాత్మ! యోజనక! యోయామ్నా

యతత్త్వార్థవి,జ్ఞానానందనివాస! యోపరమ! యోసర్వేశ!
యోమోక్షుల,క్ష్మనిత్యాశ్రియ! యాశ్రితుండ నను నెమ్మిం
జూడవే సత్కృపన్! 10

క. నీయందె పొడముచుండును
నీయందె యడంగుచుండు నిఖిలము, వేదాం
తాయత్త తత్త్వవిద్యా
శ్రీయోనిధి వరయ నీవ చిన్మయపురుషా! 11

క. నీకంటె నితర దైవము
లేకుండుట కంబరావలీఢతమోర
త్నాకరములు సాక్షులు జగ
దేకాధిపకీర్తి నీక యొసఁగు మహాత్మా! 12

శా. సర్వాత్ముండవు సర్వలోకఘటనాచాతుర్యధీవర్తివిన్
సర్వవ్యాపివి సర్వపూర్ణరుచివిన్ సర్వైకసేవ్యుండవున్
సర్వోత్కృష్టమహాప్రభావుఁడవు నెన్నన్నీవ యున్నాటకున్
'సర్వంవిష్ణుమయంజగ' త్తనెడిశాస్త్రంబుల్ ప్రమాణంబులౌ.

సీ. బయలు నీయందు సంభవ మైనకతమునఁ
దోయజేక్షణ! యనంతుండ వైతి,
పృథివి నీవు సముద్ధరించినకతమున
దానవదమన! భూధరుఁడ వైతి,
వుదకస్వరూపమై యుండెడుకతమున
నుతకీర్తి! నారాయణుండ వైతి,

వఖిల తేజంబు నీయందమన్నకతమున
సర్వేశ! బ్రహ్మతేజంబ వైతి,
తే. వోలెఁ బ్రాణానిలంబ వై యున్నకతనఁ
బుండరీకాక్ష! సర్వాత్మకుండ వైతి!
ప్రకృతిరత్నావిచక్షణ! పరమపురుష!
నిరుపమానంద! సర్వంబు నీవ తలఁప. 14
తే. పంచభూతాత్మకంబు లై పద్మజాండ
మండలంబులు నీమహామాయయందు
నుద్భవించుచు డిందుచు నుండు సలిల
పూరమున బుద్బుదంబులుఁ బోలె నండ్రు. 15
సీ. నీవచఃకలనలు నిగమాదివిద్యలు,
జగములు నీయింద్రజాలలీల,
ద్వాదశాదిత్యులు, దహనుండు, శశి, ప్రజా
పతులు, రుద్రులు, సురల్, పవనవసువు
లాదిగాఁ గల దివ్యు లందఱు సృష్టిబీ
జాత్మకు లగుచు నీయంద పొడము
చుంద్రు, నాశముఁ బొందుచుం; బ్రచ్యుతఖ్యాతి
నీయంద వర్తించు నిక్కువంబు
తే. కాలచక్రంబు నీకేళికల్పనంబు
పరమకూటస్థుఁడవు పరబ్రహ్మతేజ
మై వెలింగెదు తత్త్వంబు నరయ నీవ
యంతయును బరమాత్మ నీ వరసి చూడ. 16

—•{ బ్రహ్మకు విష్ణుమూర్తి ప్రత్యక్షమై సృష్టిసాధనములఁ బ్రసాదించుట. }•—

వ. అని బహు ప్రకారంబులఁ బ్రశంసించు విరించికిఁ బ్రసన్నుం డై. వెన్నుండు జగంబులు నిర్మించుతలంపున ననేకవిద్యారహస్యంబు లుపదేశించి సృష్టిరచనాచాతుర్యంబును వాక్సిద్ధియుఁ గామరూపకామసంచారప్రభావంబులు ననుగ్రహించి తద్వచనానురూపంబుగ మాయ సంఘటించి యంతర్హితుం డయ్యెఁ; దదనంతరంబ. 17

క. హరి నిర్దిష్ట వివేక
స్ఫురణంబున గోచరించె భువనవిరచనా
పరిబోధము బ్రహ్మకుఁ ద
ద్గురువిద్యావిభవ మాత్మఁ గొనసాగంగన్. 18

వ. ఇట్లు పరిబుద్ధుండై విద్యానాథుండు. 19

క. కోటీరదివ్యతేజము
దీటుకొనం జేసి యాత్మతేజోంశమునన్
హాటకమయాండ మొక్కటి
పాటించి యొనర్చి నీటిపైఁ దేలించెన్. 20

క. లోపల బయలై బరిణియ
రూపునఁ గర్పరము నాఁగ రూఢం బగుచున్
వ్యాపింపఁ దొడఁగె సంబుధి
లోపల నది పరపు లేక లోలోర్ములమై. 21

క. అంతర్గతుఁడై యపుడు త
దంతరమున నిలిపెఁ జదల ననిలంబు, నభ
స్స్వాంతువలన నగ్ని, శిఖా
వంతువలన జలము, కుశమువలనఁ బృథివియున్. 22

క. పై సప్తావరణంబులు
భాసిల్లఁగఁ జేసె ననల పవమాన పయో
భూ సురవర్త్మాదులచే
నా సరసిజసంభవుఁడు తదండంబునకున్. 23

వ. ఇట్లు సృజియించి సకల భువనధురంధర యగు నివ్వసుంధరం దిరంబుగాఁ దద్బ్రహ్మాండంబుక్రిందికర్పరంబున నాలుగంచులు మోవ హత్తించి, బహుకోటియోజన విస్తీర్ణం బగు నందుఁ గొంతభాగంబుఁ గడపలచేసి, నట్టనడుమ నాలవాలంబుచందంబుగాఁ జక్రవాళంబు నిలిపి, తన్మధ్యప్రదేశంబున మేరుశైలంబు సంస్థాపించి, నెండియు, వెండికొండ మొదలైన కొండలు పెక్కులుగల్పించి, దిశాష్టకం బేర్పరించి యయ్యష్టదిక్కోణంబుల నైరావతాది వేదండాష్టకంబుఁ బ్రతిష్ఠించి యంతర్ద్వీపంబులతో నుదన్వంతంబులు సంతరించి యివ్విధంబునం బదిలం బైనమహీమండలంబు మొదలుగా నధోభువనంబు లేడును నిర్మించి. 24

క. పదునాలుగు లోకంబులు
నదనున వెలిఁగింప వేయి యంశువులకు నా

స్పదముగఁ ద్రిగుణాత్మకుఁ డెం
పొదవఁగఁ బుట్టించె నినుని నురుతేజమునన్. 25

తే. క్రిందిభువనంబు లేడింటి నంది వెలుఁగ
మీఁది భువనంబు లేడింటి నూఁది వెలుఁగ
వేయివెలుఁగుల సూర్యనారాయణుండు
చక్రవాళాద్రిపై మింటఁ జాగుచుండె. 26

క. అవధిగిరిమధ్యభూమిన
రవిమండల దివ్యదీప్తి రంజన; మవలం
దు విజృంభింపదు; తిమిరం
బవిరళమై యుండుఁ గజ్జలాకారమునన్. 27

తే. మేదినీకాంతముత్యాలమేలుకట్టు
మాడ్కిఁ జూపట్టునక్షత్రమండలంబు
గగనమున నిల్పి వెండియుఁ దగినచోట్లఁ
బెక్కు దివ్యాలయములు దీపింపఁజేసె.

క. ఈరేడులోకములఁ బరి
పూరితముగ జంతుచయముఁ బుట్టించె సురేం
ద్రారి నర పన్నగాదిక
మాహూతిగ నుచితకులగుణాకారములన్. 29

మ. తగులోకంబులుఁ దద్విశేషవిహితస్థానంబులుం, దత్కులా
నుగుణవ్యాప్తులు జంతుసంతతులకున్ రూపించి,తన్నాకమున్
మగుడంబుట్టువుఁబృథ్విలోఁగలుగసంభావించెఁ గాలంబుతోఁ
దెగుఁ దత్కాల మహర్నిశాబ్దగతి నాదిత్యప్రచారంబులన్.

క. అన్నిటికి నూర్ధ్వలోకం
బన్నలువకు నిలయ మయ్యె, హరియును మాయా
భ్యున్నతతేజోమూర్తుల
వన్నెగ విహరించెఁ జెక్కు వసతులయందున్. 31

క. హరియంశభేద మగు శం
కరుఁ డాత్మారాముఁ డగుచుఁ గైలాసమహా
గిరిశృంగాగ్రమునందుం
బరమచిదానందకేళిపదమున నుండెన్. 32

సీ. మనువు, లింద్రాదిదిఙ్మండలాధీశ్వరు,
లాశ్వినేయులు, రుద్రు, లమరవరులు,
వసువులు, మునులు, రాక్షసులు, గంధర్వులు,
మానవుల్, మొదలైన జ్ఞానవిదులు
ఖగ మృగ పశు కీటకప్రాణు లైన య
ల్పజ్ఞానజీవులు, పర్వ తావ
నీజాత గుల్మలతాజాతు లైన య
జ్ఞానిగణంబులు సంక్రమింప

తే. విష్ణుమాయా పరిభ్రమ ద్వీపుల కాల
చక్ర విభ్రాంత మగుచుండె సకల జగము
బహుళ బహువిధ సంపత్ప్రభావ విలస
నముల నభివృద్ధిఁ బొందుచు నరవరేణ్య ! 33

వ. ఇవ్విధంబునం బ్రభవించిన నిఖిల ప్రాణిగణంబులును సత్త్వ

రజస్తమో గుణసంజాత శమ దయాహంకార దుర్మానమోహ-
మాత్సర్యాదుల ననుసరించుచుఁ బ్రవర్తించుచుండు. 34

చ. తముఁ గడుముంచుకొన్న పటుతామసరాజసవృత్తిఁ బూనువా
రమిత మహోగ్రహాస్ఫురదహంకరణాదులఁ బాపకారులై
శమకరుణాప్రమోదములు చాలక వైష్ణవమాయచేత దు
ర్దమభవపంకమగ్నులయి క్రాలుదు రుత్కటదుఃఖదుర్మతిన్.

చ. సుమహిత సాత్త్వికోదయ విశుద్ధమతు ల్వినయప్రకాశితో
త్తమకరుణాశమంబులు నుదార వివేకముఁ గల్గి మోహసం
తమస విదూరులై హరిపదస్థిర చిన్మయసౌఖ్యలీలలం
బ్రమదము నొందుచుండ్రు బహుభంగుల సత్పురుషుల్
నుతింపఁగన్. 36

క. కావున రాజసతామస
భావంబులఁ బొరలఁబడక పటుసాత్త్వికసం
భావితు లై సత్పురుషులు
సేవింపఁగ మెలఁగుదురు విశేషవిధిజ్ఞుల్. 37

—◆ బ్రహ్మదేవుఁడు రాజసగుణముచే గర్వించుట. ◆—

క. రాజసగుణ కలితుండై
రాజీవభవుం డహంకరణ పరిణతుఁడై
తేజముఁ జూపుచుఁ ద్రిభువన
పూజితుఁడై ప్రాభవంబు పొదలఁగ నుండెన్. 38

వ. ఇవ్విధంబున మహారాజసంబున లోకేశ్వరత్వం బవలంబించి,

శా. తానే బ్రహ్మను,బద్మజాండముస్వజాతంబాటఁ దానొక్కఁడే
కా నన్యం బిఁక నొండులే దనుచు సంకల్పించి యాత్రష్ట దు
ర్మాన శ్రీ నసలారె వైష్ణవమహామాయాకృతాజ్ఞానసాం
డానీకంబు లనేకముల్ మఱియు నయ్యోచోట్ల వర్తింపఁగన్.
క. ఆ పరమేశ్వరు మాయా
రూపంబు జగంబు, తదనురూపంబుగ ను
ద్దీపించితిఁ దా ననక, త
దాపిహిత నిజ ప్రబోధుఁడై విధి మఱియున్. 40
వ. ఒక్కనాఁడు సత్యలోకంబునందు నెనమండ్రు బ్రహ్మలును, మహామునులును, మనువులుఁ, బురందరాది బృందారక సందోహంబులును, యక్ష రాక్షస గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధ రాప్సరోవ్రాతంబులును, జంద్ర సూర్యగ్రహ తారకాసరిత్సాగర పర్వతాదులుం *బ్రవేశించి బహువిధ సేవాయత్తంబులగు చిత్తంబుల మొత్తంబులై కొలువ నలువ కొలువునఁ గూర్చుండె. 41
సీ. నాలుగువిధముల లీలాభినయములు
పొసఁగ నాడెదు నప్సరసలయొఱపు
సప్తస్వరములు మించ విపంచికలు మీటి
పాడెదు గంధర్వపతులమేలు
వేణునాదామృతవీచీపరంపర
నలరించు నాగకన్యకలచెలువు

* బరివేష్టించి.—పాఠాం.

లలితేంద్రజాల విద్యలు చూపి మెప్పించు
సిద్ధవిద్యాధర శ్రేణినేర్పు
తే. "బ్రహ్మపురుష! సరస్వతీప్రాణనాథ!
సర్వలోకేశ! సర్వరక్షాధురీణ!"
యనుచు వినుతించు దివ్యజయారవంబు
నవధరించుచు సంతోష మావటించి. 42
క. తన సృజియించిన యింద్రా
ద్యనిమిషముఖదివ్యకోటు లవ్విధమునఁ దన్
గొనియాడుచుఁ బూజింపన్
ఘనరాజసమహిమ వెలయఁగా నిట్లనియెన్. 43
క. నాయంత వేల్పు గలఁడే
యేయెడల జగత్ప్రపంచ మి ట్లొనరింపన్?
బాయక నడుపఁగఁ? ద్రిభువన
నాయకుఁడై బ్రహ్మపదమునన్ వర్తింపన్? 44
క. నాకంటె నధికుఁ డొక్కఁడు
లోకంబుల లేఁడు దివిజలోకములోనన్;
నాకల్పించినయవె యీ
ల్లోకంబులు! నధికుఁ డింకెులోనం గలఁడే? 45
ఉ. తానె త్రిలోకనాయకుఁడఁ దానె జగద్రచనాధురీణుఁడం
దానె జగత్ప్రపోషకుఁడఁ దానె జగత్పరిహర్తఁ బూజ్యుఁడం
దానె సమస్తదివ్యులకుఁ దాపసులార! మునీంద్రులార! యో
దానవులార! న న్నుపరదైవముగా భజియించుచుండుఁడీ! 46

క. పదునాలుగు లోకంబుల
పదముల మిముఁ బుచ్చునట్టి ప్రభువను నే నై
యొదవుచు సకలైశ్వర్య
ప్రదుఁడు స్వతంత్రుండు నాఁగఁ బరఁగుదు నెందున్. 47

ఆ. ఇంద్రియముల గెల్చి యెక్కటి నిర్విఘ్న
యోగచిత్సుఖామృతోపయోగి
యై యదృచ్ఛఁ దిరుగునట్టి యోగీంద్రుండు
నరయ నేన కాని యొరుఁడు లేఁడు. 48

క. ఎన్నఁడు నొండు దలంపక
నన్న పరబ్రహ్మ మని మనంబున నిడి య
త్యున్నతిఁ దపములు సేయుచు
నున్న వివేకులకుఁ గలుగు నురుశుభపదముల్.

చ. అని తనుఁ దానె చెప్పుకొని హర్షసుధారసవారిరాశిలో
ననయము నోలలాడు హృదయంబునఁ దా నసలారుచున్నయ
వ్వనరుహసంభవున్ భువనవందితు నుత్కట దివ్యతేజునిం
గనుఁగొని ప్రాంజలుల్ దనరఁగా సురలోలి నుతించి రొక్కటన్.

—•{ బ్రహ్మలు, దేవతలు మొదలయినవారు బ్రహ్మను స్తోత్రము సేయుట. }•—

సీ. బ్రహ్మ లయ్యోనమంత్రము పరమార్థ మని పల్కి,
రిదమిత్థ మనియె మహానందగణము,
లింద్రాదిదిక్పాలు రీలాగె యౌ నని,
రాదిత్యు లిది నిశ్చయంబ యనిరి,

తప్ప దీమా టని దానవు లాడిరి,
కల్ల గా దనిరె యక్షవ్రజంబు,
సత్యోక్తి యనిరి నిర్జరసమూహంబులు,
గంధర్వపతులు నిక్కంబ యనిరి,

తే. యాశ్వినేయులు, మనువులు నాదియైన
వారు నట్లనె యనిరి దుర్వారఫణితిఁ
దన్మహాఘోష మపుడు మంథానమథన
సమయసాగర ఘుమఘుమస్వనము గెలిచె. 51

క. వనజభవు నంతవాఁడును
ఘన వైష్ణవమాయ కొలఁది గానఁ డటన్నం
గనునే మున్ తేఁడు నీళ్లను
మునుఁగుచుఁ గాఱుపు లఱచు మూఢుం డొందున్? 52

—♦ మార్కండేయ మహాముని బ్రహ్మ నాక్షేపించి పలుకుట ♦—

వ. ఇవ్విధంబున విధాత జగదేకాధిపత్యంబు వహించి యాత్మ స్తుతి చేసికొనిన నాలించి సింహగర్జనుం బ్రతిధ్వను లిచ్చు గిరి మహాగర్భంబులుంబోలె తదనురూపంబుగఁ గంఠఘోష ణంబుగా నుద్ఘోషించుచు నవ్విరించిం బ్రస్తుతించు విజ్ఞాన విహీనుల దేవదానవాది దివ్యయోనులం జూచి సహింపక లేచి మార్కండేయమహామునీంద్రుండు బ్రహ్మదండంబునుం బోనిదోర్దండం బెత్తి యందఱం గలయ వారించి ప్రజాపతి నవలోకించి. 53

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్యలు మూర్తి వహించి పల్కెడున్
సాదరతం బ్రమాణముగ నన్న క్రియం బరమాద్భుతంబుగా
నాదిమునీంద్రముఖ్యుఁడు చిరాయురుపేతుఁడు పూని పల్కె నం
భోద గభీరనాదమున మోహాపరీతుని నబ్జజాతునిన్. 55

మ. పరదైవంబును, బ్రహ్మయోగియుఁ, బరబ్రహ్మైకతేజంబునుం,
బురుషుండున్, భువనైకనాయకుఁడు, నంభోజాసనాండావలీ
పరినిర్మాతయు, హర్తయు, న్వరదుఁడున్ భావింప విష్ణుండ వై
పరఁగ, న్నిన్ను నుతించుకొన్న, సుమతుల్పాటింతురే పద్మజా!

ఆ. నిన్న గాదు మున్న నీవు జనించుట
నిపుడె సంభవించె నీజగంబు!
నపుడె ప్రభుఁడ వైతి! వకట! మహాప్రభుం
డైన విష్ణుఁ డుంట యరయవైతి! 57

క. నారాయణ నాభీసర
సీరుహమున సుకృతఫలవిశేషంబునఁ బెం
పారఁగఁ బుట్టుట మఱచితి
వే! రాజస మేల మఱవనీ దెల్లినన్! 58

వ. పూర్వజన్మ సహస్రంబుల నేలాగుతపంబు లాచరించితివో
తత్ఫల పరిపాకంబునఁ బరమపురుషుం డైన పద్మనాభుని
నాభీపద్మంబున నుద్భవించి పద్మసంభవుం డను ప్రధాన
నామంబు వహించి యమ్మహాత్ముని ప్రసాదంబున జగంబును
సృజియించి స్రష్ట వై పర్యాయంబున బ్రహ్మాదినామంబులఁ
బ్రసిద్ధుండ వై ప్రభావంబు వడసితివి. ఈమేలు ప్రకటించిన

బ్రహ్మణ్యదైవంబును, బ్రహ్మాండనాయకుండును, బ్రహ్మయోగియుఁ, బరబ్రహ్మంబును, బ్రకృతిపురుషాధీశ్వరుండును, గాలాతీతుండును, గాలస్వరూపుండును, నిత్యుండును, సర్వవ్యాపకుండును, సకలజగత్సృష్టి కర్మకుండును, విష్ణుండ యని తగిన ధీమంతులఁ బ్రబోధించుచు, స్వామిభృత్యన్యాయంబున నద్దేవుని సేవించుచుండక, దురభిమానంబున నజ్ఞుండవై నేనే దైవంబ నని యాడుకొనుట దగునే యని పలికిన, నప్పలుకులు క్రోధోద్బోధకంబులైన నిర్వేదించి (విరించి) యాసత్యసంధునితో నిట్లనియె. 59

—◆ బ్రహ్మ విష్ణుమూర్తి నాక్షేపించుట ◆—

చ. హరి పరమాత్ముఁడుం బ్రభుఁడు నయ్యెనయేని జగంబు
తానె పెంపరుదుగ సంఘటింపవల దంటివె? నావలె సర్వ
పూజ్యమై। పరఁగెదు బ్రహ్మపట్టమున భాసిలుచున్ సక
లైకసేవ్యుఁడై। యురువిభవాన్వితుం డగుచు నుండక యూ
రకయుండ నేఁటికిన్? 60

ఆ. అతనినాభియందు నవతరించిన మాత్ర
నంయమీంద్ర! పౌరుషంబు చెడెనె?
స్థాన మొకటి లేక జనియించునే యెద్ది*
యైన? దాని కేమి? యవల వినుము! 61

సీ. ఉదయింపఁడే సూర్యుఁ డుదయాద్రి? నుదయాద్రి
కంటెఁ †దేజస్వియై కానఁబడఁడె?

---

* ఎట్టిదైన—పాఠాం. † తేజంబుగా—పాఠాం.

పరిభవింపఁడే వహ్ని పాదపంబునఁ? బాద
పముకంటెఁ బరిభవాస్పదము గాఁడె?
యంకురింపదె ముత్తియము చిప్ప? నాచిప్ప
కంటె సత్కాంతిసంగతము గాదె?
యుద్భవింపదె ఫల మొక్కగిఁ బుష్పమునఁ? బుష్ప
మునకంటె నుపయోగ్య మనఁగఁబడదె?
తే. జనన మందదె కర్పూర మనఁటి? ననఁటి
కంటె నిఖిలైకయోగ్యమై గడలుకొనదె?
యట్ల యేనును హరియందు నవతరించి
యంతకంటెను బూజ్యుండ నైతి వినుము! 62
క. నే జనియించినకతమున
నీజగములు గలిగెఁ గాక! యిన్నాళ్ల య్యం
భోజాత్ముఁడు సృజియింపఁ బరి
యోజకుఁ డగునేని యూరకుండునె చెపుమా! 63
క. నాకల్పించిన లోకము
గాక జనార్దనుఁడు వేఱె కల్పించిన యా
లోకము గల్గినఁ జెప్పుము
నీకన్నది గలిగె నేని నిఖిలము నెఱుఁగన్! 64
ఉ. ఈమును లీమరుద్గణము లీదనుజుల్ విని యూరకుండఁగా,
నే మని మించి పల్కితివు లీసభలోపలఁ బద్మనాభు పైఁ
బ్రేమవహించి నాకు నొకపిన్నతనంబుగ నీవు పెద్దవై?
యామెయి నీకుబంటితెలి విక్కడ నేరికి లేకపోయెనే? 65

ఉ. "ఆరయ లోకనాథుఁడు! సురాసురపూజ్యుఁడు! కర్త! యీ
విధిం। జీరికి నైన గైకొనక చెల్లునె యీక్రియ దేవకోటిలో
నూరక నోటిక్రొవ్విన దురుక్తులు పల్కఁగ?" నంచు నుం
డఁగా! నేరక ధిక్కరించితివి! నిన్నిఁక నే మన? వృద్ధతాపసా!

ఆ. అనిన మందహాస మాదంద రోచులఁ
జంద్రికామయూఖసదృశ మగుచు,
రత్నదర్పణాభిరామసముద్దామ
మృదుకపోలరుచికి మెఱుఁగు గాఁగ. 67

మ. అర్కోదగ్రరుచిప్రకాశుఁడు ప్రభావాఢ్యుండు వేదార్థసం
పర్కప్రస్ఫుటసత్యవాక్యుఁడు మహాప్రామాణికశ్రేష్ఠుఁ డా
మార్కండేయమహామునీశ్వరుఁడు పద్మప్రోద్భవు, న్మాథతా
కార్కశ్యం బెడలింపఁ గోరి, పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్.

—♦ మార్కండేయుండు బ్రహ్మతో విష్ణుప్రభావమునుగూర్చి చెప్పుట ♦—

తే. హస్తిమశకాంతరము సహస్రాంతరంబు
విష్ణునకు నీకు, నిట్లు భావింపలేక
పలికితివి; నీవు, నీబ్రహ్మపదము నెంత
యతని దాసానుదాసుని ప్రతికి రావు. 69

ఉ. అక్కట! కన్నులారఁ గనియైన నెఱుంగవు, రాజసంబు పెం
పెక్కఁగ, వేద మేది నుతియించెదుఁ జూడవె? తద్రహస్య
మున్। న్యక్కృత మయ్యె నీకతన నల్పవిచారుఁడ వౌటఁ

జేసి, నీ। వెక్కడ? విష్ణుఁ డెక్కడ? సహింతురె యార్యు లన
ర్హవాక్యముల్? 70

క. ఎన్న నినుబోఁటి బ్రహ్మలు
వెన్నునినాభీసరోజ వివరమునం దు
త్పన్ను లయి పద్మజాండము
లెన్నన్నో సృజించుచుందు రీచందమునన్. 71

క. నా సంభవించినది మొద
లీనందునఁ జేనిరి బ్రహ్మ లిరువురు విను! ప
ద్మాసన! తద్భువనద్వయ
మానరసిజనాభమూర్తియందున డిందెన్. 72

వ. చిన్మయమూర్తి యగు నమ్మహాపురుషునియందుఁ బ్రాణి
గణసంకీర్ణంబు లగు బ్రహ్మాండంబులు సర్వతోముఖంబులు
తండోపతండంబులై మొండుకొని జంతుజాలంబులుంబోలె
నావిర్భవించుచుం గాలపరిపాకంబున భగ్నంబులై పోవు
చుండుఁ, గొన్ని బ్రహ్మాండంబులు గగనంబున నక్షత్రంబు
లుంబోలె దృశ్యాదృశ్యంబులై యుండు, నొక్కవేళ నమ్మహా
మాయానాటకుండు తనమాయవలన లోకంబులకుఁ బ్రళయ
దశలు గల్పించి వినోదలీలకై నినుబోఁటి బ్రహ్మలం
బెక్కండ్రిం బుట్టించి, (వారు), పడుచులు బొమ్మరిండ్లు
గట్టుకొని యాడునట్లు, తన్మ్రోల *నిటువంటి జగంబులు

* నిలువ నీవంటి—పాఠాం.

పన్నుకొని యాడుచున్న, వారిలో నొక్కండై తిరుగు
చుండు నతనిదివ్యప్రభావంబు లనేకవిధవిచిత్రకారణంబులు.

క. తన కపటకృత్య మఖిలము
ననక, జనుల్ బ్రహ్మసృష్టి యని భ్రమయుటకై
నినుఁ గని నీచే జగములు
జనియింపఁగఁజేసె హరి; విచారింపు! తగన్. 74

ఆ. విష్ణుమాయ గాఁగ వివరింపుదురు మహా
సూక్ష్మమతులు జగము; స్థూలమతులు
బ్రహ్మసృష్టి గాఁగ భావింతురు; కొంద ఱె
ద్దియును నెఱుకపడక తిరుగుచుంద్రు. 75

ఆ. హరికి, సృష్టికర్త వై జనించుటఁజేసి
యధిక దివ్యతేజ మడరె నీకు
నస్మదాది దివిజు లర్చింప వెలసితి
వింతవట్టు చాలదే? మహాత్మ! 76

—◆{ వటపత్రశయనుఁడైన విష్ణుమూర్తికి మార్కండేయు
నకును జరిగిన సంభాషణము. }◆—

వ. ఇంక నొక్కరహస్యంబు వినుము. 77

తే. నీవు పుట్టకమున్న మున్నీటిమీఁద
బాలవట పల్లవంబున బాలమూర్తి
నొంటిఁ బవళించి హరి దివ్యయోగలీలఁ
దన్నుఁ దా నాత్మ భావించు చున్నవేళ. 78

సీ. నే నొక్కరుండ మున్నీటిలోఁ దో డెవ్వ
రును లేక చీకాకు గొనుచు నీట
నీఁదుచు మునుఁగుచు నెగయుచు గగ్గోలు
పడి మొరటిల్లుచు బ్రమసి విభుని
శివుని సంతతముఁ బూజింతు, నా దేవుఁ డె
య్యెడ డాఁగియున్నాఁడొ యింక నెట్లు?
సచరాచరంబులై జగములు పొలిసిన,
యీవేళ నాకు దిక్కెవ్వ రిందు?
తే. నెచట నా దేవుఁ గనుఁగొందు? నేమి సేయు
వాఁడ నని క్రిమ్మరుచు నొక్కవలన, మాయ
నట్లు శైశవలీలావిహారరసిక
మానసంబు చిదానంద మందిరముగ. 79

సీ. పరిలసత్స్ఫురత్ప్రభోత్కరరత్నమునుబోలెఁ
గ్రొమ్మెఱుంగులు గిఱికొనెడువాని
నీటఁ దోఁగుచు నిగనిగ మను చిగురు మ
ఱ్ఱాకు పానుపున సొంపారువాని
మంజీరమేఖలామణిమయ గ్రైవేయ
మకరకుండలదీప్తి మలయువాని
వెలిదమ్మిరేకుచూపులఁ జిన్ని నవ్వుల
లేఁత వెన్నెలఁ బుక్కిలించువాని
తే. బాలుఁ డయ్యును బ్రౌఢితోఁ బరఁగువాని
గోచరించియు బ్రహ్మమై తోఁచువాని

సృష్టి లీలాత్మకుండయి వెలఁగువాని
విపుల మాయాచరిష్ణు నవ్విష్ణుఁ గంటి. 80

వ. కని జగత్ప్రళయంబై మిన్ను మోచియున్న యిమ్మున్నీటి మీఁదఁ దేలియాడు ముద్దుగద్దఱి బాలుం డెవ్వఁడో యాశ్చర్యంబై యున్నది! కపటబాలుండై వర్తించు నొక్క దివ్య పురుషుండు గాఁబోలు! నితనిచందంబుఁ గంద మని డాయం బోయి "సకలశూన్యంబైన చీఁకటిం గవిసియున్న పెంపైటి నీటిమీఁద నొక్కరుండవు వెఱపులేక యున్న వాఁడ వన్నా! నీ వెక్కడి పిన్న పాపఁడవు? నీవిధం బెఱింగించి నన్ను నూఱడింపుము. చేరుగడ లేక యున్నవాఁడఁ, జంద్రశేఖరుం డెచ్చట నున్నవాఁడు, నీ వెఱుంగుదువే?" యనిన నిందులో నున్నవాఁడు పోయి చూడు మని నోరు దెఱచిన నేను గిరిగుహా గర్భంబునుంబోని తదభ్యంతరంబు ప్రవేశించి యందుఁ జంద్ర సూర్య గ్రహ నక్షత్ర సరి త్సాగర పర్వత వన పవన దహన విలసితంబులును, బ్రహ్మాది దేవ దానవ మానవ ప్రభృతి జంతుకోటి సమ్మర్దంబులును, మహోత్సవాడంబరాభి రామంబులు నగు చతుర్దశభువనంబులు గాన వచ్చిన విస్మయం బంది కామసంచారంబున సకలంబును గలయఁ గుమ్మరి యొక్కచోటఁ గైలాసవాసుం డగు నిందుధరుని సందర్శించి యారాధించి తత్ప్రసాదంబు వడసి, యచట నుండక వెండియుఁ గొంతతడవునకుఁ దద్వదన ద్వారంబున మగిడి వెడలి చూచునప్పు డప్పుండరీకాక్షుండు

వైకుంఠ దివ్యభవన శేషపర్యంకంబున, లక్ష్మీసమేతుండై దివ్యాంబరాభరణగంధమాల్యాలంకృతుండును శంఖ చక్ర గదా పద్మ శోభితుండును మధురమందస్మిత సుధాధారాభిషిక్త లోచనుండును నగుచు నానందించుచున్నలాగు కన్నులకు వెక్కసంబుగాఁ జూచి నలుదిక్కులు ప్రతీక్షించు నప్పుడు నీవు గల్పించిన యీప్రపంచంబు గానవచ్చిన నచ్చెరువంది, యీపరమానందస్వరూపంబునకు నభివందన సహస్రంబులు సమర్పించి, యుదంచితరోమాంచ కంచుకిత దేహుండనై యానందాశ్రు కణంబు లురలం గరంబులు మోడ్చి. 81

క. ఓ దివ్యపురుష! యో కరు
ణోదధి! యో దేవదేవ! యో జనక! భవ
త్పాదారాధన యోగ్యుని
గా దృష్టింపనె మహాత్మ! కమలదళాక్షా! 82

చ. తనరు పురాణసంహితలతావలముం దగ మెట్టి శాస్త్రపుం
బెనుఁదలుపు ల్వడిం దెఱచి పెంపున నాగమసౌధమెక్కి యం
దనుపమయోగపీఠమున నంచితలీల వెలుంగుచుండు నిన్
గనుఘనయోగిపుంగవులకంటె సుఖస్థితి నిట్లు గాంచితిన్. 83

వ. అని నా నేర్చినట్లు వాక్పుష్పాంజలులు సమర్పించినం గనుంగొని నైకొని (యీగోవిందుండు) మందస్మితంబు నిగుడ, మునీంద్రా! చంద్రశేఖరుం జూచితివే? యనిన విని, యంజలి బంధంబుతో, మహాపురుషా! చంద్రశేఖరుండయననేల? విశ్వ

ప్రపంచంబంతయు ననంతవిలాసంబులోఁ జూచితి. దేవరదివ్య ప్రభావంబుచూడ నేనెంతవాఁడ నని నమస్కరించిన, నీవు వీరశైవుండవు, నాయంశభేదం బగు శివునియంద భక్తి సలుపు మది మదీయహితప్రవర్తనం బని కరుణించె. నాఁట నుండియు మృత్యుంజయుని సేవించుచుఁ దదీయవరప్రసాదసామర్థ్యంబున మృత్యువు గెలిచినవాఁడఁ గావున లోకంబున నద్దేవదేవుని మాయలు కొన్నికొన్ని యెఱుఁగుచు నిటువంటి మహాత్త్వంబులు చూచుచు నిట్లున్నవాఁడ నివి నా చూచిన యర్థంబులు. తన్మాయాప్రభావంబు విజ్ఞానహీనులకుఁ దెలియనరిది. తనయందు భక్తి నల్పిన మహాత్ములకు మాయావిధానంబు చూపి తుదిం బరమసాయుజ్యంబునం గలుపుకొను నింక నొక్క యితిహాసంబు చెప్పెద. 84

— పుండరీకునికథ —

క. విను మును మధురాపురమున
ఘనుఁడు మహాభాగవతుఁడు గలఁ డతఁడు జగ
ద్వినుతుండు పుండరీకుం
డనువిప్రుఁడు సహజసాత్త్వికాచారుఁ డిలన్. 85

క. సావిత్రి యతని యంగన
సావిత్రికి సాటివచ్చు సాధ్వీతిలకం
బావెలఁదితోడ నాతఁడు
శ్రీవిలసితుఁ డైన హరిచరిత్రము నొందెన్. 86

సీ. శాంతిసద్వృత్తులు సవతుగా నవరించుఁ
గారుణ్యసౌజన్య కలితుఁ డగుచుఁ
గర్మధర్మంబులఁ గవగాఁగ నలరించు
నన్వయాచారనయజ్ఞుఁ డగుచు
సత్యశీలంబులు సమముగా నవరించు
మితభాషణార్జవమిళితుఁ డగుచు
శ్రుతివాక్ప్రబోధముల్ ప్రీతిగాఁగ నొనరించుఁ
బ్రీతిభా విరక్తి సంపన్నుఁ డగుచు
తే. ఫాలమున గోపిచందనప్రభయు నలుత
జలరుహాక్షసరోజంబులు శ్రవణవీథిఁ
దులసిమంజరియును బలుకుల రమేశు
కీర్తనము నొప్ప వెలయు నా కీర్తిధనుఁడు. 87

సీ. ప్రాణంబుకంటెను బరమహితంబుగాఁ
బాటించు నేప్రొద్దుఁ బద్మనాభు
నాత్మనేపథ్య క్రియలకంటె సంప్రీతి
విష్ణుపూజలు గడు విస్తరించు
నిల్లాలికంటెను నుల్లంబునకుఁ గడు
నింపుగా హరిభక్తి నిరవుకొల్పు
లలిత పుత్రోపలాలనకంటె వైష్ణవ
ధర్మమార్గసపర్య కూర్మి నడుపు
తే. వేదపఠనంబుకంటెఁ బవిత్ర మనుచు
హరికథా తత్పరుం డగు యజ్ఞఫలము

కంటె ఫల మని తద్వ్రతక్రమము సలుపుఁ
బుండరీకుండు సుజనసంపూజ్యుఁ డగుచు. 88

క. ధీమహితుఁ డతఁడు సాల
గ్రామ శిలాతలమునందుఁ గమలాక్షు రమా
రాముని నర్చించు మన
స్తామరసమునందుఁబోలెఁ దద్దయు భక్తిన్. 89

—◆{ పుండరీకునియొద్దకు నారదముని వచ్చి విష్ణుభక్తి ప్రభావము చెప్పుట. }◆—

వ. ఇవ్విధంబున ననుకూలదాంపత్య సౌభాగ్యంబును సాధుబుధ సేవ్యమాన నిజకులోచిత వ్యాపారంబును, విష్ణుభక్తియుఁ నంతకంతకుం గొనసాగ, నాగమజ్ఞుం డగు నమ్మహాను భావుం డొక్కనాఁడు స్వసమారోపిత తులసీకాననంబున యమునాతీరంబునఁ బిప్పల తరుచ్ఛాయ శీతల ప్రదేశంబున నిష్ఠాగరిష్ఠుం డై సాలగ్రామ శిలార్చనం బొనర్చు వేళ యదృచ్ఛాగతుం డైన నారదునిం బూజింప నతం డతని శుద్ధసాత్త్విక ధర్మంబునకు సంతోషించి యిట్లనియె. 90

ఉ. ఆరయ వేషభాషలు క్రియల్ మనమున్ సరియైన సద్గుణో
దారుఁడుగల్గుటచ్చెరువు ధారణి; నేఁడిదె చూడఁగంటిఁ బెం
పారఁగ వేషభాషలు క్రియల్ మనమున్ సరియైన సద్గుణో
దారుని వైష్ణవోత్తముని ధన్యుని నిన్ను మహీసురాగ్రణీ!

క. ఇదిగో! గృహస్థధర్మం,
బిదిగో! నాచారపరత, యిదిగో! ముక్తి

ప్రిదమార్గము, సాలగ్రా
మ దృవత్పూజనముఁ జూచి మది హర్షించెన్. 92

క. నీవును సాలగ్రామశి
లావాసుం డైనయట్టి లక్ష్మీవిభుఁడున్
భావింప నొక్కరూపం
బై వెలిఁగెద రేమి చెప్ప? ననఘచరిత్రా!

శా. పట్టంబట్టఁగఁ బాలు నింద్రియముల న్బంధించి వాంఛ ల్గడున్
బుట్టింపం బలు వైన తద్విషయము లొప్పం ద్రోలి దుర్మోహపుం
బట్టై యుత్కటదుఃఖదుర్గతులకుం బ్రాపైన సంసారముం
గట్టల్కం దిగఁద్రోయ కేల కలుగుం గంజాక్షపూజారతుల్?

చ. సతులు, సుతుల్, సహోదరులు, సంగడికాండ్రు, పదార్థజా
లముల్ । ప్రతిపద దుఃఖమూలములు పాపసమాచరణాను
బంధముల్ । మతిఁ బరికింప నంచు గుణమాన్యులు తత్పరి
ముక్తమోహు లై। యతులసుఖైకహేతు వగు నచ్యుతభక్తి
భజింతు రెంతయున్. 95

క. విను దీర్ఘస్వప్నము జగ
మనియుఁ బ్రపంచంబు మిథ్య యనియును సంసా
ర నిబద్ధబుద్ధి మరలిచి
నినుబోఁటులు విష్ణుభక్తి నిలుపుదు రాత్మన్. 96

ఉ. అంతయు విష్ణుమాయ జగ, మాత్మ నెఱుంగ, నసత్యలోకవి
భ్రాంతము లోకవర్తనము బ్రహ్మవిదు ల్గనుఁగొందు రీని న

త్యంతివివేకదృష్టిఁ గని, తద్విరతి న్నిరతంబుఁ జిత్సుఖా
నంతవిలాససిద్ధికొఱ కచ్యుతభక్తి భజింతు రెంతయున్. 97

మ. పరిబోధాంజనయుక్త చిత్తనయనప్రివ్యక్త దుష్ప్రిల్లన
ద్గురుమాయావృతచిన్నిధానమనియాద్యుల్విష్ణునింగాంచి దు
స్తరసంసారవిమోహదైన్య మెడలన్ సంతోష సంప్రాప్తిచేఁ
బరమబ్రహ్మపద ప్రకృష్ట సుఖసంపత్ప్రాప్తిఁ దా చుంద్రిలన్.

క. హరిమంత్రజపనిరూఢియు
హరిపూజాసంభ్రమంబు హరికీర్తనముం
బరమ మగు సాధనము దు
స్తరభవవిదళన మొనర్చి తత్పద మొసఁగన్. 99

క. కావున నీవును నుత్తమ
ధీవిభవము గల్గి సన్మతిన్ సాలగ్రా
మావాసుం గేశవుఁ దుల
సీవనమంజరులఁ బూజసేయుము భక్తిన్. 100

—◆ తులసీప్రభావము ◆—

ఆ. కల్పక ప్రసూన కన కారవింద మా
ణిక్యపూజనముల నెలవుకొనదు
జలజనాభు చిత్తజలజంబు తులసీ ద
ళార్చనమునఁబోలె ననఘచరిత! 101

క. తులసీకానన మెచ్చట
విలసిల్లుచునుండు నచట విష్ణుఁడు నుండున్

జలజాక్షుఁ డున్న చోటను
జలజాసన ముఖ్యదివిజసంఘము నుండున్. 102

ఆ. భక్తజనులయందుఁ బావనతులసీమ
హీజవాటియందు నెట్టివేడ్క-
(నుండు నట్టివేడ్క-) నుండఁడు హరి లక్ష్మి
యందుఁ బరమపదమునందు వినుము. 103

సీ. శ్రీతులసీమహీజాతాభిషేకంబు
పట్టాభిషేకసంపత్ప్రదంబు
శ్రీతులసీతీర్థసిద్ధరసార్ద్రిత్వ
మవభృథస్నాన పుణ్యావహంబు
శ్రీతులసీమూలమృత్తికాతిలకంబు
యమనిశాచర పరిహారరక్ష
శ్రీతులసీనమస్క్రియ బ్రహ్మహత్యాది
పాపతిరస్క్రియా ప్రౌఢముద్ర

తే. తాపహరణంబుతులసీ ప్రదక్షిణంబు
శ్రీకరము నిత్యతులసీ విలోకనంబు
వేదశాస్త్రోపనిషదర్థ విశ్రుతంబు
దీనిఫలమేమిచెప్ప? భూదేవవర్య! 104

సీ. తులసీమహీజంబు మొలవఁబెట్టినఁ గల్గు
ససముద్రభూదానసమఫలంబు
తులసీవనముదండ సలరు శ్రాద్ధంబు గ
యాశ్రాద్ధఫలదమై యతిశయిల్లు

తులసీవనంబునందు జపించుమంత్ర మొ
క్కటి కోటిమై స్వసంకల్ప మొసఁగు
తులసీవిలాసంబు గల యిల్లు కలనైన
దర్శింప భయ మందు దండధరుఁడు

తే. తులసి దురితాహితాభేద్యదుర్గభూమి
తులసి సజ్జనగృహవాటికలకుఁ దోడవు
తులసి నిత్యమహోత్సవంబులకు నెలవు
తులసి కైవల్యలక్ష్మికిఁ దోడు నీడ. 105

క. గంగాకళిందజాది త
రంగిణులం దీర్థమాడఁ బ్రాపించుఫలం
బంగీకృత మగు శ్రీతుల
సిం గరముల నంటినపుడ చింతింపఁ దగన్. 106

తే. తులసి యెన్నులనత్తావితులకు రాదు
కల్పవృక్షప్రసూన సుగంధభరము
తల్లసన్మంజరీ పూజఁ దన్నుఁ దనుపు
వారి కచ్యుతుఁ డచ్యుతావాసమొసఁగు. 107

వ. అని తులసీవనలక్ష్మిం బ్రశంసించి. 108

చ. ప్రతిదివసోపవాసములఁ బాయకఖ్రిస్సియు సత్యదానస
ద్వ్రతములఁ బెద్ద లయ్యునుదురంతతపోసలకీలఁ గ్రాఁగియున్
గ్రతు నియమార్తి గ్రమాఁగియునుఁగానరువైష్ణవదివ్యలోకవ
చ్యుతపదపంకజార్చకుల చొప్పున విప్రకులైకభూషణా!

మ. ప్రతిమాస్థండిలహృజ్జలాగ్ని రవిబింబస్థానలక్ష్యప్రకా
శితు నారాయణుఁ గొంద ఱుత్తమగుణుల్ సేవింతు రార్యుల్
ఘనుల్, ప్రతిభం గొందఱు నీవు నుంబలె నసాలగ్రామసాక్షాత్ప్రి
కా, శితు లక్ష్మీవిభుఁ బూజసేతురమృతశ్రీవాససౌఖ్యార్థులై.

—♦ సాలగ్రామ పూజా మాహాత్మ్యము. ♦—

క. ఏమిటియందును సాల
గ్రామస్థలియందుఁ బోలెఁ గమలాక్షుఁడు తే
జోమహితుఁ డగుచుఁ బూజితుఁ
డై మోక్షశ్రీ నొసంగఁ డండ్రు మహాత్ముల్. 111

శా. ఉగ్రైన స్తిమిరార్కమండలము, నిత్యోత్కృష్ట దుఃఖాటవీ
వ్యగ్రోదగ్రమహాదవాగ్ని, కుమతవ్యాపారదుర్మోహస
ర్పగ్రస్తాభయదానమానితకళాపక్షీంద్రరూపంబు, సా
లగ్రామాచ్యుతపూజనంబు సుజనాలంకారచూడామణీ !

ఆ. కీర్తనీయ వజ్రకీటవినిర్మిత
చారుచక్రసుప్రసన్నమైన
విష్ణుదివ్యమూర్తి వెలయుసాలగ్రామ
మల్పమతుల కబ్బ దర్చ లొసఁగ. 113

క. విను సాలగ్రామ శిలా
ర్చన మెవ్వఁ డొనర్చు వాని సకల పితృగణం
బును బితృలోకంబునకుం
జను యమపురినుండియైన సత్యం బనఘా. 114

ఆ. అనయకారి యైన, నఘవంతుఁ డైన, మో
హాంధకారమగ్నుఁ డైన భక్తిఁ
బూని వేడ్క నెవ్వఁడేని సాలగ్రామ
పూజసేయు నతఁడు పూజ్యతముఁడు. 115

సీ. దివ్యసాలగ్రామదేవమందిరము ప్ర
త్యక్ష వైకుంఠపుణ్యాలయంబు
దివ్యసాలగ్రామదేవోత్సవక్రీడ
త్రిభువనసామ్రాజ్యదివ్యపదవి
దివ్యసాలగ్రామదేవపూజానిష్ఠ
బ్రహ్మనిర్యాణసంపన్నలీల
దివ్యసాలగ్రామదేవతీర్థప్రసా
దములు త్రిలోకసేవ్యములు దలఁప

ఆ. నిది యెఱింగి సువ్వె యెపుడు సాలగ్రామ
పూజసేయుదురు ప్రబుద్ధమతులు,
మ్లేచ్ఛ శూద్ర కుమత తుచ్ఛ చండాల నా
స్తికులు దక్క, వినుము ధీరహృదయ! 116

—♦ హరినామకీర్తన ప్రభావము. ♦—

క. హరినామకీర్తనమునకు
నరయఁగ నేకులజు లయిన నర్హులు పూజా
పరతఁ గల పుణ్యసంపద
హరి యొసఁగుం గీర్తనీయుఁ డై వారలకున్. 117

క. విస్తారం బగుదుష్కృత
దుస్తరసంసారవార్ధితుదిఁ జేర రమే
శ స్తుతినాకాహూధుల
కస్తోకాత్మ్మలకుఁ గాక యన్యుల కగునే. 118

తే. పుత్రమిత్రకళత్రార్థ భూరివిషయ
సంకులం బగుసంసార చక్ర మెల్ల
విష్ణుమాయా మహామోహవిభ్రమంబు
దీని మదిఁ బాదుకొల్పు భూదేవవర్య! 119

తే. విష్ణుమాయాపరాధీనవిధివిధేయ
ధర్మ మల్పార్థభోగ ప్రదంబు వినుము
సర్వధర్మంబులును మాని చక్రధరుని
నాశ్రయింపుము చిత్సుఖావాప్తికొఱకు. 120

వ. అని యనేకపరమరహస్యంబు లెఱింగించి యబ్జభవనందనుం
డంతర్హితుం డయ్యె, దదనంతరంబ యమ్మహీదేవోత్తముండు
చిత్తంబున లోకోత్తరుం డగునారదమునిసత్తముని సత్యవచ
నంబులు వేదప్రమాణంబు లని యాదరించి, తొల్లింటికం
టెను బ్రతిదినప్రవర్ధమానసువ్యక్తభక్తితాత్పర్యంబులు గలిగి
సాలగ్రామవిష్ణుపూజామహోత్సవంబు లొనర్చుచుఁ దదీయ
మంత్రపరతంత్రుండును దదీయనామస్మరణపరాయణుండును
నై యనుకూలకులపాలికాసహాయుం డగుచు నిజకులోచిత
ధర్మకర్మంబులు కృష్ణార్పణ బుద్ధిం దగనఁ గొలంది విడువక
నడుపుచుం దనలోన. 121

ఉ. నారద సంయమీశ్వరుఁడు నా కుపదేశ మొనర్చె విష్ణుపూ
జా రతియుం దదీయగుణసంస్మరణ స్తవమంత్రతంత్రవి
ద్యారమణీయభంగియుఁ గృతార్థుఁడ నైతి మదీయజన్మసం
స్కార విశేషసంపద జగంబుల వర్ణన కెక్కుఁబో! యిఁకన్.
వ. అని హర్షించి వెండియు. 123
క. ఇస్సీ! సంసారం బిది
లెస్సతనం బేమియును ఫలింపక మిగులన్
నిస్సారంబై తోఁచు, మ
నస్సంకల్పములు పెక్కు నాశముఁ బొందున్. 124

—♦ విష్ణుమాయంగూర్చి పుండరీకుఁడు సందేహపడుట. ♦—

ఉ. ఆమునినేతయున్ భువనమంతయు విష్ణునిదివ్యమోహ మా
యామయమంచుఁబల్కె నిదియట్లనయయ్యెడుఁజూడఁజూడ,మి
థ్యామయతన్ నిజంబుగఁ బదార్థవిసర్జన మాచరింపఁగా
లేమిన యాతలంపును జలించెడుఁగానియొకించుకాత్మలోన్.
వ. అని కొండొక పరమార్థంబు విచారించి విష్ణుమాయా విభ్ర
మంబున నవ్విచారంబు గొనసాగింపలేక ప్రపంచం బాలో
కించి. 126
శా. ఆలుం బిడ్డలు నిండ్లు నర్థములు నన్యోన్యసంబంధాచారముల్
నాళీకాసనసృష్టికర్తృకములై నానావిధానంబులై
యాలీలం బహుకాలకముల్ గడవఁగా,నీ సర్వమున్ విష్ణుమా
యాలాస్యంబిదియాటకున్ మదికిదృష్టాంతంబునా కెట్లగున్?

శా. ఈభూమండలి యీసముద్రవలయం బీవాయు వీపావకం
బీభాస్వత్తుహినాంశుదీప్తగగనంబీజంతుసంపత్తి మా
యాభిన్నమ్ములటంటమెట్టులవిదృష్టాంతంబులై యుండఁగా?
నేభావంబున నిశ్చయింతు నొకటే నీతథ్య మిథ్యా ద్వయిన్.

క. నాయాత్మకు దృష్టాంతం
బై యుండిన దాఁక మాయ యన లే నెపుడుం
దోయజభవ కల్పిత మగు
నీయఖిలము, మాట లింక నేఁటికి వేయున్? 129

క. ఈయాలును నీబిడ్డలు
నీయిండ్లును నీ కులంబు నిట్లుండఁగ వే
తే యొక సంసారస్థితి
యై యుండిన మాయ యనఁగ నగు నఖిలంబున్. 130

వ. అని యివ్విధంబున సందేహదోలాందోళాయమాన మాన సుం డగుచుఁ గ్రమ్మఱఁ బరబ్రహ్మవేది యగు నారదమహా మునీంద్రుని సత్యోపదేశంబువలన సకలంబును విష్ణుమాయా విలసనం బని వినిన తెఱఁగు దృష్టాంతంబుగా నెఱుంగం గోరి యప్ప టప్పటికి స్వామీ! నేనీభక్తుండ, నీవు భక్తవత్సలుం డవు గావున నించుక నీమాయ చూపవలయు నని విష్ణునిం బ్రార్థించుచున్న వాఁ డై యొక్కనాఁడు పితృదివసంబున బ్రాహ్మణుల నిమంత్రణంబుచేసి, ధర్మపత్నియగు సావిత్రి కృతస్నాన యై పాకయత్నంబు నడుపుచుండఁ దదీయోచిత

ద్రవ్యంబులు సంపాదించి మధ్యాహ్న సమయంబున నదికిం బోయె. 181

ఆ. తీర్థ మాడి విధులు దీర్చి సూర్యోపాస్తిఁ
జేసి విమల పులినసీమయందుఁ
బంకజాసనమునఁ బదిలుఁడై విష్ణు నా
మత్రయము జపించి మఱియు నతఁడు. 182

క. కుందేందుధవళమూర్తిని
మందస్మితమధురవదనమండలు మాయా
సుందరు విష్ణునిఁ దనమది
సందేహనివృత్తికొఱకు స్మరియించె మదిన్. 183

వ. అంత. 184

—♦ పుండరీకుని విష్ణుమాయ యావహించుట. ♦—

తే. అన్ను నట్టినగతి, నిద్ర యలమినట్లు,
మూర్ఛ వచ్చినపగిదిఁ గన్మొగిచి చిత్త
మింద్రియవ్యాప్తి నుడిగి తదేకనిష్ఠ
నలరఁ గలవోలె హరిమాయ యాశ్రయించె. 185

తే. ప్రాణి జనియింపఁ, దొల్లింటిభవము తెలివిఁ
గప్పి, విపరీత వృత్తిమైఁ ద్రిప్పుచున్న
వినుతచారిత్ర యైన యావిష్ణుమాయ
విప్రసహజపరిశృతియును వేఱుచేసె. 186

వ. ఇట్లు పుండరీకుండును విగత విజ్ఞానుండై యుండు నవసరంబున

క. మారునిమోహన దివ్యవి
కారము స్త్రీరూప మొంది కదిసినక్రియ సొం
పారి యొక బోయగుబ్బెత
చేరువఁ గనుపట్టె విప్రుచిత్తం బలరన్. 138

సీ. పచ్చగాజులయొప్పు పచరించు చేతులు
సంకుటుంగరములచాయ లొసఁగ
నిగనిగల్ దొలఁకాడు బిగువుచన్నులమీఁద
గురివెందపూ గుబ్బసరము దనర
ధవళతాళపలాశతాటంకరుచి మించు
చెక్కులఁ జిఱునవ్వు జీరువాఱఁ
గొప్పున కందని కురుల నించుక దోఁచు
నుదుటి జేవుఱు బొట్టు కుదురు మెఱయ

తే. నన్నవలిపంపుటొల్లియ సగము గట్టి
సగము ముసుఁగిడి యొయ్యారముగ మెఱుంగుఁ
గంచుమెట్టెలు మొరయంగఁ గడఁకవచ్చు
నవ్విలాసినిఁ దగ మెచ్చె నవనిసురుఁడు. 139

క. అలీలావతివిభ్రమ
హేలాయావనగుణముల నెవ్వనితలఁ పొం
దోలింపదు ధైర్యచ్యుత
మై లోకమునందు నంగజార్తం బగుచున్ ? 140

తే. అట్లు ముందటఁ బ్రత్యక్షమైన మదన
దేవతయుఁబోలె నొప్పు నాతిఁగఁనుఁబోఁడి

మేలిమొలజవ్వనమునకు లోలుఁ డయ్యె
విగతలజ్జాభిమానుఁడై విప్రకులుఁడు. 141

క. కులశీలంబులు దలఁచునె
వలరాయనిబారిఁ బడిన వాఁడు నవీనో
జ్జ్వలయావనసంపద గల
కలికిమెఱుఁగువాలుఁగంటి కడఁ జూపట్టన్? 142

తే. దాని మదనోన్ముఖత్వంబు, దాని సొబగు,
దాని క్రొమ్మేని జిగి బిగి, దాని వయసు
మదనసామ్రాజ్యకళలట్లు మాఱుమలయఁ
జూచి పులకించె మమతలఁ జొక్కి దేర. 143

క. అది మాయావిలసన మని
మదిఁ గానకపోయెఁ గాక మఱి పాఱుఁడు దా,
నిది బోయత యనవలదే
తుది? భ్రమసినతలఁపు తెలివి దూఁకొన డెందున్. 144

—◆పుండరీకుఁడు బోయదానిని మోహించుట.◆—

వ. వెండియు. 145

ఉ. ఇయ్యెలనాఁగ యొంటిపడి యిక్కడకుం జనుదెంచెలీల,నిం
కెయ్యెడ కైనఁ బోఁగలదొ యేమయినంబనిగల్గి! యుచ్చటం
దియ్యము చూపమందునొ! మదింబరికింపఁగనంచునాత్మలో
నయ్యవనీసురుండు వెడయాసల పెల్లునఁ దల్లడిల్లఁగన్. 146

ఉ. అచపలాక్షియుం గదిసి యాధరణీసురపంచబాణునిం
జూచె మనోనురాగగతి సొంపునఁ బొంపిరివోవు చూపునం

జూచిన చూపులోన మదిసోఁకవికారము, మై చెమర్చెఁ బె
ల్లేచె నసౌఖ్యముల్ వలపులింపులుఁ గోర్కెకీఁదావలంబులై.

క. జవ్వనపు సిరుల మదమునఁ
గ్రొవ్వారుచు నున్న మెఱుఁగుగుబ్బలతోడన్,
నివ్వటిలుచున్న కన్నియ
యెవ్వనిఁ బైకొనదు రతికి నేకతమైనన్ ? 148

క. ఎలప్రాయము లావణ్యముఁ
గలిగిన స్త్రీపురుషు లొంటిఁ గదిసినచోటన్
వలరాయఁ డేల మానును
గులశీలము లడఁచి జోడు గూర్పక యెందున్ ? 149

వ. ఇవ్విధంబున నొకరియొకరితలంపులంగామకళాశంకలంకురింపఁ దమక తమక తమకంబునం బట్టుకొన గమకించుచుండి రప్పు డప్పువ్వుఁబోణి యతనితలంపు దెలిసికొనం జూచి కొండొక ధైర్యంబు పట్టుకొని కట్టెదుర బిగువుచనుకట్టు పయ్యెద దిగ జార్చుచు నదీజలంబులఁ గాళ్లు, చేతులుఁ గడిగికొని యొక్క కెందమ్మిపూవుఁ దిగిచి పుష్పాడి చింద నందంద కరారవిందం బునఁ ద్రిప్పుచుఁ జక్రవాకమిథుననిధువన క్రీడ లాలోకిం చుచు, ముసిముసినవ్వులు నవ్వుచు మాటిమాటికిఁ గూటమి కాశలు గలుగ మగిడిచూచుచున్నఁ దదభిప్రాయంబు దెలిసి మనసిజుండు ప్రేరేపఁ బుండరీకుండు లేచి యాచమన వ్యాజంబున దాని డాయంబోయి, 150

ఉ. ఎవ్వరిదాన? వెక్కడకు నేఁగెద వాయితపాటుతోడ నీ
వివ్వల నొంటిపాటున యథేచ్ఛ రతీశవిహారరేఖఁ దో
డెవ్వరు లేక? పాణవిభుఁ డెవ్వఁడు? నీకుల మెద్ది? చెప్పవే!
జవ్వని ! నిన్నుఁ జూడమదిఁజాలఁగవేడుకతొంగలించెడున్.

తే. అనిన [illegible]ంచుక తలవంచి యాననమున
నలఁతినవ్వును లజ్జయు నంకురింప
చేతి కందిన ఫలమట్లు చేరఁబడుచు
నెలుఁగురాల్పడ నొయ్యన నిట్టు లనియె. 152

— ◆ బోయత తన వృత్తాంతముచెప్పి పుండరీకుని వరించుట. ◆ —

ఆ. బోయవారిపడుచ భూసురోత్తమ! యేను
బెండ్లి లేదు నాకుఁ బెద్దవారు
గలరు ముసలివారు తలిదండ్రు లింతియు
యల్ల యేటిదాపుపల్లెదాన. 153

క. మావారిఁ దల్లిదండ్రులఁ
బ్రోవను, నను గారవింపఁ బూం దైనపతిన్
భావించి కాని పెండిలి
గావించిన నొల్ల ననుచుఁ గడుఁ జింతింతున్. 154

ఆ. దానఁజేసి మగఁడు తన కెవ్వఁడును లేఁడు
తగినమగఁడు లేమి మగనియాశ
విడిచి యున్నదాన, విప్రపుంగవ ! నీవు
మగఁడ వైతివేని మనసు వచ్చు. 155

క. ఆరూఢయౌవనం బిది
భారముగా దిన్నినాళ్లు పరికింప మహా
భార మయి తోఁచె నిప్పుడు
నీరూపశ్రీలు మీఁద నిగుడుచు నుండన్. 156

క. ఎన్నఁడు నెవ్వరిమీఁదను
గన్నానక యున్నచోటఁ గాముఁడు నీపైఁ
గన్నానఁజేసె, నిఁక నె
ట్లున్నదొ నాభాగ్యరేఖ? యుత్తమచరితా! 157

వ. అని పాలివోని నిందుజవ్వనంబునఁ గన్నులపండువై యున్న యక్కన్నియ నోరూరం జేయుచున్న చందంబు డెందంబును, జంద్రికారసపూరంబు చంద్రోపలంబునుంబోలె, ననురాగ రసమయంబుఁ గావించుచుండఁ బుండరీకుం డంతర్గతంబున.

ఉ. అక్కట! యింతచక్కని మృగాక్షిని బోయతనెట్లు చేసె న
వ్వెక్కురు దైవమున్వీఁగడు విభ్రమసంపద మీఱువారియం
దొక్కకళంక మేమయిన నుంచుఁ గృపావిపరీతబుద్ధియై
చక్కరవిల్తునంతటి రసజ్ఞుని నంగవిహీనుఁ జేయఁడే. 159

ఉ. వాసన లేని మేలిమి సువర్ణము దీని మనోహరత్వ, మ
బ్జాసనుఁ డన్వవాయ మొక టల్పతరంబుగ సంఘటించుటం
జేసి విలాస విభ్రమ విశేషము మాన్పదు నాకళంకమున్
భాసుర చంద్రబింబమునఁ బ్రిన్నని వెన్నెలకందునుంబలెన్,

తే. ఇంక నిన్ని విచారంబు లేఁడ కెక్కఁ
గంతుఁ డసిధార ధైర్యంబుఁ గత్తరింప

నాదయువులేక చిత్త మీ యబలమీఁద
వ్రాలియున్నది మగుడఁ ద్రిప్పంగరాక. 161

క. ఈ చేరికమాటలలో
నే చంచలనేత్రిఁ బ్రేమ నెలయించి తదీ
యోచిత రతితంత్రసుఖ
ప్రాచుర్యం బనుభవింతు బ్రహ్మామ ముట్టన్. 162

వ. అని కామోద్రేక జనితోన్మాదంబున లజ్జాభిమానంబులు
విడిచి దానితో నిట్లనియె. 163

క. ఓ వెలఁది! నీ చరిత్రము
నీవచన విశేషగతియు నీ వినయము నీ
లావణ్య భావములు మ
ద్భావము మదనానురాగ పదముం జేసెన్. 164

ఉ. నీ యిటువంటి సద్గుణము నీ నవయౌవనరూప లక్షణ
శ్రీయుతిఁ జెందగల్గిన విశేష పురాకృత పుణ్య మేమనన్ ?
తోయజనేత్ర! నాదగు మనోరథమున్ ఫలియించు నీవు నా
ప్రేయసివై తిమేని విధిపెంపున భాగ్యతవైన నేమగున్? 165

క. నీ మనసులోనఁ దెలఁగెద?
నీమాటల కడుగుడాఁట నిక్కము వినుమా
కాముఁడు రతియును సాక్షులు
గా మృష గా దబల! నమ్మి కైకొను నన్నున్. 166

చ. బిగిచనుదోయిక్రొమ్మెఱుఁగుల నెక్కువయుక్కునఁజక్కనౌ త్రియ
ప్పగ నధరామృతం బొసఁగిపొందిక మాటలగారవించుచున్,

దగ మదభీష్ట పుష్పశరతంత్రములన్ సుఖకేళిఁ దేల్పవే
మగువ! తదీయ తీరనవమంజుల వంజులకుంజవాటికన్. 167

క. అని యనుమానింపక మన
మున మనసిజ బాణపాతమునఁ బొడమెడువే
దనఁ బడఁజాలక బాలికఁ
గనుఁగొని తమకించి పట్టి కౌఁగిటఁ జేర్చెన్. 168

క. మును వనితజవ్వనపుసిరిఁ
గని వంశము మఱచెఁ; బిదపఁ గౌఁగిటిలోవం
దను మఱచె బ్రాహ్మణుఁడు; రతి
నొనరిన నిఁక నేమి మఱచునో సుఖకేళిన్. 169

క. అదిరా! యిది, సాధారణ
మదిరామాత్రమున మఱచు మనుజుఁడు మదవ
న్మదిరాక్షీలీలోత్కట
మదిరా రస లహరి మేను మఱవఁడె యెందున్? 170

వ. ఇట్లు మోహపరవశత్వంబున బ్రహ్మకుల సంభవుండు సం భ్రమించి పరిరంభించి పులక కలికాకలిత గాత్రాభోగుం డును బద్ధానురాగుండునునై కౌఁగిలి వదలక మదవతి నతి ప్రియత్నంబున నొయ్యన నెయ్యంబుగాఁ దార్చికొని తన్న దీసవిధపుష్పితలతానికుంజ క్రీడంబున నిధువనక్రీడ లాచ రించి తదనంతరంబ జోడువాయక వేమకజొత్తిల్లు చిత్తంబు తోడఁ దద్గృహంబున కేఁగి, దానిజననీజనకు లకునత్తమా మలకు నల్లుండ నని తనపేరు చెప్పి నమస్కరించి, వారి దీవె

నలువడసి యింటికి సర్వంబును దానయై పోయకాఁపురంబు సేయుచుండె, నివ్విధంబునఁ గొంతకాలం బప్పువ్వుఁబోణి జవ్వనం బనుభవించి యొక్కకొడుకు నొక్కకూఁతునుం గనియె నంత. 171

క. ఆయాలును నాబిడ్డలు
నాయిండ్లును నాకులంబు నాబ్రతుకును వే
తే యొక సంసారస్థితి
యై యుండం గోరినట్ల యావిప్రునకున్. 172

—◆ పుండరీకుఁడు మాయాసంసారము సేయుట. ◆—

క. ఈరీతి న్మాయా సం
సారవృథాభ్రాంతిఁ బొరలె సదసద్విద్యా
ప్రారంభ ముడిగి విప్రుఁ డ
వారణ నత్యల్ప భోగ వాంఛాసక్తిన్. 173

తే. అల్పసంసారవిషయ సుఖానుభోగ
మభిలషింపుదు రధము లి ట్లధమగతికిఁ
దద్విరక్తి ప్రబోధ సుధాస్వరూప
చిదమలానంద మనుభవింపుదురు ఘనులు. 174

క. దుర్విషయ కలుషవార్ధ్యం
తర్వర్తులు గనరు మోక్ష ధామము, విద్యా
పర్వతశిఖరస్థితు లగు
నిర్వాహకమతులు గాని, నిశ్చయదృష్టిన్. 175

వ. అంతఁ దత్కాలంబున నతం డున్నదేశంబున 176

సీ. పగ లార్ద్రి పూనెఁ, బ్రాక్పశ్చిమంబుల గురు
కావ్యులు సమసప్తకమున నుండి
ధూమకేతువు దోఁచెఁ దూర్పుదిక్కున, బుధ
శుక్రమధ్యస్థుఁడై సూర్యుఁ డుండె
గ్రహరాజ భార్గవాగ్రగుఁ డయ్యెఁ గుజుఁడు, మీ
నమున వర్తించె శనైశ్చరుండు
దితిసుతాహితమంత్రి యతిచారగతుఁ డయ్యె
శశి రక్త పరివేష సహితుఁ డయ్యెఁ

తే. జంద్రికాచ్ఛాయ విద్యుత్తు సంభ్రమించెఁ
బ్రాతరారంభములఁ దుషారములు చిలికె
రాత్రిగగనంబు నక్షత్ర రమ్య మయ్యె
విను మనావృష్టిదోష మావిర్భవింప. 177

సీ. హరుని చిచ్చుబలె కంటిమురువున నిప్పులు
గురిసెఁ జండకరుండు గోచరముగ
నాడాడ నుగ్రదవాగ్ని శిఖాభీల
మై నీఱుచేసె వనాంతరములు
గండభేరుండాది చండమృగంబులు
గ్రామోపకంఠముల్ గదల వయ్యెఁ
బటుతరసంతాపభారకారణములై
వ్యాధులు జీవుల నలఁత ముంచెఁ

తే. గళ్ల రాజులు డెగిరి నిష్కారణంబు
దండుగలువట్టఁ బ్రజ నాత్మ ధరణివిభుఁడు
బందిపట్టులు తఱచయ్యెఁ బాపకారి
విధికృతంబైన యయ్యనావృష్టికతన. 178

ఆ. ఏఱు లింకెఁ గొలఁకు లింకె బొడ్డనబావు
లింకె నూతు లింకె నింక కున్న
యయ్యవగ్రహోదయమున నంభోరాశి
యైన నింకు ననిన? నబ్జగర్భ! 779

సీ. కదు వాడి కొన మాఁడి నుడి సచ్చి వే రెండి
వరులు పెంధూళులై ధరణిఁ గలిసె
యావనాళాది సస్యములెల్ల భూమిని
బదను లేకయె విత్తఁబడక యుండెఁ
బుష్పఫలాభిసంపూర్తిశూన్యత నెల్ల
తరువులు నీ రింకఁ బిఱుఁదువోయె
నీరసంబై నేల నెఱియలువాసినఁ
దూఁడుదుంపలు గ్రాఁగి మాఁడి పడియె

తే. నిగిడి కావిరి దిశలఁ బెన్పొగలు గవిసె
నెండమావులతో మంట లెగసెఁ జవల
నయ్యవగ్రహసమయచండాంశు కిరణ
ధ ధగద్వహ్నికీలావితాన హారిని. 180

క. ధనికులయిండ్లం గలిగిన
ధన మెంతయు నెత్తు కెత్తు ధాన్యముఁ గొనఁగాఁ

జని ధాన్యవాటికాతతు
లనలశిఖాఘోరబాధ నవి సరియయ్యెన్. 182

చ. దురితమలీమసాంగమును దుస్సహరోషకఠోరదంష్ట్రికన్
బరిభవదీర్ఘజిహ్వయును బంధురరోదనసింహనాదమున్
దర నిశితాసిధారయు నుదగ్రత మీఱ దరిద్రతా నిశా
చరి,వికృతాకృతిం గసిమసంగుచుఁ బైకొనె జంతులోకమున్.

వ. ఇండియు నకాండప్రళయంబైన యయ్యనావృష్టిదోషంబునం బ్రాపించిన మహాక్షామంబునం జేసి తద్దేశంబున రాజనంబు తేజంబు దూలంగ, దివసరి సరియయ్యె, సంబావు లావు దప్పెఁ, గర్పూరభోగి బాగుచెడె, బలుగుత్తి మొత్తంబడియెఁ, గాంబోది బీదరాలె, నవిసె నవాసి, సల్లి దుల్లెఁ, బ్రోసంగు క్రుంగె, వంకె డొంకె, మెట్టజీలుగు మాలుగయ్యెఁ, గావేరి కావరంబుడిగె, సత్తెనంగ సత్తువచెడె, వెలవడంబు వెలవెలంబాఱె, బుడుమ ముడివడె, వరగ సురిఁగెఁ, జామ కోమలత్వంబు విడిచె, *యవలఁ జెవులు గప్పె, గోధూమంబు నిర్ధూమంబయ్యె, నువ్వు క్రొవ్వఱెఁ, పెసర యసుఱుసరుఁ దప్పె, మినుము మునుము మునిఁగె, సను మనుమానంబయ్యె, నులవ చెలువుమాసె, బొబ్బర దబ్బఱయ్యె, సనంగ నలంగె, ముసిరి మిసిమిదప్పె, లంకలు బింకంబు దఱిఁగె, నావ ప్రభావంబు వదలెఁ, గందమూలంబులు నిర్మూలంబు లయ్యెఁ, జెఱకు గిఱుకవడె, నారుఁదీఁగెలు చీకాకయ్యెఁ,

* యవల చెలువు దప్పె, ముద్రి. పా.

శోకమార్గకులు తేకువచెడఁ, జూత పనస రంభా ఖర్జూర కపిత్థ తాళ హింతాళ నారికేళ నారంగ జంబూ జంబీర మాతులుంగ లవంగ ప్రముఖ ఫలపాదపప్రధానంబులు లూనంబు లయ్యె, నలాబు కూశ్మాండ కర్కరీ పటోలికా కారవేల్ల వృంతాక కోశాతకీ మూలక ప్రభృతి హితౌషధీ నికరంబు దుష్కరంబయ్యె, దధి క్షీర ఘృత తైల మధు శర్కరా స్తోమంబులు విరామంబు లయ్యె, క్షుధాతుర బాల వృద్ధ స్త్రీలోక భీరుక పరిదేవ నార్తనాదంబులును, ఘూన గ్రీన సలిలపానదారిద్ర్యంబునఁ గంటక ప్రాచీర నీరస తరు గుల్మలతాసంతతులు నములుచుం గృశించు పశుగణంబు లొనర్చు నంభారవంబులు నుప్పొంగి గగనంబుఁ గబళింప, 'భిక్షాందేహి', 'నాస్తిగచ్ఛ'యను దీననిర్దయ జనాలాపంబులును, 'దరిద్రస్య మృతస్యచ' యను దుఃఖార్తుల దీనలపితంబులును, 'కాలో వక్రగతిర్భవే' త్తను చింతాపరిక్రాంతుల భయాయత్త భాషణంబులును, 'జాతస్య మరణం ధ్రువ' మ్మను దేహపరిత్యాగ వైరాగ్య భాషణంబులును, "రక్షంతి పుణ్యాని పురాకృతాని" యను ధార్మికుల ప్రమాణోక్తులును, 'దరిద్రతా ధీరతయా విరాజతే' యను సత్పురుషుల యభిమాన వాక్యంబులును, "నదేవా త్సృష్టి నాశన" మ్మను పౌరాణికుల యుపశమన వచనంబులును జెల్లుచుండం గరుణాద్భుతభయానకబీభత్సరౌద్రరసావహంబగుచుఁ గేదారక్షేత్రంబులు ధూళిమయంబు లయ్యె;

గ్రామాప కంఠంబులు పశుశల్యమయంబు లయ్యె; గృహాంగణంబులు శవమయంబు లయ్యెఁ; బట్టణంబులు శుష్కభూత మృత కరి తురగ గర్ద భోష్ట్ర కళేబరకబళన వ్యాకీర్ణ కుర్కుర కంక గృధ్ర కాక సాలావృక కోలాహల మయంబు లయ్యె; మనుజలోకంబు పరస్పర ద్రవ్యాపహారణ వంచన తాడన మారణ తర్జన భర్జనాది వివిధ దుష్కర్మ మయం బయ్యె; దిశావలయంబు దుర్గంధమయం బయ్యె; నహోరాత్రసంధ్యా సమయంబులు పిశాచ మలినచ్ఛాయా మయంబు లయ్యె; నిల్లు మేతెల్ల నడంచి, భూమిం గలసారస్యం బెల్లఁ దీర్చి, చతుర్విధ పురుషార్థంబులను గావుపట్టుచు, వర్షప్రాప్తికై పర్జన్య దేవతాప్రీతిగా నొనర్చు మంత్ర తంత్ర జప తపో ధ్యాన హోమకర్మ కలాపంబులు విఫలంబులు గావించుచు, శాకునిక భాషణంబు లప్రమాణంబులు సేయుచు, ననన్య వార్యంబై యనాచారంబునకు నాధారంబును, నజ్ఞానంబునకు నిదానంబును, వర్ణసాంకర్యంబునకు నాకరంబును, నరిషడ్వర్గంబునకు నిసర్గంబును, జంతునాశంబునకు నివాసంబునై యావిర్భవించిన యాదుర్భిక్షకాలంబున. 188

సీ. పెట్టినతల్పులు పెట్టిన ట్లుండ దే
వాలయంబుల సమయార్చ లుడిగి
విప్రమందిరముల విధి దక్కి స్వాహాస్వ
ధానమః పుణ్యాశబ్దములు లేక
రాజసౌధాంగణ తేజంబు చెడ వీర
భటఘోట గజవిజృంభణము వాసి

యంగళ్ల సొబగెల్ల నడఁగె వస్తుక్రయ
విక్రయంబులు మాని విజన మగుటఁ
ఆ. దల్లి బిడ్డ కిడని దశవచ్చె మగఁ డాలి
నమ్మ యనెడువట్టి యలఁతి వచ్చె
గురుసహోదరాది పరమబాంధవులకుఁ
బోరు పుట్టె లేమికారణమున. 184

మ. క్రతుదీక్షల్ వడుగుల్ వివాహకలనా ప్రారంభసీమంతముల్
రతి తంత్రంబులు నాట పాటలు ప్రియాలంకార సారస్య
ముల్ । వ్రతముల్ వేదపురాణశాస్త్ర పఠనల్ వర్ణాశ్రమా
చారముల్ । హితసంస్కారము లయ్యె లేమి గదుఁ బెత్తె
యొల్లెడన్ దోఁచినన్. 185

వ. అట్లు మానిసి మానిసిం దినుకఱవు దఱిమిన నుపాయశూన్యులై సకల మహీజనులు నాఁకటిచిచ్చు పెచ్చున మలమల మాఁడి యెండి కుండబకుగులై పడుచుండ హతశేషులు పాడైనయూళ్లు విడిచి యన్యో నెలవులకుం బోవుచుండ; రట్టి ముట్టడి నత్త మామలుం గూఁతు నంతరించిన సంతరింపలేక యవ్విరించికులసంభవుండు దుఃఖాక్రాంతుండై ప్రియకాంతం జూచి కన్నీరు నిగుడ్చుచు నిట్లనియె. 186

చ. ఇరువదియేఁడు లయ్యె మన మిద్దఱముం గవగూడి యెందు నే
యెరసును లేక యుంటి మిటు లీవఱకున్ విధి యింతమీఁద నే
వెరవునఁ బెట్టునో యెఱుఁగ; వృద్ధులుఁ బుత్రియుఁ బోవ దుఃఖసం
భరితుల మైతి; [illegible] లేమి నొప్పెడున్.

క. ఈదుర్భిక్షార్ణవమున
నేదరియుం జేరలేక యిదిగో చీకా
కై డెనపడుచున్నారము
పైదలి! యింక నెన్నిపాట్లఁ బడుదుమొ మీఁదన్ ! 188

ఆ. తోయజాక్షి ! నేఁటితో నీకు నాకును
దైవ మెడలుసేయఁ దలఁపఁబోలు
నిల ఋణాను బంధ మిన్నాళ్లు యున్నాళ్లె
కాక కూర్పనేమి కారణంబు. 189

వ. అని మోహాతిశయంబున, వాత్సల్యంబున దైన్యంబుతోఁ బం
బలికి యాఁకలి నీటుపట్టులకు నోర్వక పురపురం బొక్కు
చున్న పిన్నబిడ్డనిం జూచి నిర్వేదించి యీశిశువును రక్షిం
చుట మిక్కిలి ప్రయాసంబై యున్న, దేయుపాయంబున
నైన శీఘ్రంబున నొండుదేశంబునకుం బోవుట కర్జంబు,
మన్నివేశం బని యుండుట కార్యంబు గాదు, సురక్షితంబైన
రాజ్యంబునఁ దిరిసికొని తినిదైన బ్రతుకవచ్చు, నని
యూహించి, 190

తే. పొలఁతి! విను పూర్వదక్షిణభూమి యెల్ల
నెపుడు దుర్భిక్షదోషంబు నెఱుఁగ దంద్రు
బహునదీమాతృకలు గాని ప్రతిదినంబు
దివి నిరీక్షించుదేవమాతృకలు గావు. 191

సీ. కర్ణాటరాజ్యంబు గంభీరతుంగభ
ద్రాజలౌఘంబులఁ దనరు చుండు

ద్రావిడదేశ ముత్తరకళోర్మిరమ్య కా
వేరికాలువల ముక్కారుఁబండుఁ
దై్రలింగ్యమధ్య భూతలము కృష్ణాగౌత
మీ ప్రవాహంబుల మిగులఁ బండుఁ
గాళింగమధ్యదిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలఁ బండు

తే. వెండియును జిత్ర మిట్లనావృష్టి యైన,
నంబుజాక్షి! నభోనభస్యద్వయమున
దర్ప మొప్పార గౌతమి దరులు ముంచఁ
శార్వరములయాళ్లు పదివేలు పండు నెపుడు. 192

సీ. ఎత్రోవఁ జూచిన నేప్రొద్దు సలిలాన్న
సత్రశాలాజనసంభ్రమంబు
యేయూరఁ జూచిన నెల్లధాన్యంబులు
కోరుపెట్టెడు ప్రజాఘోషణంబు
యేయిండ్లఁ జూచిన నిందిరాకరసంత
తోత్సవతోరణాభ్యుదయరేఖ
యెవ్వరిఁ జూచిన నివ్వటిల్లెడు దయా
దానసౌజన్యవిద్యానిరూఢి

తే. యెచటఁ జూచినఁ గనుపండు విందువదన!
నారికేళామ్లవనపపున్నాగముఖ్య
ఫలితశృంగారవనపరంపరలచేతఁ
గోరికల ముంచు గౌతమీతీరభూమి. 193

తే. వారిజానన ! గౌతమీతీరవసతి
భోగమోక్షంబులకు జన్మభూమి సువ్వ
జన్మసంస్కారఫలవిశేషంబు గలుగు
వారలకుఁగాని కలుగ దవ్వసతిసుఖము. 194

వ. ఈ వృత్తాంతంబు మున్ను పెద్దలవలన విని యెఱుంగుదు
నందులకుం బోద మని నిశ్చయించి. 195

సీ. కొడుకుఁ జంకిట నిడికొని భోయయిల్లాలిఁ
జక్కఁగా వీఁపున సంతరించి
గంజచిత్రడికి నీఁగలు పోక మునరెడు
నుగ్గంపుఁగుండఁ జే నొకటఁ బూని
యొక్కకరంబున నెక్కు డించినవిల్లుఁ
గోలలుఁ బిసియంబుఁ గూడఁబట్టి
నడునెత్తిపైఁ దాౘట మడఁచి చుట్టనచింపి
యాఁతాకుచాఁప వహించి కుౘంగి

తే. వీనుఁగుల నెత్తుకొని నిజస్థానమునకు
జరుగు వెక్కురుబటుగుపిశాచ మనఁగ
మైలవట్టినమైచాయ గ్రమ్మఁగి పడుచుఁ
బుండరీకుండు గౌతమీ భూమి కరిగె. 196

తే. అట్లు కతిపయదినముల కచట నచట
నాకలంబులు దినుచు నల్లల్లఁ జేరెఁ
బుండరీకుండు గౌతమీపుణ్యభూమి ;
నంతఁ బాపక్షయమునకై యబ్జగర్భ ! 197

చ. చనిచని కాంచె విప్రుఁడు బిస ప్రసవ ప్రసరత్పరాగసం
జనితసుగంధబంధురలసజ్జలశీకరశీతవాతపో
తనిరుపమాన శైత్యనిరత ప్రతివర్ధిత సత్త్వపోషితా
దినియమ నైష్ఠికప్రతతి తీరములం గల గౌతమీనదిన్ (?)

వ. ఇట్లు కాంచి యనతిదూరంబునఁ గరంబులు మోడ్చి. 199

ఉ. రంగదనిద్రసప్రవిచికాసితపద్మసుగంధసమ్మిళ
ద్భృంగ కసంగభంగకళి దీప్త కదర్ప కృపానుషంగ కా
శాంగనశీకరోత్కర, సముగ్రతరంగకు ప్రొక్కె గౌతమీ
గంగ కభంగురాభ్యుదయ కారణ కారుణికాంతరంగకున్ (?)

చ. తరఁగలపెల్లుఁ గ్రొన్నురువుతండము మోడుఁ జలత్కణావళీ
విరళతయున్ భ్రమీవలయవిభ్రమముల్ లహరీపరంపరా
సురుచిరభంగిరయంబు జవముసొంపును తెంపెసలార వచ్చునీ
గరిమ త్రిలోకలోచన వికాసము సేయుఁగదమ్మ! గౌతమీ!

ఉ. కొండలు ప్రక్కలించి పటుకూలనిపాతము నాచరించుచుం
డండతరోగ్రనక్రముఖసత్త్వవిహారసముచ్ఛలన్మహో
ఖండతరంగహస్తములఁ గంకణముల్ వెదచల్లుచున్ సము
ద్దండత వచ్చునీనిబిడదర్పము మెత్తుఁగదమ్మ! గౌతమీ! 202

వ. అని కొనియాడుచుం బుత్త్రకళత్రసహితుండై పుండరీకుండు
దత్పుణ్యవాహినీప్రవాహంబున నవగాహించి దప్పిదీఱ సలిల
పూరంబులు గ్రోలి దుష్కర్మనిముక్తికిం బాత్రంబై వెడలి
తత్తీరంబునఁ గొంతదూరంబు చని చేరువ నొక్క యగ్రహా
రంబు చూచి డాయంబోయి. 203

—◆ పుండరీకుండు భిక్షుసునకుం బోవుట ◆—

క. గ్రామోపకంఠమున వట
భూమిజ మొకఁ డున్నఁ జూచి పుత్త్రిని దారం
బ్రేమమున డించి భిక్షుక
భూమీసురుఁ డరిగెఁ బత్త్రిపుటహస్తముతోఁ. 204

తే. బ్రాహ్మణుఁడు ధర్మపథము చేపట్టి యింక
*యువతిపుత్త్రావలోక నాభ్యుదయ మొంద
మనకు నుండుట దగ దని మాయసతియు
మాయబాలుండు నవ్వేల మాయమైరి. 205

క. మాయాకారాగృహమున
బోయత యనుపాశబంధమునఁ బాపి రమా
నాయకుఁడు పుండరీకునిఁ
బాయక యిఁక దివ్యరాజ్యపదవియు నిచ్చెఁ. 206

తే. అధికవిజ్ఞాననిధి యైన యవనిసురుఁడు
పుండరీకుండు త్రైలోక్యపూజితుండు
కోరికొని మాయ నీ దురాచారదశకు
వచ్చెఁగాక యతండు దుర్వాంఛితుండె? 207

తే. ఉత్తమజ్ఞానశిఖ నేల్చు నొక్కవేళ
నురుకృపామృతమునఁ దేల్చు నొక్కవేళ
నెప్పు డెవ్వరి నెటు సేయ నిచ్ఛగించు
నట్ల కావించు లీలార్థ మచ్యుతుండు. 208

* ప్రా. ప్రా. బంధుపుత్త్రా. (వలోకనభాగ్య మొందె?)

తే. ఉభయకర్మంబుల ప్రాప్తి నొందఁ జేయు
నుభయకర్మవినిర్ముక్తి యొగి నొనర్చు
నచ్యుతుఁడె కర్త యని యుండు నవఘమతికి
నొదవుఁ దుదియందు విష్ణుసాయుజ్యలక్ష్మి. 209

వ. ఆ సమయంబున. 210

క. తనమాయాపటలముదా
పున హరి సాక్షాత్కరింపఁ బూని వసించెన్.
వినుః తెరలోపల వెలువడి
కనుపండువుగాఁ గ నిలువఁగల నటులీలన్. 211

తే. జలధరచ్ఛన్ననక్షత్రసమితిఁ బోలె
మాధవునిఁ గొల్చి తన్మహామాయలోన
నారదాది మునీంద్రబృందారకులును
జేరియుండిరి తత్కృపాశ్రీలు చూడ. 212

క. వా రున్నయట్ల నచ్చర
లారూఢవిమానలై సమందితపుష్పా
సారములు గురియ నుండిరి
శ్రీరమణునియాజ్ఞ విప్రశేఖరుమీఁదన్. 213

వ. ఇవ్విధంబున భాగవతశ్రేష్ఠుండైన పుండరీకుండు, వేద
గ్రామంబున విష్ణుమందిరాలయంబు ప్రవేశించి సంసార
క్షుధాతాపశాంతికై వైరాగ్యపాత్రంబున సువవిమద్వాక్యం
బులచేతం గైవల్య లక్ష్మిం భరమానందామృతభిక్ష యడుగం
గోరియున్న యమ్మహాయోగి పుంగవుండు గావున నయ్యె

గ్రహారంబుఁ జొచ్చి యొక్క-పుణ్యగృహంబునకుం బోయి యభ్యంతరవర్తిని నయ్యిల్లాలిని 'భిక్షాం దేహి' యని పలి కిన విని, యామె "యయ్యా వేళగాదు తిరిగి ర"మ్మనిన నాతండు వెండియు నిట్లనియె. 214

క. "అల్లదె! యాలును బిడ్డఁడు
నుల్లల నుడుకుచును నోర్వకున్నారు కడుం
దెల్లగునాఁకటిచిచ్చునఁ
దల్లీ! లే దనక భిక్ష దయ నిడు!" మనియెన్. 215

తే. పుండరీకుండు దాను నాపువ్వుఁబోణి
తనకులాంగన, యీయిల్లు తినది గాఁగ
నెఱుఁగనేరక భిక్ష దాఁ దఱిమి యడుగ
నాపతివ్రత పతిమాట లోట మెఱిఁగి. 216

వ. ఇది యేమొకో భర్త నదికిం బోయి తీర్థం బాడి వేగిరంబ రాక తడవుచేసె మధ్యాహ్నంబు దిరిగెఁ, గుతపకాలంబు దప్పక బ్రాహ్మణుల నర్చింపవలయునని విచారించుచున్న దగుటంజేసి సావిత్రి యాలోవనే "భిక్షాం దేహి" యనిన వేళగా దనినం బోక యాలుబిడ్డ లాఁకొన్నవా రని దయ దోఁప భిక్షార్థియై పలుక, నవ్వచనంబు తనమనను చూడఁ బుండరీకుండు పలికిన కపటంపుఁబలు కని నవ్వుచు, నొక్క-తామ్రపాత్రంబు దోఁచుచు నిల్లు వెడలి వచ్చి ముంగిట నున్నపతి మఱలోకించి. 217

తే. ఎంతదడ వాసె యమునకుఁ నేఁగి వీరు
తీర్థమా డింత కపుడ యేతేరరాద ?
పిదప నను నిట్లు భిక్ష వేఁడెదరు గాని
బ్రాహ్మణులఁ గొల్చి తెందు శీఘ్రమునఁ బోయి. 218

వ. వేగిరంబ వచ్చి వంటయును వేళయును దప్పకుండ బ్రాహ్మణుల నర్చింపవలయు,నగ్నిహోత్ర దేవపూజా విధానంబు లాచరింప వలయు, నాయితము సేయు మనినవారు, నను నిట్లు భ్రమి యించుచు మాయలాడుచు వచ్చి మునివాకిట బెండుపడి యూరకున్న వా రిది యే మనిన మాఱుత్తరం బీ నేరక కళవళించి. 219

చ. భ్రమసి యతండు వెండియును బట్టెఁడు నా కశనంబు పెట్టు ము
త్తమసుచరిత్ర! తల్లి! యనిదైన్యముదోఁపఁగఁబల్కుచున్న నా
యమచలియించియేమియిదియక్కట! భూతముసోఁకఁబోలుఁద
న్ను మఱచియాడెడుంగడుమనోవ్యథయయ్యెడునేమిసేయుదున్

సీ. ధాతువుల్ దప్పిన తమకము చందమో
యక్షివిభ్రమము లే దదియుఁ గాదు
నీటిలో నక్రంబు నిగుడ భీతిల్లెనో
యంగకంపంబు లే దదియుఁ గాదు
కార్యాంతరాసక్తి గల విలక్షత్వమో
యార్తభావంబు లే దదియుఁ గాదు
బ్రహ్మవిద్యాతత్త్వభావవచలతయో
యానందలహరి లే దదియుఁ గాదు

తే. కానఁ దక్కిన వేమియుఁ గనుఁగొనంగ
నొంటి నది కేఁగి రాఁగ నత్యుగ్రభూత
వికృతి మైసోఁకుటయు తప్ప దకట! దీని
కేది ప్రతికృతి చింతింప నెవ్వ రింక? 221

సీ. ప్రత్యక్షవిష్ణురూపంబు సాలగ్రామ
మర్చించుభక్తి నిత్యైకనిష్ఠ
బ్రహ్మంబు హరియ కా భావించు నేకత
సావధానమున యోగానురూఢి
సంసారసుఖము నిస్సారంబుగాఁ జూచు
మృగతృష్ణికాజలముగఁ దలంచి
వైష్ణవమాయ సర్వముగ వితర్కించు
నారదాదుల బోధనంబు నమ్మి

తే. శుద్ధసాత్త్వికమూర్తి విశుద్ధబుద్ధి
సత్యసంధుండు కరుణాప్రసన్నముఖుఁడు
బ్రహ్మకులసంభవునకు నీపావనునకు
నిట్టిదురవస్థ ఘటియించితే విధాత! 222

ఉ. ఈ దురవస్థ మాన్పి పరమేశ్వరుఁడార్యుఁ డనంతుఁ డచ్యు
తుం డాదివిధాత ధాత సకలాత్ముఁడు సర్వహితైకవర్తి దా
మోదరుఁ డార్తరక్షణగుణోదధి నా పతిఁ గాచుఁగాతఁ! ప్ర
హ్లాదు ధ్రువున్ గరీంద్రునిదయామతిఁగాచినయట్లయి తతిన్.

తే. భూతముల కెల్ల నాధారభూత మైన
విష్ణుఁ డీభూతవికృతి వే విప్పుఁగాతఁ!

బుండరీకుఁ డితండు నాపురుషుఁడేని
యేఁ బతివ్రత నగుదునే నీక్షణంబ. 224

వ. అని, ప్రాకృతుల చందంబున నితరమంత్రతంత్రవిధానంబుల
తంబోక, యయ్యుత్తమపతివ్రతాతిలకంబు నిజపాతివ్రత్య
మహాప్రభావజనితవిజ్ఞానవిశేషంబున సకలంబునకుం గర్త
విష్ణుండ యని నిశ్చయంబు ప్రదీపించినం బులకించి యార్త
జనశరణ్యుం డగు నారాయణుం బ్రార్థించిన. 225

—• పుండరీకునకు విష్ణుమూర్తి ప్రత్యక్షమగుట •—

మ. కురిసెం బుష్పులవాన లభ్రమున, దిక్కుల్ నిండ శ్రావ్యంబులై
మొరసెందివ్యమృదంగనాదములు, సమ్మోదాప్సరోలాస్యముల్
బెరసెన్ దేవజయధ్వని స్ఫురణతోఁ బెంపారు తన్మాయయున్
విరిసెన్ ధర్మచరిత్రుఁడైన యతని న్వే ముంచి మంచంబలెన్.

ఆ. సానఁబట్టినట్టి జాతి రత్నమువోలె
విప్రుహృదయ మపుడు విమల మయ్యె
విష్ణుమాయఁ బడిన విధ మెల్ల నిందజా
లముగఁ దలఁచి హరిఁ దలంచె వెతఁదు. 227

వ. అంత. 228

సీ. వికచముక్తాఫలమకుటదీధితితోడ
ధవళలోచనములఁ దళుకు లెసఁగ
వజ్రకుండలసముజ్జ్వలగండకాంతితో
మంజుస్మితశ్రీలు మొలుచుచుండ

నభినవకౌస్తుభప్రభలతో వక్షస్స
లస్థరమాదీప్తిలతలు నిగుడ
స్వర్ణపీతాంబరచ్ఛాయతో జలరుహ
రాగకాంచీరుచిరాజి మెఱయ
తే. బాహుదండ సముద్దండ పద్మశంఖ
చక్రకౌమోదకీ మహాచ్చక్ర మొప్పఁ
దేజముల కెల్ల నుత్కృష్టతేజ మగుచుఁ
గరుణ లక్ష్మీశ్వరుండు సాక్షాత్కరించె. 229
వ. అట్లు డెందంబునకు వాక్కునకు నందరాని యమృతచిదా
నందస్వరూపం బగు నాదినారాయణదేవుండు ప్రత్యక్షంబైన,
నద్దేవుని శ్రుతిసీమంతినీ సీమంత సిందూరరజంబులగు శ్రీపాదార
విందంబులవలనం బ్రసరించు నరవిందోద్భవపురందర ప్రముఖ
బృందారక పూజిత పారిజాత ప్రసూనదివ్య సౌరభ
సౌభాగ్యంబును, శ్రీవత్సలాంఛన సులక్షితం బగువక్షస్స్థలం
బున నిగుడు కౌతుకోత్సవ శ్రీపరిరంభ సంభ్రమ ప్రసక్త
లక్ష్మీపయోధర గంధసార సురభిగంధ పరంపరా సారస్యం
బును, జూర్ణకుంతల రేఖా బంధురంబగు ధమ్మిల్లవల్లీ బంధం
బునం బొలయు గర్భకేతకీభూత కోమల శ్యామల తులసీ
మంజరీమంజుపరిమళ ప్రవాహంబును, బహుప్రకారంబుల
నాసికాపుట కుటీరంబులం బొగపుల వాఱు మనోహర
శారీర భూరిరుచి నిచయచాకచక్యంబులును, దత్ప్రభల
నల్లిబిల్లిగొను శంఖ చక్ర కనకాంబ రాభరణ కిరణ తరంగ

సమాందోళనంబులును, దన్మయూఖశేఖల నౌరయు మంద స్మితశర లోచనాంచల మరీచి చంద్రికా ప్రసరణంబులును, గప్పారి యొప్పు నవలావణ్య యౌవనసంపద్విలాసంబును, త్రైలోక్యసామ్రాజ్య మూర్ధాభిషేకలాంఛన ప్రాభవప్రసాద లక్ష్మీ ప్రభావాతిశయంబును, బెనుఁబండువు సేయం గన్ను లానంద రసమగ్నంబులై నిగుడ సందర్శించుచు మోద్భుఁ గేలుదోయితోఁ బ్రదక్షిణంబుచేసి యగ్రభాగంబున. 280

చ. సనకసనందన ప్రముఖసంయములూహ లొనర్చుతత్త్వము న్వనజజముఖ్య దేవ పరివారము నేలెడు రాచవారలున్ ఘనతరభక్తియుక్తజన కామఫలప్రదదైవతంబు నై తనరెడునీవు నచ్చెలి విధంబునఁ దోఁచితినాకు నచ్యుతా!

మ. దురితావాసము పుణ్యనాశనము చేతోజాడ్యమూలంబు సం సరణం బాత్మకళత్రపుత్ర ధనదోష వ్యాధిపీడాకరం బరయం జిక్కితి దీసఁ జాలు నిఁక నన్నర్థిం గటాక్షింపవే హరి! నారాయణ కృష్ణ కేశవ ముకుందాదేవ దామోదరా!

క. ఈదుర్మోహాపు సంసా
రోదధిఁ దరిఁయింపఁజేయ నొండు గలదె మీ
పాదస్మరణప్లవ మొకఁ
డాదరువై నిలిచెఁ గాక యవ్యయపురుషా! 283

వ. అని మహాభాగవతశ్రేష్ఠుం డగుపుండరీకుండు పలికినఁ బుం డరీకాక్షుండు ప్రసన్నుండై గండమలంబునం గందళించు మందస్మితచంద్రికాపల్లవంబులపై జాతిన ధవళధవళకటాక్ష

వీక్షణప్రసాదమధుర సుధాపూరంబున నభిషేకం బాచరించి
ఘోరమాయా సంసారగహనదహనదందహ్యమానమర్మస్థ
నుండైన యతనిమనస్సంతాపంబు మాన్చి యిట్లనియె. 284

క. నీమనసు చూడఁ జేసిన
నామాయాకలన సువ్వె నారదుఁ దలనాఁ
డీమేర నీకుఁ జెప్పెఁడ
నీమది నటుగానఁ జూడు నిఖిలము ననఘా! 285

ఆ. అస్మదీయమాయ యఖిలజనంబును
మాయజగములోన మలఁగఁజేసి
పరఁగఁ గర్మపాశబద్ధులై సంసార
మోహదురితజలధి మునుఁగుచుంద్రు. 286

క. రాజసతామసమతములు
బీజంబులు మాయసొంపు పెంపొనరింపన్
రాజిల్లుసాత్త్వికము ద
ద్వ్యాజముఁ దలఁగించి పరమధామముఁ జూపున్. 287

వ. కావున నహంకారమోహదూషితంబు లగు రాజసతామసం
బులు విసర్జించి యుత్తమసాత్త్వికజ్ఞానంబున నన్ను సాల
గ్రామస్వరూపు నారాధించిన నిన్ను మోహింపఁ దలంచి
కాదె నారదునిం బంచి బ్రహ్మోపదేశంబు సేయించి యది
సాలక వెండియు నీమనస్సంశయలేశంబు మాన్పుటకు నపూ
ర్వమాయావిలసితం బగు సంసారం బభిగమించి యేమ ప్రతి
చ్ఛాయయుండిలో దీపింపంజేసి దానఁ దగులుపెట్టి పూర్వ

జన్మాంతర కర్మశేషంబులు దొలంగించి యుచితపదం బొసం గుటకై యింతప్రయాసంబు నొందింపవలసె, నట్లు గావున నీవు నింక మోహవికార దూరుండవై యల్పపల్వల కలుష వారిపంకంబున మునుఁగుచుఁ దేలుచుండు మహిషసంఘంబుఁ జూచు గోపాలుని చందంబున, నిద్రాముద్రితులైన వారి గెళవునుండి చూచు జాగరూకుని మాడ్కి, మదిరాపానం బున మత్తిల్లి శిథిలీకృతాంగకములతో నింద్రియజ్ఞానంబు లేక నిద్రించు స్త్రీలనడుమ నింద్రియ భ్రంశంబు లేక పరి భ్రమించు శుద్ధాత్మునికైవడి, మాయావిషయ భోగంబులం జిక్కి మ్రక్కి పాపంబులం బొరలుచున్నమూఢుల నవలోకిం చుచు సమస్తవస్తు విస్తారంబునం దవంతర్బింబిత తేజో విశేషుండ వగుచు సత్పురుషులం బ్రబోధించుచు భూలో కంబునం గొంతకాలంబు మహాభాగవతుండవై ప్రసిద్ధి వహించి తుది నాయం దైక్యముఁ జెందఁగలవని ప్రసాదించి హరి యంతర్హితుండయ్యెఁ, దద్వాక్యప్రమాణంబున నావుం డరీకుండును బ్రహ్లాదనారద పరాశరప్రముఖ మహాభాగవత శ్రేష్ఠులతో జగద్వర్ణనీయుండై యట్లనె కొండొక కాలంబు బుధపుంగవులహర్షోత్కర్షంబుఁ గావించుచు హరి నారా ధించుచు నుభయకర్మ నిర్ముక్తుండై ధర్మకళత్రింబైన సావి త్రియుం దానును జ్వాలాసహిత ప్రదీపంబునుంబోలె సాల గ్రామగర్భబ్రహ్మ నిర్యాణ తేజస్సనాథుండయ్యె; నిది జగ ద్విఖ్యాతంబు. 288

క. ఈ పుండరీకచరితము
పాపపుసంసారతిమిర పటలం బడఁచున్
దీపింపఁజేయు బోధము
దీపము క్రియ మాయ యింటఁ దిరిగెడు వేళన్. 239

వ. అని యివ్విధంబున మార్కండేయ మహామునీంద్రుండు మునిబృందారకుల విస్మితులం గావించి విరించితో నిట్లనియె.

మ. జలజాతోద్భవ! పుండరీకుఁడు విశేషజ్ఞానియైయుండియుం బలుపాట్లంబడె విష్ణుమాయ నీకెఁజెప్పన్వేఁడి నిర్వ్యాజని శ్చలితబ్రహ్మవిదుండలోకందు నిలువన్ శక్తుండె తన్మాయకున్ వెలయం దత్కరుణాశ్రితుండు వెలిగా విశ్వంభరామండలిన్.

క. నావుడుఁ దద్వచనముఁ దన
భావంబునఁ దిరుగఁ దిరుగ భావించియు బో
ధావహితుఁడు గానేరక
యావిధి హరిమాయ ద్రిప్ప నపు డిట్లనియెన్. 242

మ. అకటా! యేమి మునీంద్ర! బాలుఁడవొ మూఢాత్ముండవో వెఱ్ఱివో, సకలబ్రహ్మమునీంద్ర దైత్యదివిషత్సంఘుంబు నిన్మెచ్చునే, యొకమర్త్యాధముఁ బుండరీకుఁ దనమాయోపాయ కృత్యంబులన్, వికలస్వాంతునిఁ జేసె నంచు గుఱిగా విష్ణుం బ్రశంసించినన్. 243

—•{ బ్రహ్మదేవుఁ డహంకరించి యా విష్ణుమాయఁ దనపైఁ బన్నింపు మని మార్కండేయునితో వాదించుట }•—

క. ఇన్ని కథ లేల చెప్పెద
విన్నచున్ మోసపుచ్చు టిది చిత్రం బే

పన్నిన మాయలు నాపైఁ
బన్నింపుము నిర్వహింపఁ బదిలుఁడ వైనన్. 244

క. అతనిచేఁ గాకుండిన
నీతపమునఁ గల్గు బల్మి నెరవుచు నైనన్
ఖ్యాతిగ నను భ్రమయింపుము
చూతము నీ కేమి యిదియె చోద్యము గాదే. 245

చ. హరి దనమాయ పన్నినను నందఱ వెఱ్ఱులఁ జేసినట్లు యీ
సురలు మునీంద్రులుం బొగడఁ జోద్యముగా భ్రమయించి
యో మునీశ్వర! యిఁక విష్ణుమాయ గెలువం దరమే యని
నీవు మెచ్చఁగాఁ । బరఁగెదఁ గాక బ్రహ్మ మయి పద్మభ
వాండముఁ దాన యేలుచున్. 246

వ. అని క్రోధించి. 247

క. నేనున్ బ్రహ్మన హరిమా
యానాటకచక్రవిభ్రమాయత్తుఁడ నై
దీనుని గతిఁ దిరుగుదు నఁట
యీ నీచోక్తులును వింటిరే యెయ్యెడలన్. 248

క. ఈ సురసంఘము నీవును
నాసామర్థ్యంబు పద్మనాభుని నిజమా
యాసామర్థ్యముఁ జూచెద
రాసన్నం బైన వేళ యది యట్లుండెన్. 249

వ. ఇదిగో నేఁడు నేను జరాచర నిర్మాణ కర్మంబులు విసర్జించి
లోకపరిపాలనంబులు పాలించి నిర్విఘ్న పరబ్రహ్మ మోగా

ధీన మానసుండనై నిర్వాణ తత్త్వం బంగీకరించి యొక్క-విహిత పుణ్యస్థానంబునఁ దపంబు సల్పుచుండెద, నేఁ బాసి పోయిన వెనుక సృష్టి చీఁకట్లు గొని లోకంబులకు దిక్కు-లేక జంతులోకంబు చీకాకుపడకుండ నిర్వహింపఁజాలక నట్టి యింద్రజాలంబులు పన్నుకొని యాడుచు మిముబోంట్ల భ్రమియింపుచున్న విష్ణుండును నీవును, దేవముని సంఘుంబులతోడ వచ్చి జగత్పరిపాలనంబునకు నన్నుఁ బ్రార్థించుచున్నప్పుడు నిన్ను మందలించెదఁ గాక యని వృథాప్రతిజ్ఞలాడ నేల యని దిగ్గునం గొలువు విచ్చి యా ప్రజాపతి యొక్క-రుండును ఖేచర గమనంబున మందరపర్వతంబునకుం జనియె నంత. 250

సీ. బ్రహ్మ పోయినఁ దోడిబ్రహ్మలు వోయిరి
సృష్టిక్రియాలీలఁ జిక్కు-పఱచి
వేదశాస్త్రాదిక విద్యలెల్లను మ్రింగి
యా సరస్వతి యత్త నాశ్రయించె
బ్రహ్మరథంబు నిర్వ్యాపార మైన నం
చేలు విచ్చి మానసనరసి కరిగె
బ్రహ్మతేజస్ఫూర్తి పాసిన సత్యలో
కమునఁ బెంజీకటి గవిసియుండెఁ

తే. బద్మసింహాసనాగ్రంబు • పాడువాఱె
దాన సత్య తపో జ్ఞాన ధర్మపరులు

బ్రహ్మపదవాసు లట భయభ్రాంతు లైరి
తద్విధం బేమి చెప్పుదు ధర్మతనయ! 251

సీ. ప్రభ మాసె నర్కబింబంబునఁ జంద్రికల్
సడలెఁ జంద్రునియందు జాతవేదు
దాహకత్వము మానెఁ దారాగ్రహచ్ఛాయ
లెడలె నోషధులయం దింకె సత్త్వ
మబ్ధిఁ దరంగంబు లడఁగె నేఱులవేగ
ముడిగె వాయువులు వీయుటలు దక్కెఁ
గాలమార్గంబు వక్రత నొందె జపతపః
క్రతుకర్మధర్మసంగతులు పొలిసె
తే. జననములు లేక జంతుసంక్షయము గలిగె
దైత్య ముని దేవతా కోటి తల్లడిల్లె
బ్రహ్మతేజంబు వాసిన పద్మజాండ
మండలం బెల్లఁ జీఁకటి క్రమానుపడియె. 252

—◆ మార్కండేయునకు విష్ణుమూర్తి ప్రత్యక్షమౌట ◆—

క. ఆ యజుఁడు పోవ శూన్యం
బై యుండిన జగముఁ జూచి యచ్చెరువడుచుం
బోయిరి సురాసురాదులు
నాయెడ గమి విచ్చి బెగడి యన్యోన్యగతులన్. 253

ఉ. అంతయు నామృకండుసుతుఁడాత్మఁ గనుంగొనిపద్మయోని న
త్యంతవిమోహుఁగా వగచియుర్విధిలోకములెల్లమాయఁబోన్

జంతువినాశమై సృజన చాలక కాలము విన్నవిన్న శ్రీ
కాంతు భయాపహారిఁ ద్రిజగత్పతిసంస్మరియించె భక్తితోన్.

వ. అట్లు కన్నులు మూసికొని యంతర్ధ్యానంబున సంస్మరించిన
నాక్షణంబ. 255

క. దినకరకోటి ప్రభతో
మునిముందటఁ దోఁచి పలికె ముదమున మేఘ
ధ్వనిఁ గేవలుఁ డవ్విష్ణుఁడు
జననాయక! యమృతధార జాఱెడుభంగిన్. 256

చ. పరమమునీంద్ర సంస్తవనపాత్రచరిత్ర! మృకండుపుత్ర! నీ
గురుపరమార్థబోధమునకున్ మది గొల్పక బ్రహ్మ దానహం
కరణపరాయణత్వమునఁ గానక నన్ను నధఃకరించి దు
ష్కరతరపీడ చేసెఁ ద్రిజగంబుల కంచుఁ దలంక నేఁటికిన్.

వ. అని నిజాభిప్రాయం బెఱుకపడం బలుకుచు ముందట బ్రహ్మ
తేజోరూపంబున నున్నం గన్నులు విచ్చి మార్కండేయుండు.

క. అవ్యక్తుఁ డైన విష్ణుని
నువ్యక్తధ్యానయోగసుందరమూర్తిన్
దివ్యజ్యోతిర్మండలు
నవ్యాహతశంఖచక్రహస్తునిఁ గనియెన్. 259

చ. కనుఁగొని యశ్రుబిందువులుగాఱఁగ నంజలిబంధ మొప్పఁగాఁ
దనువునఁ గంటకాంకురవితానము లీనఁగ భక్తి గద్గద
స్వనమున వేదవాక్యముల సన్నుతిఁజేసె మహాద్భుతోత్సవం
బునఁ దనుఁదానెఱుంగక ప్రమోదసుధాంబుధిఁ దేలాడుచున్.

క. నారాయణ ! దేవ! కృపా
పారాయణ ! భక్తలోకపాలన ! విద్యా
కైరవచంద్రోదయ ! మా
యారమణీరమణ! యతుయానందనిధీ ! 261

క. కేవల మనుసీతత్త్వము
భావింపఁగ నెంతవాఁడ భవదీయకృపాం
భోవాహసుధాధారల
నీవిభవము గలిగెఁగాక యీశ్వర నాకున్. 262

వ. దేవా ! విధాతదుర్నీతిం జేసి భువనంబులకు నపాయంబు వాటిల్లెఁ బ్రాణిగణంబు సంక్షీణం బయ్యె, భయభ్రాంతులై సురాసురవరేణ్యులు దిరుగుచున్నవారు, వీరిం గరుణించి లోకంబుల కభయదానంబు ప్రసాదింపవే యని ప్రార్థించిన నా పరమపురుషుం డిట్లనియె. మునీంద్రా ! లోకంబులు మదీయమాయానిర్మాణంబు లని కానక విధాత తనచేత సృష్టంబులైన వని యహంకరించి దురభిమానంబున నిట్లు చేసినవాఁడుగాక! లోకంబుల కతనిచేత నపాయం బెట్లు ప్రాప్తించుఁ? నతనిదృష్టి కట్లుదోఁచె నంతియ, చక్కం జూడు మని దివ్యదృష్టిం బ్రసాదించినఁ జరాచర ప్రమోదధామంబులై చంద్రసూర్యపావక ప్రభాభిరామంబు లయి జగంబులు గానవచ్చిన నచ్చెరువంది మార్కండేయుండు వందనసహస్రంబు లాచరించిన, నతని మన్నించి వెండియు నిట్లనియె.

ఆ. అస్మదీయమాయ యఖిలంబు ననక తా
బ్రహ్మననుచు లోకపతి నటంచు
యోగి ననుచు నున్నయుబ్బెల్ల నడఁగించి
పిదప లోకమునకు ముద మొనర్తు. 264

వ. కొండొక కాలంబు చూచు చుండు మని తన యభిప్రాయం
బెఱిఁగించి హరి యంతర్హితుం డయ్యె నంత. 265

—♦ బ్రహ్మదేవుఁడు తపస్సు చేయ మందరగిరి కరుగుట. ♦—

సీ. రాజేంద్ర ! విను మట్లు రాజీవసంభవుం
డాగ్రహంబున మందరాద్రియందు
నుగ్రతపంబు సేయుటకునై పోవంగ
నడుమ ననేకవిఘ్నములు దోఁచె
మదిమది నుండి బ్రహ్మపదంబు వాయుట
గా దని మ్రోసె నాకాశవాణి
హరిమాయఁ గడవరాదని యొక్కపెట్టున
దర్పించి పలికె భూతవ్రజంబు
తే. తలఁప నట్లన యాఁగదా తండ్రి దైవ
మనక యవమాన మొనరించు నధమజాతి
కేఁటివిజ్ఞానసంపద ? యేఁటితపము ?
లేల సిద్ధింప నేర్చు నభీష్టఫలము ? 266

క. అతిరాజసతామసమతు
లతులానందప్రకాశ మగుయోగకళా

రతి నిర్వహింప శక్తులై
సతతబ్రహ్మజ్ఞశుద్ధసాత్త్వికులగుటన్. 267

క. కనుఁగొనియె నట్లు చని యు
వ్వనరుహసంభవుఁడు మణిసువర్ణమయోద్య
ద్ఘనశృంగసంగత స్వ
ర్వనితాసాహస్రసుందరము మందరమున్. 268

వ. కని యమ్మహానగం బధిరోహించి. 269

సీ. సరళాదిపాదపచ్ఛాయలఁ జిన్ముద్ర
నురుతరధ్యానులై యున్నమునుల
సానుదేశంబుల సమధికనిష్ఠతోఁ
బంచాగ్నితప్తులై పరఁగుమునులఁ
దలక్రిందు గాఁగ శాఖలయందు వ్రేలుచు
నత్యుగ్రనియతిఁ జెంపారుమునులఁ
గందరాగర్భంబులందుఁ జాములు ప్రాఁక
దృఢయోగరూఢి వర్తించుమునుల
తే. నిరశనవ్రతజపముల నెగడు మునులఁ
గేవలబ్రహ్మకళఁ బరికించు మునులఁ
గాంచె లక్షోపలక్షలఁ గమలభవుఁడు
ధరణినాయక! యమ్మహీధరమునందు. 270

చ. అనలరవీందుమండలసహస్రసముజ్జ్వలదీప్తులొల్కఁ బ
ర్వనక్రియనమ్మహీధర వరేణ్యమునందుఁ దపం బొనర్చున

[illegible] (నఖండతేజుల విమోహతమోహరనై కదత్తులన్
గనుఁగొని [illegible] ములగర్భుఁడుతద్దయుసుప్రసన్నుఁడై.)

ఉ. (ఎట్టిఫలంబులం బడయ నెంచి తపించుచు నున్నవారొ వీ)
రిట్టి తపఃప్రభావులకు నిచ్చునభీష్టవరంబు లెట్టివో
గట్టిగ వీరి కేను బొడకట్టి తదర్థము లిచ్చు టొప్పు ని
ప్పట్టున నంచు దివ్యరుచి పర్వఁగ డాసి విధాత యిట్లనున్.

క. [illegible] మీాతపముల కే
నిచ్చెదఁ బ్రార్థింపుఁ డెద్ది యేనియు ననినం
జెచ్చెర నతులై యమ్మును
లిచ్చిరి మాఱుత్తరంబు లెలస వ్వాలయన్. 273

క. మాకోరిన వర మొసఁగఁగ
నీకు నశక్యంబు పొమ్ము! నీరజభవ! నీ
కే కాదు నీవు మొదలుగ
శ్రీకంఠాదులకు నైనఁ జింతింపఁ దగన్. 274

వ. అది యెయ్యది యంటేని. 275

ఉ. దానము సత్యము న్దపము ధర్మము యజ్ఞము బ్రహ్మవాదవి
జ్ఞానము ధైర్యము న్గలిగి సాత్త్వికులై పరమార్థవేదు లె
వ్వాని కృపావిశేషమున వర్ధిలు చుండ్రు విమోహముక్తి నా
శ్రీనిధిమాయ గెల్చుటకుఁ జేయుట మాతప మబ్జసంభవా!

వ. తన్నిమిత్తంబునం జేసి తదధినాయకుండు విష్ణుండు గావున
నద్దేవదేవునింగూర్చి తపంబుసేయుచున్నవారము, నిన్నుఁ
గోరికాదు, సమస్తుండ నై తివేని యధిదేవతవై మాతప

ఫలంబులు స్వీకరించి యవ్వారం బొనంగుము, నీకసాధ్యం బగునేని నీవు పోయెదిత్రోవం బొమ్మనిన నవ్విరించి క్రోధించి.

సీ. సంయమీశ్వరులార! సకలవేదాగమ
విద్యారహస్యముల్ వెదకినారు
ప్రాజ్ఞులు మహితతపస్సిద్ధు లిట్టి మీ
రజ్ఞులభంగి నిట్లాడఁ దగునె
సచరాచరము లైన జగములు గల్పించి
యఖిలంబునకుఁ గర్త నైన నన్ను
బ్రహ్మదేవునిఁ గూర్చి ప్రార్థించునర్థమే
విష్ణుమాయాజయ వికటబుద్ధి?

తే. మృత్యురాక్షస శత్రుదారిద్ర్యజయమె
విష్ణుమాయాజయం బవివేకులార!
బ్రహ్మశివవాసవాదిత్యపదనిరూఢి
యడుగ కె ట్లడిగితి రిట్టి యధమవరము. 278

క. దాకొని మార్కండేయుఁడు
ప్రాకృతులను బోలె మిమ్ము భ్రమయించెనొకో
కాక, యభేద్యము హరిమా
యాకల్పన మనుచు బ్రహ్మ మచ్యుతుఁ డనుచున్. 289

వ. అట్లు కాఁబోలుంగాక లేకున్న మీకు నీవృథావిష్ణుమాయా భ్రాంతి పుట్టునే, మిమ్ము బోధించినట్లు విరతింబుట్టించి దివ్య పదభ్రష్టులం గావించి యేకాకులం జేసి యనేకులఁ జీకాకు పఱచె. నదియునుం గాక, దేవమునిసంఘంబులలో నేడ

నాసమ్ముఖంబున నాసృష్టియెల్లనుం దృణీకరించి సర్వంబును విష్ణుమాయగాఁ బ్రతిష్ఠించి విష్ణుని బరబ్రహ్మంబుగా నూఁది, నన్నుం దిరస్కరించె, దానికి నేఁ గోపించి శాపదగ్ధునిం జేయం దలంచి, శాపదగ్ధునింజేయుట పౌరుషహాని యని వితర్కించి యది విసర్జించి సర్వంబును విష్ణుమాయ యను నతని యవివేకంబు మాన్పి పిదపం జేయవలసినట్లు చేసెద నని లోకంబులు శూన్యంబులు గావించి యేకాంతంబునం దపంబుసేయువాఁడ నై వచ్చితి, మీఁదటిపనుల మీకుం జెప్పనేల నాకంటె విష్ణుండు సమర్థుం డయ్యె నేని మీవరం బులు వేఁడుకొం డని వారికడం దొలంగి శిఖరాగ్రంబునకుం బోయి వజ్రకీటరూపంబున శిలాపటలంబు భేదించి తదగ్రం ధ్రంబున లోపలం జొచ్చి దశయోజనవిస్తారంబుగా నొక్క గుహం గల్పించి. 280

—♦ బ్రహ్మ తప మారంభించుట. ♦—

సీ. తనపూర్వరూపంబు దాల్చి నిజప్రాభ
వంబున నొక్కవనంబుఁ గొలనుఁ
గల్పించి తిమిరవికల్పనార్థము బ్రహ్మ
తేజము దివియగా నోజపఱచి
తత్సరస్తీరమందారభూజమునీడ
విమలచంద్రోపలవేదిమీఁదఁ
బంకజాసనబంధబంధురుం డచలుఁడై
యంతర్నిరీక్షణం బాచరించి

తే. బ్రహ్మ నిర్వాణతేజంబు భావవీథి
ధ్యానమొనరించునిలుకడ దప్పి యపుడు
లోకములు లోకగతియును లోకకృతియు
సంస్మరింపంగఁ దొడఁగె నాజలజభవుఁడు. 281

తే. అచలితధ్యాననియతి బ్రహ్మంబుఁ గాంచి
చిదమలానందరససుధాశీకరముల
నాత్మఁ దనుపంగ లేఁడాయె నబ్జసూతి
యట్లు సిద్ధించునే విషయాతురునకు ? 272

క. విరతి యెఱుంగక యోగా
చరణంబున ధ్యాని యైన జనునకు బ్రహ్మ
స్థిరబుద్ధి యేల తోఁచెడుఁ
బొరిఁబొరి సంసారకృత్యములెకాక మదిన్. 283

మ. పరమబ్రహ్మము ధ్యేయమున్ ఫలమునున్ భావింపఁగా వైష్ణవో
ద్ధురయోగ స్ఫురణంబ, యోగితతి కేత్రోవన్ విచారించినన్
సరసీజాసనుఁ డట్లెఱింగియును దన్మాయాపరిభ్రాంతి నా
పరమాత్మవ్యతిరిక్తయోగమె మదిన్ భావించె సర్వేశ్వరా! 

వ. ఇవ్విధంబున, ననన్యభేద్యం బగుమందరగిరిగర్భంబున నిశ్చల
సమాధిం గన్ను దెఱవక పదివేల దివ్యవర్షంబులు తపంబు
చేసె, నంత నొక్కనాఁడు సర్వాంతర్యామి యగువిష్ణుని
మాయాబలంబున. 285

సీ. స్వర్ణరంభాతరుస్తంభసంభృతము వి
ద్రుమఖండవలభీప్రరోపితంబు

విలసితకుందకుట్మల మౌక్తిక శ్రేణి
కరవీరదళవిటంకవ్రజంబు
మాలతీజాలకమార్గంబు నవకైత
కచ్ఛదఫలకప్రకల్పితంబు
కల్హారతోరణకలితంబు మల్లికా
పుష్పవితానసంపూజితంబు
తే. పద్మకోరకకనకకుంభస్ఫుటంబు
చూతలతికాచతుర్ద్వార శోభితంబు
బహుళబహువిధపరిమళబంధురంబు
నగుచు నొకమేడ సంభూతమయ్యె నచట. 286
క. చంద్రాధిదేవత యనం
జంద్రసమానాస్యహాసచంద్రికతోడం
జంద్రికులేశ్వర ! వాణీ
చంద్రానన యయ్యె మాయ, శౌరిమతమునన్. 287
ఉ. శ్రీమదహర్ముఖద్యుమణి చెల్వున నుజ్జ్వలరాగరేఖఁ జూ
డామణి మీఱఁ దారలఁ దడంబడఁ జేయఁగఁ జాలుతారహా
రామలదీప్తి పర్వఁగ ననంగధనుర్గుణ భృంగఝుంకృతో
ద్దామ సువర్ణనూపుర పదద్వయితో సతి యొప్పెఁ జూడఁగన్.
చ. కనకముఁ జెక్కి పుచ్చిన ప్రకారమునన్ గిఱికొన్న వన్నెయుం
దనరునితంబబింబమును దామరమొగ్గల యగ్గలంబుఁ గా
దనుకుచకుంభయుగ్మము, నుదగ్రసుధారసపల్లవోష్ఠముం
గనుఁగొన నొప్పు నింతికి జగత్త్రియజైత్రచరిత్రసంపదన్.

సీ. నెత్తమ్మిరేకుల నెఱిమించునడుగులఁ
గ్రొత్తలత్తుకనీరు గులుకుచుండఁ
గోమలరంభాభిరామంబు లగు తొడల్
బిగియారునునుఁజాయనిగల నిగుడఁ
గలికిజక్కవసోయగము మీఱు కుచకుంభ
సౌభాగ్యగర్వంబు సంభ్రమింప
మరునారసంబులమాడ్కి మిటారంపుఁ
గ్రొవ్వాఁడి కొనగోళ్లు నివ్వటిల్ల
తే. నలరుఁగెమ్మోవి నమృతహాసంబు దొలఁక
వెడఁదకన్నుల మదరేఖ విస్తరిల్ల
మనసునిండిన నిండు జవ్వనముతోడ
మరులుగొలుపంగఁ దొడఁగె నమ్మాయమగువ. 290
సీ. కుచముల మెత్తిన కుంకుమగంధంబు
నీ రనురాగంబు నెలవు చెప్ప
నిటలభాగంబున నెలవంకకస్తూరి
కారేఖ వలపుఁజేఁకట్లు గొలుపఁ
గొప్పునఁ దుఱిమిన గొజ్జంగరేకులు
నెత్తావిపవనంబు నిర్వహింప
వలుఁదపిఱుందుపైఁ జెలువారు వెలిపట్టు
వలువ వెన్నెలరేకువన్నెఁ దాల్ప
తే. నాసికారత్నతాటంక నవ్యహార
చారుకంకణ కాంచిమంజీరరుచులు.

మేలి తనులక్ష్మి కొనఁగునివాళి గాఁగఁ
జెలువ రతియోగ్యభూషణ శ్రీలఁ దోఁచె. 291

మ. మదగర్వంబును యౌవనోదయము రమ్యత్వంబు మాధుర్యమున్
మృదులాలాపదరస్మితాంశుకలనాస్మేరాననాబ్జంబు పెం
పొదవన్ మన్మథరాజ్యలక్ష్మి క్రియ నేత్రోత్సాహసంపత్కళా
సదనంబై విలసిల్లె నాకపటభాషాదేవి లీలాగతిన్. 292

ఉ. అంగనయంగదీప్తి యమృతాంశుమయూఖతరంగరేఖ ను
ప్పొంగుచు దీపమై యచటఁ బొల్పెనలారెడు బ్రహ్మతేజమున్
క్రమ్మంగఁ బడంగఁజేసె నభిరామ గుణం బిఁకఁ జెప్పనేల య
య్యంగజదివ్యతేజమున కడ్డమె యావెడబ్రహ్మతేజమున్.

క. అమ్మాయపొలఁతిఁ జూచిన
నమ్మాయానాటకుండు హరి దా నైనన్
నెమ్మది ధైర్యము వదలఁడె
యిమ్మైఁ జపలాత్ము బ్రహ్మ నేఁటికిఁ జెప్పన్? 294

తే. ఆవిలాసిని రసహావభావలీల
కురుఁడు బహురూపధారియై మానవేంద్ర!
నిశితపుష్పాస్త్రపూర్ణతూణీరసహితుఁ
డగుచుఁ గార్ముకగుణనాద మడరఁజేసె. 295

క. వెన్నలరేకు విధంబునఁ
జెన్నగు వెలిదమ్మిపఱపుచే నలరుచు న
త్యున్నతడోలాతల్పం
బన్నలఁతుకదంబ రతులయానలఁ జూపెన్. 296

క. ఉల్లోల మదనసాగర
కల్లోలం బనఁగ డోలికాపర్యంకం
బల్లన గాడ్పునఁ దూఁగుచు
నల్లలనాహంసి కాశ్రియంబై యొప్పెన్. 297

వ. ఇట్లు త్రిలోకవిజయధ్వజిని యగురతిరాజు తేజంబునకు వన్నె వెట్టుచుఁ గన్నులకు వెక్కసంబైన చందంబై యమ్మాయా సరస్వతి సనత్కుమారికావరునిశాసనంబు శిరంబునం దాల్చి వాసనావశంవదమదాళిజాతం బగుచు సురతసమర ఖురళీ నివాసంబై యొప్పు నప్పువ్వుమేడలోన మధ్యప్రదేశంబునఁ బుష్పపీఠంబున సుఖాసీనయై పురోభాగంబున వాహన హంసంబును, గెలంకున వజ్రపంజరంబునం బ్రియకీరరమణి యు నుండ నియమించి, కుచకుంభంబునఁ బసిండివీణె మోపి జాజువయ్యెదతోఁ గర్ణావతంసకహ్లారసురభిళమధూళిబిందు సందోహంబునకుం బరిభ్రమించు చంచరీకాంగనలు పట్టు శ్రుతు లంగీకరించి కరాంచలంబులం దంత్రులు మీటుచు మధురగానంబున బ్రహ్మనాదంబు గూర్చి బ్రహ్మవశీకార కామరాజమంత్ర కలితశృంగార గీతంబులు పాడుచుండ నప్పుడు. 298

క. గోపాల వేషధరుఁడై
శ్రీపతి వేణుస్వనంబు చెలఁగించు క్రియన్
బ్రాపించెఁ దన్మహామా
యాపాటలగంధివీణియయు నునుమ్రోఁతన్. 299

వ. పెండియుం దనకుఁ దానే సంకల్పదశావిశేషంబున. 300

—◆ మాయాసరస్వతి మదనవికారములఁ గనఁబఱచుట. ◆—

సీ. కన్నీరు నించుఁ దొంగలిరెప్ప లల్లాడ
నొకమాఱు ప్రియుఁడు రాకునికిఁ జేసి
కంపించు నొకమాఱు కౌఁదీఁగె చెమరింప
భర్త కౌఁగిటఁజేర్పఁ బట్టె ననుచు
నవ్వులఁ దేలు నానన మొప్ప నొకమాఱు
పతితోడ భాషించు భావరతికిఁ
బులకించు నొకమాఱు వలపుఁజన్నుల క్రేవ
లదర వల్లభులీల లాత్మఁ గోరి
తే. యంగజుఁడు వెల్లిగొల్పంగ నంగకముల
నెల్లఁ గళ జాఱి ధైర్యంబు పల్లటిల్ల
బ్రహ్మదేవునిపైఁ బ్రేమఁ బాఱవిడిచి
వీణియను మీటి పాడుచు విద్రుమోష్ఠి. 301

వ. ఇవ్విధంబున నవయౌవనమదోద్రేకంబున నుప్పొంగుమన్మథ
రసోల్లాసంబున నవ్విలాసిని యలవోకగా వీణె వాయించుచు
బ్రహ్మదేవునిం బ్రేరేపఁ దివురుచుండె నానమయంబున.

క. ఆరామపుష్పమాలా
శారీరసుగంధభరము సన్మందమరు
త్ప్రేరితమై పైఁ బర్వెన
సారసభవు నింద్రియములు సంచలించెన్. 302

క. పైగాలి వాఁకినంతన
యోగముచెడి మనసు గరఁగ నాగి బ్రహ్మకుఁ గాం
తాగురుకుచపరిరంభా
భోగంబున నేమి చెప్పఁ బురుషులతలఁపుల్ ? 304

క. తన దీర్ఘయోగభావన
కొనసాగక యింద్రియములఁ గోరెదు మది న
వ్వనజజుఁడు తాల్మి చాలక
తనువున మరుమోహాలవారి దగులుకొనంగన్. 305

వ. కొంతదడ నెద్దియుఁ దలంపనేరక యూరకుండి యావివిక్త ప్రదేశంబునఁ జిత్తంబు మదనాయత్తం బయ్యె; దీనికిఁ గతం బేమి యనుచుఁ గన్నులు విచ్చి యచ్చట నచ్చవెన్నెల చాయం బ్రజ్వరిల్లుచు బ్రహ్మతేజంబు నధఃకరించి యమృత ప్రవాహంబుచందంబున నయనానందకందంబై దండడించు నమ్మించుఁదీఁగెఁబోఁడి మైచాయం జూచి యిది యేమిదీప్తి యొకో, తెలియవలయు ననుచు లేచి ముందట మన్మథ పుష్పకంబునం బోని పువ్వుమేడం గనుంగొని వెఱఁగుపడుచు డాయంబోయి. 306

మ. శ్రవణోత్తంసవినీలనీరజ గుణాశావంభ్రమద్భృంగమం,
ద్రవిరావశ్రుతి వీణె మీటుచు సుధాధారామనోహారిగా
వ విశేషంబునఁ గంటకాంకురవితానస్వేదముల్ పైకొనం
బుపుగడ్డన్ విలసిల్లుచుం గలికియై పుష్పాస్త్రమేకొల్పుచు౯.

క. గురుకుచములఁ బయ్యెదకొం
గర జాఱఁగ మేనుమఱచి యనురాగముతోఁ
బరిపరివిధములఁ దను నా
దరమున నంకించి పాడు తరుణిం జూచెన్. 308

—♦ బ్రహ్మదేవుఁడు మాయాసరస్వతిని జూచి మోహించుట. ♦—

క. కన్నులకు వెక్కసంబై
యన్నలఁతుక మదనపరవశాకారవిలా
సోన్నతి శతధృతిధృతి యను
మున్నీటికి మందరాద్రిమూర్తి వహించెన్. 309

వ. ఇవ్విధంబున నుల్లంబు పల్లవింపంజేయునావల్లవచరణ చరణ రమణీయత్వంబును, నారంభోరు నూరుచారుభావంబును, నాపులినజఘన జఘనఘనత్వంబును, నానతనాభి నాభిసౌభాగ్యంబును, నాతనుమధ్య మధ్యానవద్యత్వంబును, నాలతాంగి యంగలౌల్యంబును, నాగురుకుచకుంభ కుచకుంభ గాంభీర్యంబును, నాబిసరుహహస్త హస్తప్రశస్తలావణ్యంబును, నాకంబుకంఠి కంఠసముత్కంఠితవిభ్రమంబును, నాచంద్రవదన వదనప్రసాదమాధుర్యంబును, నాబింబాధర యధర సుధారసధారయు, నాసుదతి దంతపంక్తి సొబగుకాంతియు నామృదుకపోల కపోలపాలికాలాలిత్యంబును, నాచంపకనాస నాసికానిశ్వాససౌరభ్యంబును, నాచకోరాక్షి యక్షికటాక్ష తీక్ష్ణతయును, నాసుకర్ణ కర్ణవర్ణనీయశ్రీకారరేఖయు, నాశీతాంశుఫాల ఫాలభాగపరభాగంబును,నానీలకచ కచనిచయ

చాకచక్యంబును, నానుకుమారి సౌకుమార్యంబును, నా సుందరి సౌందర్యంబును, నాయువతి యౌవనగర్వంబును, నావిలాసిని విలాససామగ్రియుఁ గౌతుకాశ్చర్యధుర్యంబగు మనంబున నేకాగ్రదృష్టిం దృష్టించి వాంఛాతిశయంబున.

క. ఈ లీలావతికౌఁగిలి
చాలద తాదాత్మ్య మొసఁగ సమధికయోగ
జ్వాలాముఖగతసౌఖ్యం
బేలా కాంక్షించెదరు మునీశ్వరు లాత్మన్ ? 311

క. ఈలలనయౌవనాంబుధిఁ
దేలక యోగాగ్నిశిఖలఁ దేలెదునామె
నేలాగునఁ జల్లారెదుఁ?
జాలు జితేంద్రియతఁ గల్గు సౌఖ్యము లింకన్! 312

వ. ఇదియ మదీయతపఃఫలంబు, నాతపోఽధిదేవతయ యీహూ పంబునఁ బ్రత్యక్షం బైనయదిగాక, కేవలస్త్రీమాత్రంబున కిచటికిం బ్రవేశింప నెట్లువచ్చు నని తనప్రయత్నంబు మఱచి పట్టుకొనఁ దలంచి కదియంబోయి. 313

క. ఒకచో వాహనహంసము
వొకచోఁ బ్రియకీరరమణియును, శేత విపం
చికయును నుండఁగ భారతి
యొకో! యని యటఁ గొంతనిలిచి యొయ్యనఁ జూచెన్. 314

ఉ. అచపలాక్షి యంతఁ దన యానన మించుక యెత్తి మందటం
జూచె వరోజమాలి, మరుచౌకృఁనఁ బట్టఁ దలంచుచుంచలుం

జూచి వివంచి డించి నగుచుం బువుగద్దియ డిగ్గ మేఖలా
కాచ కలధ్వనుల్ చెలఁగఁగా ఁబయికొంగుదొలంగ గ్రక్కునన్.

క. పువుగద్దె డిగ్గుపడి నునుఁ
బువుఁదీగెంబోఁడి తుఱుము పువ్వులు రాలెన్
బువువిలుతు నెఱయములగు
పువుఁదూపులువోలె బ్రహ్మబుద్ధి గలంగన్. 316

తే. అట్లు చని తూఁగుటుయ్యెల యవలికేఁగి
ముదిత తల్పంబుమాటున కొదుఁగఁ బోవఁ
దనమనం బూనవఱచి యాతమ్మిచూలి
యంగజోద్రేకమునఁ జేఁటకొంగు పట్టె. 317

ఉ. పట్టిన లజ్జయున్ భయముఁ బాటిల, మై గరుపాఱ లీలమై
గొట్టునఁ బట్టనీక పెనఁగొంచుఁ గరంగుచునున్నఁ, బోక యా
దిట్టమగండు ప్రేముడిఁ దదీయ విధం బరయంగఁ గోరి లో
దొట్టెడుకోర్కివెల్లువలఁ దోఁగుచు నిట్లనియెన్ మృదూక్తులన్

క. బాలా నీవెవ్వరు ? నీ
వేలాగున వచ్చియుంటి ? విచ్చట నీకీ
కేళీగృహ మెట్లాదవె? గు
ణాలంకృత ! చెప్పవే ప్రియంబున నాకున్! 319

క. నీపేరు చెప్పి మధురా
లాపసుధాధారచేత లలన ! మనోభూ
చాపధ్వని నిర్ఘాత మ
హాపరితాపంబు మాన్పుమా కృపతోడన్! 320

వ. అని కామార్తుండై యధైర్యంబు దోఁపఁ బలుక నవ్వెలుక
బోఁటి యిట్లనియె. 321

సీ. దేవ ! మహాత్మ ! నీదేవి నన్నెఱుఁగవే
సేవకురాలి వాణీవధూటి ?
నట్లు మార్కండేయుఁ డాడినఁ గోపించి
యబ్జజాండంబు శూన్యంబుచేసి
మీరు విచ్చేసిన మీతోడఁ గూడి యీ
గుహకు నేతెంచితిఁ గూర్మితోడ
బ్రహ్మవలోకనపరత నాపై దృష్టి
యునుప కుండితి గాక యుగ్రనిష్ఠఁ

తే. దావకాయల్లకార్తి సంతాప మంది
నాఁటనుండియు మిముఁగూర్చి నాన విడిచి
చేయుచుందుదుఁ దప మిట్లు చిత్తభవుని
బారిఁ బడలేక యీలీలఁ బరితపించి. 322

క. దేవ ! మహాయోగివి నీ
కీవిధమున నార్తిఁ బొంద నేఁటికి? నే నీ
దేవిని స్వకీయఁ గానే ?
కావింపుము చిత్తకాంతుఁ గరుణాదృష్టిన్. 323

వ. అనిన నవ్వారు నెఱుంగనియేకాంతస్థలం బగుటను, నితర
సామాన్యస్త్రీగాక స్వతంత్రకులపాలిక యగుటకు సంతో
షించి యంతరంగంబున నుప్పొంగువనంగ సాగరకల్లోలంబుల
మునింగి నిర్నిరోధంబుగ నయ్యంగనం గవుంగిలించి మించుఁ

దూఁగుటుయ్యెల యెక్కించి పంచశరకేళీప్రపంచంబు విస్త
రించి నలసినట్లు పెక్కువేలేండ్లు గ్రీడించె. 324

తే. ఊర్ధ్వరేతస్కుఁడై దృఢయోగశక్తిఁ
బటుతపోజ్వాలఁ గ్రాఁగు తపస్వి యైనఁ,
జెదరు సతిఁ గన్న; వాణిశుఁ జెప్పనేల?
మనసు పండనిసన్న్యాసిమతమువాని? 325

సీ. అతిసూక్ష్మయోగ శాస్త్రార్థంబు శోధించి
విజ్ఞానసంపద విస్తరించి
కడఁ బ్రపంచము మిథ్య గాఁగ సిద్ధాంతించి
ద్వంద్వమోహంబుల తగులు విడిచి
యేకాంతియై యింద్రియేచ్ఛఁ బోవక యుండ
దృఢముగాఁ జిత్త మాత్మీకరించి
తనువులఁ బులకలు జనియింప నిర్మల
బ్రహ్మతేజోధ్యానపరత నొంది

తే. యక్షయానందరససుధ నాని యాని
తాన చిద్రూప మై యుండు తపము తపము
గాక, తన కేల సిద్ధించుఁ గమలజునకు?
బూమె బ్రిమయింపఁ బోయిన బోడితపము! 326

సీ. అర్థార్థములమీఁద నరుచి పుట్టినదాఁక
సంసార మొకపాటి జరుపవలయు
నరుచిపుట్టినఁ బరుం డగుచు నాసంసార
విషయభోగము దిగవిడువ వలయు

విడిచి మనంబు నిల్కడఁ జెందునందాఁక
నుచితసజ్జనగోష్ఠి నుండవలయు
మనసు నిల్చిన దాని మఱచి బ్రహ్మముఁ గన్న
దాఁకఁ దపంబులఁ దలఁపు వలయు
తే. బ్రహ్మ మీక్షించి తపములభార మెడలి
యవ్యయానందలహరి నింపారవలయుఁ
గాక, తమకించి వట్టియాగ్రహము పూని
సేయుతామస తప మెందు సిద్ధిఁ బొందు? 327
వ. అని యోగనిరూఢి యెఱింగించి గోవిందశర్మ ధర్మనందను
నకు నటమీఁది కథ యి ట్లనియె. 328
తే. తనివి చాలక దినదినోత్సాహరతికి
మనసుగొలుపుచు మన్మథోన్మాద విస్మృతి
మఱచెఁ దన బ్రహ్మయోగ సమాధి బ్రహ్మ,
మన్మథ బ్రహ్మయోగ సమాధిఁ బొంది. 329
సీ. అంతకంతకు లతాంతాస్త్రరసాంభోధి
నోలలాడుచుఁ దృప్తి నొందలేక
బహువిధ రతులలోఁ బడి చిక్కి మగ్నుఁడై
దష్టాధరుండు నిర్దళితనఖుఁడు
గాఢపరీరంభ గంభీరకుచకుంభ
ఘర్మాంబు కలితవక్షస్స్థలుండు
నగుచు మన్మథ ముద్రి లవయవంబులకు నా
భరణంబు లై యుండఁ గరము మెఱసి

తే. ఘనతపోధ్యాన సంధ్యాదికములు, విధుఁలుఁ
దనకు రతితంత్రములె కాఁగఁ దలఁపు నిలిపె
వేదవిద్యా రహస్య వివేక మెల్ల
దగ్ధమై పోవఁ బ్రాల్మాలి తమ్మిచూలి. 330

—• { మాయాసరస్వతి శతరూపములు ధరించి బ్రహ్మను మిక్కిలి మోహింపఁ జేయుట. } •—

ఆ. లోలుఁ డగుచు నిట్లు నాళీకజాతుండు
నిమునమైనఁ బాసి నిలువ కెనయ
గాఢరతుల కోర్వఁగాఁజాల కామాయ
లలన నూఱు రూపములు ధరించె. 331

సీ. తారహారంబులు ధరియించి వెలిపట్టు
వలువతో నొకమూర్తి వన్నె మెఱసె
నలిన నాగ విభూషణములు ధరించి చెం
గావితో నొకమూర్తి కేవఁ జూపె
నవరత్న భూషణోన్నతిఁ జెంది చిత్రాంబ
రంబుతో నొకమూర్తి రంగుమీఱె
విరులసొమ్ములును దామరనూలిచీరయుఁ
గైచేసి యొకమూర్తి కరముఁ దనరె
తే. మృగమదశ్రీల నొకమూర్తి మేళగించెఁ
గుంకుమాదృతి నొకమూర్తి కొమరుమిగిలె
మఱియు వేర్వేఱు విధముల మండనముల
నలరె మాయాసరస్వతి నలువయెదుట. 332

క. ఇందుముఖ నూఱురూపులఁ
జెంది మనోజాతకళలఁ జెలఁగినఁ గడు నా
నందించి బ్రహ్మ ప్రీతిం
బొంది శతానందుఁ డనఁగఁ బొగ డొందె నృపా! 333

వ. అట్లు శతరూప విలాసంబులఁ గరంగించిన యమ్మించుఁబోఁడియందు శతానందుండు ననేక సంవత్సరంబులు సురతసౌఖ్యం బనుభవించె, నంత నారూపంబు లన్నియు నుపసంహరించి యెప్పటి రూపంబునెయ్యంబు చూపుచున్న గారవించి యొక్కనాఁడు సుఖపారవశ్యంబునఁ బట్టంబోయినఁ బట్టువడక కొలంకుల నొదిఁగియుఁ బొదరిండ్లఁదూఱియు నోలంబుల డాఁగియు నేఱయించుచు గుహా వెడలి తదీయద్వారంబున నిర్గమింప విరించి విరహాభారంబున కోర్వక వెనువెంట వెలికివచ్చిన, నచ్చట నగ్రభాగంబున నటమున్న యదృచ్ఛాగతుం డైన యమ్మునిశ్రేష్ఠుండు మునులతోఁ బ్రత్యుత్థానంబు చేసె నప్పుడు. 334

క. వెనువెంట బ్రహ్మ దగులఁగ
వనజానన తగులువడక వచ్చి తదగ్రం
బున మెఱుఁగుఁదీఁగె వోలెం
జననాథ! యదృశ్య యయ్యె సభ్యులు చూడన్. 335

చ. పొలఁతి యదృశ్యభావమును బొందినఁ దాపసవర్యు లద్భుతా
కలితమనస్కులై దిశలుగన్గొని యొండొరుఁజూచి ముందటన్

వలపుల సోలుచున్ మరునివాలికతూపులగండ్లతోడ నా
విలమతి నున్న పద్మజు, వివేకవిహీనునిఁ జూచి రంభయున్.

క. ఆ దిగులుపాటుఁ గంపము
నా దైన్యము నావిలక్షణాకారము నా
ఖేదము లజ్జయు నజు దుః
ఖోదధి కల్లోలపాల నూఁచె నరేంద్రా! 337

వ. అంత నది యంతయు విష్ణుమాయావికారంబుగా నెఱింగి
హరిం దలంచి మోహనిద్రముద్రితుండగు చతుర్ముఖునిఁ
బ్రబోధింప సమయం బగుటకు సంతోషించి బ్రహ్మవాది
యగు మార్కండేయుండు మునిసంఘుంబులతోఁ జేరం బోయి
నమస్కరించి యవ్విరించి కిట్లనియె. 338

సీ. దేవ! మహాత్మ! నీదివ్యావతారంబు
పరిణుతింపఁ ద్రైలోక్యపావనంబు
సృష్టికిఁ గర్తవు సేవ్యుండ వఖిలవే
దాగమవిద్యారహస్యవేది
వరయ నీ విట్టి మహానుభావుఁడ వజ్ఞు
నట్ల చింతాక్రాంతి నలఁగఁ దగునె?
యమరసంయమికోటి కారాధ్యుఁడగు విష్ణు
నాజ్ఞపూనుటయు నీ కనుచితంబె?
తే. నలఁగితివి పెక్కు విధముల నాన విడిచి
తెలియు మిఁక నైన హరిమాయ తేటపడఁగ

నది సరస్వతి గాదు మాయావధూటి
దానికై తపియింపకు మానసమున. 339

క. విడువు మహంకారము మదిఁ
బొడమింపుము బోధ; సకల భువనస్తుత మై
యడ రెడు సాత్త్వికగుణమున
నడువుము హరిఁ దలఁపు మనమునన్ సేవ్యునిఁగాన్. 340

మ. విలసద్బోధ పథంబు సాత్త్వికగుణావేశంబు తద్వృత్తిఁ బు
ష్కలవర్తుల్ చరియించుచో నిరతసౌఖ్యశ్రీలుచేకొంద్రు, దు
ర్మలినాహంకృతి నిర్మథించి వినుమార్యస్తుత్య!సత్యం,బహం
యులుతత్సాత్త్వికవర్త్యులట్లుగశుభంయుల్గారుసూచూడఁగన్

సీ. హరిమాయ జగములు, హరిమాయ యాకాశ
మరుదగ్నిసలిల భూమండలములు,
హరిమాయ బ్రహ్మలు, హరిమాయ యింద్రాది
సురకిన్నరోరగాసురగణంబు,
హరిమాయ సూర్యుండు, హరిమాయ చంద్రతా
రాగ్రహాతపతిమిరవ్యవస్థ,
హరిమాయగుణములు, హరిమాయ పంచేంద్రి
యస్మరవికృతి కామాదికంబు

తె. ప్రభవోత్సాహ వీర్య శౌర్యములు, జయము,
భయము, రక్షయు, హాని లాభములు, కృపయుఁ
గర్మతంత్రంబు హరిమాయ నిర్మలాత్మ
సత్యసాత్త్విక విజ్ఞాన సరణిఁ జూడు! 342

సీ. బ్రహ్మంబు హరిగాఁగ భావింపు బ్రహ్మండ
మండలి హరిగాఁగ మతినెఱుంగు
సత్యుండు నిత్యుండు శాంతుండు వేద్యుండు
చింత్యుండు హరి గాఁగఁ జిత్తగింపు
ముద్భవస్థితివిలయోత్పాదన క్రియా
కర్తత హరి గాఁగ నిశ్చయింపు
వేద వేదాంతాది విద్యార్థ తత్త్వంబు
హరి నిరంజనునిగా ననుమతింపు
తే. విమల విజ్ఞాన దీపంబు వెలుఁగఁజేసి
మూఢతాహంక్రియా క్రోధములు విడిచి
యాత్మనాయకు నవ్విభు నాశ్రయింపు
శాశ్వతైశ్వర్య సౌఖ్యంబు సంగ్రహింపు. 343

వ. అని సమబుద్ధి యగు నవ్వృద్ధముని యుపదేశించిన సత్య వాక్యంబులఁ బ్రబోధితుండై పితామహుండు విజ్ఞాన సుధా ధౌత దురహంకార పంకకళంకుండై విమలంబైన హృదయం బున భక్తి నిల్పుకొని యశ్రుధారాపూరంబులు దొరఁగు నయనంబుల దైన్యంబుదోఁప నూర్ధ్వబాహుండై ముకుళిత హస్తంబులతోఁ గరుణాసాగరుం డగు హరి నుద్దేశించి. 344

—♦ { బ్రహ్మకు జ్ఞానోదయమై విష్ణుమూర్తిని స్తోత్రము చేసి యపరాధ క్షమ చేయు మని వేఁడుట. } ♦—

ఆ. ఓ యనాథనాథ! యో కరుణోదధి!
యో భయాపహారి! యో మహాత్మ!

యో జగత్త్రయేశ! యో సురాసురపూజ్య!
కలుషబుద్ధి నైతిఁ గావవయ్య! 345

ఉ. నన్నపరాధిఁ గావుము వినమ్రుఁడ దీనుఁడ నీచకర్ముఁడన్
నన్నపుబుద్ధి వాఁడఁ గలుషక్రియుఁడన్ శరణాగతావన నా
భ్యున్నతమైన నీబిరుదు భూవినుతంబు మదీయదుష్కృతం
బెన్నక దివ్యచిత్తమున నెగ్గులు పెట్టునె తండ్రి పుత్రుపై ?

ఉ. నీ మహనీయమాయను గణింపఁగ నెంతటి వాఁడనేను మా
యామయదుర్వికారుఁడ నహంయుఁడ సంయమిభావితాత్మది
వ్యామరసేవ్య తావకశుభాకృతిఁ జూపి కృతార్థుఁ జేయవే
స్వామి సహస్రకోటి శిఖిచంద్ర దివాకరతేజ! సత్కృపన్!

సీ. సంతాప ముడుపవే జలజాయతేక్షణ!
కృపఁ జూడవే జగద్విపుల కీర్తి!
దీనత మాన్పవే త్రిభువనాధీశ్వర!
యభయ మీవే దేవతాగ్రగణ్య!
నిర్వేద ముడుపవే నిర్నిరోధానంద!
యండ గావే సముద్దండశౌర్య!
వికలత వారింపవే భక్తవత్సల!
సన్నిధి గావే ప్రసన్నహృదయ!

తే. దివ్యరూపంబు చూపవే దేవదేవ!
యాశ్వసింపవె సంరక్షితాశ్రితౌఘ!
గాగవింపవె సుజనమందారభూజ!
యాత్మనాయక! నామొఱ యాలకించి. 348

—◆ బ్రహ్మాదులకు విష్ణుమూర్తి విరాడ్రూపము కనఁబఱచుట. ◆—

వ. అని యిట్లు బ్రహ్మ యాబ్రహ్మంబు వేఁడినం గరుణించి. 348

క. పరమ విరాడ్రూపంబున
హరి సాక్షాత్కారమొందె నాదిత్య సహ
స్రరుచిన్ వెలుఁగుచు బ్రహ్మకు
వరదుండై మోహతమము వారింపంగన్. 349

వ. ఇట్లు పరమపురుషుం డగువిష్ణుండు బాలసూర్య ప్రభాపటల చటుల పద్మరాగ మణి ముకుట విటంక విలంబమాన పారిజాత ప్రసూన(మాలికా?)సౌరభ సౌభాగ్యంబు విస్తరించు మస్తక సహస్రంబును, శరచ్చంద్రచంద్రికాసాంద్రపరిభాఖండ పుండరీకదళంబుల వెదచల్లు విలోచనసహస్రంబును, మంత్రకళాధిదైవతమధుకర నికర సంకలిత చ్ఛందోబృంద మంజీర మంజరీ రంజితంబైన చరణారవిందసహస్రంబును, శంఖ చక్ర కౌమోదకీ శార్ఙ్గ నందక ప్రముఖ దివ్యాయుధ మయూఖరేఖాసమాశ్రయంబైనదీర్ఘబాహుసహస్రంబునుశోభిల్లఁ,గనకమణిఖచిత మకర కుండల హార కేయూర కంకణ ముద్రికా కాంచీలతాది దివ్యాభరణ భూషితుండును, వక్షస్స్థలస్థిత వైజయంతీ పరిగావరణ మధ్య ప్రభాసిత కౌస్తుభ పదక ప్రేంఖోల్లలిత లీలాభినంది తేందిరాసుందరీ మందస్మిత ద్యోతమానగండస్థలీ ముకుర బింబిత ముఖమండలుండును, దివ్య పీతాంబరధరుండును, దివ్య గంధానులేపమనోహరుండును, దివ్య సౌందర్య

ధుర్యుండును నై చరణాంగుష్ఠ నిష్ఠ్యూత సురసరిత్పూరంబుల నఖ కిరణ కదంబ కాదంబంబుల నోలలాడించుచు, దివ్య మాణిక్య శృంగసంగతంబై మూర్తిమంతంబై తోఁచిన మహామేరువు చందంబున నపరిమిత తేజోరాశియై శృంగార వీర కరుణాద్భుత రసస్వరూపం బగురూపంబునం బ్రదీపించుచు నిత్యముక్తులైన సనకసనందన సనత్కుమార వామదేవ నారదాది బ్రహ్మయోగీంద్రులు చామర ఛత్త్ర ధ్వజాది సేవావిధానంబుల నుభయపక్షంబులం గింకరులై సేవింప నాభివలన నంతరిక్షంబును, ప్రాణంబులవలనఁ బవనంబును, ముఖంబువలన బ్రహ్మనలేంద్రులును, స్వేదంబువలన నద నదీ సముద్రంబులును, పాదంబులవలన భూమియుఁ, జూపుల వలన సూర్యుండును, మనస్సువలనఁ జంద్రుండును, శ్రోత్రం బులవలన దిశలును గల్పించి, బ్రహ్మనాదంబున నోంకారం బును, దివ్యభాషణంబుల వేదంబులును, శ్రవణ నాసికారంధ్ర రోమకూపంబులవలన వసురుద్రాదిత్యవిశ్వేదేవయక్షరాక్షస సిద్ధవిద్యాధరాప్సరో గణంబులును, చతుర్విధ జంతుసం తానంబును నుద్భవింపంజేయుచు, నవాఙ్మానసగోచరప్రభా వం బైనయా తేజంబు చూఁగనశక్యం బని కరుణించి మార్కండే యాదిమునీంద్రసంఘంబునకును, నార్తులై ప్రార్థించు న వ్విరించికిని దివ్యదృష్టిం బ్రసాదించె నప్పుడు. 350

ఆ. లక్షసూర్యమండలము లొక్కనదువునఁ
గూడియున్న నైనఁ జూడవచ్చుఁ

గాని, యట్టి దివ్యమైన తేజముచూడ
నరిది వినుము పాండవాధినాథ ! 351

క. ఆతేజోమూర్తి సుమీ
భూతలవర ! నీమఱంది!, పురుషవరేణ్యుం!
డాతత కరుణాజలనిధి!
యాతురబాంధవుఁడు! కృష్ణుఁ!; డరయుము బుద్ధిన్! 352

క. నయవంతులు దృఢయోగ
ప్రియతధ్యానానుమాధి భావములోన
నియమించి కాంచుతత్త్వ
దయ మాతేజంబు సుమ్వె! ధర్మనిధిష్ఠా! 353

క. ఆముని సంఘము, దాను
దామరరాచూలి యద్భుతంబును భయముం
బ్రేమము భక్తియుఁ బొడమఁగ
భూమింబడి పొరలిపొరలి పొరిఁ బొరి మ్రొక్కెన్. 354

వ. ఇట్లు వా రెల్లరు సాష్టాంగదండప్రణామశతంబులు సమర్పించి; రప్పుడు పద్మసంభవుండు, పరమవిరాడ్రూపంబునం దసవంటి బ్రహ్మలను సురాసురాదిజంతు సంతానంబును బుట్టించుచుఁ, దన చేసిన యంధకారంబు విరియించుచుండు తేజోరాశియై యున్న యన్నారాయణుని నవలోకించి పులకించి దృగంచలంబుల వెడలునశ్రువులు రెప్పలతుద వప్పళించుచు మోద్పుఁగేలుదోయితో నోంకారపురస్సరంబుగాఁ బురుషసూ

_త్రంబును నారాయణోపనిషత్తును జదివి వేదశాస్త్రపురాణేతి
హాసపర్యాయంబున నిట్లని స్తుతియించె. 355

సీ. జయ! పరబ్రహ్మ శాశ్వత నిరంజన నిర్వి
కల్ప నిత్యానంద కవివరేణ్య
జయ! త్రిగుణాతీత సత్యస్వరూప ని
ర్మల శాంత పుష్కలారాధ్యచరిత
జయ! మహాయోగీంద్ర! జయ! సాంద్రకారుణ్య
జయ! యగణ్యాకార జయ! యనంత
(జయ! సమస్తాధార! జయ సర్వసంచార!
జయ! విచిత్రవిహార! జయ! ముకుంద
తే. జయ! జయ! వినోదవిహిత విశ్వప్రపంచ!
జయ! జయ! వికారరహిత నిశ్చలమనోజ్ఞ!
జయ! జయ! నిరస్త సకలదోషప్రచార!
జయ! జయ! మహోజ్జ్వలా! జయ! జయ! పరేశ!) 356
సీ. వేదాఘములు నీవ వేదోపనిష దర్థ
రాద్ధాంత తత్త్వసారంబు నీవ
ధ్యానంబు నీవ ధ్యేయస్వరూపము నీవ
తత్ఫలారూఢ మోదంబు నీవ
ప్రకటిత బహుతరబ్రహ్మాండ నిర్మాణ
కుశలుండ వీవ తద్గురుఁడ వీవ
జననరక్షాలయాచరణ దక్షుఁడ వీవ
జీవాత్మపరమాత్మభావ మీవ

తే. పూజ్యపూజక పూజా విభూతి వీవ
పంచ తత్త్వాశ్రియును నీవ పరమపురుష
వర్తి వీవ చిదానందమూర్తి వీవ
త్రిభువనోదారచారిత్ర ! శ్రీకళత్ర ! 357

సీ. బ్రహ్మాండ కోటులు ప్రభవించు నీమహా
మాయఁ దద్బ్రహ్మాండమండలముల
కధిపతు లైన బ్రహ్మ లనేకు లఖిల చ
రాచర విధసృష్టి యాచరించు
వారు తత్సదృశు లుదార తేజులు బ్రహ్మ
మను మహేంద్రాదులు మఱియుఁ గలరు
పరికింప లోకాధిపత్యమాత్రము బ్రహ్మ
గాని సామర్థ్యంబుకలిమి నంత

తే. కంటె యోగీంద్ర దివ్యసంఘంబు గలదు
తలఁప నిటువంటి దగుసృష్టి కలనలోన
నొకఁడ రాజసదురహంక్రియోద్ధతుండ
నీశ! నీతత్త్వ మెఱుఁగ నే నెంతవాఁడ? 358

క. నీపాద సేవకులలో
నేపారఁగ నొకనిఁ గాఁగ నెఱుఁగుము కరుణా
రోపమున; బ్రహ్మపదవీ
వ్యాపారము చాలు నాకు నఖిలాధిపతీ. 359

చ. ఘనుఁడుమృకండుపుత్రుఁడుజగద్వినుతుండతఁడేమొచెప్పెఁజె
ప్పిన హితభాషణంబు లవి బేలతనంబునఁ జేయనైతి నాఁ

డనుమతిఁ జేసి మత్సర మహార్ణవ మగ్నుఁడనై చలంబునన్
జనక! తదీయ దోషము మనంబునఁ బెట్టక ప్రోవవే దయన్.

క. నీతత్త్వ నిశ్చయస్థితి
నాతరమె యొనర్ప లోకనాయక! విద్యో
పేతులు యోగీంద్ర వరులు
నాతురమానసులు గాఁగ నవ్యయపురుషా! 361

వ. అని విన్నవించిన విరించి ననుగ్రహించి క్రమ్మఱ బ్రహ్మాధిపత్యంబును విజ్ఞానోదయంబును గరుణించి చతుర్దశ భువనంబులకుం బ్రమదం బొనర్చి సకల సురాసురార్చితుండై మార్కండేయునివీడుకొల్పి తన్నుఁగూర్చిమాయాజయంబునకై తపంబుసేయు నమ్మందర గిరివాసు లగుమునీంద్రులకు దివ్యసాయుజ్యంబు ప్రసాదించి యంతర్హితుం డయ్యె నప్పుడు.

—• బ్రహ్మ యథాప్రకారంబు బ్రహ్మాధిపత్యంబు సేయుట. •—

తే. బ్రహ్మతేజంబుతోఁ దొంటి పగిది బ్రహ్మ
బ్రహ్మసింహాసనాగ్రవిభాసి యగుచు
భువనములు నడ్పుచుండె విభూతిమెఱసి
బ్రహ్మముని దేవదానవ ప్రతతి గొలువ. 363

—• ఫలశ్రుతి. •—

క. బ్రహ్మస్వరూప మగు హరి
బ్రహ్మకుఁ దనకేళిచూపి పరఁగినపరమ
బ్రహ్మోపదేశచరితము
బ్రహ్మానందము నొసంగుఁ బార్థివచంద్రా! 364

వ. అని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పె ననిన విని పరీక్షి
త్తట మీఁదటి కథాప్రసంగం బెట్లుండె నని శుకబ్రహ్మ
నడుగుటయును. 365

శా. గంగాసంగపదాంబుజద్వయయశోగంగాతరంగావళీ
రంగత్పద్మభవాండ! కుండలికులేంద్రప్రౌఢపర్యంక! సా
రంగాంకాభరణాద్భుతప్రక్రియకర్మస్ఫారసంసారఘో
రాంగారార్తసుధాపయోధర! జగద్వ్యాకీర్ణపుణ్యోదయా!

క. శుక సనక సనందన శౌ
నక భీష్మ వ్యాస విదుర నారద పవమా
నకుమార ప్రహ్లాద బ
లి కిరీటి వసిష్ఠముఖ ఫలిత సురభూజా! 367

తే. చతుర్వేదవేద్యా చతుర్వక్త్ర చోద్యా
చతుర్ముక్తి దాతా! (చతుర్వర్గనేతా!)
సతీయుక్తవత్సా! సతీవామపత్సా!
సతీమాతృపాదా! (సతీనేత్రమోదా!) 368

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ
కృష్ణభట్టారకపౌత్రి చింతలపూఁడి కామయప్రభుపుత్ర
సుకవివర్య రాధామాధవయెల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు
తృతీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

# విష్ణుమాయానాటకము.

---

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరాధామదవద్వ
క్షోరుహమకరీకలాపశోభసముద్రా
ప్రారంభ విజృంభణాశిత
ధారానఖజాల ! నవమదన గోపాలా ! 1

తే. అ ధరింపుము దేవ ! సంయమివరుండు
సకల వేదాంత విద్యా విశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మఱియు
నింపుగా నాపరీక్షిన్న రేంద్రుతోడ. 2

వ. ఇవ్విధంబున శతానందునికథ చెప్పి గోవిందశర్మ ధర్మనంద
నునకు విష్ణుమాయువలన శివుండు మోసపోయినతెఱంగు
విశదంబుగా నెఱింగింప సమకట్టె. 3

మ. విను విశ్వక్షితిపాలమౌళివలభీవిస్ఫారరత్నప్రభా
కనదుద్దామపదారవింద ! త్రిజగత్కల్యాణచారిత్ర ! పాం
డునరేంద్రోత్తమపుత్ర! యీమునిగరిష్ఠుల్ నీవునుంగూడిమెం
దునకుం జిత్తముఁ బోవనీక హరియందున్నిల్పిసంప్రీతితోన్.

వ. అని కొలువు సావధానంబు గావించి. 5

— సముద్రమథనప్రశంస. —

సీ. ఆదికాలమున మాయావక్రి యగుచక్రి
యనుమతి నమృతార్థ మమరగణము
నమగారిగణము దుగ్ధాంభోధి మందర
మంథానమునకు సమగ్రశక్తి
నహిరాజ దామకం బడరించి మథియింపఁ
బుట్టె నుగ్రానలస్ఫూర్తిఁ దొలుతఁ
గాలకూటము, దానిగతి కోర్వఁగాలేక
దేవదానవు లార్తిఁ దిరుగుపడఁగ
తే. హరికిఁ బ్రియముగ వారికి నభయ మిచ్చి
యావిషజ్వాల ఫాలాక్షుఁ డాహరించి
కాలకూటాశనుండు నా ఖ్యాతివడసి
తారగిరి కూటమున కేఁగె ధర్మతనయ ! 6
సీ. కల్పపాదప పంచకము నప్సరస్త్రీలు
కామధేనువును జింతామణియును
నుచ్చైశ్శ్రవంబు, మదోత్కటం బగుచతు
ర్దంతియు జనియించెఁ దరువఁ దరువ
నవి యింద్రభోగ్యంబు లయ్యె వెండియు లక్ష్మి
యును దులసియు జనించిన విరించి
జనకుండు విష్ణుండు సంప్రీతిఁ జైకొనెఁ
గ్రిమ్మఱ నమృతకుంభమ్ముతోడ

తే. సకలలోకైకరక్షా విశాలబుద్ధి
యంత ధన్వంతరియు నుదయంబు నొందె
మహితమందరమంథానమథ్యమాన
మానితాంభోనిధానంబుమధ్యవీథి. 7

క. కుముదమున జృంభితం బగు
హిమ జలపూరంబువోలె హృదయోత్సవమై
విమలస్ఫటికఘటంబున
నమృతము పరిపూర్ణరుచుల నమరెం జూడన్. 8

ఉ. అయ్యమృతంబుచూచియమరాసురసంఘములబ్ధిఁద్రచ్చుటల్
సయ్యన మాని రంత బలిశాసన మూఁది సురారు లుద్ధతిన్
గొయ్యతనంబుతోనమృతకుంభముఁగక్కసనాక్రమించిమూఁ
కయ్యరుదెంచికొక్కెడ కందుకుఁబాలిడకోహటింపఁగాన్.

క. వెలవెలఁబాఱిరి వేల్పులు
తల చెదరి, సుధాఘటంబు దైత్యులు గొనినన్
బలవంతులు గొనునర్థము
బలహీనులు మగుడఁ గొనుట భారము గాదే? 10

క. పాలీక యమృతకలశం
బాలీల సురారికోటి హరియించిన దే
వాళి యుపాయవిహీనత
నాలం బొనరింప సేన నడరించుటయున్. 11

తే. భూతభావిభవత్కాలముల విశేష
గతులు దెలిసిన యమ్మహాకార్యవేది

శౌరి యిది వేళ గా దని సంజ్ఞఁ జేసి
జంభమర్దనసైన్యసంరంభ ముడిపె. 12

చ. హరిహయుఁ డబ్జలోచనునియాజ్ఞ బలంబులఁగుస్తరించి సం
గర మెడలించి యియ్యె మెసఁగన్ నయవాక్యవిశేషచాతురీ
గరిమను బాలువెట్టుఁడు సగం బమృతంబని చేరిపల్కుచున్
వెరవున రాక్షసేశ్వరుల వేఁడుచునుండఁగ నంత నవ్వలన్. 13

— విష్ణువు మోహినీకాంత యగుట. —

మ. త్రిజగన్మోహనమూర్తి యైనహరి నారీరత్నరూపంబునన్
గజయానంబున, నందియ ల్మొరయ వీక్షాపుండరీకచ్ఛద
వ్రజముల్ సల్లుచు మందహాస మెసఁగన్ వక్షోజముక్తావళీ
భజనన్ వే చనుదెంచెఁ గామకళనాపాథోధికల్లోలమై. 14

తే. అలసయానంబుతో వచ్చి యమరదైత్య
బలమునడుమ విలాసంబు పరిఢవిల్ల
మోహమాయాంధకారంబు ముంచుకొనఁగ
నిలిచె శృంగారమూర్తి నానీలవేణి. 15

ఉ. వెండియు దుగ్ధసాగరము వెల్వడి వచ్చెనో లక్ష్మి నా మరు
న్మండలము న్మరుద్విమతమండలమున్ మదనార్తిఁ బొందియొం
డొండ సమాకులం బగుచు నుల్లసిలన్ దరహాసచంద్రికా
మండితదృక్సుధాలహరి మానిని ముంచె సమస్తలోకముల్.

మ. తరళత్వంబు విలోచనంబులకుఁ జేతఃపంకజశ్రేణి కా
తురభావంబు నిదాఘ మంగములకున్ దోడ్తోన పాటిల్ల నా

సరసీజానన పుష్పసాయక సహాస్రశ్రీకశృంగార సా
గరమూర్తిం జనుదెంచి నిల్చెను దివౌకఃపూర్వదేవావళిన్.

సీ. తరుణారుణాంఘ్రిపద్మద్వయీలాక్షావ్రి
భాస్ఫూర్తు లింద్రగోపములు గాఁగ
నవరత్నఖచితమండనబహుచ్ఛాయా క
దంబంబు శక్రచాపంబు గాఁగఁ
గుచకుంభచిత్రితగోరోచనాపత్త్ర
లతలు సౌదామనీ లతలు గాఁగ
గమనలీలోచ్చలత్కచభారవిచికిల
సూనముల్ వడగండ్ల సొంపు గాఁగ,

తే. కాంచిఘంటానినాదంబు గర్జ గాఁగ
లలన కందర్పపర్జన్యలక్ష్మివోలె
దివిజ దైతేయ చాతకోత్సవము గాఁగ
వాలుఁజూపుల నమృతంపు వానఁ గురిసె. 18

సీ. ఆత్మసంజాతరోషానలచ్ఛట పెంపు
విరహసద్దావాగ్ని నిరవుకొనియె
వైరిబాణోన్ముఖత్వంబు నేత్రాపాంగ
పటుశాత శరపరంపరలఁ దొడరె
నన్యోన్యలక్ష్మీసమాహరణప్రీతి
యౌవన సంపత్తి నావహించె
సమరభూ జయసముజ్జ్వలకీర్తి సంసక్తి
వికచహాసేందు చంద్రికలఁ గలిసె

తే. నమృతకుంభంబుపై నున్న యాళి రుచుల
మించుకుచకుంభయుగళంబుమీఁద నిలిచె
నేమిచెప్పుము? నింద్రాసురేంద్రముఖుల
కాడగనమ్మోహనాంగి ప్రత్యక్షమైన! 19

సీ. అభినవలీలాసితాంభోరుహం బని
కమనీయ ధవళశంఖం బనియును
శృంగారముగ నిండు చెంగల్వక చ్ఛని
ప్రభ మించు కౌస్తుభాభరణ మనియుఁ
బసుపుఁ గుంకుమచాయ పట్టు పుట్టం బని
సిరి మించు కనకకౌశేయ మనియుఁ
గ్రొత్త హత్తించిన లత్తుక రస మని
కమలరజోమిళద్గంగ యనియుఁ

తే. గామపరవశయై యున్న కామిని యని
విష్ణుకితవవిలాసినీవేష మనియుఁ
దలఁచు నసురామరర్షిసంతతి పొలంతి
యైన దైత్యారిమేనిచిహ్నములఁ జూచి. 20

— మోహినీకాంతను జూచి సురాసురులు మోహపడుట. —

తే. అటుల నమ్మోహినీదేవి నమరగణము
నసురగణమును వీక్షింప నసమబాణ
కల్పలతవోలె మదనాగ్నికళికవోలె
సంతసంబును దాపంబు సంభవించె. 21

శా. మాయానిర్మిత విశ్వలోకుఁడగు శ్రీమద్వాసుదేవుండు తా
మాయామానినియై విలాసకలనా మాధుర్యముం జూపఁగా
నాయింద్రాసురరాజసైన్యముల యేలా? మోహవిభ్రాంతులై
శ్రేయస్సిద్ధ మునీంద్రులైన మదనార్చిష్మచ్ఛిఖం గ్రాఁగరే?

శా. ఆలీలావతి సర్వమోహన కళాహంకార రేఖాస్థితిన్
లీలాలంకరణాభిరామ యగుచున్ లేఖాసుర శ్రేణితో
మేలంబాడుచు రాఁగ నిందిర బలులున్ మీనాక్షి వే డాసి ర
ట్లాలోకింపఁగఁ గర్మయుగ్మక మవిద్యం జెందు చందంబునన్. 24

వ. అప్పుడు.

చ. ఇది తన యిచ్చ నుండెనిదొ యెవ్వని కైన నధీన యైనదో
మదననిధాన దేవతకు మాఱటయై విలసిల్లుచున్న దీ
మదవతి యెవ్వతేనియును మానక పట్టెద నేన నేన యి
య్యదనున నంచు నిద్దఱుఁ బ్రయత్నమునొందిరి రెండుసేనలన్.

క. ఆ మాయామోహినియును
నామెయి దరహాసచంద్రికామృతవీక్షా
దామముల వాని వానికిఁ
గామించిన యట్లు మేలు గైకొల్పె నృపా! 26

వ. అవ్విధంబున నాదేవేంద్ర బలిదానవేంద్రులు సాంద్రానురా
గంబున దగ్గఱిన మొగ్గరంబులు విడిచి సకలసైన్యంబులు నొక్క
పెట్టునఁ జెలియలికట్ట నతిక్రమించి వచ్చు సమయసముద్ర
తరంగ సంఘంబులభంగిఁ జుట్టుకొని యాలతాంగి యంగ
లావణ్య సరోవరంబున నోలలాడుచూపులును, వానికి

మున్నాడి యయ్యిందువదన దరహాస చంద్రికామృతపూరం బాస్వాదింపం దివురునాలుకయును, దానిందలకడచి యాపద్మగంధి బంధురశారీరసౌరభం బాఘ్రాణింపం దలంచు నాసికయును దానిం దోలిచి యాశుకవాణివీణామధురభాషణమకరందబిందు శైత్యంబునం బరిణమింపం దలపెట్టు వీనులును, వాని నతిక్రమించి యాయువతి యౌవనమదోద్వృత్తపయోధరకుంభపరిరంభణంబునకు నభిముఖంబులై గరుపాఱుమేనులును నై, పంచేంద్రియంబులు నిస్తంద్రంబులై హృదయంబును బోధింపం జూచుచుండె నయ్యవసరంబున నాబింబాధరకు దేవరాజ దనుజరాజు లిట్లనిరి. 27

ఉ. ఎక్కడనుండి వచ్చితిటు లెయ్యది నీశుభనామ వర్ణముల్
నిక్కము చెప్పి వీనులకు నెయ్యమొనర్పుము! స్వేచ్ఛదానవో
యొక్కని యాలవో సురనరోరగముఖ్యులలోన; నీక్రమం
బక్కజమయ్యెడిన్ సరసిజానన! చూడము నిన్ను నెన్నఁడున్.

క. మాయంతఃకరణంబులు
నీయెడ ననురాగ లీల నిలిచినవి యన
న్యాయత్తములై చిత్తభ
వాయుధకృత్తంబులై సురాసురపూజ్యా! 29

వ. అనిపలికిన, నాకలికిచిగురాకుఁబోఁడి వాఁడిదేఱిన నిడువాలుఁ జూపుల సేనపయిం గెలువరేకులవాన గురియుచు మందహాస మధురంబులైన మృదువాక్యంబుల నిట్లనియె. 30

శా. ఏనిచ్ఛావతిన్నై చరింతుఁ, బతిలేఁడెవ్వాఁడు నాకొక్కరుం,
డేనాఁడుంగనుదృష్టిపెట్టె మదిలో నెవ్వాఁడు నే వాని బ్రి
హ్మానందంబునఁ దేల్తు;వేఱెయొకచో నాసక్తుఁడెవ్వాఁడు దా
వానిం గైకొని, తాపదగ్ధుఁ డయిపోవంజేతు నాపోకలన్. 31

సీ. నా నెఱిఁ జూచిన ననుపారి యతులైనఁ
దలఁ పొందుదిక్కులఁ దగులనీరు
నా నామవర్ణముల్ వీనులఁ బడనేని
విజితేంద్రియులకైన వేడ్క నిలుచు
నా దృష్టి సోఁకిన మోదించి నిర్వాణ
మతులైన నాయొద్ద మరఁగి యుంద్రు
పొందుగా నామైత్రిఁ జెందిన బ్రహ్మ యో
గీంద్రులకైనను నింపు పుట్టు

తే. చూచి చూడఁగ లేరు నాసొబగు జనులు
మేలు గలచోట వర్తింతుఁ గేళిగతుల
నెవ్వ రేలాగు ననుఁ గూడ నిచ్ఛగింతు
రట్ల నేనును వారల ననుసరింతు. 32

వ. ఇది యస్మదీయ ప్రవర్తనంబు,మీరలు దుగ్ధజలనిధి మథించి యమృతంబు సంపాదించి సహృదయత్వంబునం బంచుకొన నేరక విరసించి పోరఁదలంచితిరని గగనవాణివలన విని యీ యిరువాఁగునకుం బోరులేకుండ నమృతంబు పంచిపెట్టెదనని వచ్చితి, మీ రెండు దెఱఁగులవారికి సమ్మతంబగునేని యొక్క పక్షంబున నానేర్చినట్లు పంచిపెట్టెదఁ గాదేని యెందేనియుం

భోమెద నని యనురాగంబు నెఱపి తగవు దోఁపఁ బలికిన
నందఱు నేకవాక్యంబున నిట్లనిరి. 33

ఉ. వీనులు సంతసిల్లె నరవిందదళేక్షణ ! తావకీనవా
చానయమాధురిన్ సకల సమ్మతమయ్యె భవత్ప్రియోజనం
బీనిపుణత్వ మీజగతి నెవ్వరి కున్నది? మమ్ము మన్మథా
ధీనుల నీసురాసురుల నేలుము పుణ్యకటాక్ష దృష్టులన్. 34

క. అమృతము మా కేఁటికి నీ
యమృతోత్కృష్టంబులైన యాలాపములున్
మమకారంబును జాలదె?
రమణీ ! నీయాజ్ఞ మాశిరంబుల నిలిచెన్. 35

క. నీమాట కడుగు దాఁటము
నే మెవ్వర మిందు; మాకు నియమముగా నీ
కోమల చరణాబ్జంబులు
భామిని ! ముట్టుదుమె నీకుఁ బ్రియ మొందన్? 36

వ. అని సమయంబుచేసి రప్పుడు. 37

మ. అమృతం బేఁటికిఁ బ్రాణమేమిటికి రాజ్యంబేలయన్యాభిలా
షములంజెందు సుఖంబు లేలమదనోత్సాహోద్భవైతద్వధూ
కమనీయాధర పానసంజనిత సౌఖ్యం బబ్బినం జాలు నం
చమృతంబిచ్చిరిదానవుల్ వారికిమాయామోహినీమూర్తికిన్

ఆ. అమృతకుంభ మిచ్చి రంభోజపత్త్రాక్షి
కాత్మజీవరక్ష యనక యసురు

లేణలోచనలకు నీరానివస్తువు
గలదె యెట్టిదైనఁ గాముకులకు? 39

వ. అట్లు ప్రముఖులైన రాక్షసులు దయాధర్మ విహీనులు గావునఁ జేతికందినఫలం బనుభవింపనేరక యయ్యమృతంబు మాయావి యైనహరిచేతి కిచ్చి యొక్క బంతిం గూర్చుండి రప్పుడు పురందరప్రముఖబృందారకులును దారొక్కవంక యైకూర్చుండి రిట్లు రెండు దెఱంగులవారును రెండుబంతులై యయ్యింతి తమ కమృతంబు వడ్డింపం గుతుచువేడుక నుండి రంత. 40

చ. అమృతముహస్తపంకజమునందు వహించి మురారి దేవతా
సమితికి నైజరూపమె ప్రసన్నము సేయుచుఁజూపెఁజేతి య
య్యమృతము; దానవాళికిఁక నాఁడుదనం బెప్రకాశమానమై
యమరగఁజేసి చూపె దరహాసరసామృత మాదరంబునన్.

క. కనకాంబర పల్లవయును
కనకాభరణ ప్రసూనకళికయు నై యా
వనఫలభరమున నొప్పెన్
వనమాలిని దనుజకల్పవల్లికపోలెన్. 42

వ. అవ్విధంబున దేవతలు తూర్పుమొగంబునుం బూర్వదేవతలు పడమటిమొగంబును నై ముందటఁ గనకమణిపాత్రంబులు వెలుఁగం గూర్చుండిన, నవ్వధూరత్నంబు ప్రయత్నంబున నమృతకుంభంబును నెత్తుగా వామహస్తపంకజంబున ధరించి

కనకదర్వీకలితదక్షిణకరారవిందయై యుత్తరముఖంబై నిలిచి రెండుబంతులుం గలయ నాలోకించి మొదలిబంతి నగ్రస్థానంబున నున్న దేవతాచార్యునకు బృహస్పతికి వడ్డించి, తదనంతరంబ యంతరాంతరవిశేషంబులు దెలిసి యాగంబులం బ్రథమహావిర్భాగయోగ్యుం డైన యిందుండును, జతుర్విధాహారంబులును దనజిహ్వాముఖంబులం బరిపాకంబుచేసి తొలుతఁ జవిగొన నర్హుం డైన వైశ్వానరుండును, సకల ధర్మంబులకు నాధారభూతుం డైనధర్మరాజును, బుణ్యతపోవిభవంబున దేవభావంబు వహించిన పుణ్యజనుండును, యదఃపతియై యమృతజనకుండు నైన వరుణుండును, జగత్ప్రాణుం డైన పవమానుండును, నవ నిధానాధీశ్వరుం డైన పౌలస్త్యుండును, నిఖిలైశ్వర్యధుర్యుం డైన యీశానుండును మొదలుగాఁ గల నసురుద్రాశ్వినేయప్రముఖులకు వడ్డించుచు నప్పటప్పటికిం దనయొయ్యారంబు చూపుచు,

సీ. అమృతకుంభము ద్రెద్దు నలవోక నొకచేతఁ
బట్టి పయ్యెదకొంగు బాగుపఱుచు,
నలవున నిలిచి యొయ్యన మేనిచెమటలు
మందానిలమునకు విందువెట్టు
ఫాలభాగంబునఁ బలుమాఱుఁ జెరలాడఁ
గొనగోళ్ల ముంగురుల్ గూడదువ్వ
నవనలతయై లీల నమృతంబు వెట్టుచు
సందెలు మొరయించు మందగతుల

తే. దొడ్డపిఱుఁదున వేగంబు దొట్రుపడఁగ
వ్రేఁగుఁజన్నుల నందునఁ దూఁగలేక
మరుఁదు సహచరుఁడై తోడుమలయుచుండ
నమరకోటికి వడ్డించు నమృతరసము. 44

ఆ. "అత్తతలవి చేతు, లంగడియవి కన్ను"
లనెడుజాడఁ జూపె నబ్జవదన
యమృత మమరకోటి కలవోక వడ్డించు
దితిజవరులమీఁద దృష్టిఁ బఱపి. 45

సీ. తనకుచంబులు చూడఁ గను పెట్టువానికి
సన్నపయ్యెదకొంగు జాఱవిడుచుఁ
దనయానమాటలు వినఁదలంచినవానిఁ
దగిలి యొయ్యన జాణతనము లాడుఁ
దనమనోభావంబు సెనయఁ గోరినవాని
కలఁతిమై దరహాసకలనఁ జేయుఁ
దన మన్మథోత్సుకత్వంబు నారయువానిఁ
గనుసన్నలోనన యనుమతించు

తే. నమృతమునకంటెఁ దీపియై యాత్మలోన
నుభయసైన్యంబులకు లోచనోత్సవముగ
నాఁడువారలవెడబూమె లాడుఁ గొంత
యమరకార్యాభిలాషి నారాయణుండు. 46

క. మాయా విలసనలీలల
నాయువతి సురారికోటి నటు భ్రమయించెన్

దోయజనేత్రల వలపులు
మాయలు గా కవియు నిజమె మహి నూహింపన్. 47

తే. అమృతపూరంబుఁ గ్రోలునయ్యమరతతికి
నాత్మ కింపైన తృప్తి లేదాయె నపుడు
రమణిమందస్మితామృతరసముఁ గ్రోలు
నసురసంఘంబునకుఁబోలె నవనినాథ! 48

వ. ఇట్లు వడ్డించుచు వచ్చివచ్చి కడపటిబంతియందుఁ దనకీర్తి
ప్రతాపంబులుంబోలె వెలుఁగారు చంద్రసూర్యులకునమృతం
బొసంగి తనరాక కెదురుచూచుచు వేగిరపడుచున్న క్రవ్యా
దులు చెదరకుండ నభిముఖుండై మదనవికారలీలలు చూపు
చుఁ బరాకునఁ దోడిఁబడం దత్సమీపమున నున్న సింహికా
సూనునకు మాయాదేవభావకలితుం డగుటఁ దలంపక
యమృతంబు పెట్టిన, వాఁ డయ్యమృతం బుపయోగించు
సమయంబున నాచంద్రసూర్యులు వీఁ డమరారి రాహు
వని చక్రధరుని కెఱింగించి రప్పుడు. 49

చ. సరినమరారి రాహువని చంద్రుఁడుసూర్యుఁడుఁ బల్కుకంటె
మున్ హరియునెఱింగివీనిఁ దెగటార్పుదువన్న తలంపులోనతా
నరసిసహస్రభానుసదృశారసహస్ర సుదర్శనంబు శ్రీ
కరగతివచ్చి వానితల గ్రక్కునఁ ద్రుంచెనిమేషమాత్రలోన్.

క. రాహువుతలఁ ద్రుంచి మహో
త్సాహంబున బ్రిమరితిరిగి చక్ర మవార్యం

బై హరినిలయమునకు జగ
దాహ్లాదకరైకలీల నరిగె న్నిమిటన్. 51

క. కమలాక్షదత్త మగు నా
యమృతము సోఁకుటయు నమృతమై రాహువు మ
స్తము వెలిఁగె నాఁటనుండియు
నమృతకరార్కులకు వైరియై యది యుండెన్. 52

ఆ. మాయ నైన నెట్టిమతమున నైన నే
మరుల నైనఁ బగఱమనికిఁ జెఱిచి
ధర్మపరులఁ బ్రోవఁ దగు మహామతులకు
సాక్షి యౌనొ కాఁడొ చక్రధరుఁడు! 53

క. బృందారకులకు నమృతం
బందఱకు నొసంగి యపుడు హరియును జగదా
నందకర పురుషరూపము
నందుఁ బ్రకాశించె దివ్య మగురూపముతోన్. 54

వ. వెండియు దేవకార్య నిర్వాహకుండై నారాయణుండు తదవ
శేష సుధాకలశంబు సంరక్షింపుమని దేవేంద్రునిచేతి కిచ్చి
కౌస్తుభాభరణ భాసితుండును, శ్రీ తులసీ విలసితుండును
లక్ష్మీసమేతుండును నై విష్వక్సేనాదులు గొలువగరుడవాహ
నుండై వైకుంఠపురంబునకు విజయంబుచేసెనప్పుడు. 55

ఉ. అంతయుఁజూచి నివ్వెఱగునంది బలిప్రముఖుల్ నిశాచరుల్
కంతునిరిమ్మవాసి మదిఁ గంపము నొందుచుఁ గాలహీనులై

చింతయు వంతయుం గనలు జిక్కుఱు వక్కుఱు సేయలేచి దు
ర్దాంత సముద్రఘోషమునఁ దాఁకిరివానవదివ్యముఖ్యులన్.

—◆ దేవదానవుల కలహము. ◆—

మ. అమరేంద్రుండును నుగ్రుఁడై శిఖియమాద్యాశాధిపశ్రేణితో
సమరోత్సాహరసప్రసన్నముఖుఁడై సైన్యంబు మున్నాడి దు
ర్దమదోర్దండితమండలాగ్రఘనకోదండాస్త్రసన్నాహసంభ్రమ
మొప్పం దఱుమంగవీఁకఁ బొడిచెన్ రాత్రించరవ్యూహమున్.

క. కార్యంబు చెడినకతమున
వీర్యాధికు లయ్యు దనుజవీరులు మదిలో
స్థైర్యములు దక్కి యపగత
శౌర్యులగుచుఁ బఱచి రమరసంఘం బలరన్. 58

శా. ఆరీతిన్ దనుజవ్రజంబు గత శౌర్యాటోపసంరంభమై
పాఱన్, దైవతవల్లభుండును నిలింప వ్రాతసంస్తుత్యుఁడై
గారామార సుధాఘటంబుఁ గొని లోకంబుల్ ప్రశంసింపఁగా
ధీరుండై యమరావతీపురికి నర్థిం బోయెఁ జౌదంతిపై. 59

వ. అంత. 60

మ. దురహంకార మహానలార్చియగు నాదుర్వాసుశాపంబునన్
శరధింబడ్డ సురేంద్రలక్ష్మిఁ దిరుగన్ సాధించె, దైత్యేంద్రుల
న్మరులం బెట్టి సుధాఘటంబుఁ గొనియెన్, రక్షించె దేవావళిన్
సరిలే రాహరికాశ్రితావన సుహృత్సంరక్షులన్ దైవముల్. 61

వ. అని జగంబులు గొనియాడుచుండె నా వృత్తాంతంబంతయు
నెఱింగి కలహప్రియుండగు నారదమహామునీంద్రుండు తత్ప్ర

కారంబు శంభునకు విన్నవించి వెలుఁగుపఱతు నని గగన ఘంటాపథంబునం జని. 62

—విష్ణుని మోహినీ రూపకథను శివునితో నారదుఁడు చెప్పుట.—

ఉ. కాంచన గర్భనందనుఁడు గాంచె విలంబపయోదగర్జితో
దంచిత రత్నశృంగ కృతతాండవమత్త శిఖండి సాంద్రమున్
చంచలగాంగభంగపరిషంగపయోధినిషంగ దేహరు
గ్వంచిత పూర్ణచంద్రము సకల్మషతారధరాధరేంద్రమున్.

సీ. పార్వతీశంభుదంపతుల కేళీ సౌధ
మమర కన్యకల క్రీడాచలంబు
కనకనగస్వామి కెనయైన చెలికాఁడు
భూకామినీ శిరోభూషణంబు
జలజజాండాధార సంభృత స్తంభంబు
దశకంధరునిచేతి తమ్మిబంతి
గగనగంగాపతాకామణిదండంబు
పుష్కరశ్రీదేవి పువ్వుగద్దె

తే. కీర్తనలు సేయఁదగు పార్శ్వవర్తమాన
మందపవమాన చలగరున్మధుప లీన
వినుత కల్పద్రుమవితానవికచసూన
వాసనా శ్రీధరంబు కైలాస ధరము. 64

ఉ. రావణుబాహు దండముల వ్రెయ్యలువాసినరాలు రేకుల
ట్లై విలసిల్లఁగోణములయందు వెలింగెడు నింద్రనీలకే

ఖా విభవంబు తుమ్మెదలుగా రజతాచలరాజ మొప్పు ధా
త్రీవనితాలలామ కరదీపితకేళి సితాంబుజచ్ఛవిన్. 65

చ. భుజబలలీల నారజతభూధరకూటముల న్మృగేంద్రముల్
గజములఁబట్టఁ గొన్ని భయకంపమునన్ వడిఁ గాలుజాతి య
క్కజముగ గండశైలముల కైవడి ద్రొల్లఁగ వానిఁ బట్టి వా
యుజవముతోడఁద్రూల్చుశరభోత్కరముల్ గగనాంగణంబునన్

మ. కటకాగ్రంబులఁ గేసరుల్ కరుల వీఁకం బట్టుచోఁ బుట్టు త
త్పటుగర్జల్ దిశలన్ బ్రతిధ్వనులు చూపం దారశైలంబు దు
ర్ఘట నిర్ఘోషము నొందు నుగ్రముఖజాగ్రన్నారసింహోదయో
త్కటహుంకారహిరణ్యదానవసభాస్తంభంబుచందంబునన్.

చ. ఘులఘులఁ బాఱునభ్రనది కాలువ లున్నతచంద్రమశ్శిలా
తలమునఁ బడ్డఁ బెల్లెగయుతత్కణమండలి మింట దట్టమై
యలనడు వెండికొండఁ గొలువై వసియించినచంద్రమౌళికిన్
జెలు వలరంగ మీఁదవిరచించిన ముత్తెపుమేలుకట్టనన్. 68

సీ. కుండలీకృత భోగమండి తోన్నతఫణో
దారుఁడై యున్న శేషాహివరుఁడొ
ప్రతికృష్ణపక్ష విభ్రష్టేందు కళలు ప
ద్మాసనుం డొకప్రోవుఁ జేసినాఁడొ
యసమాక్షు లావణ్యరసము జాఱుచు నున్న
యుర్వీధరం బగుచున్నయదియొ
యల్లనాఁ డురులింగమై మిన్నుగాఁడిన
శాంభవోజ్జ్వల రుచిస్తంభ మిదియొ

తే. యనుచు శతకోటిచంద్ర చంద్రాతపంబు
తళుకునిగనిగ లాశలఁ దగులుకొనఁగఁ
జూడ నొప్పారు నమ్మహాక్షోణిధరముఁ
బద్మసంభవభవుఁ డెక్కెఁ బ్రమద మెసఁగ. 69

వ. ఇట్లు కన్నులపండు వైన యవ్వెండికొండ నధిరోహించి తదగ్ర రత్నశిఖరాభోగంబునఁ గనకమణిమయ ప్రాకార గోపుర సౌధవీథికాబద్ధ తోరణ వైజయంతీ విరాజితంబును, సతత వికసిత సురభి సురతరు కుసుమవిసర విసృమరపరిమళ మిళిత తరు పవన సహచర ముఖర మధుకర నికర మృదు నినద హృదయంగమంబును, ప్రతిగృహ గర్భనిర్భర ప్రతిశబ్దబద్ధానద్ధఘుమఘుమధ్వానమానితంబును, బలిసమయ సమాందోళిత కనకఘంటా ఘణత్కార మనోహరంబును, ప్రాసాద గోపురపురోభాగప్రతిష్ఠితవృషభధ్వజంబును, కనకకలధౌత దండ మండితాఖండమాణిక్య దీపమాలికా ప్రకాశితాంతర్గేహంబును, పంచాక్షరీప్రముఖ పాశుపతమంత్రజపధ్యాన పరాయణభరితంబును, ప్రమథగణమహితముక్తిమండపసహస్రంబును, నందికేశ్వర దండనాయక సభాసీన పురందర ప్రభృతినిఖిలదేవతాముని మండల మండితంబును, ప్రతిద్వారద్వారపాలకరకలిత కనకవేత్రలతాశతదురవలోకితంబును, నై జగదేకపూజ్యం బైన శివాలయంబు ప్రవేశించి తదభ్యంతరంబున.

సీ. గంగాకణాకీర్ణ ఘనజటాళితోడఁ బు
ష్పిత కల్పకములీల బెరయువానిఁ

గంఠహాలాహలకచ్ఛరచ్ఛవితోడ
నుదితపూర్ణమృగాంకు నోరయువాని
సామ్మైన శేషాహిచూడామణిశ్రీల
తోడ సహస్రాంశు దొరయువానిఁ
గరుణారసోర్మికాగాంభీర్యములతోడ
నుదధిరాయని భంగి నున్నవానిఁ
తే. గామకళ మెడ్మదిక్కునఁ గడలుకొనఁగ
బ్రహ్మతేజంబు కుడివంకఁ బ్రజ్వరిల్ల
యోగసింహాసనంబున నున్నవాని
శివుని దర్శించె మునికులశ్రేష్ఠుఁ డపుడు. 71
వ. ఇట్లు దర్శించి జయజయేతివచనపురస్సరంబుగాఁ బ్రదక్షిణంబు
చేసి బహుపరికారంబులం బ్రస్తుతించినం గరుణించి కాల
కూటహరణానంతరసముద్రమథనకథా ప్రసంగంబు వినఁ
జిత్తగించి విరించిసంభవునకు శ్రీకంఠుం డిట్లనియె. 72
తే. ఉదధి మథియించువేళ నీవున్నవాఁడ
వే కదా కాలకూటంబు వెనుక నందు
సంయమీశ్వర ! యేమేమి సంభవించె
నెవ్వ రేమేమి గైకొని రెఱుఁగఁ జెపుమ. 73
క. అని విషకంధరుఁ డడిగిన
విని హర్షావేశ మొదవ వినయాంజలియై
ముని విన్నవించె నప్పుడు
తనచూచిన యంతవట్టుఁ దత్పరమతితోన్. 74

చ. గగనము మ్రోచి బాడబశిఖానిచయంబుఁ దృణీకరించి క్రొం
బొగలు దిశావకాశములఁ బొంగ నభంగవిషాగ్ని యుగ్రమై
జగములు మ్రింగఁజూచినఁ, బ్రసన్నుఁడవై యుపసంహరించి దే
వగణముఁ గాచి దేవరవు వచ్చినవిమ్మట నాపయోనిధిన్. 75

మ. తరువందర్వఁగఁబుట్టెఁ గౌస్తుభము చింతారత్నమున్ గల్పభూ
మిరుహైరావత లేఖవాజులును, లక్ష్మీ నాకవేశ్యా సుధా
కర బృందావనముల్, సుధారసము, లోకఖ్యాతిగా; వాని శ్రీ
హరి దాఁ గొన్నిహరించి తక్కినవి దివ్యశ్రేణికిచ్చెన్ గృపన్.

శా. ఆకర్ణింపుము దేవ! యొక్కటి త్రిలోకాశ్చర్యకృత్యంబు నా
కాకోద్వేషులు మున్ సుధాఘటము గర్వోద్రిక్తులై బల్మిఁ దా
రేకైకొన్న సురాళి విన్ననయి యూహింపంగఁ, గంజాక్షుఁడై
యాకంజాక్షుఁడు గ్రమ్మఱం గొనియె దైత్యశ్రేణిచే లీలమై.

క. కొని తన త్రిభువన మోహన
వనితాలీలావిలాసవైఖరిచేతన్
దనుజులకు నిడక యమృతం
బనిమిషులకు నొసఁగెఁ జువ్వె యార్యారమణా! 78

క. ఆహరి లీలామాయా
మోహినియై మరులుగొలుప ముల్లోకములున్
మోహించె; నసురవీరుల
మోహాంధులఁ జెప్ప నేల మురజిన్మిత్రా! 79

సీ. అప్సరస్స్త్రీలు వీడ్రిదాసమలై తమ
మించు విభ్రమము నిందించుకొనిరి

యందఱు నాయల్లకార్తులఁ గావించు
వెడవిలుకాఁడును వెఱ్ఱి యయ్యె
నూర్ధ్వరేతస్కులై యుండు తాపసులకు
నధరరేతస్కంద మయ్యె నపుడు
తను వెత్తి పంచభూతంబులు సైతము
విరహాభారంబున విహ్వలించెఁ

తే. బద్మసంభవముఖులు విభ్రాంతులైరి
మొదల, నసురాధిపుల నతిమూఢజనులఁ
జెప్పఁగానేల లోకముల్ చిక్కువడియె
విష్ణుమాయావిలాసినీవిలసనమున. 80

క. ఎన్నఁడు విన్నది కన్నది
యెన్నినయది గాదు సువ్వె యేయుగముల న
వ్వెన్నుని మాయాస్త్రీత్వము
పన్నగధర ! పొగడఁ దరమె బ్రహ్మాదులకున్. 81

వ. అని సర్వమోహనకృత్యం బైన విష్ణుమాయాచరితంబు విన్న
వించిన విని శివుండు వెఱఁగుపడి నారదుమొగంబు చూచి
చిఱునవ్వు నవ్వి నాసికావిన్యస్తహస్తాంగుళిపల్లవుండై తల
యూఁచి యెంత మృష వలికె నీమునీశ్వరుం డనుచుఁ
బ్రియకాంత నవలోకించి. 82

క. హరి యీ భువనత్రయమును
దరుణీలీలామనోజ్ఞతలఁ గడు మోహా

తురముగఁ జేసెనటే యా
సరసత నేఁజూడ కేల సమ్మతిపడుదుర్గా. ౮౩

క. వైకుంఠంబునకుం జని
శ్రీకాంతుని కపటసుందరీ విలసన మా
లోకించి వత్తు నిపుడ య
నాకులమతితోడ నుండు మంబుజనేత్రా ! ౮౪

వ. అని ముక్కంటి పలికిన మందస్మితం బొనరించి యంబికా
మహాదేవి యిట్లనియె. ౮౫

—• పార్వతి శివుని నివారించుట. •—

క. దేవరవు మిక్కిలియుఁ గాం
తావివశాత్ముఁడవు మనసు ధైర్యము చలనం
బై వచ్చెనేని మఱితువు
భావింపఁగ సర్వభూప్రపంచం బెల్లన్. ౮౬

చ. జగములుమూఁడునాతనివశంబుననున్నవిమాయఁజిక్కియా
జగతిఁ బ్రధానదైత్యసురసంయములుం గమలాననుండు నా
దిగఁ గలవార లెల్ల వికృతిం బడుచుంద్రు తదీయలీల నే
మగునొసుమీమహాత్మ!జలజాక్షునిచేత భవత్ప్రతాపమున్.

తే. తలఁపు ధైర్యంబు పదిలంబుఁ గలిగెనేని
గట్టిగాఁ గామునకు బొమ్మగట్టితేని
నమ్మి పొమ్మని నగుచు నానగజ పలికె
హరుఁడు నవ్వుచు నాయింతి కనియె మఱియు. ౮౮

తే. సర్వమోహాంధ మైనయీజగముఁ జక్రి
మాయగొల్పుట యిదియెంత మహిమ చెపుమ
భూమి శిశువులఁ బ్రమయించు బూమెకాండ్రి
చేత నార్యుఁడు బ్రమయునే చిత్రవీథి. 89

ఉ. నాయవియింద్రియంబులు, మనం బెటుపోయినవానిసంగతిఁ
బోయెదు వాఁడఁగాను; నినుబోఁటుల లోకవిహారలీలకై
పాయకయుంటగాక మరుబారికి లోఁబడి యో! మృగాక్షి! నేఁ
డీయెడ నాజితేంద్రియత యెల్లను జూచెదు నిశ్చయంబుగన్.

వ. అని పలికిన హరుని యుద్యోగంబు నిశ్చయంబు సేయం గోరి
నారదుం డిట్లనియె. 91

—◆ శివుని నారదుఁడు తిరిగి పురికొల్పి రోషమెక్కించుట. ◆—

తే. ఆ మనోహర కామినీ హావభావ
విలసనంబును జూచిన వెఱ్ఱియెత్తి
దేవ! బ్రమసి తిరుగుదువు దీనవృత్తి
నింకఁ బదివేలమాటల నేలచెప్ప. 92

వ. అనినం గనలి యతనివచనంబు నిరాకరించి తన మహాను
భావత్వంబు ప్రకటించి యీశ్వరుఁడు ప్రమథగణములతో
నిట్లనియె. 93

—◆ శివుఁడు విష్ణుమాయకు లోఁబడనని పంతమాడుట. ◆—

ఉ. సిద్ధమతిన్ జితేంద్రియతఁ జెందితి దుర్విషయాభిలాషసం
బద్ధుఁడఁగాక దుష్కృతిని భావజు గెల్చినవాఁడ నత్తపో

వృద్ధ మనోవికాస మొదవించు చిదంశము, నిట్టినాకు దు
ర్బుద్ధులుకామినీజనులపోకలఁ జిత్తము సంభ్రమించునే. 94

క. నావుడుఁ దద్వచనంబులు
భావించి విరించి సుతుని భాషణములు సం
భావింపక ప్రమథులు గిరి
జావల్లభుతోడ ననిరి నందడిపడుచున్. 95

ఉ. దేవరముందటం గపటధీయుతుఁడైన సరోజనేత్రు మా
యావికృతుల్ సురాసురులయందు బలెం బ్రసరింప నేర్చునే
భూవలయంబు దిక్కులు నభోగతియుం గబళించు సంధకా
రావృతు లేమియూఁ జెవుమయక్కనిముందరనిందుశేఖరా.

క. మిము నెక్కడ భ్రమయించెదు
మము బ్రమయించినన చాలు మాయాతరుణీ
క్రమదుర్వికారముల నా
కమలాక్షుఁడు పెక్కుపలుకఁగా నేమిటికిఁ. 97

వ. అనిన మందహాసం బెసంగు సుందరాస్యంబుతో వారి నవ
లోకించి. 98

క. ఇప్పుడు మన కీపంతము
చెప్పఁగ నేమిటికి నలనిచేడియరూపం
బొప్పారఁ జూచి భ్రమయని
యప్పుడుగా యనుచు లేచె నభవుం డంతన్. 99

క. హరుఁ డా వైకుంఠమునకు
నరిగెడు సంభ్రమము హృద్యమై నారదునిఁ

బరితుష్టాత్మునిఁ జేసెను
సురదుందుభి నినద మెసఁగ సురపథవీథిన్. 100

సీ. భర్మసూత్రింబునఁ బదిలంబుగాఁగ ఘ
నవ్యాఘ్ర నాగాజినములు గట్టి
మంత్రపవిత్రి నిర్మలభూతి సర్వాంగ
కముల సాంద్రింబుగాఁ గలయ నలఁది
తరళజిహ్వాభీలదర్వీకరస్వామి
నలవోకఁ బేరుగా నలవరించి
పటుజటాజూటాగ్రభాగంబుపైఁ జంద్ర
ఖండంబు వెడపువ్వుగాఁగఁ దోఁపి

తే. దర్పకునిఁ దిన్నదహననేత్రింపు దీప్తు
లిటియఁ గప్పిన రెప్పలయొడల నిగుడ
దివ్యయోగీంద్రిమూర్తియై దివ్యతేజ
మెసఁగ రూపంబు గైకొనె నీశ్వరుండు. 101

క. ఆపాదఫాలభస్మో
ద్దీపితుఁడై నిర్వికల్పతేజోమహిమన్
బ్రాపించి యోగవిద్యా
రూపం బిది యనఁగ నపుడు రుద్రుఁడు పొలిచెన్. 102

వ. ఇట్లు నిర్వికారం బగురూపంబుదాల్చి నిజపంచాక్షరీ మంత్రి
విద్యాబలంబున దుర్విషయ కలుషేంద్రియ మహాభుజంగంబు
లకు వాకట్టు గట్టి పంచబాణుని బిరుదుపెండేరంబు నెట్టి

చిత్తంబు నుత్తమయోగంబునకుఁ దగులు పెట్టి దృఢనిశ్చ
యంబున. 103

క. హిమగిరిజా సహితుండై
హిమకరశేఖరుఁడు చనియె వృషభేంద్రమహో
ద్యమలీలాగతివిచల
ద్విమలశుభ్రాకుండలాంశువిభ్రమరేఖన్. 104

క. పేర్రకుఁ డై ముందర నా
నారదమునివల్లభుండు నడువఁగఁ బ్రమథుల్
చేరి యిరుగడల సేవా
పారీణతఁ జనిరి విజితభావముతోడన్. 105

శా. చూడం బోయిరి పావకేందురవితేజుల్ బ్రహ్మవిద్యాధికుల్
వ్రీడాశూన్యకటీరమండలులు నిర్విఘ్నాత్మయోగుల్ పరి
వ్రాడీశుల్ విజితేంద్రియుల్ శివ్రువిభావస్థైర్యమున్ వైష్ణవ
క్రీడామాయయు నెట్టులయ్యెడినొ తర్కింపంగనంచున్వడిన్.

క. హరిమాయాచాతుర్యము
హరుఁ డేక్రియఁ దెలియఁ గలఁడొ యరయుద మనుచున్
సురలుఁ నలుగడ నడచిరి
పౌరిఁ బౌరి వైకుంఠ నగరమునకుం బ్రీతిన్. 107

వ. ఇట్లు చనుచు నందుఁ గొందఱు దివ్యపురుషులు విష్ణుమాయా
పరీక్షేచ్ఛుం డై యేఁగువిరూపాక్షుని యక్షీణతేజోరూపంబు
గనుంగొని తమలోన 108

శా. కుంఠీభూతదురింద్రియాగ్రహుఁడు చక్షుష్పీతపుష్పాయుధో
త్కంఠుం డుగ్రవిలోచనుండు ఘనయోగధ్యానచిన్మూర్తి శ్రీ
కంఠుం; డట్టి మహాత్మునిన్ భ్రమలఁ జిక్కం బెట్టునట్లైనవై
కుంఠుం డెవ్వరి మోసపుచ్చఁడు కనత్ క్షుద్రైకమాయాగతిన్.

వ. అని వితర్కించి రంత నమ్ముందట 110

శా. భేరీశంఖమృదంగనాదములు బ్రస్ఫీతాంబరాభోగభా
గ్ధీరోద్యద్విహగేంద్రకేతనముఁ బ్రీతిన్ జేసెఁ జక్షుఃశ్రవో
హారశ్రోత్రవిలోకనంబులకు లోకానందకం దైకల
క్ష్మీరమ్యాచ్యుతరాజధాని కెదుటం జేరంగరా దవ్వులన్.

ఉ. మేలిమి ధూపధూమములు మించి మధువ్రతలీలఁ గ్రాల ను
త్తాల సువర్ణకేతన వితానదళంబులఁ దెల్లదీవిపైఁ
బోలఁగ మెట్టఁజెంగలువపోల్కి ముదంబునఁ దేల్చు రత్నరే
ఖాలలితాంశు గోపురము కంజదళాక్షుపురంబు శంభునిన్.

క. అతత పుణ్యోపేతము
శ్వేతద్వీపము తదగ్రసీమఁ బరిఖ
భూతాబ్ధిపురము లోక
ఖ్యాతం బది వేత్ర పొగడఁగా నేమిటికిన్. 113

తే. నెఱిఁ జతుర్విధపురుషార్థనిధులు మిన్ను
ముట్టి యున్నట్టు లొప్పు నప్పట్టనమున
గుఱుతుమీఱఁ జతుర్ద్వారగోపురములు
విశదమణిమయ వైజయంతికలతోడ. 114

చ. అమలినహారిహాటకమయంబులు నగ్రినరోజరాగకుం
భములును నైనమేడలఁ బ్రిభాకరబింబము దోఁచితన్మహో
ద్యమరుచిపుంజముల్ మెఱుఁగుతండము లీనఁగభానుకోటితే
జమున వెలుంగు నప్పుర మజస్రము ఖేచరదుర్నిరీక్ష్యమై.

చ. స్ఫటికమణి ప్రభాపటలభాసురగోపుర శృంగకోటి సం
ఘటనగ నేడు కోటలును గాక పదంపడి విశ్వకర్మ యు
త్కటమతిఁ బెట్టుకోటయనఁగాఁ గనుపండువుసేయు రాకలం
జటులసుధాబ్ధిభంగములసంఖ్యములాపురిచుట్టుఁదూలుచున్.

చ. వలయితరత్నవప్రము సువర్ణశిరోగృహరాజసంచయో
జ్జ్వలితము నైన యప్పురము సాగరమధ్యతటంబునందు ని
ర్మలపరివేషచక్రరుచిమండనమండితచంద్రభానుమం
డలిప్రతిబింబమోయనఁ గనం గడు నొప్పుఁ ద్రిలోకపర్వమై.

ఉ. సింగపుమోములుంగలుగుచిత్రరురూపము లప్పురోత్తమో
త్తుంగ సువర్ణ హర్మ్యములఁ దోరములై యటవేల్పుటేటినీ
టం గడు బింబితంబులగుటన్ గని నీళ్లకుఁ దెచ్చు యభ్రమా
తంగము భీతి మాన్పుదురు తచ్చలితాచలితప్రవాహులై.

చ. వననిధివీచికోచ్చలిత వారికణంబులు, నాపురంబులో
ఘనతరహర్మ్యకేతువులగాడ్పులఁ దూలుచు రాలు నభ్రవా
హిని జలబిందువుల్ చదలనింపగుఁ దన్మిథునోత్సవంబునన్
జన సురగామరాంగనలు చల్లెడుసేన లనంగ వెన్నెలన్. 119

చ. హరిమెదుటన్ బురందిర నటాంగనమై యలరించుమ స్తభా
సురకనకాగ్ర దండపరిశోభిత పూర్ణఘటాలివోలెఁ ద

ద్గరు గృహరాజసౌధమణికుంభపథంబున నూర్ధ్వలోకముల్
గరము వెలుంగు దిక్కులఁ బొగడ్తకు నెక్కె విచిత్రవైఖరిన్.

మ. హరినీలేందుశిలాభిరామ మగుచున్ హర్మ్యం బొకండగ్రభా
స్వరమాణిక్యఘటంబుఁ గేతనపటీసంపత్తియుం గల్గి య
ప్పురి వామాంగముఁ దామ్రజూటముమహాభోగంబుహారంబు
నుం గర మొప్పారెడు నాసదాశివునిరేఖన్ బొల్చు నత్యున్నతిన్.

చ. నవనలినప్రియోర్ధ్వకిరణ ప్రతతుల్ పురి వెండిమేడలం
బ్రవిమలరాగపల్లవవిభాసిత లై లత లట్లు సాఁగఁగాఁ
బవడపుఁదీఁగె లెక్కడకుఁ బ్రాఁకెడు నంచుఁ దదగ్రపంచర
ద్యువతులు పట్టి చేఁ దగులకుండఁగ నవ్వుదు రద్భుతంబునన్.

చ. త్రిపథగయే చతుష్పథగ దేవతరంగిణి చూడఁ డంచు రే
యి పురిఁ జతుష్పథాగ్రమున నిందుఁడు నిల్చిన నాల్గువీథులం
జపలతరస్ఫురత్కనకసౌధపరంపరలన్ సుధాకరా
తప రసపూరముల్ నిగుడఁ దద్దయుఁ జూతురు పౌరబాలికల్.

మ. హరిసౌధాగ్ర సుదర్శనార కలితం బై చిత్రవర్ణాకృతిన్
సురుఁగన్ వ్రేలుచుఁ గేతనాంబరముఁ బొల్చున్నాఁడు రాహుగ్ర
హోద్ధురమూర్ధంబటుఁ ద్రుంచివైచునెడ నెందుం బోక రక్తాంక
మై పరిభాసిల్లు తదీయభోగలతయన్ భావంబునం దత్పురిన్.

చ. బహుకుసుమోపహారములఁ బ్రస్ఫుటమౌక్తికరంగవల్లులన్
బ్రహితవిచిత్రతోరణ పరంపరలన్ శశికాంత వేదులన్
రహిఁ బచరించు నప్పురవరంబు పథంబులు శ్రీకరంబు లై
సహజమె శ్రీనివాసములు సంతతమున్ సదలంక్రియాస్థితుల్.

శా. కేళీసౌధముఁ, గేళిడోలికయునుం, గేళీవనశ్రేణియుం,
గేళీశైలముఁ, గేళిదీర్ఘికయునుం, గేళీమరాళంబులున్
బోలన్ లేనిగృహంబు లేదొకటియుం బూఁబోఁడ్లు ప్రాణేశులున్
శ్రీలక్ష్మీ హరిమూర్తిభేదములు వర్ణింపంగ నిం కేఁటికిన్. 126

మ. బలభి న్నీలమణి ప్రతానకృత సోపానంబులుం బద్మరా
గ లసత్కంధర మందిరంబులు గళత్కల్పద్రు పుష్పావళీ
కలితస్వర్ణ విశాలసానువులు నై కన్పట్టు క్రీడాద్రులన్
లలనల్ మేఘవియుక్తచంచలలలీలం బొల్తు రవ్వీటిలోన్.

ఉ. రాకొమరుండు మన్మథుఁడు రాజస మొప్పఁగనప్పురంబులో
నేకధనుర్ధరుం డగుచు నెమ్మొలు చూపు గుణీకృతాళిలీ
లా కలఝుంకృతుల్ సుదతులం బతులం గదు నొంచు నమ్మహా
భీకరమాని వైరి కతి భీకరభంగి చెలంగఁ జేయుచున్. 128

మ. హరినాభీనవపుండరీకమకరందాసారమున్ గ్రోలి త
ద్వరకహ్లారమయోరుసౌధసుమనోవాతాయనద్వారసం
చరణక్రీడ లొనర్పుచుం దిగుచు నిచ్ఛాభంగి సంగీతసు
స్వరభృంగీతతి మందమారుతము పజ్జం గ్రుమ్మరున్ దత్పురిన్.

సీ. పాలమున్నీటిలోపల నెంత దవ్వైన
జానుదఘ్నంబుగా సంచరించుఁ
దివుటఁ దొండము సాఁచి దిక్కరిణీ శ్రేణి
చరమాంసదేశముల్ సంస్పృశించుఁ
గైలాసమేరుశృంగముల వప్రక్రీడఁ
గొమ్ముల నలవోకఁ గూలఁ ద్రోచు,

సమదఘీంకారనిస్వనములఁ జక్రవా
ళాచలగుహాల సింహములఁ గలఁచు
తే. సమదరక్షోధినాధవక్షఃకవాట
పాటనోద్దండతరచండబలభరమునఁ
బ్రకటకట దానపానసంభ్రమ దళింద్రి
గానముల నొప్పు నప్పురికరివరములు. 130

చ. రూపముతోడి గాడ్పులు, గరుత్తులులేని ఖగంబు, లశ్వలీ
లాపరినర్త నోల్లసితలాసిక వర్గము శౌర్యవార్ధి వీ
చీపటలంబు నాఁగవిలసిల్లుచు నుండు మనోజవంబుతో
నాపురివాజిరాజి హరిదశ్వుని యశ్వము లన్న నవ్వుచున్.

ఉ. భూరిబలోగ్రహేమకశిపుప్రముఖాసురులన్ జయించి య
వ్వీరులబొమ్మ పెండెములు వ్రేలఁగ నంఘ్రుల దిగ్వలీనవి
స్ఫార విరోధులై సుభటసంజ్ఞకు మోహన చక్రలాంఛనో
దారభుజా కలాపులయి తత్పురిఁ గాల్బరు వొల్తురిమ్ములన్.

చ. పరభృతచంచుసంచలిత పల్లవమున్, మధులోలబంభరో
త్కరగతసూనమున్, శుకముఖప్రవిభిన్న ఫలంబుఁ, గేలిసం
చరదబలాప్రియప్రసవసద్మము నైసకలర్తుయోగ్యమై
పురి వనవైభవం బలరు భూరి మనోహరసౌరభస్థితిన్. 133

చ. రసికవధూవరుల్ కనకరత్నవిభూషణవిభ్రమంబుపై
విసిగి పరిత్యజించి వెడవిల్తుని కన్నులపండు వైనసొం
పెసఁగఁగఁ బువ్వుసొమ్ము ధరియించి పరస్పరరూపదర్శనో
ల్లసితపునఃపునస్స్మరతలంపటులై సుఖయింతు రాపురిన్. 134

చ. నిరతము నిర్మలామృతమునిండి తలంకుకొలంకు లంతరాం
తరముల నుండవేల్పుకనుదమ్ములకుంబ్రియమాచరించుచున్
బరిఖ దనర్చుఁ దన్నగరపంకజవాన కటిస్థలంబునం
గరము వెలుంగువజ్రఫలకంబులమేఖలలీలఁ గ్రాలుచున్.
మ. పరమబ్రహ్మము విష్ణుఁ డీజగము లుత్పాదించి తద్రక్షకై
పురుషాకారముఁ దాల్చునాఁడు సిరితోఁ భోగింప నీదుగ్ధసా
గరమధ్యంబున సర్వమోహనముగాఁ గల్పించినాఁ డమ్మహా
పురి వైకుంఠము; దానియొప్పుపొగడన్ భోగీంద్రుఁడున్ జాలునే

—♦ శివుఁడు వైకుంఠములోఁ బ్రవేశించుట. ♦—

వ. ఇవ్విధంబున నపరిమితైశ్వర్యరేఖాలంకృతం బైనయావైకుంఠ
దివ్యనగరం బట్లు త్రిలోచనుండు లోచనపర్వంబుగాఁ జూచి
నంతసంబునం బ్రవేశించి రాజమార్గంబునం జనునప్పుడు.
తే. తోరణాంభోజమకరందధార నర్ఘ్య
మొసఁగి మధుకరమధుర రవోక్తిఁ గుశల
మడిగి బాంధవసంభావనానుకూల
యయ్యెఁ బురలక్ష్మి పార్వతీహరుల కపుడు. 138
తే. హరుని తనుదీప్తిచే నీలహర్మ్యచంద్ర
కాంతపాషాణముల జలకణము లురల
నాడెఁ బ్రోదిసెమిళ్లు కేకారవములఁ
గనకనూపుర ఘళఘళాత్కార మెసఁగ. 139
సీ. మృగమదాలేపమ్ము మెఱయువేదిక నద్రి
కూలభాగం బని కొమ్ముఁ జమ్మ

మరకతసౌధకోమలరుచులకుఁ దృణ
　　　　ప్రీతిమై నందంద మూతిఁ జాఁచు
నాపణగతస్నదివ్యచ్ఛాయనిర్ఝరా
　　　　కృతియైన నుటికి లంఘింపఁ జూచుఁ
దన నీడ మణిభిత్తిఁ గని ప్రతిప కకుద్మ
　　　　దాశంకఁ గనలి గుబ్బనుచుఁ దిరుగు
తే. వెండితగడున నిలిచిన వీథులందుఁ
దాండవము చూపు నూపురధ్వనులతోడఁ
పసిఁడి మువ్వలపేరు జొంపంబు మొరయ
నందికేశ్వరుఁ డీశ్వరానందలీల. 140
సీ. ముత్తెంపుఁ జెఱఁగులఁ జిత్తంబు నిండించు
　　　　కనకాంశుకంబుల కట్టు దనరఁ
బసుపుఁగుంకుమచాయ నెసఁగు కుచంబుల
　　　　మందారపుష్పదామములు వ్రేల
నెలవంక తిరునామ గలనెన్నుదుళ్లఁ గెం
　　　　పుల చుక్కబొట్టులు చెలువు మీఱఁ
దాటంకవజ్రాంశుధావళధళ్యంబుతోఁ
　　　　జెక్కులఁ జిఱు నవ్వు చెంగలింప
తే. శంఖచక్రాంకభుజలతల్ చారుముఖులు
పురపురంధ్రులు సంభ్రమంబుమెయి వచ్చి
నిలయచత్వరవేదుల నిలిచి చూచి
రద్రిజాశంకరులను నెయ్యంబుతోడ. 141

సీ. శుకముఖోదితముక్తి సూచకభాగవ
తవిధేయులైన భాగవతవరులు
సువనిషద్బ్రహ్మసూత్రసముత్కృష్టగీతార్థ
గరిమ శోధించు భాగవతవరులు
ధృతివిశిష్టాద్వైతమతవైష్ణవాచార
గతి నివేదించు భాగవతవరులు
సావర్ణ్యముక్తిలక్షణము వచించు నా
గమయుక్తి మెచ్చు భాగవతవరులు
తే. నింటిముంగిళ్ల నరఁగుల నెనసి యున్న
యాసనంబుల విడి లేచి యచట నచటఁ
దమకు సముచిత సంభావనములు సేయ
నద్రిజయు నీశ్వరుండును నరిగి యరిగి. 142

వ. అంతఁ గొంతదవ్వునం బురమధ్యంబున ననేకకోటిసూర్యబింబ ప్రతిబింబకంబు లనం బ్రతిభాసిల్లుపద్మరాగమణిఖండంబు లెడ నెడం గలిగి, కనకరుచినిచయచకచకవ్యాకీర్ణంబై యగ్రభాగంబునఁ గృత్రిమమరాళ ద్వంద్వమధ్యంబులం గెందామర పువ్వుల మవ్వంబున నివ్వటిల్లు పసిండి కుండలచాలు శోభిల్ల నాకాశంబారయుప్రాకారంబులోడంగూడి, ప్రత్యగ్రవిద్రుమ ద్వారస్తంభసముజ్జ్వలవజ్రకవాటఘటితంబును, ధళధళాయమాన నవరత్నకీలితంబును, బుష్పతోరణాభిరామంబును, బహిరంతర్వికచచందోవ్రిపలవితర్దికాశోభితంబును, దౌవారిక సహస్ర దురవలోకంబును నగు ప్రథమగోపుర ద్వారంబు

పరివేషించి వెండియునుం గుంకుమపంకానులేపంబున నిగ
నిగలువాఱుచు నకాల సంధ్యారాగంబు సంపాదించుచు
వివిధకుసుమకోరక నికరవిరచిత రంగవల్లీసముల్లసితంబు లగు
ననేకద్వారగోపురప్రాంగణంబులు చూచుచు నయ్యైద్వార
పాలకకృతావధానంబుల నభినందించుచుం బోయి ముందట.

—◆ శివుఁడు నారాయణమూర్తి హజారము నొద్దకుఁ బోవుట. ◆—

సీ. శతధనుర్విస్తారచత్వరరత్నకు
ట్టిమభూమి మెఱుఁగుటండముల నీన
మండితనవపుష్పమాలికాసంకీర్ణ
భృంగసంగీతప్రసంగ మడర
బహుపద్మరాగకుంభముల బాలాదిత్య
పాటలాంశువులు పైఁ బ్రబ్బికొనఁగ
నవరత్నచిత్రితప్రవిమలోల్లోలకాం
తులు క్రిందఁ బెక్కువన్నెలు రచింపఁ

తే. బసిఁడికంబాల వేయింట బాగుమీఱి
మరకతోపలసోపానమార్గ మిడిన
పెద్దమొగసాలమేడ సంప్రీతిఁ గాంచి
వాహనము డిగ్గె శివుఁడు పార్వతియుఁ దాను. 144

వ. ఇవ్విధంబున శంభుండు ప్రమథగణపరివృతుండై ప్రియకాంత
యుం దానును వచ్చి పెద్దకొలువుకూటంబుముందర వాహ
నావతరణంబు చేసి యుండుట ద్వారపాలురవలన విని నారా
యణుండును, 145

—◆ నారాయణమూర్తి శివపార్వతుల కెదురుగా వచ్చినప్పటి విధము.◆—

క. తనమాయాశ్రీలీలలు
విని కన్నుల్గాఁ జూడవచ్చు విధ మిది యని న
మ్మనమున నవ్వుచు నెదురుగఁ
జనుదెంచెన్ లోననుండి సంప్రీతి దగన్. 146

మ. హరి యంతఃపురినుండి వచ్చుటయు నయ్యైసేవకై యున్నవా
రురువేగంబున వామదేవశుకముఖ్యుల్ చేరి కేళాంజ యొ
క్కరుఁ డొక్కం డడపం బొకండునిజఖడ్గంబున్వహింపంగ నొ
క్కరుఁడొప్పారఁగఁబట్టెనుజ్జ్వలితముక్తాచ్ఛత్త్ర మగ్రంబునన్.

వ. వెండియు విష్వక్సేనుండు కైదండ యొసంగఁ, గనకవేత్త్ర
పాణు లగుచుఁ జండప్రచండ జయ విజయ కుముద కుము
దాక్షులు ముందట "నిలకడతో మహాదేవ" యను
నాలోకశబ్దంబులు పలుకం, బసిండిగోడుగుపావాలగిలుకల
కుం దోడై శ్రీపాదపద్మంబుల నిగమాంతనూపురఘుళం
ఘుళధ్వానంబులు చెలంగఁ, దరంగరేఖాభంగి నపాంగంబులం
గరుణారసంబు దొలంకఁ, బంకజలోచనానవాస్రంబులు ధవళ
చామరంబులు వీవఁ, గనకపీతాంబరమయూఖరేఖాలంకృ
తుండై, మూర్తిమంతంబు లై శంఖచక్రంబు లిరువంకలం
జనుదేర ననంతవిలాసవై భవంబున శుద్ధాంతకేళీభవనంబులు
వెలువడి గంభీరయానంబునఁ జనుదెంచి యా దంపతుల
నవలోకించి. 148

క. శ్రీరమణీగురుకుచకా
శ్మీరదరివసిక్త మగుచు మెఱయునురమునన్
వారిజనాభుం డప్పుడు
గారవమునఁ బ్రమథనాథుఁ గౌఁగిటఁ జేర్చెన్. 149

వ. ఇట్లు కౌఁగిలించి యన్యోన్యమధురాలోకనజనితకౌతుకంబునం బొదలి యద్రిజఁ గుశలం బడిగి పద్మనాభుండు సబహుమానంబుగా నయ్యుద్దఱం దోడ్కొని కొలువుకూటంబునకు విజయంచేసి వారికి నొక్క భద్రపీఠంబు చూపి నిజసింహాసనాగ్రంబు నలంకరించె, నంతఁ గ్రమక్రమంబునఁ బితామహ ప్రముఖదేవగణంబులు గంధర్వాప్సరస్సిద్ధవిద్యాధరవ్రాతంబు నరుగుదెంచి యద్దేవదేవునకుం బొడసూపి యుచితస్థానంబులం గొలిచి యుండి రాసమయంబున. 150

క. అవధానతత్పరం బై
యవనీశ్వర! చూడ నొప్పె హరికొలు వపుడా
శివపద్మోద్భవవాసన
దివిజర్షిప్రమథపూజ్యదివ్యవిభూతిన్. 151

—♦ లక్ష్మీపార్వతులు కలిసికొనుట. ♦—

తే. గౌరి వచ్చుట యెఱిఁగి శ్రీకాంత దివ్య
కామినులు గొల్వ శుద్ధాంతసీమనుండి
కౌతుకస్మేరవక్త్రపంకజముతోడ
వచ్చెఁ గొలు వెల్ల సంతోషవార్ధిఁ దేల. 152

వ. ఇట్లు వచ్చి. 153

తే. కలిమిచూపులనెత్తమ్మికంటి యెదురు
గాఁగవచ్చిన నగజాతఁ గౌఁగిలించి
తగినపూజలఁ దనిపి సంతసముతోడ
నేకపీఠస్థ యయ్యె నయ్యింతితోడ. 154

—♦ నారదుఁడు విష్ణుమాయాగానము సేయుట. ♦—

క. ఆవేళ నారదుఁడు వీ
ణావాదనకేళిఁ దేల్చె నారాయణు నా
నావిధతన్నిజమాయా
వ్యావృత్తుల గీతసరణి నమరులు మెచ్చన్. 155

వ. వెండియుఁ బర్యాయంబున గంధర్వ యక్ష కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరాదు లయ్యైవిద్యల వైశారద్యంబులు చూపిరి. తదనంతరంబ సముచితగోష్ఠి సలిపి తన వచ్చినరాక ముఖావలోకనంబునం బ్రమథులకు నెఱుకపఱచి యలఁతి నవ్వు నివ్వటిల్ల శివుండు పుండరీకాక్షునకు నిట్లనియె. 156

—♦ { విష్ణుమూర్తియొక్క మాయామోహినీరూపము చూడవలెనని సాంబమూర్తి కోరుట. } ♦—

చ. తరలకవార్ధిఁ ద్రచ్చియమృతంబొడఁగూర్చి బలాఢ్యులై నిశా
చరులు హరించినం గపటచంచలలోచనవై కరంచి నీ
వెరవునఁ బుచ్చి దివ్యులకు విందులువెట్టి త్రిలోకపర్వమై
తిరిగిననీవినోదము మదిం బ్రియమయ్యెడుఁజూడ నచ్యుతా!

క. నారదుఁడు చెప్పె మదనో
దారభవత్కామినీ విహారవిలాస

శ్రీరామణీయకంబును
నారాయణ! నామనంబునకుఁ బండువుగాన్. 158
ఉ. ఏమెయినింతిరూపము వహించితొ యెంతవిలాససంపదన్
గాముని నాక్రమించితివొ కౌతుక మొప్పఁగ నేక్రమంబునన్
బూమెలఁ దేల్చితో దనుజపుంగవదేవమునీంద్రవర్యులన్
దామరసాక్ష! నాకుఁ బ్రమదంబుగఁ జూపుము తద్వినోదముల్.
తే. హరివధూలీల మోహించె నఖిలజగము
నావిలాసంబు చూచిన నభవ! నీవు
నంగజభ్రాంతిఁ జరియింతు వనుచు నన్నుఁ
బంతముగ నాడె నారదపారికాంక్షి. 160
క. దేవాసురమునులట్టులె
నీవును మోహింతు వనిన నీవోక్తులకున్
భావమునఁ గనలి వచ్చితిఁ
గావింపుము మాయ నీప్రగల్భతఁ జూతున్. 161
ఉ. దానవదేవసిద్ధమునితామరసాసనముఖ్యు లందఱున్
నీనలినేక్షణాంగరమణీయగుణంబుల మోహితాత్ములై
దీనత నొంది క్రుమ్మరుట తెల్లమి; వారలు వీరె; వీరిలో
నా నెఱియున్ భవత్కపటనాటకముల్ విభజింతమియ్యెడన్.
ఉ. నామదినిర్వికారమును నావిజితేంద్రియతానిరూఢియుం
నీమహనీయమాయయును నేఁ డమరుల్ గని మెత్తురందఱుం
దామరసాక్ష! చూపు బెడిదంబుగ నీకలమాయలెల్ల నా
దీమన మెల్లఁ జూపెద నతిస్థిరయోగనిరూఢి పెంపునన్. 163

వ. అని మహాయోగిపుంగవుం డైన యనంగదమనుండు, తన
యొద్ద మున్ను విష్ణుమాయం బ్రకటించి సకలంబును హరి
మాయామగ్నం బనియును బరమసాత్త్విక జ్ఞానవంతు లగు
హరిభక్తులకుం దక్కం దక్కిన వా రెవ్వరికి నమ్మాయ గడవ
రా దనియును మఱి యంతటం బోక సామాన్యదేవదానవు
లంబలెనే మహానుభావుం డగు దన్నుం బరిగణింపక నీ వైన
నమ్మాయవలనం దరింప లేవనియును దిరస్కారగర్భంబు
గాం బలికినకలహప్రియు నప్పటికిం గోపింపక సైరించి కార్యా
నంతరంబున వారించువాం డై మచ్చరంబున వచ్చి చిత్త
క్షోభంబుతోడ వనజనాభుతో నంతఃకోపతామసుం డై పలుక
నవ్వీరూపాక్షునిరూక్షవచనంబులకు ననుగుణంబుగాం బ్రమథ
శ్రేష్ఠులు క్రోధపరుషభాషణంబులం గడకన్నులం గెంపు
దోంప నిట్లనిరి. 164

తే. కూపమండూకమునుబోలెం గొంచెమైన
నీదు వెడమాయం దామున్గి నీచబుద్ధి
నధికగుణగణ్యుం డైన యీయభవు నాడె
దితరులనుబోలి యీమహాని మెఱుకమాలి. 165

ఉ. మాయలముంచునిన్నయిన మచ్చరికించిన విష్ణుం డంచుమున్
బాయక రుద్రునిం బలికెం బల్కినయప్పుడె పండ్లు దుల్లంగా
వ్రేయుదు మీవెడంగు ముని, వేగిరమేలసిభర్త మాన్పంగాం
బోయెనుగాక; యీపనులు పోయినపిమ్మటం జెప్పనేంటికిన్.

ఉ. ఆతని కల్ల నేమిటికి నాతఁడు పల్కినయట్లు నీవు నీ
గాతలె పల్కి మాయలఁ బ్రగల్భతఁ జూపినఁ జూచి రోసి య
జ్ఞాతభవాదిదివ్యమునిసంఘము ముందటఁ బొల్లువుచ్చి వి
ఖ్యాతిగఁ గ్రమ్మఱం జనుటకార్యముగాక తలంచిచూచినన్.

క. నీమాయకొలఁది యీముని
యేమై మున్నెఱిఁగి నాఁడొ మెఱుఁగక యున్నన్
దా మెఱసి పంతమాడును
భూమిం గలచోట్ల నెల్ల బూమెలు గాఁగన్. 168

చ. మొదల నిశాచరాధముల మూఢుల దుర్విషయాభిలాషులన్
మదనవికారతత్పరుల మాయలఁ బెట్టుట చెప్పనేల? య
య్యదనున సిద్ధసంయమిమహావిజితేంద్రియులు న్మనోభవ
ప్రదరవిభిన్నులై రనుచుఁబల్కె మునీంద్రుఁడు నీవధూక్రియన్.

ఉ. నీతరుణీవిలాసమున నెమ్మదిఁ దాలిమి దూలి యమ్మనో
జాతనిశాతబాణములఁ జంచలులైన మునీంద్రు లెవ్వరో
చూతము వీరు వారనుచుఁ జూపిన నీసభలోన వేఱె, కాం
తాతరళాత్ములు న్మనులె తాపసులే విజితేంద్రియాత్ములే ?

వ. అని ప్రమథులు పరిహాసంబుగాఁ బెక్కుభంగుల నారదుని
భర్జించి హరిని ధిక్కరించి బీరంబులు పలుకుచుండె నాసమ
యంబున. 171

చ. ప్రమథగణంబులాడుబహుభాషలు, శంకరుఁ డీరసంబునన్
దమకముతోడ వచ్చినవిధంబును నారదు నిశ్చయంపు భా

వముఁ గని మందహాస మొదవన్ వనతాననుఁడై నిమేషమా
త్రముహరియూరకుండె నుచిత్రక్రమమూరయుచున్మనంబునన్.

వ. అప్పుడు. 173

సీ. మా ఉత్తరములేక మాధవుం డున్నవాఁ
డది యేమొకో యని యరయువారు
మనబోంట్లఁగాక యీమాయలు సోఁకునే
దర్పకాంతకు నని తలఁచువారు
నేఁడేని యిద్దఱ నెఱిఁగినంబులు గాన
నయ్యోడు నని మదినలరువారు
హరు నేవిధంబున నైన నీ హరి మాయ
నెలయించునని నిశ్చయించువారు

తే. నైరి సురమునిముఖులు తదవసరమున
నా పరీక్షాప్రతిష్ఠ యొనర్పనున్న
భావ మిది యని విభుఁ డున్నభావ మెల్ల
నారదుఁడు తన్మనః పరిసన్నత నెఱింగె. 174

క. అందఱు నయ్యోవిధముల
నందకధరు చిత్తవృత్తి నాటినతలఁపె
ల్లం దమ మతముల కొలఁదుల
నం దరయుచు నుండి రమరు లాసమయమునన్. 175

వ. సర్వాంతర్యామి యగు నయ్యనంతుండు, తన యంతర్గతం
బున నమృతార్థంబు దుష్టదానవవంచనంబున కై పూనిన
మదీయమానినీరూపవిలసనంబు చూచినవాఁడై నారదుండు

వార్తావాహుండు గావున సకలలోకంబుల బహుప్రకారం బులఁ బ్రకటించుచు వచ్చివచ్చి తనప్రోల వినోదంబుగాఁ బ్రసంగించినఁ బ్రమథులుం దానును నేమని యాక్షేపించి నాఁడో, దానికై కథానుకథనంబున దేవర వైనం జూచిన మోహింతు వని యత్యాశ్చర్యంబుగాఁ బ్రస్తుతించిన నది తన్నుం దిరస్కారంబుసేయుటగాఁ దలంచి యభిమానించి క్రమ్మఱ నాకపటసుందరీసౌందర్యంబు చూచి మోహింపక నిర్వికారంబునం బోవువాఁడ నని సంకల్పించుకొని వచ్చిన వాఁడు, సాంత్వవచనంబులం బోవువాఁడు కాఁడు, దీని కేమిసేయువాఁడ, నమ్మహాత్మునిచిత్తంబు సంక్షోభింపం జేయవలసె, నీతని తమకంబు కొలంది గాదు, ప్రమథులు నిర్వాణత్వంబు చూపి బీరంబులు పలుకుచున్నవారు, వీరి నెవ్విధంబున నైన నీవేళకుం దోఁచి పంపితినేని నారదునకుఁ దలయెత్తుకొనరాదు, నేఁడు వీరిని మోసపుచ్చి సిగ్గుపఱుప కుంటినేని గెంటసంబాడి సవ్వదు రని నానావిధంబుల నూహించి మాధవుండు కొండొకప్రొద్దునకు మాయామంద స్మిత సుందరం బగువదనారవిందం బల్లన నెత్తి భూతభర్త కిట్లనియె. 176

—◆ నీపంతము మాను మని శివునితో విష్ణువు చెప్పుట ◆—

క. అమృతార్థం బసురులకై
కమలేక్షణ నై వికారకలనన్ మాయా

భ్రిమలం బెట్టితిఁగా క
ట్లమరున యోగీశ్వరుండ వగు నీయెదుటన్. 177

ఉ. నీవు మహానుభావుఁడవు నిర్మలయోగ నిరూఢ మానిసం
భావితదివ్యమూర్తి వి పరిభావనమగుిఁడ విట్టి నీకు చే
తోవికృతి ప్రపంచములు దోఁచున యింతుల దుర్వికారమా
యావిమమపరికారముల నన్యులకుం బలె భూతనాయకా!

మ. మము సఖ్యంబునఁ జూడవచ్చి హితసన్మానంబులంబూజలం
బ్రమదం బందక యల్పకార్యమునకై భావంబు వేఱొక్కచం
దము గావించుచు నీగణంబు గడుఁజిత్తక్షోభముంజెంది దు
ర్దమవాఙ్నిష్ఠురవృత్తిఁజూపుటకు నాత్మన్ మెచ్చెదిట్లేఁటికిన్.

క. కనకాక్షాదులకై చూ
పిన నామాయావిలాస పేశలగుణముల్
మును తెలియవె యా భంగిన
దనుజులకుం జూపినాఁడ దర్పకదమనా! 180

చ. అదియును నీకుఁ జూడఁ బ్రియమైన నొకానొక కార్యవేళఁజూ
పెద నిపుడేల యింద్రియవిభేదముఁ బొంది మనంబు తాల్మిబి
ట్టదరఁగఁజేసి యూరక మహాత్మవినిశ్చల దివ్యయోగ సం
పదఁ గుదియింప నీ సుజనమండలియందు నవేందుశేఖరా!

ఉ. నావుడు శంభుఁ డిట్లనియె నారదు పంతము నిల్పుటొండె నే
భావజు నేఁడు గెల్చి కృతిభంగిఁ బ్రసిద్ధికి నెక్కుటొండెఁ గా
కి వెడమాటలం జనుదునే మురమర్దన! నేఁడు సువ్వో కా
ర్యావసరంబు నీకును మదర్థము మాయలపెంపుచూపఁగన్

క. నామీఁదియానసుమిమ్మా
తామరసదళాక్ష! యన్యథా చిత్తుఁడవై
నీమాయా స్త్రీరూపము
నాముందఱఁ జూపకున్న నమ్మను దీనిన్? 183

క. అని రుద్రుఁడు వాలాయము
తను నొత్తిలి పలుకఁబలుకఁ దగ ! నిట్లనియెన్
వనజాక్షుఁడు బ్రహ్మామర
మునులకుఁ గర్ణోత్సవముగ మూర్ధేందుధరున్. 184

చ. పలుమఱు మాన్యుఁడంచు నిను భంగమొనర్పక సఖ్యమూఁది
నీయలుకకు నోర్చి నీప్రమథు లాడెడుకర్ణకఠోరభాషలన్
దలఁకక నీకు నేఁ బ్రియము తద్దయుఁ జెప్పిన నియ్యకోక నా
పొలఁతుకరూపుచూచుట కెపొంగెదుచూచెదుగాక యేమనన్

వ. అని పలికి భక్తవచనపరిపాలకుండును జగన్నాటకసూత్ర
ధారుండును సత్యసంపన్నుండును నగునవ్వేన్నుండు చిన్ని
నగవుమొగంబునం జిగురుకొల్పి నారదునిప్రజ్ఞ నిల్పువాఁడై
యతని నవలోకించి. 186

క. ఫాలవిలోచనవహ్ని
జ్వాలల మరు నేర్చివాఁడు సర్వజ్ఞుఁడు కాం
తాలీలల మోహించునె
యేలా పంతంబు పలికి తీహారుతోడన్. 187

వ. అనినఁ గరంబులు ముకుళించి విరించి నూనుండు కలహాభోజ

నుండు గావున నయ్యుద్ధమునకు వివాదం బగుటకు సంతసించుచు
హరియభిప్రాయం బెఱింగి యిట్లనియె. 188

—♦ నారదుఁడు విష్ణుమూర్తిని, నాతనిమాయను నుత్కర్ష చేయుట. ♦—

శా. దేవా! దేవర దివ్యతత్త్వము మహాధీరుల్, పరబ్రహ్మవి
ద్యావేదుల్, నిజసాత్త్వికోత్తములు,సత్యజ్ఞానవంతుల్ మదిన్
భావింపంగల రేమొకాక యితరుల్ భావింపఁగా శక్తులే
యీవాణీశముఖామరుల్దెలియ రే యీయర్థ మాత్మేశ్వరా!

క. డెందంబునకును వాక్కున
కందఁగరాకున్న నీ చిదాకృతి విద్యా
మందు లెఱుంగరు విజ్ఞా
నేందుజ్యోత్స్నాప్రసన్నహృదయులు దక్కన్. 190

తే. అట్లు బ్రహ్మైకతేజ మై యలరునీవు
భూరిమాయాబలంబున భువనచయము
బహుచరాచరకోటిసంపదల నించి
ప్రభుఁడ వై యుంట యిది వేదభాషితంబు. 191

క. ఇటువంటి నీవు మాయా
నటనకళాప్రౌఢి చూపినన్ బ్రమయక యెం
తటివారు యోగవిద్యా
పటుబుద్ధివహించి నిల్వఁబడువా రర్వన్. 192

మ. అదియే యేల? యెఱుంగరే మునులు నీయంభోజజాతుండునీ
మదవత్పుత్కటరూపవిభ్రమమునన్ మానంబు వే తూలినన్

మదమాద్యన్మదనాస్త్రనిర్దళితమర్మస్థానులై పోక బ
ల్లిదులై యెవ్వరు నిర్వికారమునఁదాల్మిన్ జెంద లేకుండుటల్.

వ. దేవర వల్ల సముద్రమథనసంభవం బైనయమృతకుంభంబు హరియించిన యసురుల మోసపుచ్చి యమృతంబు గొనుటకై కపటకామినీరూపంబుఁ దాల్చి యానక్తంచరులు మున్నుగా సకలలోకంబులను మోహింపఁ జేయుట జగంబులం బ్రసంగించుచుఁ బోయిపోయి కైలాసంబునఁ బ్రమథగణపరివృతుం డైనయమ్మహాదేవుని సన్నిధానంబున స్తుతియించిన మిథ్యాలాపంబు లని నన్ను నపహసించి తన నిర్వికారత్వంబు ప్రకటించుకొని యహంకరించిన. 194

శా. పంతం బాడితి ఫాలలోచనునితో బ్రహ్మాదులుంబోలె నా
వం తైనన్ గడువంగ లేక హరిమాయామోహచక్రంబునన్
భ్రాంతిం బొందుదు వాజగత్పతివధూరత్నోల్లసత్క్రీడలన్
జెంత న్నిల్చిన నీవు సంచుఁ ద్రిజగత్సిద్ధంబుగాఁ దత్సభన్.

క. ఇది యపరాధం బని వి
మదిఁ జూడక భక్తవరద! మనమున కింపై
నది యాచరింపు మనుచుం
దుదిఁ దోఁపం బలికె నారదుఁడు సకలంబున్. 196

ఉ. అంతయు దివ్యచిత్తమున నారసి మాయలు సంఘటించి శ్రీ
కాంతుఁడు తత్సభాసదులఁ గాలగళుం బ్రియమారఁ జూచె వ
క్త్రాంతరసుప్రసాదదరహాసరసామృతవీచి దోఁపఁగా
నంతట నేమి చెప్పుదు ధరాధిపవల్లభ! యద్భుతంబుగన్.

—♦ { విష్ణుమాయాప్రభావము చేత ముందుగానే శివునికి మన్మథవికారములు పుట్టుట. } ♦—

క. ఆ యంగజ గురు నగవున
నాయంగజవైరి యంగజానందకళా
శ్రీయుక్తుఁ డయ్యె వెన్నెల
సోయగమునఁ గైరవప్రసూనము పోలెన్. 198

సీ. అవయవంబులు గరుపాఱె నానందాశ్రు
కణములు దొరఁగె మైకంప మడరె
జడత వాటిల్లె వైస్వర్యంబు జనియించెఁ
బులకాంకురంబులు పొడమెఁ గలయ
మోములు వైవర్ణ్యమును బొందె నందంద
శ్రమవారిపూరంబు జాలువాఱె
నుల్లాసమునుబొందె నుల్లంబు నంగజో
త్సాహానురాగముల్ సందడించె
తే. భావి వైష్ణవమాయాసతీవిలాస
జాతపరితాపభారసూచకముగాఁగ
నప్పు డే మని చెప్పుదు నవనినాథ!
కొలువు వారికి నెల్లఁ గోర్కులు దలిర్ప. 199

—♦ మాయామోహిని యవతరించి వచ్చుట. ♦—

క. హరి యోగమాయ మది నం
స్మరియించినమాత్ర నపుడ మనుజేశ్వర! యా

పురహారముఖుల ముఖంబులఁ
గర మరుదుగ మదనకాంతికళ డైవాఱెన్. 200

చ. కలకల నవ్వునెమ్మొగముఁ, గాటుకరేఖలసోయగంపుఁ జూ
పులు, నెలవంక నెన్నుదురు, భ్రూలతికావలనంబు, మన్మథా
కులహృదయంబుఁ గల్గి కుచకుంభభరానతమధ్యవల్లితోఁ
జెలఁగుచు వచ్చె నొక్కమద సింధురయాన సభాగ్రసీమకున్

సీ. నాసాపుటముల కానందసంపాదియై
ప్రచరించె నొకవింత పరిమళంబు
చెవులకుఁ బండువై చిత్తంబు ఝల్లనఁ
గెరలె నపూర్వభృంగీస్వనంబు
కనుఁగొనల్ మిఱుమిట్లుగొనఁ దళుక్కనఁ బర్వె
గుఱుతు సేయఁగరాని మెఱుఁగుఁదీఁగె
యంగంబు లుప్పొంగ హర్మ్యరత్నశ్రేణి
మోహనపుత్రికామూర్తి దోఁచె

తే. నతివ చనుదేర ముందఱ నంతనంత
నభినవసుగంధమును నూపురారవంబు
నంగదీప్తియు నణిరూపు నయ్యెఁ బిదపఁ
జోద్య మందుచు సభవారు చూడఁజూడ. 202

— మోహినీకాంతను జూచి యెల్లవారును మెచ్చుకొనుట. —

చ. మదననిధానదేవతయొ, మానినియైతిలకింపవచ్చునిమ్మద
రసపూరమో, సురతమంత్రనియంత్రితయంత్రమూర్తియో

శా. కేళీసౌధముఁ, గేళిడోలికయునుం, గేళీవనశ్రేణియుం,
గేళీశైలముఁ, గేళిదీర్ఘికయునుం, గేళీమరాళంబులున్
బోలన్ లేనిగృహంబు లేదొకటియుంబూఁబోండ్లుప్రాణేశులున్
శ్రీలక్ష్మీ హరిమూర్తిభేదములు వర్ణింపంగ నిం కేఁటికిన్.126

మ. బలభిన్నీలమణి ప్రతానకృత సోపానంబులుం బద్మరా
గ లసత్కంధర మందిరంబులు గళత్కల్పద్రు పుష్పావళీ
కలితస్వర్ణ విశాలసానువులు నై కన్పట్టు క్రీడాద్రులన్
లలనల్ మేఘవియుక్తచంచలలలీలం బొల్తు రవ్వీటిలోన్.

ఉ. రాకొమరుండు మన్మథుఁడు రాజన మొప్పఁగనప్పురంబులో
నేకధనుర్ధరుం డగుచు నెమ్మొలు చూపు గుణీకృతాళిలీ
లా కలఝుంకృతుల్ సుదతులం బతులంగడు నొంచునమ్మహో
భీకరమాని వైరి కతి భీకరభంగి చెలంగఁ జేయుచున్. 128

మ. హరినాభీనవపుండరీకమకరందాసారమున్ గ్రోలి త
ద్వరకర్పూరమయోరుసౌధసుమనోవాతాయనద్వారసం
చరణక్రీడ లొనర్చుచుం దిగుచు నిచ్ఛాభంగ సంగీతసు
స్వరభృంగీతతి మందమారుతము పజ్జంగ్రుమ్మరున్ దత్పురిన్.

సీ. పాలమున్నీటిలోపల నెంత దవ్వైన
జానుదఘ్నంబుగా సంచరించుఁ
దివుటఁ దొండము సాఁచి దిక్కరిణీ శ్రేణి
చరమాంసదేశముల్ సంస్పృశించుఁ
గైలాసమేరుశృంగముల వప్రక్రీడఁ
గొమ్ముల నలవోకఁ గూలఁ ద్రోచు,

సమదఘీంకారనిస్వనములఁ జక్రవా
ళాచలగుహాల సింహములఁ గలఁచు
తే. సమదరక్షోధినాధవక్షఃకవాట
పాటనోద్దండతరచండబలభరమునఁ
బ్రకటకట దానపానసంభ్రమ దళీంద్ర
గానముల నొప్పు నప్పురికరివరములు. 130
చ. రూపముతోడి గాడ్పులు, గరుత్తులులేని ఖగంబు, లశ్వలీ
లాపరినర్త నోల్లసితలాసిక వర్గము శౌర్యవార్ధి వీ
చీపటలంబు నాఁగవిలసిల్లుచు నుండు మనోజవంబుతో
నాపురివాజిరాజి హరిదశ్వుని యశ్వము లన్న నవ్వుచున్.
ఉ. భూరిబలోగ్రహేమకశిపుప్రముఖాసురులన్ జయించి య
వ్వీరులబొమ్మ పెండెములు వ్రేలఁగ నంఘ్రుల దిగ్వలీనని
స్సార విరోధులై సుభటసంజ్ఞకు మోహన చక్రిలాంఛనో
దారభుజా కలాపులయి తత్పురిఁ గాల్వురు వొల్తురిమ్ములన్.
చ. పరభృతచంచుసంచలిత పల్లవమున్, మధులోలబంభరో
త్కరగతసూనమున్, శుకముఖప్రవిభిన్న ఫలంబుఁ, గేలిసం
చరదబలాప్రియప్రసవసద్మము నైనకలర్తు యోగ్యమై
పురి వనవైభవం బలరు భూరి మనోహరసౌరభస్థితిన్. 133
చ. రసికవధూవరుల్ కనకరత్నవిభూషణవిభ్రమంబుపై
విసిగి పరిత్యజించి వెడవిల్తుని కన్నులపండు వైనసొం
పెసఁగఁగఁ బువ్వుసొమ్ము ధరియించి పరస్పరరూపదర్శనో
ల్లసితపునఃపునస్స్మరతలంపటులై సుఖయింతు రాపురిన్. 134

చ. నిరతము నిర్మలామృతమునిండి తలంకుకొలంకు లంతరాం
తరములు నుండ వేల్పుకనుదమ్ములకుంబ్రియమాచరించుచున్
బరిఖ దనర్చుఁ దన్నగరపంకజవాస కటీస్థలంబునం
గరము వెలుంగువజ్రఫలకంబులమేఖలలీలఁ గ్రాలుచున్.

మ. పరమబ్రహ్మము విష్ణుఁ డీజగము లుత్పాదించి తద్రక్షకై
పురుషాకారముఁ దాల్చినాఁడు సిరితో భోగింప నీదుగ్ధసా
గరమధ్యంబున సర్వమోహనముగాఁ గల్పించినాఁ డమ్మహా
పురి వైకుంఠము; దానియొప్పుపొగడన్ భోగీంద్రుఁడున్ జాలునే

— శివుఁడు వైకుంఠములోఁ బ్రవేశించుట. —

వ. ఇవ్విధంబున నపరిమితైశ్వర్యరేఖాలంకృతం బైనయావైకుంఠ దివ్యనగరం బట్లు త్రిలోచనుండు లోచనపర్వంబుగాఁ జూచి సంతసంబునం బ్రవేశించి రాజమార్గంబునం జనునప్పుడు.

తే. తోరణాంభోజమకరందధార నర్ఘ్య
మొసఁగి మధుకరమధుర రవోక్తిఁ గుశల
మడిగి బాంధవసంభావనానుకూల
యయ్యెఁ బురలక్ష్మి పార్వతీహరుల కపుడు. 138

తే. హరుని తనుదీప్తిచే నీలహర్మ్యచంద్ర
కాంతపాషాణముల జలకణము లురల
నాడెఁ బ్రోదినెమిళ్లు కేకారవములఁ
గనకనూపుర ఘుళఘుళాత్కార మొసఁగ. 139

సీ. మృగమదాలేపమ్ము మెఱయువేదిక నద్రి
కూలభాగం బని క్రొమ్ముఁ జిమ్మ

మరకతసౌధశోమలరుచులకుఁ దృణ
పీ్రతిమై నందంద మూతిఁ జాఁచు
నాపణగత్నదివ్యచ్ఛాయని ర్ఝరా
కృతియైన నుఱికి లంఘింపఁ జూచుఁ
దన నీడ మణిభిత్తిఁ గని ప్రతీవ కకుద్మ
దాశంకఁ గనలి గుఱ్ఱనుచుఁ దిరుగు
తే. వెండితగడున నినిచిన వీథులందుఁ
దాండవము చూపు నూపురధ్వనులతోడఁ
పసిఁడి మువ్వలపేరు జొంపంబు మొరయ
నందికేశ్వరుఁ డీశ్వరానందలీల. 140
సీ. ముత్తెంపుఁ జెఱఁగులఁ జిత్తంబు నిండించు
కనకాంశుకంబుల కట్టు దనరఁ
బసుపుఁగుంకుమచాయ నసఁగు కుచంబుల
మందారపుష్పదామములు వ్రేల
నెలవంక తిరునామ గలనెన్నుదుళ్లఁ గెం
పుల చుక్కబొట్టులు చెలువు మీఱఁ
దాటంకవజ్రాంశుధాళధళ్యంబుతోఁ
జెక్కులఁ జిఱు నవ్వు చెంగలింప
తే. శంఖచక్రాంకభుజలతల్ చారుముఖులు
పురపురంధ్రులు సంభ్రమంబు మెయి వచ్చి
నిలయచత్వరవేదుల నిలిచి చూచి
రద్రిజాశంకరులను నెయ్యంబుతోడ. 141

సీ. శుకముఖోదితముక్తి సూచకభాగవ
తవిధేయులైన భాగవతవరులు
నుపనిషద్బ్రహ్మసూత్రకృష్ణగీతార్థ
గరిమ శోధించు భాగవతవరులు
ధృతివిశిష్టాద్వైతమతవైష్ణవాచార
గతి నివేదించు భాగవతవరులు
సావర్ణ్యముక్తిలక్షణము వచించు నా
గమయుక్తి మెచ్చు భాగవతవరులు
తే. నింటిముంగిళ్ల నరఁగుల నెసఁసి యున్న
యాసనంబుల విడి లేచి యచట నచటఁ
దమకు సముచిత సంభావనములు సేయ
నద్రిజయు నీశ్వరుండును నరిగి యరిగి. 142

వ. అంతఁ గొంతదవ్వునం బురమధ్యంబున ననేకకోటిసూర్యబింబ ప్రతిబింబకంబు లనం బ్రతిభాసిల్లుపద్మరాగమణిఖండంబు లెడ నెడం గలిగి, కనకరుచినిచయచకచకవ్యాకీర్ణంబై యగ్ర భాగంబునఁ గృత్రిమమరాళ ద్వంద్వమధ్యంబులం గెందామర పువ్వుల మవ్వంబున నివ్వటిల్లు పసిండి కుండలచాలు శోభిల్ల నాకాశంబొరయుప్రాకారంబుతోడంగూడి, ప్రత్యగ్రవిద్రుమ ద్వారస్తంభసముజ్జ్వలవజ్రకవాటఘటితంబును, ధళధళాయ మాన నవరత్నకీలితంబును, బుష్పతోరణాభిరామంబును, బహిరంతర్వికచచంద్రోపలవితర్దికాశోభితంబును, దౌవారిక సహస్ర దురవలోకంబును నగు ప్రథమగోపుర ద్వారంబు

ప్రవేశించి వెంటయునుం గుంకుమపంకానులేపంబున నిగ
నిగలువాఱుచు నకాల సంధ్యారాగంబు సంపాదించుచు
వివిధకుసుమకోరక నికరవిరచిత రంగవల్లీ సముల్లసితంబు లగు
ననేకద్వారగోపురప్రాంగణంబులు చూచుచు నయ్యైద్వార
పాలకకృతావధానంబుల నభినందించుచుం బోయి ముందట.

—◆ శివుఁడు నారాయణమూర్తి హజారము నొద్దకుఁ బోవుట. ◆—

సీ. శతధనుర్విస్తారచతస్రరత్నకు
ట్టిమభూమి మెఱుఁగుతండముల నీన
మండితనవపుష్పమాలికాసంకీర్ణ
భృంగసంగీతప్రసంగ మడర
బహుపద్మరాగకుంభముల బాలాదిత్య
పాటలాంశువులు పైఁ బ్రబ్బికొనఁగ
నవరత్నచిత్రితపరివిమలోల్లోలకాం
తులు క్రిందఁ బెక్కువన్నెలు రచింపఁ

తే. బసిఁడికంబాల వేయింట బాగుమీఱి
మరకతోపలసోపానమార్గ మిడిన
పెద్దమొగసాలమేడ సంప్రీతిఁ గాంచి
వాహనము డిగ్గి శివుఁడు పార్వతియుఁ దాను. 144

వ. ఇవ్విధంబున శంభుండు ప్రమథగణపరివృతుండై ప్రియకాంత
యుం దానును వచ్చి పెద్దకొలువుకూటంబుముందర వాహ
నావతరణంబు చేసి యుండుట ద్వారపాలురవలన విని నారా
యణుండును, 145

—◆ నారాయణమూర్తి శివపార్వతుల కెదురుగా వచ్చినప్పటి విధము.◆—

క. తనమాయాశ్రీలీలలు
విని కన్నులఁ జూడవచ్చు విధ మిది యని ని
మ్మనమున నవ్వుచు నెదురుగఁ
జనుదెంచెన్ లోననుండి సంప్రీతి దగన్. 146

మ. హరి యంతఃపురినుండి వచ్చుటయు నయ్యోసేవకై యున్నవా
రురువేగంబున వామదేవశుకముఖ్యుల్ చేరి కేళాంజి యొ
క్కరుఁ డొక్కం డడపం బొకండునిజఖడ్గంబున్వహింపంగ నొ
క్కరుఁడొప్పారఁగఁబట్టెనుజ్జ్వలితముక్తాచ్ఛత్త్రమగ్రంబునన్.

వ. వెండియు విష్వక్సేనుండు కైదండ యొసంగఁ, గనకవేత్రి
పాణు లగుచుఁ జండప్రచండ జయ విజయ కుముద కుము
దాక్షులు ముందట "నితఋతో మహాదేవ" యను
నాలోకశబ్దంబులు పలుకం, బసిండిగోడుగుపావాలగిలుకల
కుందోడై శ్రీపాదపద్మంబుల నిగమాంతనూపురఝుళం
ఝుళధ్వానంబులు చెలంగఁ, దరంగరేఖాభంగి నపాంగంబులం
గరుణారసంబు దొలంకఁ, బంకజలోచనాసహస్రంబులు ధవళ
చామరంబులు వీవఁ, గనకపీతాంబరమయూఖరేఖాలంకృ
తుండై, మూర్తిమంతంబులై శంఖచక్రంబు లిరువంకలం
జనుదేర ననంతవిలాసవైభవంబున శుద్ధాంతకేళీభవనంబులు
వెలువడి గంభీరయానంబునఁ జనుదెంచి యా దంపతుల
నవలోకించి. 148

క. శ్రీరమణీగురుకుచకా
శ్మీరదరిపసిక్త మగుచు మెఱయునురమునన్
వారిజనాభుం డప్పుడు
గారవమునఁ బ్రమథనాథుఁ గౌఁగిటఁ జేర్చెన్. 149

వ. ఇట్లు కౌఁగిలించి యన్యోన్యమధురాలోకనజనితకౌతుకంబునం బొదలి యద్రిజఁ గుశలం బడిగి పద్మనాభుండు సబహుమానంబుగా నయ్యిద్దఱం దోడ్కొని కొలువుకూటంబునకు విజయంచేసి వారికి నొక్క భద్రపీఠంబు చూపి నిజసింహాసనాగ్రంబు నలంకరించె, నంతఁ గ్రమక్రమంబునఁ బితామహప్రముఖదేవగణంబులు గంధర్వాప్సరస్సిద్ధవిద్యాధరవ్రాతంబు నరుగుదెంచి యద్దేవదేవునకుం బొడసూపి యుచితస్థానంబులం గొలిచి యుండె రాసమయంబున. 150

క. అవధానతత్పరం బై
యవనీశ్వర! చూడ నొప్పె హరికొలు వపుడా
శివపద్మోద్భవవాసవ
దివిజర్షిప్రమథపూజ్యదివ్యవిభూతిన్. 151

—♦ లక్ష్మీపార్వతులు కలిసికొనుట. ♦—

తే. గౌరి వచ్చుట యెఱిఁగి శ్రీకాంత దివ్య
కామినులు గొల్వ శుద్ధాంతసీమనుండి
కౌతుకస్మేరవక్త్రపంకజముతోడ
వచ్చెఁ గొలు వెల్ల సంతోషవార్ధిఁ దేల. 152

వ. ఇట్లు వచ్చి. 153

తే. కలిమిచూపులనెత్తమ్మికంటి యెదురు
గాఁగవచ్చిన నగజాతఁ గౌఁగిలించి
తగినపూజలఁ దనిపి సంతసముతోడ
నేకపీఠస్థ యయ్యె నయ్యింతితోడ. 154

—♦ నారదుఁడు విష్ణుమాయాగానము సేయుట. ♦—

క. ఆవేళ నారదుఁడు వీ
ణావాదనకేళిఁ దేల్చె నారాయణు నా
నావిధతన్నిజమాయా
వ్యావృత్తుల గీతసరణి నమరులు మెచ్చన్. 155

వ. వెండియుఁ బర్యాయంబున గంధర్వ యక్ష కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరాదు లయ్యెవిద్యల వైశారద్యంబులు చూపిరి. తదనంతరంబ సముచితగోష్ఠి సలిపి తన వచ్చినరాక ముఖావలోకనంబునం బ్రమథులకు నెఱుకపఱచి యలఁతి నవ్వు నివ్వటిల్ల శివుండు పుండరీకాక్షునకు నిట్లనియె. 156

—♦ { విష్ణుమూర్తియొక్క మాయామోహినీరూపము చూడవలెనని సాంబమూర్తి కోరుట. } ♦—

చ. తరలకవార్ధిఁదఱచ్చియమృతంబొడఁగూర్చి బలాఢ్యులై నిశా
చరులు హరించినం గపటచంచలలోచనవై కరంచి నీ
వెరవునఁ బుచ్చి దివ్యులకు విందులువెట్టి త్రిలోకపర్వమై
తిరిగిననీవినోదము మదిం బ్రియమయ్యెడుఁ జూడ నచ్యుతా!

క. నారదుఁడు చెప్పె మదనో
దారభవత్కామినీ విహారవిలాస

శ్రీరామణీయకంబును
నారాయణ! నామనంబునకుఁ బందువుగాన్. 158

ఉ. ఏ మెయినింతిరూపము వహించితొ యెంతవిలాససంపదన్
గాముని నాక్రమించితివొ కౌతుక మొప్పఁగ నేత్రమంబునన్
బూమెలఁ దేల్చితో దనుజపుంగవ దేవమునీంద్రవర్యులన్
దామరసాక్ష! నాకుఁ బ్రమదంబుగఁ జూపుము తద్వినోదముల్.

తే. హరివధూలీల మోహించె నఖిలజగము
నావిలాసంబు చూచిన నభవ! నీవు
నంగజభ్రాంతిఁ జరియింతు వనుచు నన్నుఁ
బంతముగ నాడె నారదపారికాంక్షి. 160

క. దేవాసురమునులట్టులె
నీవును మోహింతు వనిన నీ చోక్తులకున్
భావమునఁ గనలి వచ్చితిఁ
గావింపుము మాయ నీప్రగల్భతఁ జూతున్. 161

ఉ. దానవదేవసిద్ధమునితామరసాసనముఖ్యు లందఱున్
నీనలినేక్షణాంగరమణీయగుణంబుల మోహితాత్ములై
దీనత నొంది క్రుమ్మరుట తెల్లమి; వారలు వేరె; వీరిలో
నా నెఱియున్ భవత్కపటనాటకముఁ విభజింతమియ్యెడన్.

ఉ. నామదినిర్వికారమును నావిజితేంద్రియతానిరూఢియుం
నీమహనీయమాయయును నేఁ డమరుల్ గని మెత్తురందఱుం
దామరసాక్ష! చూపు బెడిదంబుగ నీకలమాయలెల్ల నా
దీమస మెల్లఁ జూపెద నతిస్థిరయోగనిరూఢి పెంపునన్. 163

వ. అని మహాయోగిపుంగవుం డైన యనంగదమనుండు, తన యొద్ద మున్ను విష్ణుమాయం బ్రకటించి సకలంబును హరిమాయామగ్నం బనియును బరమసాత్త్విక జ్ఞానవంతు లగు హరిభక్తులకుం దక్కఁ దక్కిన వా రెవ్వరికి నమ్మాయ గడపరా దనియును మఱి యంతటం బోక సామాన్యదేవదానవులంబలెనే మహానుభావుం డగు దన్నుం బరిగణింపక నీ వైన నమ్మాయవలనఁ దరింప లేవనియును దిరస్కారగర్భంబుగాఁ బలికినకలహప్రియు నప్పటికిఁ గోపింపక సైరించి కార్యానంతరంబున వారించువాఁడై మచ్చరంబున వచ్చి చిత్తక్షోభంబుతోడ వనజనాభుతో నంతఃకోపతామసుఁడై పలుక నవ్విరూపాక్షునిరూక్షవచనంబులకు ననుగుణంబుగాఁ బ్రమథశ్రేష్ఠులు క్రోధపరుషభాషణంబులం గడకన్నులం గెంపు దోఁప నిట్లనిరి. 164

తే. కూపమండూకమునుబోలెఁ గొంచెమైన
నీదు వెడమాయఁ దామున్ను నీచబుద్ధి
నధికగుణగణ్యుఁ డైన యీయభవు నాడె
నితరులనుబోలి యీపాని మొఱకమాలి. 165

ఉ. మాయలముంచునిన్నయిన మచ్చరికించిన విష్ణుఁ డంచుముం
బాయక రుద్రునిం బలికెఁ బల్కినయప్పుడె పండ్లు దుల్లఁగా
వ్రేయుదు మీవెడంగు ముని, వేగిరమేలనిభర్త మాన్పఁగాఁ
బోయెనుగాక; యీపనులు పోయినపిమ్మటఁ జెప్పనేఁటికిన్.

ఉ. ఆతని కల్ల నేమిటికి నాతఁడు పల్కినయట్లు నీవు నీ
గాతలె పల్కి మాయలఁ బ్రగల్భతఁ జూపినఁ జూచి రోసి య
బ్జాతభవాదిదివ్యమునిసంఘము ముందటఁ బొల్లువుచ్చి వి
ఖ్యాతిగఁ గ్రమ్మఱం జనుటకార్యముగాక తలంచిచూచినన్.

క. నీమాయకోలఁది యీముని
యేమై మున్నెఱిఁగి నాఁడొ యెఱుఁగక యున్నన్
దా మెఱసి పంతమాడున
భూమిం గలచోట్ల నెల్ల బూమెలు గాఁగన్. 168

చ. మొదల నిశాచరాధముల మూఢుల దుర్విషయాభిలాషులన్
మదనవికారతత్పరుల మాయలఁ బెట్టుట చెప్పనేల? య
య్యాదనున సిద్ధసంయమిమహావిజితేంద్రియులు న్మనోభవ
ప్రదరవిభిన్నులై రనుచుఁబల్కెఁ మునీంద్రుఁడునీవధూక్రియన్.

ఉ. నీతరుణీవిలాసమున నెమ్మదిఁ దాలిమి దూలి యమ్మనో
జాతనిశాతబాణములఁ జంచలులైన మునీంద్రు లెవ్వరో
చూతము వీరు వారనుచుఁ జూపిన నీసభలోన వేత్రె, కాం
తాతరళాత్ములు న్మనులె తాపసులే విజితేంద్రియాత్ములే ?

వ. అని ప్రమథులు పరిహాసంబుగాఁ బెక్కుభంగుల నారదుని
భర్జించి హరిని ధిక్కరించి బీరంబులు పలుకు చుండి రాసమ
యంబున. 171

చ. ప్రమథగణంబులాడుబహుభాషలు, శంకరుఁ డీరసంబునన్
దమకముతోడ వచ్చినవిధంబును నారదు నిశ్చయంపు భా

వము గని మందహాస ముదవన్ వనతానముఁడై నిమేషమా
త్రము హరియూరకుండె నుచితక్రమ మారయుచున్మనంబునన్.

వ. అప్పుడు. 173

సీ. మా యుత్తరములేక మాధవుం డున్నవాఁ
డది యేమొకో యని యరయువారు
మనబోంట్లఁగాక యీమాయలు సోఁకునే
దర్పకాంతకు నని తలఁచువారు
నేఁడేని యిద్దఱ నెఱతనంబులు గాన
నయ్యెడు నని మదినలరువారు
హరు నేవిధంబున నైన నీ హరి మాయ
నెలయించునని నిశ్చయించువారు

తే. నైరి సురమునిముఖులు తదవసరమున
నాపరిక్షిప్రతిష్ఠ యొనర్పనున్న
భావ మిది యని విభుఁ డున్నభావ మెల్ల
నారదుఁడు తన్మనః పరిసన్నత నెఱింగె. 174

క. అందఱు నయ్యేవిధముల
నందకధరు చిత్తవృత్తి నాటినతలఁపె
ల్లం దమ మతముల కొలఁదుల
నం దరయుచు నుండి రమరు లాసమయమునన్. 175

వ. సర్వాంతర్యామి యగు నయ్యనంతుండు, తన యంతర్గతం
బునఁ నమృతార్థంబు దుష్టదానవవంచనంబున కై పూనిన
మదీయమానినీరూపవిలసనంబు చూచినవాఁడై నారదుండు

వార్తావాహుండు గావున సకలలోకంబుల బహుప్రకారం బులఁ బ్రకటించుచు వచ్చివచ్చి తనప్రమోల వినోదంబుగాఁ బ్రసంగించినఁ బ్రమథులుం దానును నేమని యాక్షేపించి నాఁడో, దానికై కథానుకథనంబున దేవర వైనం జూచిన మోహింతు వని యత్యాశ్చర్యంబుగాఁ బ్రస్తుతించిన నది తన్నుం దిరస్కారంబుసేయుటగాఁ దలంచి యభిమానించి క్రమ్మఱ నాకపటసుందరీసౌందర్యంబు చూచి మోహింపక నిర్వికారంబునం బోవువాఁడ నని సంకల్పించుకొని వచ్చిన వాఁడు, సాంత్వవచనంబులం బోవువాఁడు కాఁడు, దీని కేమిసేయువాఁడ, నమ్మహాత్మునిచిత్తంబు సంక్షోభింపం జేయవలసె, నీతని తమకంబు కొలంది గాదు, ప్రమథులు నిర్వాణత్వంబు చూపి బీరంబులు పలుకుచున్నవారు, వీరి నెవ్విధంబున నైన నీవేళకుం దోఁచి పంపితినేని నారదునకుఁ దలయెత్తుకొనరాదు, నేఁడు వీరిని మోసపుచ్చి సిగ్గుపఱప కుంటినేని గెంటసంబాడి సవ్వడు రని నానావిధంబుల నూహించి మాధవుండు కొండొకప్రొద్దునకు మాయామంద స్మిత సుందరం బగువదనారవిందం బల్లన నెత్తి భూతభర్త కిట్లనియె. 176

—● నీపంతము మాను మని శివునితో విష్ణువు చెప్పుట ●—

క. అమృతార్థం బసురులకై
కమలేక్షణ నై వికారకలనన్ మాయా

భ్రిమలం బెట్టితిఁగా క
ట్లమరున యోగీశ్వరుండ వగు నీయెదుటన్. 177

ఉ. నీవు మహానుభావుఁడవు నిర్మలయోగ నిరూఢ మానిసం
భావితదివ్యమూర్తి వి పరిభావనమగుఁడ విట్టి నీకు చే
తోవికృతి ప్రపంచములు దోఁచున యింతుల దుర్వికారమా
యావిషమపరికారముల నన్యులకుం బలె భూతనాయకా!

మ. మము సఖ్యంబునఁ జూడవచ్చి హితసన్మానంబులంబూజలం
బ్రమదం బందక యల్పకార్యమునకై భావంబు వేఱొక్కచం
దము గావించుచు నీగణంబు గడుఁజిత్తక్షోభముం జెంది దు
ర్దమవాఙ్నిష్ఠురవృత్తిఁ జూపుటకు నాత్మన్ మెచ్చెదిట్లేఁటికిన్.

క. కనకాక్షాదులకై చూ
పిన నామాయావిలాస పేశలగుణముల్
మును తెలియవె యా భంగిన
దనుజులకుం జూపినాఁడ దర్పకదమనా! 180

చ. అదియును నీకుఁ జూడఁ బ్రియమైన నొకానొక కార్యవేళఁ జూ
పెద నిపుడేల యింద్రియవిభేదముఁ బొంది మనంబు తాల్మిబి
ట్టదరఁగఁజేసి యూరక మహాత్మవినిశ్చల దివ్యయోగ సం
పదఁ గుదియింప నీ సుజనమండలియందు నవేందుశేఖరా!

ఉ. నావుడు శంభుఁ డిట్లనియె నారదు పంతము నిల్చుటొండె నే
భావజు నేఁడు గెల్చి కృతిభంగిఁ బ్రసిద్ధికి నెక్కుటొండెఁ గా
కి వెడమాటలం జనుదునే మురమర్దన! నేఁడు సువ్వో కా
ర్యావసరంబు నీకును మదర్థము మాయలపెంపుచూపఁగన్

క. నామీఁదియానసుమ్మీ
తామరసదళాక్ష! యన్యథా చిత్తుఁడవై
నీమాయా స్త్రీరూపము
నాముందఱఁ జూపకున్న నమ్మము దీనిన్? 183

క. అని రుద్రుఁడు వాలాయము
తను నొత్తిలి పలుకఁబలుకఁ దగ! నిట్లనియెన్
వనజాక్షుఁడు బ్రహ్మామర
మునులకుఁ గర్ణోత్సవముగ ముగ్ధేందుధరున్. 184

చ. పలుమఱు మాన్యుఁడంచు నిను భంగమొనర్పక సఖ్యమూఁది
నీయలుకకు నోర్చి నీవ్రమథు లాడెడుకర్ణకఠోరభాషలన్
దలఁకక నీకు నేఁ బ్రియము తద్దయుఁ జెప్పిన నియ్యకోక నా
పొలఁతుకరూపుచూచుటకెపొంగెదుచూచెదుగాక యేమనన్

వ. అని పలికి భక్తవచనప్రతిపాలకుండును జగన్నాటకసూత్ర
ధారుండును సత్యసంపన్నుండును నగునవ్వేన్నుండు చిన్ని
నగవుమొగంబునం జిగురుకొల్పి నారదునిప్రజ్ఞ నిల్పువాఁడై
యతని నవలోకించి. 186

క. ఫాలవిలోచనవహ్ని
జ్వాలల మరు నేర్చినాఁడు సర్వజ్ఞుఁడు కాం
తాలీలల మోహించునె
యేలా పంతంబు పలికె తీహారుతోడన్. 187

వ. అనినఁ గరంబులు ముకుళించి వికెంచి నూనుండు కలహాభోజ

నుందు గావున నయ్యిద్దఱకు వివాదం బగుటకు సంతసించుచు
హరియభిప్రాయం బెఱింగి యిట్లనియె. 188

—◆ నారదుఁడు విష్ణుమూర్తిని, నాతనిమాయను నుత్కర్షచేయుట. ◆—

శా. దేవా! దేవర దివ్యతత్త్వము మహాధీరుల్, పరబ్రహ్మవి
ద్యావేదుల్, నిజసాత్త్వికోత్తములు, సత్యజ్ఞానవంతుల్ మదిన్
భావింపంగల రేమొకాక యితరుల్ భావింపఁగా శక్తులే
యీవాణీశముఖామరుల్దెలియరే యీయర్థ మాత్మేశ్వరా!

క. డెందంబునకును వాక్కున
కందఁగరాకున్న నీ చిదాకృతి విద్యా
మందు లెఱుంగరు విజ్ఞా
నేందుజ్యోత్స్నాప్రసన్నహృదయులు దక్కన్. 190

తే. అట్లు బ్రహ్మైకతేజ మై యలరునీవు
భూరిమాయాబలంబున భువనచయము
బహుచరాచరకోటిసంపదల నించి
ప్రభుఁడ వై యుంట యిది వేదభాషితంబు. 191

క. ఇటువంటి నీవు మాయా
నటనకళాప్రౌఢి చూపినన్ భ్రమయక యెం
తటివారు యోగవిద్యా
పటుబుద్ధివహించి నిల్వఁబడువా రుర్విన్. 192

మ. అదియే యేల? యెఱుంగరే మునులు నీయంభోజజాతుండునీ
మదవత్స్వోత్కటరూపవిభ్రమమునన్ మానంబు వే తూలినన్

మదమాద్యన్మదనాస్త్రనిర్దళితమర్మస్థానులై పోక బ
ల్లిదులై యెవ్వరు నిర్వికారమునఁదాల్మిన్ జెంద లేకుండుటల్.

వ. దేవర వల్లు సముద్రమథనసంభవం బైనయమృతకుంభంబు హరియించిన యసురుల మోసపుచ్చి యమృతంబు గొనుటకై కపటకామినీరూపంబుఁ దాల్చి యానక్తంచరులు మున్నుగా సకలలోకంబులను మోహింపఁ జేయుట జగంబులం బ్రసంగించుచుఁ బోయిపోయి కైలాసంబునఁ బ్రమథగణపరివృతుం డైనయిమ్మహాదేవుని సన్నిధానంబున స్తుతియించిన మిథ్యాలాపంబు లని నన్ను నపహసించి తన నిర్వికారత్వంబు ప్రకటించుకొని యహంకరించిన. 194

శా. పంతం బాడితి ఫాలలోచనునితో బ్రహ్మాదులుంబోలె నా
వం తైనన్ గడువంగలేక హరిమాయామోహచక్రంబునన్
భ్రాంతిం బొందుదు వాజగత్ప్రతివధూరత్నోల్లసత్క్రీడలన్
జెంత న్నిల్చిన నీవు నంచుఁ ద్రిజగత్సిద్ధంబుగాఁ దత్సభన్.

క. ఇది యపరాధం బని వి
మదిఁ జూడక భక్తవరద! మనమున కింపై
నది యాచరింపు మనుచుం
దుదిఁ దోఁపం బలికె నారదుఁడు సకలంబున్. 196

ఉ. అంతయు దివ్యచిత్తమున నారసి మాయలు సంఘటించి శ్రీ
కాంతుఁడు తత్సభాసదులఁ గాలగళుం బ్రియమారఁజూచె వ
క్త్రాంతరసుప్రసాదదరహాసరసామృతవీచి దోఁపఁగా
నంతట నేమి చెప్పుదు ధరాధిపవల్లభ! యద్భుతంబుగన్.

—◆ { విష్ణుమాయాప్రభావముచేత ముందుగానే శివునికి మన్మథవికారములు పుట్టుట. } ◆—

క. ఆ యంగజ గురు నగవున
నాయంగజ వైరి యంగజానందకళా
శ్రీయుక్తుఁ డయ్యె వెన్నెల
సోయగమునఁ గైరవప్రసూనము పోలెన్. 198

సీ. అవయవంబులు గరుపాఱె నానందాశ్రు
కణములు దొరఁగె మైకంప మడరె
జడత వాటిల్లె వైస్వర్యంబు జనియించెఁ
బులకాంకురంబులు పొడమెఁ గలయ
మోములఁ వైవర్ణ్యమును బొందె నందంద
శ్రమవారిపూరంబు జాలువాఱె
నుల్లానమును బొందె నుల్లంబు నంగజో
త్సాహానురాగముల్ నందడించె
తే. భావి వైష్ణవమాయాసతీవిలాస
జాతపరితాపభారసూచకముగాఁగ
ఇప్పు డే మని చెప్పుదు నవనినాథ!
కొలువు వారికి నెల్లఁ గోర్కులు దలిర్ప. 199

—◆ మాయామోహిని యవతరించి వచ్చుట. ◆—

క. హరి యోగమాయ మది నం
స్మరియించినమాత్ర నపుడె మనుజేశ్వర! యా

పురహారముఖుల ముఖంబులఁ
గర మరుదుగ మదనకాంతికళ వైదె వాఱెన్. 200

చ. కలకల నవ్వునెమ్మొగముఁ, గాటుకరేఖలసోయగంపుఁ జూ
పులు, నెలవంక నెన్నుదురు, భూలతికావలనంబు, మన్మథా
కులహృదయంబుఁ గల్గి కుచకుంభభరానతమధ్యవల్లితోఁ
జెలఁగుచు వచ్చె నొక్కమద సింధురయాన సభాగ్రసీమకున్.

సీ. నాసాపుటముల కానందసంపాదియై
పచరించె నొకవింత పరిమళంబు
చెవులకుఁ బందువై చిత్తంబు ఝల్లనఁ
గెరలె నపూర్వభృంగీస్వనంబు
కనుఁగొనల్ మిఱుమిట్లుగొనఁ దళుక్కనఁ బర్వె
గుఱుతు సేయఁగరాని మెఱుఁగుదీఁగె
యంగంబు లుప్పొంగ హర్మ్యరత్నశ్రేణి
మోహనపుత్రికామూర్తి దోఁచె

తే. నటివ చనుదేర ముందఱ నంతనంత
నళినవసుగంధమును నూపురారవంబు
నంగదీప్తియు నటిరూపు నయ్యెఁ బిదపఁ
జోద్య మందుచు సభవారు చూడఁజూడ. 202

— ♦ మోహినీకాంతను జూచి యెల్లవారును మెచ్చుకొనుట. ♦ —

చ. మదననిధానదేవతయొ, మానినియైతిలకింపవచ్చునస్మద
రసపూరమో, సురతమంత్రనియంత్రితయంత్రమూర్తియో

సదమల దివ్యయోగిజన సంఘము పాలిటి విఘ్నశక్తి యో
యది యని యవ్విలాసవతి నందఱుఁ జూచిరి యుత్సవంబునన్.

శా. మందాందోళితకుండలద్వయముతో, మందస్మితశ్రీలతో
మందారప్రసవాంచితాలకమిళ న్మత్తాళిగానంబుతోఁ
గందర్పక్షితిపాల గంధగజరా డ్గంభీర యానంబుతో
సౌందర్యాలయ మైన యాపొలఁతి యాస్థానంబు వే డాసినన్.

చ. కొలువున నున్నయచ్చరలు గుందిరి వైందవచంద్రికారుచిన్
నలినులభంగి సిగ్గునఁ బెనంగిరి శ్రీ నగజా వధూమణుల్
వెలవెలఁబాఱెఁ దద్భువనవిస్ఫుటకృత్రిమరత్నపుత్రికా
విలసన మవ్విలాసవతి విభ్రమకాంతులు మింటఁ దోఁచినన్.

—◆ మోహినీకాంతావిలాసవర్ణనము. ◆—

సీ. వేయుమన్మథులపూవింటికోలలు పాఱు
పరుసున దృక్పరంపరలు నిగుడ
లక్షపద్మములయుల్లాసంబు పొదిగొన్న
కరణి నెమ్మోముపికాస మడరఁ
గోటిచంద్రద్యుతుల్ కొనసాగుచున్నరూ
పంబునఁ దనుదీప్తి ప్రజ్వరిల్ల
శతకోటిరతివధూసౌభాగ్య మెసలారు
పగిది లావణ్యసంపద దనర్ప

తే. నఖిలదివ్యాంగనాసమభ్యర్చితాంగ
విభ్రమాసక్తి మరుఁడు వెన్వెంట రాఁగఁ

జొచ్చు నాస్థానసదనంబు శోభనాంగి
చంద్రకౌముది కుముదపుష్పంబువోలె. 206

వ. ఇట్లు మదనకామధేనువుచందంబున, ననంగమంగళాధిదేవత తెఱంగున, సంకల్పభవకల్పలతికలాగునఁ, గా మ స ము ద్రి కల్లోలిక విధంబునం, గుసుమశరవర్షాగమతటిద్వల్లి మురిపెంబువ, నిక్షుకోదండ వీరలక్ష్మి లక్షణంబున సాక్షాత్కరించి లత్తుకరసంబున జొత్తిల్లుచుం బ్రణయాపరాధనాయకవక్షస్తాడనప్రసాదదానశౌండంబు లై వందనీయంబు లైనయడుగు కెందమ్ములును, బ్రసూనతూణీరలావణ్యంబు గణింపక భుజంగభయంకరంబులై మరునిమువ్వలకోలలుంబోలెరవ్వళిం జూపు రవలయందియలు గలజంఘాకాండంబులును, నునుఁ బసిండినిగనిగలనలరారుచు వల్లభభద్రదంతావళంబుల బంధించు కట్టుఁగంబంబు లైన మెఱుంగుఁదొడలును, ననంగమంగళగృహోపకంఠ నాభీసరోవర కనక సైకతం బై విటరాజహంస విహారణపదం బైననితంబబింబంబును,మందపవన కంపితం బగు లేఁదీఁగె బాగున జలదరింపుచు యువశ్రేష్ఠులకు నస్తి నాస్తి వివాదహేతు వైన తనుమధ్యంబును, రతిరాజపట్టాభిషేకసమయ సమభ్యర్చిత కనక కలశంబుల విలాసంబుల నవకుంకుమస్థాసకపుష్పమాల్యాలంకృతంబు లై రసికకాముక గాఢాలింగనబంధభ్రమానుబాధ బంధురంబు లైన గురుకుచ కోరకంబులును,బంకజ నాళ శంకాకరంబు లైనహస్తంబులును, త్రిరేఖావిలసితం బై వల్లభరతిరాజ్య ప్రవేశసమయవిజయ

శంఖం బైనగళంబును, ప్రణయరంహోనునయపరికరగ్రాహ్యం బై కోమలతాళీశలాటుబీజవిరాజితం బైన చుబుకంబును, బున్నమనిండుచందురునిచందంబునం బ్రసన్నం బై పాంథజనమనస్సంతాపహరణకారణసుధారసరసికమందస్మిత సుందరం బైన నెమ్మొగంబును, బరిపక్వబింబికాఫలరూపంబున రసమయం బై ప్రాణేశ్వరతృష్ణాపిపాసాప్రశమనసమర్థం బగు నమృతం బాస్వాదింప నింపైన యరుణాధరంబును, మనోహరసౌరభసౌభాగ్యనిశ్వాసమారుతంబునం బ్రియులముఖకమలంబుల వాసించు నాసికాచంపకంబును, శ్రీకారసదృశంబు లై వియోగిదురభిమానలతోచ్ఛేదన నిరత మదన నిశాత చక్రంబు లనం బ్రజ్వరిల్లు వజ్రతాటంకచక్రంబులు గల శ్రవణంబులును, మందస్మితస్మేరంబు లై మనోరమణరమణీయముఖావలోకనముకురబింబంబు లై విడంబించుమృదుకపోలపాలికలును, ముత్తియంపుఁజిప్పలయొప్పిదంబున విప్పారి, హృదయకమలసముద్భూతమదనానురాగమకరందంబు చిందుచు వెక్కసం బైనవెన్నెలరసంబు పుక్కిలించుచకోరంబులన నలరు దరహసిత విలోచనంబులును, పారిజాతప్రసూనగర్భనిర్భరం బై విరహిజనమర్మభేదకం బై పెంజీఁకటిసిరుల నించుచునింద్రనీలఖండఖచితమయూరపింఛసమానం బైన పాలక కేశపాశంబును, దనకు సహజాలంకారంబు లై పొలుపార సముచిత దివ్యాంబరాభరణంబుల భూషితమైనమదాలసత్వంబును, మనోహరలీలా మధురిమంబును, వ్రీడానమ్రభావం

బును, వీక్షావిలసనంబును, నంతర్హాసంబును, ననంగ లౌల్యం బును, క్షణక్షణసాత్త్వికోదయంబుఁ బుట్టింపంజాలు నెల జవ్వనంపుసిరులును దైవాఱ సర్వమోహినియై సంసారసుఖ సారంబైన మన్మథ బ్రహ్మవిద్యాతత్త్వంబే ప్రమాణం బని చిదానంద కళలు తనయందకాని లేవను నుద్యోగంబు గలిగి యక్కలువకంటి పురోభాగంబున నిలిచిన. 207

—• { మోహినీకాంతను జూడఁగానే శివునికిని బ్రహ్మర్షులు మొదలైన వారికిని జిత్తవైకల్యము పుట్టుట. } •—

మ. కలఁగెం జిత్తము; గుండె ఝల్లుమనియెం; గంపించె దేహంబు; క న్నులు కెంపెక్కెఁ; జలించె ధాతువులు; వెన్నుండట్లు మాయాసతీ కలనన్ గామకళానమ్రసరసిక్కోత్కంఠతన్ విజృంభింపఁగా వలరా జంటని దంటనంచు విరతిన్ వర్తించునాశూలికిన్.

తే. బ్రహ్మయోగీంద్రదేవదిక్పాలవరులు
మ్రానుపడి చూచు చుండిరి మగువచెలువు
ప్రమథు లన్యోన్యపరిరంభబద్ధులైరి
వికలితేంద్రియులై వెడవిలుతుచేత. 209

ఉ. ఎంతటివారు ధైర్యము వహింపఁగ, నెంతటివారు మోహవి భ్రాంతులుగాక, యీజగతిపై నిక రుద్రునికంటె, యోగావనా నంతవిలాసరేఖఁ దరళాక్షి రతోత్సవసంభ్రమంబునం దెంత వసించి లేనగవుఁ జిల్కుచు మన్మథుఁ బ్రోదిచేసినన్?

సీ. నిశ్చలితధ్యాననియమంబు, లలితాంగి
తోరంపుహాసంబు దోఁచుదాఁక

మహనీయజపనిష్ఠ మత్తేభగామినీ
శోభనాగమనంబు చూచుదాఁక
నిజకులాచారంబు, నీరేజపత్త్రాక్షి
కడగంటి చూపు పైఁబడెదుదాఁక
నుగ్రతపోవృత్తి, యువతీశిరోమణి
యౌవనసౌభాగ్య మబ్బుదాఁక

తే. సంతతేంద్రియనిర్బంధశక్తి, యబల
యుల్లసిల్లిసిగ్గున సొబగుమే నదురుదాఁకఁ
గాక యామీఁద నాఁగునే కంతుచేతఁ
గాకగళుఁ డైన బ్రహ్మర్షిగణము లైన. 211

ఉ. ఏ మని చెప్పుదుం గురుకులేశ్వర! వైష్ణవమాయ, గొల్వునం
దామరసాక్షుఁ డెప్పటి విధంబున నున్నటులుండఁగాని బ్రి
హ్మామరమౌనికోటులకు నచ్చెరు వై పరమాత్మయోగ వి
ద్యామణియైనశంభుహృదయంబుముదంబునఁ దేల్చె నాక్రియన్

—◆ మోహినీకాంతను జూచి శివుఁడు మెచ్చుకొని వర్ణించుట. ◆—

తే. ఇవ్విధంబునఁ గొలు వెల్ల నిందువదన
భువనమోహనలీల నుప్పొంగె నపుడు
పూర్ణిమాచంద్రచంద్రికాస్ఫూర్తిచేతఁ
బాలకడలియుఁబోలె భూపాలచంద్ర! 213

క. కొలు వెల్లఁ దనవశం బై
తిలకింపఁగఁ జేసి మదవతీరత్నము ని

ర్మలచంద్రదేవతాకృతిఁ
జెలువారఁగఁ జూచి శివుఁడు చిత్తములోనన్. 214

క. బళిరే! సతి యై పుట్టిన
వలదా యిటువంటిరూపవైఖరి లీలా
విలసనముఁ జూపి పురుషుల
తలఁపులు భేదించి వలపు దలకొలుపంగన్? 215

శా. వందారుప్రియఫాలభాగమున నవ్యాజప్రసాదంబుతో
నందం బైనయలంక్రియాసరణిలాక్షాంకంబు సోఁకించుచున్
గెందమ్ముల్ దనయున్నదమ్ములయి రాగిల్లన్మనఃప్రీతిఁ బెం
పొందున్ దీనిపదద్వయంబునరికెట్లొప్పున్ జిగుల్లెన్నఁగన్.

శా. బంగారంపుమెఱుంగులం దనరి రంభాభూజముల్ తొల్లి యే
భంగిం బంకజసంభవుం దగ భజింపం జాలెనో నిష్ఠమై
రంగన్మన్మథడోలికాస్థితసువర్ణస్తంభయుగ్మంబు లీ
లం గన్పట్టెడుదీనియూరువులఁ బోలం గల్గె భాగ్యంబునన్.

చ. కనకపునిగ్గులం గలిగి గాఁగిటికిం గడువెక్కసంబులై
నునుజిగి మీఱి గోరికొననొక్కులకున్ బిగియారి యున్నమ
ధ్యనవనజాతకోరకయుగంబుక్రియన్ గొనవాఁడు లైనయీ
వనితపయోధరంబులకు వారణకుంభము లీడువచ్చునే?

చ. సితకరబింబ మే తపము చేసెనొ? పంకజసూన మేమి స
ద్వ్రతమునమాచరించెనొ?సుధారసకాంతియుసౌరభంబుపూ
ర్ణతయు వికాసముం గలిగి నాఁడెముగా నొకవేళ నైన నీ
యతివమొగంబుఁ బోల్పఁ దగినట్టిపదార్థము లొటకున్ భువిన్.

చ. అమృతము చాలువారు తుహినాంశుమరీచుల యల్లిబిల్లిము
త్రైములప్రచార, మబ్జవనదేశము కుంను, మెఱుంగుఁ దీఁగెతం
డము మొగసారి, యీనతి బెడంగు,కనుంగవచూపు లుత్కటా
సమశరమోహనాస్త్రములసంగతి మూర్ఛలపాలుసేయవే.

సీ. విజితేంద్రియుల మనోవిరతికంఠములకు
గండకత్తెర దీనికలికిచూపు
సిద్ధయోగీంద్రులచిరయోగవారాశి
కౌర్వానలము దీనియలంతినవ్వు
వటుతపోధనులతపఃపర్వతములకుఁ
గులిశాయుధము దీనికొమరువయసు
బ్రహ్మవేత్తల బ్రహ్మపరిబోధచంద్రిక
కరుణోదయము దీనిపరిచయంబు

తే. సకలనిమ్మలు నీపూర్ణచంద్రవదనఁ
జేరి బిగియారుకౌఁగిటఁ జేర్చుదాఁకఁ
గాక యామీఁద ఫల మేమి కలదు చూడ?
ననుచుఁ దర్కించె శివుఁడు మోహాంధుఁ డగుచు. 221

వ. అప్పుడు. 222

క. కొలు వెల్లఁ దన్నుఁ జూడఁగ
దళదరవిందాక్షి చూచెఁ దరళకటాక్షం
చలములఁ బ్రేమముఁ దమకము
నలవడగ వును నంతరించ నిందుకిరీటున్. 223

చ. అసితపయోజపత్త్రములయంచుల మించులువాఱుచంద్రికా
రసకణరాజిచందమున రాజిలురాజనిభాస్యకజ్జల
ప్రసరలసత్కటాక్షములఁ బర్వెడు లేనగవుల్ గరంచె న
య్యసమశరారిడెంద మనఁగాంకురముల్ నవనీతముంబలెన్

క. తన చూపుకంటె మిక్కిలి
వనితామణిమేలుచూపు వాంఛాలతలన్
బెనిచిన శంభుఁడు మదనుని
సునిశితబాణాగ్నిశిఖలసోఁకున నొచ్చెన్. 225

—◆ శివుఁడు వివేకశూన్యతచే మోహినియందు లోలుఁ డౌట. ◆—

సీ. నారదమౌనివంతము చిత్తగింపక
నలినాసనాదులు నగుదు రనక
ప్రమథులనెఱవాదిపలుకులు దలఁపక
గిరిజ యీరసమునఁ గెరలు ననక
హరిమాయయో యని యాత్మ శంకింపక
తన దృఢయోగవర్తనముఁ గనక
సర్వజ్ఞతాశక్తి సడలుట యెఱుఁగక
చిత్తసంక్షోభంబు చెందఁ గనక

తే. మించి కామాంధకారంబు ముంచిముంచి
మనసుఁ గప్పిన సకలంబు మఱచి శివుఁడు
బాలలీలావిలాసవిభ్రమపయోధి
లోలకల్లోలములలోన నోలలాడె. 226

తే. చూచు సతిరూపు వెండియు సొంపుమీఱఁ
బడఁతి ప్రేమంబు చూపునఁ బరిణమించు
నిట్టు లన్యోన్య దృష్టులు నేకమైన
భావ మాహ్లాద మొనరింప భావజారి. 227

ఆ. లేచి పోయి పట్టఁజూచుఁ గ్రమ్మఱ మాను
నవసరంబు గామి కాత్మఁ గలఁగుఁ
దరుణిఁ జూచుఁ గొలువు పరికించిపరికించి
వెచ్చనూర్చి మిగుల విహ్వలించు. 228

తే. ఎట్టకేలకు ధైర్యంబు మట్టుకొలిపి
వేళగామికి నమ్మహా వేగ ముడిగి
కొలువువీడ్కొని దీనినే బలిమి నెత్తు
కొని రయంబునఁ బోయెద నని తలంచి. 229

ఆ. ఒక్కభంగి ధైర్య మూఁది తత్క్రీడలఁ
దగిలియున్న చూడ్కి మగుడఁ దిగిచి
వీడుకోలువడయ వినయంబు సంధించి
శూలి కొలువువంకఁ జూచె నపుడు. 230

క. హరియును సిరియును మొదలుగ
సరసిజగర్భాదిదివిజసంయము లఁచటన్
ధరణీశ ! లేకతక్కరి
హరుచూడ్కికి నేమిచెప్ప నచ్చెరు వందన్. 231

క. హరియును వేల్పులు నెయ్యెడ
కరిగి రొకో యనుచుఁ బార్శ్వ మవలోకింపన్

గిరిరాజసుతయుఁ బ్రమథులుఁ
బరిజనములు లేర యచటఁ బరికింపంగన్. 332

—•{ శివుఁడు చూచుచుండఁగనే యాసభామందిరము మాయమై యాస్థలము శృంగారవన మవుట. }•—

వ. వెండియు విస్మితుం డై కామఘస్మరుండు నలుదిక్కులుం గలయ నాలోకింప నప్పుడు కొలువుకూటంబు మొదలుగాఁ గల కనకకలధౌతచంద్రశాలాద్వారకవాటగోపురప్రాకారాది గృహసన్నాహంబు లేక,యాప్రదేశంబు చూత పనస రంభా ఖర్జూర జంబూ జంబీర నారికేళ కురవ కాశోక వకుళ కరవీర పారిజాత సింధువా రాదిపాదప ప్రతానంబును, నేలా లవంగ లుంగ మాతులుంగ తక్కోల ద్రాక్షా మాధవీ యూథికా మల్లీమతల్లికా ప్రముఖలతామండపకుసుమిత నికుంజపుంజంబులును, వికచకమల కైరవోత్పలమండమండితసరోవర దీర్ఘికానముదయంబులును, మణిమయదరీగృహద్వారవేదికాశిలాఫలకకలితకేళీశైలంబును,బుష్పతరుశాఖాసమాందోళిత సువర్ణడోలాతల్పంబును,బల్లవోల్లసితకుసుమరసఫలరసధారాప్రవాహంబులును,మందమారుతపరిపూరితదిశావకాశబహువిధామోదభారంబును,కోకిలారవకోలాహలంబును, శుకనికరకలాలాపంబులును, జంచరీకఝుంకారంబులును, హరిణమిథునసంచారంబులును, మయూరనృత్తావధానంబులును, గలహంస లసదలస క్రేంకారనాదంబులునుం గలిగి యొక్కయభినవోద్యానం బై యుండె నంత. 333

క. అది సహజోద్యానం బై
మది కింపొనరింపఁ దాను మగువయుఁ దక్కన్
వెదక మఱి యొరులు లేమికి
మదనారియుఁ బ్రమదమగ్నమానసుఁ డయ్యెన్. 234

క. తన రాకయు, హరికొలువున
నునికియు, నాస్థానభూమి యుద్యానం బై
తనరుటయు మఱచె శంభుఁడు
కనియును హరియింద్రజాలకౌతుకలీలన్. 235

శా. ఆచందంబున నిర్జనం బయిన యుద్యానంబుఁ బ్రాణేశ్వరిం
జూచెం గోర్కి ఫలించెనంచు హరుఁ డత్యుద్రిక్తపుష్పాస్త్రనా
రాచశ్రేణులతోడఁ గూడి పికకీరవ్రాతభృంగీరవ
ప్రాచుర్యంబు గలంచె నవ్విభుని శుంభద్ధైర్యసారాంశమున్.

వ. అంత. 237

—♦ { శివుఁడు మోహినీకాంతను బట్టఁ దలఁచి లేవఁగా నామోహిని మాయ మగుట. } ♦—

తే. ఏకతమున నున్నయింతిఁ బట్టెడు వేడ్క
నాసనంబు డిగ్గి యరిగె హరుఁడు
సతియు నొక్క తీఁగెచాటున వడి డాఁగి
పోయె నవలఁ ద్రోచి బొమ్మవోలె. 238

క. డాఁగిన యాలతమాటున
కేఁగి లలాటాక్షుఁ డచట విందునిభాస్యన్

దాఁ గానక తల్లడపడి
వేఁగెడుచిత్తమును మేను విరవిరవోవన్. 289

ఉ. ఇక్కడ నన్ను డాయ నెలయించిన దీలత మాటలోనె యీ
టక్కరికత్తె యేవలన డాఁగెనొ నవ్వుల కంచుఁ, బొంచి నల్
దిక్కులు చూచె నప్పు డెలదీఁగెలు గప్పిన పొన్ననీడ ను
న్నెక్కిన రత్నవేది నొకయిక్కువఁ జెంపెసలారు వేడుకన్.

సీ. పయ్యెద దిగజాఱఁ బసిఁడిచాయలు దేరు
చనుదోయి ముత్యాలసరము వెలుఁగ
బహుళతాడనాయాసభారజాతస్వేద
కణములు గండభాగముల నురల
ననుగతదృష్టిసంహతితోడ సౌరభా
గతమత్త మధుపసంఘములు చెలఁగ
గ్రహణ మోచన వేళ ఘళఘళత్కారపద్మ
మణికాచకంకణరణన మెసఁగఁ

తే. కంపితోత్కటకచభారకల్పభూజ
పుష్పములు రాలి దిశలఁ బుప్పొళ్లు చెదరఁ
గ్రీడమైఁ దాన పూబంతి యాడుచున్న
యవ్విలాసినిఁ గనియెఁ జంద్రార్ధమౌళి. 241

—◆ శివుఁడు మోహినిని మరలఁబట్టఁ జూచుట. ◆—

క. కని, పేద పెన్నిధానముఁ
గనిన ట్లుల్లంబు పరమకౌతుకలీలన్

గొనసాగ నల్లనల్లనఁ
జని పట్టెద నని తలంచి సరసప్రౌఢిన్. 243

మ. చరణాబ్జంబులు భూమిభాగమున నిశ్శబ్దంబుగా మోపుచున్
దరుమండంబుల దండ నండ గొనుచున్ దత్కౌతుకోల్లాససుం
దరసంక్రీడల నేమఱించి యమితోత్సాహంబుతోఁ బట్టు త
త్పరతం జేరువఁబొన్న మాటుగొనియుద్యద్వేగసంరంభుఁడై.

ఆ. మ్రానుచాటు విడిచి మగువ యున్నెడకు లం
ఘించి ప్రేమఁ గౌఁగిలించె నపుడు
వడఁతి లేక బట్టబయ లయ్యెఁ గలలోని
లేమఁ బట్టి కౌఁగిలించు టయ్యె. 244

శా. అస్తంయాతవివేకుఁడై యపుడు చంద్రాపీడుఁ డుల్లంబునన్
హస్తప్రాప్తధనంబు పోయినటు లత్యంతంబు చింతించి వి
ధ్వస్తేందీవరలోచనా ప్రియతమ వ్యాపారలీలా పరి
స్రస్తాంగంబులతోడ ధైర్యమెడలన్ సంతాపముం బొందుచున్. 

వ. కొండొకతడ వెద్దియుం బరికింపం గానక నిర్వేదించి. 246

క. నిక్కముగఁ గౌఁగిలించితి
గ్రక్కున నది లేకపోయెఁ గౌఁగిటిలోనన్
జక్కెరవిల్తుఁడు పన్నిన
వెక్కస మగునింద్రజాలవిద్యయపోలెన్. 247

క. ఇప్పువ్వుఁబొదలలోపలఁ
జొప్పడునో చూత మనుచుఁ జూపులు దిశలన్

విప్పారఁ బెక్కునెలవులు
తప్పక పరికించి మోహదశ వాప్తింపన్. 248

—♦ శివుఁడు విభ్రాంతుఁడై వనమందుఁ దిరుగుట. ♦—

సీ. మదశిఖావళి యొక్కపొదలోన మెలఁగినఁ
దొయ్యలి యని పోయి తొంగిచూచుఁ
గలకంఠనాద మెక్కడ నైన వినఁబడ్డఁ
జెలువ భాషణ మని చిత్తగించు
నెలదేఁటితండ మెయ్యెడ మ్రోలఁ బొలసినఁ
బడఁతుక నెఱు లని పట్టఁ దివురు
గడ్డుపనఁ బూఁదీఁగె కదలిపై వ్రాలనం
గన వచ్చె నని పట్టి కౌఁగిలించుఁ
తే. జెదరి పూఁదేన వాతెఱఁ జెంద నిందు
వదనయధరామృతం బని వలచి క్రోలుఁ
జేతనాచేతనజ్ఞానశిథిలహృదయుఁ
డగుచు మదనారి మిథ్యావనాంతరమున. 249

వ. ఇట్లు పరిభ్రమించుచుం బోయిపోయి యొక్క సంఫుల్లమల్లి
కామండపంబున. 250

—♦ శివుఁడు తిరిగి మోహినీకాంతను దూఁగుటుయ్యాలపైఁ జూచుట. ♦—

సీ. జిగిగుబ్బపాలిండ్లఁ జేలాంచలంబును
దొడలపై ముంగొంగుఁ దొలఁగి యాడ
ధర మెట్టి యూఁగునుద్ధతి ఘల్లు మని బిట్టు
రమణీయమణినూపురములు మ్రోయఁ

బువ్వఁదీఁగెలఁ గరంబులఁ బట్టి నిగిడెడు
తీవ్రత మైచాయ తీఁగెసాఁగ
రాకపోకల త్రోవ నాకాశలక్ష్మికిఁ
జరణాంబుజంబు లర్చనలు గాఁగ

తే. నెలమి వనదేవతలకు నింపెసఁగ నసమ
శరునిఁ బాడుచు మందహాసంబులోడఁ
గేలిడోలామహోత్సవశ్రీలఁ దేలు
బాలఁ గ్రమ్మఱఁ గనియె నాశూలపాణి. 251

క. ఏణాంకధరుఁడు, పోయిన
ప్రాణకళయుఁబోలె మగుడఁ బ్రాప్తించిన యా
ప్రాణేశ్వరిఁ గనుఁగొనియెన్
క్షోణీశ్వర ! రెప్పతప్పు సుడియనిచూడ్కిన్. 252

వ. ఇవ్విధంబున నిందుముఖసందర్శనానందపారవశ్యంబునుంబొంది యెప్పటియట్ల వంచించి కానకుండం బట్టుకొనువాఁడై పశ్చాద్భాగంబునఁ బొదలమాటున నొదిఁగియొదిఁగి యా యుయ్యాల డాసి పట్ట నుంకించిన. 253

క. ఇందుధరుగమక మారసి
ముందఱికై యూఁగి యచట ముద్దియ యుఱికెన్
గందువ మణినూపురయుగ
మందంబుగ ఘల్లుఘల్లు మని మ్రోయంగన్. 254

—♦ మోహిని తిరిగి యదృశ్యయగుట. ♦—

శా. డోలాతల్పము డిగ్గదాఁటి మదనాటోపంబు దీపింపఁగా
బాలారత్నము స్రస్తబంధకబరీభారంబునం బుష్పముల్
రాలన్ లంఘనచాతురిం జకితసారంగాంగనాభంగి నా
శూలిన్ గిక్కురువెట్టి పోయె లతికాస్తోమాంతరాళంబులన్.

మ. తనువంచించి విహంగి యై యెగసి చేతం జిక్క క ల్లోఁగినన్
గని నిశ్చేష్టితలోచనాంబుజదళాగ్రవ్యగ్రబాష్పాంబువుల్
తనుకంపంబున రాల గద్గదికతో దైన్యంబు నిందించి వే
చని నిట్టూర్పులతోడ డాఁకొనియె నాచంద్రాస్యడోలాలతన్.

వ. ఇట్లు డాఁకొని, తదీయ మనోహరాంగ శోభనాంగరాగ
సత్త్వంబు గలిగి తద్విహరణలీలాయోగ్యం బైన యాతూఁగు
టుయ్యెలతీఁగం గౌఁగిలించి. 257

క. ఏ పుణ్యంబులు చేసితొ
యాపువ్వుందీఁగెఁ బోఁడి నప్పుడు డోలా
రూపమున నునఁగి పెనఁగెడు
నీపరితోషంబు గనఁగ నివ్వన భూమిన్. 258

వ. అని యభినందించి యమ్మొలుంగుఁదీఁగెఁబోఁడి యుఱికిపోయిన
కడకుం బోయి. 259

క. కచబంధంబున జాఱిన
విచికిలదామంబు ప్రణయవివశతఁ గొని యా
రుచిరాంగిఁబోలెఁ గౌఁగిట
నచలసుతావరుఁడు నేర్చి యానందించెన్. 260

క. తరుణీకుచనిఫలితని
ర్భరపరిమళగంధసారపంకదళంబుల్
హరుఁ జేటి మదనరక్షః
పరిరక్షాలీల మిడిరె ఫాలాగ్రమునన్. 261

వ. వెండియు నమ్ముందట నయ్యిందు వదన పదారవిందంబులు
గనుంగొని. 262

ఉ. చారుశిరీషకోమలము సారసపత్త్రమనోహరంబు వి
స్ఫారితభాగ్యరేఖము విభాసురకుంకుమపంకిలంబు నై
కోరికమించు నీ సమదకుంజరయాన పదద్వయంబు సొం
పారఁగ నస్మదీయనిటలాగ్రము సోఁకుట యెప్పుడో గదా.

క. అని సురభికుసుమముల న
వ్వనితామణిదివ్యపాదవారిజములు స
ద్వినయంబున నర్చించుచుఁ
జని యా శివుఁ డొక్క కేళిశైలముదండన్. 264

క. అరవిందేందీవరబం
ధురకేళీహంసగణమనోహరపద్మా
కరకల్లోలపరంపర
నరుదారఁగఁ దాను నొక్క హంసియుఁ బోలెన్. 265

— మోహిని జలక్రీడలాడుచు శివునకుఁ గనఁబడుట. —

సీ. గురుతరోన్నతకుచకుంభయుగ్మముఁ దాఁకి
వీచీపరంపరల్ విఱిగిపడఁగ

జలములనీఁదు నుత్సవకేళిఁ గని తద
భ్యాసవశంబు లై యంచ లలరఁ
గమలముల్ దొఱఁగి, యుత్కటసౌరభముఁ జల్లు
మోమున నెలదేఁటిమొత్త మాడ
వలరాజు కేతనజలచరార్థము వైచు
పువ్వులువోలెఁ జూపులు దనర్ప
తే. మృదులపవమాన వీజన మేను చెంది
కంజకింజల్కమధురజః కాండ మలర
వేడ్కజలకేళి సలుపునవ్వేలఁదిఁ జూచె
నిందుశేఖరుఁ డద్భుతానందలీల. 266
వ. చూచి యవ్వేలంది యానో కాదో యను సంశయంబున.
క. అరవిందవదన మోమో
యరవిందమొ నీలవేణి యలకలో తేంట్లో
తరళాక్షిచూపులో జల
చరములో గుబ్బెతకుచములో చక్రద్వయమో. 268
వ. అని భావించి. 269
ఉ. చేరి తదీయలీల తనచిత్తమునం గలశాంబురాశి వీ
చీరుచిరప్రవాళలత చెల్వున నింపెసలారుచున్న వి
స్ఫారితలోచనాబ్జముల సంతసమారఁగఁ జూచి యెట్లొ నే
ర్పారఁగఁ బట్టువేముకఁ బ్రయత్నమునన్ సడిదాఁకినెమ్మదిన్.
ఉ. ఏగతిఁ బట్టువాఁడ నొకో యిప్పుడుకీ మున్నొనరించినట్టియు
ద్యోగములెల్ల నిష్ఫలత నొందెఁ బదంపడి కంటి భాగ్యరే

ఖాగరిమన్ దటాకమునఁ గంజ నివాసినిఁబోలె నంబుకే
ళీగతదివ్యచిత్తమున లేమ చరించెడు నూర్మిపంక్తులన్. 271

—◆ శివుఁడు తిరిగి మోహినీకాంతను బట్టఁబోవుట. ◆—

క. జలకేళీమహితోత్సవ
కలనానందమున నొరులఁ గానక హంసా
వళిలోనఁ దేలు చున్నది
వెలఁదిం బట్టంగ నిదియె వేళ యటంచున్. 272

క. చరమప్రదేశమున నా
సరసీరుహాకరముఁ జొచ్చె సర్వజ్ఞుఁడు త
ద్విరహాగ్నితప్తదేహముఁ
బొరయుడు, నుడుకెత్తి నీరుబుగ్గలు వొడమన్. 273

మ. హరచూడాహరిణాంకఖండరుచి నెయ్యంబారఁగాఁ గైరవో
త్కర ముల్లాసముఁ బొందెఁ,గుందె జలజాతశ్రేణి,హంసావళీ
గరుదోఘంబున మించె సోయగము, చక్రద్వంద్వమున్మన్మథా
తురవృత్తిం గవవిచ్చి పోదొడఁగెఁదోడ్తోఁ దత్తటాకంబునన్.

—◆ మోహిని తప్పించుకొని శివున కగపడక పోవుట. ◆—

వ. ఇట్లు రభసంబునం బట్టవచ్చు కామారి కామాతురత్వంబుఁ
గనుంగొని యంతర్హాసంబున నయ్యింతి వెడసిగ్గుతో విలీన
యై, వివస్త్ర యై యున్నదాన రాకురాకు మని నివారించి
నీరువెడలి తీరంబుచేరి చీరఁగట్టుకొని. 275

క. బెడఁగారు పుప్పొసొమ్ములు
వెడవెడ [illegible]కొన్ని దొడిగి వెలిదామర పు

ప్పొడి మేన నలఁది వేఱొక
యెడ నవ్యనికుంజకుసుమసమీహితశయ్యన్. 276

శా. పూవుం దోవులఁ దమ్మిమొగ్గలను సంపూర్ణంబుగా నిచ్చు న
త్తావుల్ గ్రమ్ము మరందపూరము ప్రమోదం బారఁగాఁ గ్రోలు
చున్|భావోద్భూత మదప్రదీప్తయగుచున్ బాలిండ్లు ముక్తాం
బర|శ్రీవిన్యాసము నొందనుండె సురతక్రీడోన్ముఖస్వాంతయై.

వ. అంత నమ్మహాదేవుండు నట్లు నివారితుండై కొండొక నిలిచి
యచ్చపలలోచన మోమోట మాటకు నంతసించి. 278

మ. పలికెం దేనియలొల్క, నవ్వెఁ బ్రియ మొప్పం, జూచె నాశాలతా
వళులన్ జిక్కఁగ, డెందమున్ గనియె నివ్వామాక్షియంచుం బ్రి
యం| బలరం దమ్మికొలంకు వెల్వడి సరోజాక్షీశిరోరత్న మె
వ్వలివంకన్ మునునిల్చె నచ్చటికిఁ బోవం దత్ప్రదేశంబునన్.

మ. సతి లేకున్నఁ గలంగి గుండె చెదరన్ శంభుండు నిర్విణ్ణుఁడై
ప్రతి దిగ్భావితనేత్రపంకజగళద్బాష్పాంబువుల్ మీటుచున్
శతపత్త్రాకరసైకతోర్మిగతహంసశ్రేణులం గ్రమ్మఱన్|జతనం
బారఁగఁ జూచి యాత్మకృతదోషంబున్ బ్రశంసించుచున్.

ఆ. అపుడు పట్టనైతి నణకించి పోయె నా
మాయలాఁడి మగువ మరులుకొల్పి
యకట! మోసపోతి నరయంగ లేనైతిఁ
దలఁపు కొలఁదిగాక తప్పిపోయె. 281

ఆ. విగతవస్త్ర యైన వెలఁదిగాక, సవస్త్ర
యేల కాముకునకు? నెఱుఁగ నైతి

సతి వివస్త్ర నన్ను జడిసితిఁ బట్టంగ
భాగ్యహీనుఁ డేల ఫలము నొందు? 282

వ. అని వగచి తదీయశీలాగుణంబులు దలంచి. 283

సీ. ఆమహాగంభీరయానంబు మురిపె మా
బలుపిఱుందునఁ గ్రిమ్ముమసిఁడినిగ్గు
లాగుబ్బుపాలిండ్లపై గబ్బిచంద మా
చిగురాకుమోవిపైఁ జిన్నినగవు
లాముద్దుమోమున నడరుసంతోష మా
నిడువాలుచూపులనిశితధార
లాలలాటాంతకాంతాలకశ్రేణి యా
చరణావతంసకజలరుహంబు

తే. లారతోత్సవలీలావిహారరసిక
మానసాహ్లాదభంగి నామానసమున
మఱవ రాకున్నయవి నన్ను మరుఁడుకొల్పి
యింక నేలాగు పాలింతు నిందువదన. 284

క. వేదుక నిది యలయించెదు
జాడయొ మాయామృగంబుసఖవై కపట
క్రీడల భ్రమియించి తుదిఁ
గూడక నను మొఱఁగిపోవు కుత్సితగతియో. 285

వ. మొఱఁగుండీఁగ తెలుఁగువం దోఁచియు, మృగతృష్ణికారూపం
బునం బట్టువసలేకయు, నింద్రజాలంబుచందంబున నిజంబు
గాకయు, స్వప్నావస్థలాగున భ్రమయించియు, దర్పణచ్ఛాయ

యుంబోలె దురవగమయయ్యెను,దగులువడక పోవుచున్నది. దీని కేమిసేయువాఁడ నని విరహోన్మాదవికలచేతస్కుం డై యచట నుండం గొలుపక వెండియు నన్వేషించుచు నక్కలువ కంటియున్న పువ్వుటింటికిం బోయి. 286

క. తనుఁ జూచి సిగ్గుఁ బ్రేమయుఁ
బెనఁగొనఁ బూఁబాన్పు డిగ్గి బిసరుహదళలో
చన నగవు దొలఁక నెడచే
సి నిలిచినం గోర్కు లడర శివుఁ డిట్లనియెన్. 287

ఉ. పానుపుడిగ్గ నేమిటికిఁ బంకజలోచన ! నన్ను మన్మథా
ధీను వియోగతాపశిఖిహేతినిపీడితుఁ గౌఁగిలించి యిం
పూని హిమాంబు శీతలపయోధరగంధరసార్ద్రదేహునిం
గా నొనరింపవే రతులకందువఁ జెంది కృపాతరంగిణీ ! 288

క. అని విరహాభారవిహ్వల
ఘనమదనోన్మాదవికృతిఁ గానక దీనా
ననుఁ డగుచుఁ బెక్కుమాటలు
పని యే మని యశ్రుజలము పయిపయిఁ దొరఁగన్. 289

ఉ. చిక్కితి దుర్వియోగమునఁ జిక్కితిఁ జక్కెర వింటి వాని చేఁ
జిక్కితి మోహబంధమున శీతకరానన ! కౌఁగిలింపవే! ప్రమో
ద్రేకదనంచుహస్తములు మోడ్చుచు శంభుఁడు డాయఁబోయి
యా ప్రకృతి మాయలాఁడిబిగి చన్నులపయ్యెదఁ బట్టె నుద్ధతిన్.

ఆ. ఫాలలోచనుండు పయ్యెదఁ బట్టినఁ
బట్టువడక పోయెఁ బద్మనేత్రి

పట్టువడున యెన్నిపాటులు వడ్డ నా
విష్ణుమాయ? శివుఁడు వెఱ్ఱిగాక! 291

క. అలతి నిలువక గ్రిక్కున
చేతోభవకేళి లేక శివునకుఁ దెలుచన్
రేతఃప్రవాహము గంగా
స్రోతోరూపమునఁ దోరఁగెఁ జోద్యం బడరన్. 292

క. అయ్యింద్రియరస మంతయు
నయ్యెడ రజతంబు శుద్ధహాటకమును నై
వెయ్యమున నొప్పెఁ గనుఁగొన
నయ్యాస్థానంబు వారి కచ్చెరు వగుచున్. 293

—♦ శివునకుఁ బరబ్రహ్మజ్ఞాన ముదయించుట. ♦—

క. రాజీవాక్షుం డాక్రియఁ
దేజము పొలిచెఱపి, మాయ తెరఁ దిగిచిన నా
రాజార్ధశేఖరున క
వ్యాజ పరబ్రహ్మబోధ మడరెన్ బుద్ధిన్. 294

శా. మారారాతి, విముక్తమోహుఁడయినన్మాయావనక్రీడలున్
నారీమోహనలీలలుం దొఱఁగె నానాదేవతాశ్రేణిలోఁ
దోరంబై మునుపోలెఁ గొల్వుదనరెన్ దుర్వారతేజంబులో
ధీరుండై మణిభద్రపీఠిఁ జెలువొందె న్విష్ణుఁడునే నవ్వుచున్.

క. కురిసెఁ బువ్వులవానలు
హరిపై నానందలీల నమరులు మెచ్చన్

బరిపరివిధముల ముందట
నరనాయక ! జడలు దూల నారదుఁ డాడెన్. 296

సీ. మ్రొక్కిరి సురముని మూర్ధాభిషిక్తులు
మోడ్పుఁజేతులు మస్తముల ఘటించి
పొగడిరి శేషాదిభుజగాధినాథులు
బిరుదప్రబంధగంభీరయుక్తిఁ
బాడిరి గంధర్వపతులు వీణావేణు
కలనాదములతోడిగానసరణి
నాడి రచ్చరలేమ లభినవనృత్యంబు
లభినయవిన్యస్తహస్తలీల

తే. బ్రహ్మ ప్రాంజలియై వేదభాషణముల
బ్రహ్మతేజోవిలాసంబుఁ బ్రస్తుతించెఁ
బ్రమథగణనాయకునిమ్రోల బహువిధముల
నాదివిష్ణునిగూర్చి యయ్యవసరమున. 297

—◆ శివుఁడు కైలాసమునకుఁ బోవుట. ◆—

క. హరిమాయావిభ్రమమును
బరమబ్రహ్మైకచిత్రభావము వత్సా
దరమున వర్ణించుచుఁ ద
త్పరిరంభణకేళిఁ దేలి ప్రమదం బెసఁగన్. 298

క. ప్రమథులు గొలువఁగ నార్యా
రమణీమణిఁ గూడి చనియె రజతాద్రికి నా
యమృతాంశుశేఖరుఁడు చి
త్తమునం దద్విష్ణుమాయఁ దలఁచుచు వేడ్కన్. 299

—◆ ఫలశ్రుతి. ◆—

క. నారాయణమాయాభా
మారూపముఁ జూచి శివుఁడు మఱఁగిన కథ యిం
పారఁగ విను ధీరుఁడు సం
సారమహామాయఁ బాసి సంతస మొందున్. 300

వ. అని గోవిందశర్మ ధర్మనందనునకుం జెప్పెనని విని, పరీక్షిత్తట
మీఁదటి కథాప్రసంగం బెట్టులుండె నని శుకబ్రహ్మ నడుగు
టయును. 301

మ. కలశాంభోనిధికన్యకాకుచతటీకస్తూరికాపంకసం
కిలసుస్నిగ్ధశరీర, నీలగళయోగిగ్రామణీమోహనో
జ్జ్వలమాయామహిళావినోద, ధరణీసంక్లేశసంభావనా
విలసచ్ఛ్వేతవరాహ, భావితమహావేదాంతతత్త్వోదయా.

క. నారదవీణామధురగ
భీరధ్వనిముదితహృదయబిసరుహ శుకస
త్కారసమాశ్రితనిజతే
జోరూపఫలప్రపూర్ణసురతరురాజా. 303

తోటకవృత్తము. చతురానన దివ్యలస న్మకుటాం
కితరత్నమరీచి వికీర్ణపదా
శ్రుతిరాగతరంగవిశుద్ధజగ
త్త్రితయా శ్రితలోకవిధేయగుణా. 304

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ
కృష్ణభట్టారకపౌత్రి చింతలపూఁడికామయప్రభుసుపుత్ర
సుకవివర్యరాధామాధవయెల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందుఁ
జతుర్థాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



శ్రీరస్తు.

# విష్ణుమాయానాటకము.

---

## పంచమాశ్వాసము.

క. శ్రీకర! రాధాకైరవ
రాకాసితకిరణ! మునివిరాజితచేతో
వైకుంఠనిలయ! గుణర
త్నాకరకల్లోల! నవమదనగోపాలా! 1

తే. అవధరింపుము దేవ! సంయమివరుండు
సకలవేదాంతవిద్యావిశారదుండు
శుకమహాయోగి పలికె నుత్సుకత మఱియు
నింపుగా నాపరీక్షిన్నరేంద్రుతోడ. 2

వ. అవ్విధంబున సదాశివునికథఁ జెప్పి గోవిందశర్మ ధర్మనందను
నకు విష్ణుమాయవలన నారదుండు మోసపోయిన తెఱంగు
చెప్ప నుపక్రమించి. 3

మ. విను విశ్వక్షితిపాలమౌళివలభీవిస్ఫారరత్నప్రభా
కనదుద్దామపదారవింద! త్రిజగత్కల్యాణచారిత్ర! పాం
డునరేంద్రోత్తమపుత్ర! యీమునిగరిష్ఠుల్ నీవునుంగూడిమెం
దునకుం జిత్తము పోవనీక హరియందున్నిల్పి సంప్రీతితోన్.

వ. అని కొలువు సావధానంబుఁ గావించి. 5

—♦ విష్ణు ప్రభావ వర్ణనము. ♦—

క. పరమాత్ముఁడు పరమేశుఁడు
పరమ బ్రహ్మైకమూర్తి ప్రకృతి పురుష సుం
దరుఁడు తదీశుఁడు నని మదిఁ
బరికింపుము విష్ణు సుప్రభావచరిష్ణున్. 6

క. తేజముల కెల్ల నుత్కట
తేజం బై తమముఁ జెఱచుతీవ్రాంశుక్రియన్
దేజోనిధి యగుహరి నిజ
తేజమునఁ బ్రపన్న మోహతిమిరముఁ జెఱచున్. 7

వ. అని హరిసామర్థ్యంబు సూచించి తదనురూప కథాప్రాయం
బుగ నిట్లనియె. 8

క. సకలబ్రహ్మాండకదం
బకఘటనాచతురలీల వాయని మదితో
నొకనాఁడు సనకశుకముఖ
లకునుం బోరానివేళ లలితక్రీడన్. 9

—♦ శ్వేతద్వీపమున విష్ణుమూర్తి కొలువైయుండ మాయాకాంత వచ్చుట. ♦—

శా. శ్వేతద్వీపమునందు సాగరతటోర్వీపారిజాతావనీ
జాతచ్ఛాయ సువర్ణపీఠమునఁ గంజాతాలయాకామినీ
భూతన్వీ సముపాశ్రితుం డగుచు సంభోజాయతాక్షుండు సం
ప్రీతిన్ దివ్యసతీమణుల్ గొలువఁగాఁ బేరోలగంబున్నెడన్.

క. విదిత ప్రకృత్యవిద్యలు
మొదలుగఁ బేరైన నామములుగల మాయా

మదిరాక్షి యైనవైష్ణవి
ముదమునఁ జనుదెంచి శౌరిముందట నిల్చెన్. 11

సీ. నెత్తమ్మిరేకులనెతిమించు నడుగులఁ
గనకమంజీరభృంగములు మొరయఁ
గారుకందువసిరి గలమేనుఁదీఁగపైఁ
గుంకుమతటిదంశు వంకురింప
జక్కవ మురిపెంబు నవవచ్చుచనుదోయి
మౌక్తికబిసఖండమాల్య మదర
నిండుఁ జందురునివన్నియసొంపుమోమున
మందస్మితజ్యోత్స్న [illegible]

తే. నట్లు మోహనమూర్తి యై యరుగుదెంచి
కంకణక్రేంక్రియాళిలఁ బొంక మెసఁగ
హరికిఁ గరములు మొగిచె, నయ్యతివఁ జూచి
సతులకొలు వెల్ల వేడ్కల నందడింప. 12

క. కరములు మొగిచిన మాయా
తరుణిం గరుణాప్రసన్నతం జూచె మహా
పురుషుండు విష్ణుదేవుఁడు
సిరి కైనం గలదె యట్టిచెలిమి విభునితోన్ ? 13

తే. అపుడు శ్రీహరిసుప్రసన్నాభిముఖత
విదిత బహుమానగుణకమై వేడ్కసేయఁ
దత్ప్రియస్త్రీల కుబుసుపోఁ దగినయింద్ర
జాలవిద్యావినోదముల్ సంఘటించి. 14

వ. అమ్మాయాతరుణి తత్ప్రకారంబులు చూప నుద్యోగించు సమయంబున, సకలలోకసంచారి యగునారదమునీంద్రుండు పరమభాగవతోత్తముండు గావున భగవత్సేవాతత్పరుం డై వైకుంఠదివ్యభువనంబున కరుగుదెంచువాఁడు, పురాకృత పుణ్యఫలవిశేషంబున నట్లు కొలువై యున్న దేవదేవునిం గనుంగొని మేను గరుపాఱ గగనంబు డిగ్గి నారాయణ నామోచ్చారణపారాయణమధురవీణానాదంబుతో జయ జయశబ్దపురస్సరంబుగా ననేకప్రణామస్తోత్రసహస్రంబులు సమర్పించి తదాదరణంబు వడసి కూర్చుండె నంత నయ్యింతి తన యుపక్రమంబున.

క. పురుషుఁడుఁ బ్రకృతియు జగదు
త్కరమును గాలంబు నైన కర్తకు నాత్మే
శ్వరునకుఁ దేజోరాశికి
హరికి నమస్కృతి యొనర్చి యద్భుతలీలన్. 16

—◆ మాయాకాంత బహువిధంబులుగా నింద్రజాల విద్యలు చూపుట .◆—

సీ. బుద్బుదంబులఁబోలెఁ బొడమించు నడఁగించు
బ్రహ్మాండమండలపరికరముల
నింద్రుల మనువుల నెలయించుఁ బొలియించు
జంత్రంపు బొమ్మలసరవి మీఱఁ
బొలఁతులఁ బురుషులఁ బుట్టించు గిట్టించు
వెడబూమెరూపులవిధముగాఁగ
భూరిసంపత్కళల్ పొరయించు విరియించు
ఘననిదాఘమరీచికల తెఱఁగునఁ

తే. బంధభూతవిలాసముల్ నించుఁ ద్రెంచు
సముచితస్వప్నదృష్టప్రచారములుగ
దుఃఖసుఖములు సమకూర్చుఁ దొలఁగఁ ద్రోచుఁ
గాలసరణులఁ జక్రియుగ్మాంబుజాడ. 17

సీ. బహుమతంబులవారిఁ బ్రభవింపఁగాఁ జేసి
మూఢవాదంబుల మొనయఁ జేయుఁ
బెక్కువేల్పుల భూమిఁ బెంపారఁగాఁ జేసి
యల్పులఁ దత్సేవ కలరఁ జేయు
వర్ణాశ్రమంబులవారల సమకట్టి
కర్మానుగతబుద్ధిఁ గడలుకొలుపు
విద్యావబోధనవిభవముల్ గల్పించి
గర్వకోపోద్రేకగతులఁ బెనుచు,

తే. గజతురంగాంగనారత్నకలనఁ జూపి
రాజ్యభోగానురాగాభిరతి యొనర్చి
తామసులు రాజసులుఁ గాఁగఁ దగులు వెట్టు
సహజమోహాంధకారంబు సంఘటించి. 18

క. కూలంకషాపగాంబుధి
కేళీవనగిరుల మేలు గిఱికొల్పి లస
న్నాళీకోత్పలఫలసుమ
జాలకసౌభాగ్యలక్ష్మి సమకొనఁ జేయున్. 19

క. చంద్రార్కవహ్న్యనిలధీ
సాంద్రతఁ బొలుపారఁ జేయు జలధరవిద్యు

ద్రుంద్రనవరత్నరుచిరమ
హేంద్రి ధనుర్లీలఁ జదల నెనయం జేయుక్. 20

క. అరిషడ్వర్గాతురు లై
పరిబోధము లేక నరులు బహువిధకర్మా
చరణమున మెలఁగఁ జేయుచుఁ
బొరిఁబొరి జననాదిదుఃఖములఁ బడఁ జేయున్. 21

క. నరనాయకు లై కొందఱు
పరిజను లై కొంద ఱుచితపదరాజ్యమనో
హరు లై దుర్నయవర్తనఁ
గొఱలుచు దుష్కర్మవార్ధిఁ గూలఁగఁ జేయున్. 22

క. అతులితసాత్త్వికయోగ
ప్రతిపాదితభక్తిఁ బరమభాగవతుల నం
చితసేవాంజలితో న
న్నతి నెడనెడఁ బొగడి విభుని మన్ననవడయున్. 23

—♦ { మాయాకాంత పన్నిన యింద్రజాలమును నారదుఁడు తిరస్కరించి తన ప్రభావమును బొగడుకొనుట. } ♦—

వ. ఇవ్విధంబున ననేకవిద్యావైశారద్యంబు చూపి కౌతుకంబు నెఱపిన నవ్విభుండును, నయ్యిందిరా ప్రముఖ సుందరీ సహస్రంబును బహుప్రకారంబులం బ్రస్తుతించి సముచిత రత్నపారితోషికంబు లిచ్చి రప్పు డీమహాత్ముండు నారదుండు తదీయమాయారహస్యాదితిరస్కారగర్భంబుగా నలంతినవ్వ

నవ్వి తన తపోవిద్యానిర్వాహకత్వంబు పేరేచ హరికిఁ బ్రాంజలి యై యిట్లనియె. 23

తే. ఈమహాదేవు లెఱుఁగరే యిటకు మున్ను
నీదుమాయల కొలఁదులు? నీరజాక్ష!
యింత భ్రమయుచు నున్నవా రింతలోనె!
యతివ లబలలు, ముగ్ధలు ననుట నిజము. 24

క. మున్ను పలుచోట్లఁ జూపిన
దిన్నెరవు ప్రకృతి విద్య లివి వింత లొకో
వన్నుగ నేతన్మాయో
త్పన్నము లగు కృత్యములకు బ్రమయం జనునే? 25

క. ఏ నొకఁడఁ దక్క నీమా
యానిర్మాణమునఁ జిక్కు నఖిలము విమల
జ్ఞానము చాలనికతమున
నీనెలఁతల భ్రాంతి చెప్ప నేమిటి కింకన్. 26

తే. బ్రహ్మరుద్రాదిదివ్యుల బ్రమయఁజేయు
నపుడు నినుఁ జూచుచుండుదు నరిదిపడక
యెఱుఁగుదువు నా మనోజ్ఞాన మెల్లకడల
నేను బ్రమయుట గల్గెనే యెన్నఁడైనఁ? 27

—● నారదుని వంచింపవలె నని విష్ణుమూర్తి తలఁచుట ●—

వ. అని యమ్మహాప్రభు కృత్యంబు మోహ మాయా వ్యాపారంబు ననన్యభేద్యం బగోచరం బపరిమితక్రీడా సమ ర్థంబు నని తలంపనేరక, 'అతి పరిచయాదవజ్ఞ' యను

వాక్యంబునం గల యర్థంబు చొప్పున, హరి యనుగ్రహించి చేరందిగిచిన మందెమేలంబునం బ్రవర్తింపక, బ్రహ్మరుద్రాదులం దిరస్కరించి, తన్మాయ గణింపక యిట్లు పలికిన యా వెడంగుమునిం గనుంగొని మనంబున రోసి యతనికిం బురాకృతకర్మశేషంబు ననుభవింపం గారణంబు గల దని దివ్యచిత్తంబున నెఱుంగ నవధరించి, మాయామందస్మితం బడర నయ్యరవిందలోచనుండు గారవించి, నీ వట్టివాఁడవ యౌదు వని ప్రకటించి మొదరువేచి యొక్క సమయంబున మోసపుచ్చువాఁడై యతని నప్పటికి వీడుకొలిపి. 28

క. అంతర్వాణిశ్రేష్ఠుఁడ
దంతఃకరణప్రకాశితాత్ముఁడు విష్ణుం
డంతర్ధి నొందె; నారదుఁ
డంత స్మహతీ సమేతుఁడై మెఱవడితోన్. 29

—♦నారదుఁడు బ్రహ్మాదులతో విష్ణుమాయ తన్ను సోఁకదని చెప్పుట♦—

సీ. అట వాసి తాఁ దనంతటివాఁడు లేఁడుగా
యనుబుద్ధి నజుఁ డున్నయచటి కేఁగి
వైకుంఠపతియొద్ది వార్తలు పచరించి
తనమోహనిర్ముక్తి తగ వచించి
తద్బహుమానవాగ్గన్యతం బొగ డొంది
కైలాసమున కేఁగి శూలపాణి
దండ వైష్ణవమాయ తను సోఁక దని పల్కి
యమ్మహాత్మునియద్భుతాభినుతికిఁ

తే. ధాత్రమై యింద్రముఖదిశాపతులకడకు
యక్షగంధర్వసిద్ధ సంయములకడకు
నరిగి తన విష్ణుమాయా జయంబు నొక్క-
నొడివి తద్వందనాది సన్నుతులుఁ గాంచి. 30

తే. పాడు, హరిమాయ వీణెపైఁ బ్రస్తుతించి
తన్ను సోఁకదటంచు సంతసము నొందుఁ,
దన్మహామాయఁ బడువారిఁ దలఁచి నవ్వు,
జగ మవిద్యామయం బని తెగడు నాత్మ. 31

క. ఇతఁ డొకఁడ విష్ణుమాయా
ప్రతిపన్నుఁడు గాక మోహపాథోధి సమం
చితబోధనౌక దాఁటిన
కృతకృత్యుఁ డనంగ వెలసె గీర్వాణులలోన్. 32

వ. ఇట్లు మోహమగ్నంబు లైన బ్రహ్మాండమండలంబులలోనఁ దా నొక్క-రుండునుం గులాలకీటకంబునుంబోలె భవపంకంబునం బొరయక కొంతకాలంబు ప్రవర్తించి, యంత ననంత మాయాప్రేరితుండై మహీమండలంబున ననేకతపోవనదివ్య పుణ్యక్షేత్రంబులు చూచుచుండె నట్టియెడ. 33

సీ. అబ్జభవాండసహస్రసంఖ్యలకు ని
దానమై తత్ప్రభుత్వమునఁ బొల్చి
ధాతృరుద్రాది మూర్తత నొంది తద్వ్యతి
రిక్తతేజమునఁ జరింప నేర్చి

యణుమహాద్వ్యాపారమై నిర్వికల్పత
సద్దివ్యపరశక్తి యందు వెలిఁగి
సత్త్వాభిధానుఁడై సాత్త్వికబ్రహ్మయో
గీంద్రబోధాబ్ధిపూర్ణేందుఁడు నగు

తే. ప్రకృతి పురుషాధినాథుండు పద్మనేత్రుఁ
డితని వెడఁగుందనంబు మాయించి పూర్వ
కర్మశేషంబుతో నహంకార మడఁచి
యాత్మవిజ్ఞాన మడరింతు నని తలంచి. 35

—•{ నారదుని మోసపుచ్చుటకు విష్ణుమూర్తి సర్వవరమనెడు స్థలమునందుఁ గృత్రిమ తపస్సు చేయుట. }•—

క. చిత్రంబుగ శేషాహి ప
విత్రతపోనిష్ఠ మున్ను వెలసినముక్తి
క్షేత్రము సర్వవరము; త
ద్ధాత్రీస్థలియందుఁ గపట తాపసమూర్తిన్. 36

క. వేల్పులకు నద్భుతంబు గఁ
గల్పించెన్ మాయ పెంపు గడు దీపింపం
గల్పానోకహసదృశా
నల్పకుసుమఫలభరితవనాశ్రమ మొకటన్. 37

క. అందు నొకనిందు క్రొల నర
విందేందీవర పరాగ విస్ఫుర విలస
త్సుందర తరంగ డోలా
వందిత కలహంసమై తనర నిర్మించెన్. 38

వ. ఇట్లు పుణ్యాశ్రమ సరోవరంబు లుత్పాదించి తత్తటంబున
సుస్థిరయోగాభిరతుండై యనేక మునిసహస్రంబులు సేవింపఁ
దపోనియతి నుండె నంత. 39

క. నేదిష్ఠ దక్షిణాశా
ప్రాదుర్భూతార్ష తుల్యభాగా జలజా
మోదభర భరిత మారుత
మాదైత్యారాతి హృదయ మలరఁగఁ జేసెన్. 40

క. సవిధప్రాచీన మహా
లవణజలధి ఘుమఘుమిత కలధ్వని కెనయై
సవనాస్త్రశౌమణ్మఖ
వివిధరవం బా వనమున వీనులఁ దనిపెన్. 41

క. అతినిబిడ జలదమాలా
ప్రతిమానక్రతుసముత్థ బంధురధూమ
ప్రతతుల గగనం బాచ్ఛా
దిత మయ్యెం దద్వనమున దివిజులు పొగడన్. 42

సీ. కాశీ గయా ప్రయాగములకంటెను నైమి
శారణ్య ముఖ్యపుణ్యాశ్రమముల
కంటెను పాండురంగంబునకంటెను
సరయూతట ప్రభాసములకంటె
ద్వారావతీ భృగుద్వార భూములకంటెఁ
జారుబృందావనస్థలముకంటె

శ్రీపురుషోత్తమ సింహాచల శ్రీకాళ
స్థానాది దివ్యదేశములకంటె
తే. వర్ణ్యమై పుణ్యమై చతుర్వర్గఫలద
మై కరంబు జగత్సేవ్య మయ్యె నాది
విష్ణుఁ డచ్చోట యోగియై వెలసియున్న
సన్నుతక్షేత్రరాజ మాసగ్వరము. 43

వ. ఇవ్విధంబునం ద్రిభువనైక పవిత్రంబైన యప్పుణ్యాశ్రమం బునఁ బరమ మాయాతపశ్చరణంబు సేయుచు నయ్యచ్యుతుండొక్కనాఁడు, స్వకల్పితసరసీతీరపిప్పలతరురేఖామధ్యంబునఁ గృష్ణమృగాజినకృతాస్తరణుం డై పరిబుద్ధముని వృద్ధులం గూడుకొని బ్రహ్మబోధరహస్య గ్రంథావలోకనంబు సేయుచున్న సమయంబున నీ హిరణ్య గర్భనందనుండు తదీయ మాయాప్రేరితుం డై యట్లుఁ దిరుగుచు వచ్చి య య్యాశ్రమంబు ప్రవేశించి. 44

మహాస్రగ్ధర

కనియెం దీరావనీజోత్కటకుసుమరజఃకాండధారాళవాత్యా
ఘనవేగవ్యగ్ర భృంగీగణచరణపత త్క్రమపుష్పోపహార
స్వన దంభోభంగరంగ జ్జలఖగపరిష చ్చారుసంచారలీలా
జనితోల్లాసాచ్యుతర్షి శ్వరవరసుమనస్సారసంబున్ సరంబున్.

చ. సురుచిరకుట్మలస్తబకశోభితశాఖల గుంపుసొంపునం
బురు వగుపొన్న లీ కమలభూసుతు సొంపులఁ దేల్చె షట్పద

స్వరములతో రతిక్రమ సుశబ్దపదాంగద నాద మేదుర
స్మర నృపసార్వభౌమ నవమౌక్తిక హర్మ్యములట్లుఁదత్తటిన్.
మ. అకలంకాత్మ్కుఁడు చూచె నీమువి తటాకాభ్రంలిహానోకహ
ప్రకరస్కంధ గభీర కోటర కుటీ పర్యంక శాఖా మిళ
చ్ఛుకయుగ్మంబులు మన్మథోత్సవవచస్స్ఫూర్తుల్ ప్రవర్తించివే
డుకఁ గ్రీడించెడుసంభ్రమంబుకడుఁజూడ్కుల్ వేడ్కలందేలఁగన్
మ. కలపుంస్కోకిలముల్ రసాలదళముల్ ఖండించిచంచూపుటం
బుల నల్లల్లన వల్లభాంగనల కింపుల్ చూపుచున్ మేటిక్రొ
వ్వుల మవ్వంబున రెట్టియైనమగుచెయ్యుల్ నివ్వటిల్లంగఁ గొ
మ్మలపైఁజారుకుహూరవంబు లడరింపంజూచెఁ దీరంబునన్.
ఉ. మందమరుచ్చలాచలిత మంజుల నంజుల మంజరీ మిళ
త్సుందరవల్లియొక్కయెడఁజూడఁగనొప్పె; లతాంగియై శతా
నందసుతుండు జవ్వనమునన్ విజపీఁగు కుచద్వయంబుతో
నందముచూపు నిట్లయని యాక్రియఁజూపి నటించుకైవడిన్.
చ. కుటిలలతా ప్రభావమునఁ గోమలచూతలతాంతశాఖ యొ
క్కటియొకయింతసాఁగియొకకందువనొప్పెమరుండునారదుం
డటఁ జనుదెంచి యాకొలన నంగనయైనను బిట్టు నాటనే
యుటకయి వింటి పువ్వునకు నోలి సమర్చినబాణమోయనన్.

—◆ సరోవర వర్ణనము. ◆—

ఉ. నారదు పుంస్త్వ మీసరసునం బరిముక్తముసేసి యంగనా
కారముసేయ మాయ నమకట్టిన వస్తుచయంబ నాఁగ సొం

పారుచుఁ జూడనొప్పె చరణాది శుభావయవాభిరామముల్
సారస సైకతోర్మి పటుచక్రి నవోత్పల భృంగసంఘముల్.

చ. సరసిజగర్భనందనునిసాత్త్వికబోధముఁ గప్పియున్న ని
ర్భరతర రాజస ప్రకృతిఁ బాయని కామకృతాది దుర్గుణో
త్కర చరణప్రచారముల కైవడిఁ జూడఁగ నొప్పె నాసరో
వరవిమలోదక స్ఫురిత వారిజరేణు తరంగ సంఘముల్. 52

మ. భ్రమరద్వంద్వము లంబుజాతములపైపైఁ దన్మరందాసవ
భ్రమవిభ్రాంతములౌచుఁగూడుటలుచెప్పంజూపఁగానొప్పునీ
కమలోద్భూతసుతుండుకాంతయయివేడ్కన్భర్తతోఁబుష్ప
చాపమహోద్రిక్తతఁగేలినుల్లసిలుతద్భావిక్రియల్ దెల్పుచున్.

వ. వెండియుం గనకగర్భాత్మభవుని విమల హృదయంబుంబోదు
నంగల భవిష్యన్మోహతమోవికారం బభినయించుచుఁ బుం
డరీక షండంబుల నాక్రమించు చంచరీకజాలంబును, విధాతృ
పుత్త్రిని భావిభావజకేళీ సుఖపారవశ్యంబు సూచించుచు
బిసరసాస్వాదలహరిం జొక్కుచక్రవాకంబులును, శతానంద
నందనునకు ముందటం బ్రాప్తించు సామ్రాజ్యలక్ష్మీ మనో
హర హర్మ్య వీథీవిహరణంబు లెఱింగించుచు సమున్నత
సైకతవేదికలం గ్రీడించు రాయంచకొదమలును, స్వాయం
భూతనూజుని యంతఃకరణంబు దహింప నడరు మీఁదటి
మాయాసంసార భర్తృపుత్త్రి మిత్త్రాద్యపాయజనిత శోకా
నలస్ఫులింగకరాళత్వంబుఁ దెలుపుచుఁ గింజకింజల్కపుంజంబు
వెదచల్లుచుం దిరుగు నభినవపద్మభంజనంబును, జతురానన

సుతునకుఁ బునఃప్రసాదదానం బొసంగు బిసరుహాక్షుని కరు
ణాకటాక్ష వీక్షాసుధారసబిందు బృందంబులవిస్తారంబు ప్రశ
స్తంబుచేసియు ముక్తాఫలానుకారి శీకర నికరంబు లెగయించు
జలచరవరంపరలును గన్నులకు నింపు సొంపు సంపాదించె
నప్పుడు. 54

చ. అనుపమకౌతుకం బడర నాకమలాకర వైభవంబు ని
మ్మునివరు డర్థిఁజూచె నతిమోహనమూర్తిదటాకలక్ష్మియున్
మన మలర న్మరాళగతమంజులతాగతిఁ దేల్చె నాదరం
బునఁ దనకుం దనూజ యయి పుట్టఁగలం డని వత్సలక్రియన్.

క. జలజాకరంబు బహువిధ
ములఁ బొగడుచుఁ గమలగంధముదితశ్రీమరీ
లలిత శ్రుతులకు మారుత
చలతంత్రి విపంచి మొరయ సమ్మదలీలన్. 56

—♦ నారదుఁడు మాయామునియైన విష్ణువునుజూచి వర్ణించుట ♦—

క. అల్లల్లనఁ జని ముందట
నుల్లమునకు నేత్రములకు నుత్కటమై శో
భిల్లెడు తేజోనిధి ముని
వల్లభు హరిఁ గనియె నభినవశ్రీమూర్తిన్. 57

తే. బ్రహ్మముని పరిషద మధ్య భాసి యగుచు
గ్రహగణాశ్రితుఁడైన భాస్కరుఁడు వోలె
బ్రహ్మతత్త్వంబు తానయై ప్రతిఫలించు
హరి నపూర్వర్షివరుఁ జూచి యరుదు నొంది. 58

ఉ. ఎన్నఁడు జూడ నీమునికులేశ్వరు, నీమహితాశ్రమాధ్యునా
కన్నుల కెంతొ యెక్కుడయి కానఁగనయ్యెడు నేతదీయ ది
వ్యోన్నత చిద్విలాసము, గుణోత్తరు నీఘనుఁ జూచి బ్రహ్మ ప
శ్యన్నిట లాదు లైనఁ బరమార్థము వేఁడుదు రేమిచెప్పుదున్!

తే. లలితపద్మాక్షమాలికాలంకృతుండు
గోపిచందనతిలకపరిదీపితుండు
నగుచు నిమ్ముని విష్ణుమూర్త్యంతరంబు
కరణి నున్నాఁడు సాత్త్వికాకారమహిమ. 60

శా. ఈదివ్యాశ్రమభూమిమోక్షపదమై యింపొందు వైకుంఠమో
యీదివ్యర్షివరుండు బ్రహ్మమయుఁడై యేపారుపద్మాక్షుఁడో
భేదింపన్ మతి దూఱకున్న దనుచుం బెల్లుబ్బునుల్లంబుతో
నాదైత్యాంతకుఁ జేరఁబోయితగనియ్యార్యుండునమ్రక్రియన్.

వ. అనన్య మునిసామాన్య పరిభావ భావిత తపోధనుం డగు న
మ్మహాముని నంతరాత్మన్ బ్రశంసించుచుఁ దనకు మహా
మునులు ప్రత్యుత్థానం బొనర్ప మాయామునివేషధారి
యగు హరి డాయంబోయి యథోచితాన్యోన్యసంభావనా
ప్రశంసుండై యుండునంత. 62

—♦ మాయాముని నారదుని సంభావించి సంభాషించుట ♦—

తే. యతితనూభవు లాసనార్ఘ్యాది విధులు
సలిపి పూజించి రంభోజజాతసుతుని
హరియుఁ గుశలోపచారవాక్యములఁ బ్రీతిఁ
జేసి వెండియు ననియె విశేషఫణితి. 63

సీ. అస్మత్తపోవనం బతిపవిత్రితం బయ్యె
భవదీయతేజఃప్రభావకలన
నేతన్మదీయ మునీంద్రపవిత్రము ఫలి
తం బయ్యె యుష్మత్సుదర్శనమున
మన్మనోనిహిత సమాధి మూర్తం బయ్యె
నతిదుర్లభత్వదాగతివిశేషమున
మామకోత్కృష్టాభిమతము సిద్ధించుట
గాదె భవాదృశా గమనలీల?
తే. అంతరరుల జయించి మోహం బడంచి
పాపసంసారతాపంబు పరిహరించి
బ్రహ్మ నిర్వాణ నిర్వృతిపదవి వడసి
యున్నవాఁడవు నీవ కా కొఱుఁదు గలఁడె? 64
క. మాయామోహావిముక్తము
శ్రేయస్సుఖపదము బోధశిశిరమయూఖ
ప్రాయమును నీదురూపము
ధీయుత! నినుఁ బొగడఁ దరమె దివ్యుల కైనన్? 65
ఆ. ఈతపఃప్రయాస మెల్లను గడతేఱె
నీసమాగమమున నేఁడు మాకు
నింక మాతలంపు లెల్లను ఫలియించుఁ
ద్రిభువనైక కీర్తి విభవ మొసఁగ. 66
క. అంబుజగర్భేంద్రాదిప
దంబులు నీ కాటపట్టు లగ నంతర్లో

కంబులఁ గలిగినవృత్తాం
తం బెల్లను నీక తెలియుఁ దాపసవర్యా! 67

క. వ్యామోహాగాధవిష్ణుమ
హామాయాచక్రవిక్రియాపన్నుఁడు గా
కే మహితాత్ముఁడు లోకము
లో ముక్తుం డయ్యె దివ్యలోకము పొగడన్? 68

క. అని మునివేషధరుం డగు
వనరుహదళనేత్రుఁ డడుగ వారిజభవనం
దనుఁ డనియె బ్రహ్మవిద్యా
జనితప్రాభవము వాక్యసంపద వెలయన్. 69

ఉ. ఓమునినాథ! నీ వెఱుఁగకుండుట గల్గునె వేదశాస్త్రవి
ద్యామహితార్థనిశ్చితరహస్యపదంబులమేలు, వర్తమా
నామరసంయమీశ్వరులయందలి వృత్తము, శంకరస్వయం
భూమధుఘస్మరేంద్రసురముఖ్యులలోకవిశేషవార్తలున్. 70

—విష్ణుమాయకు లోఁబడనివాఁడను నేనే యని నారదుఁడు చెప్పుట—

వ. తక్కిన లోకవార్తలలోన నేమి విశేషంబు చెప్పనున్నయది? మూఁడులోకంబుల దేవదానవమునీంద్రాదులలో విష్ణుమాయం బడక ముక్తుండై చిదానంద కందంబై యదృచ్ఛం జరించువాఁ డెవ్వం డని యడిగితి రట్టి కృతార్థుండ నేన కాఁ దలంపుం డది యె ట్లంటేని. 71

క. ఒకనాఁ డే వైకుంఠము
నకుఁ బోయితి నచటఁ బద్మనాభుఁడు శ్రీభూ

శుకవాణీముఖకాంతా
ప్రకరముతో నొక వివిక్తపదమున లీలన్. 72

చ. కొలు వొనరించియున్నతఱిఁగూరిమి వైష్ణవమాయయింతియై
నిలిచి తదగ్రభాగమున నేరుపుతో వివిధేంద్రజాల వి
ద్యలు పచరించి పంకజభవాండచరాచరసృష్టిమార్గముల్
వెలయఁగఁజూపెనాసతులువిస్మయమందుచు వేడ్కఁజూడఁగన్

చ. అది యొక కొండ చేసికొని యవ్విభుఁడుం దనమాయచేత న
మ్మదితలఁ గన్నుఁబ్రామితఱి మోమున లేనగవంకురింపఁగా
నిది యొకవింతగాఁ దలఁచి యీసతులేటికి విస్మయంబు నొం
దెద రని పద్మలోచనుని దిక్కుమొగంబయియుంటినేనొగిన్.

క. నీమాయచేత బ్రమయరె
యీముగ్ధలు, బ్రహ్మశంకరేంద్రమునీంద్ర
స్తోమములు భ్రమయుచోఁ? బ్రతి
భామహిమ న్నేన కాక బ్రమయని వాఁడన్. 75

వ. అని పలికిన నామొగంబు చూచి, మాయావిహారి యగు నారాయణుండు సిగ్గుపడినవాఁడునుంబోలెఁ గొండొకతడ వెద్దియుం బలుకక యూరకుండి నావిజ్ఞానంబునకు మెచ్చి శిరఃకంపంబు చేసి నన్నుం బ్రశంసించి "నామాయం జిక్కుపడక తిరుగు మహాయోగిపుంగవుండవు నీ వొక్కరుండ" వని సంభావించి వీడుకొలిపె నట్లు నేనును దన్మాయారహస్యంబు లన్నియుం గరతలామలకంబు చేసికొని గతరజస్తమో మోహుండనై బ్రహ్మమునిసేవ్యమానుండనై విహరించు

చున్న వాఁడ ననిన, మందస్మితపూర్వకంబుగా సభ్యుల వినుం
డని పలికి యా తపోధనుం డగు వనజలోచనుం డి ట్లనియె.

—♦ మాయాముని ప్రత్యుత్తర మిచ్చుట. ♦—

క. మాతలఁచినట్ల చెప్పితి
వీత త్త్వజ్ఞానసిద్ధి యేరికిఁ గలదె ద
త్యాతత వైష్ణవమాయల
చేతం బడకునికి నీక చెల్లు మహాత్మా! 77

వ. అని పలుక రయంబున సత్యాశ్చర్యంబుగా నొక్క వెడనవ్వు
నవ్వి గగనవాణి నారదు నుద్దేశించి యి ట్లనియె. 78

—♦ ఆకాశవాణి నారదునిఁ దిరస్కరించి యొకకథ చెప్పుట. ♦—

క. నీ వెంతవాఁడ! వయ్యెదె
వావిష్ణునిమాయఁ బడినయార్యులలోనఁ
భావింప బ్రహ్మఋషి రా
జీవాసనరుద్రదివిజసిద్ధులలోనన్. 79

ఉ. ఏ మని పల్కితివి మునుల కెట్టులు నమ్మత మయ్యెదె మాయనీ
వేమెయి గెల్చి లోకములనెల్లను ముక్తుఁడ వైతివె విష్ణుమా
యామహితాబ్ధి నీకుఁ దరమాన తరింపఁగదె నిన్నుఁ బోలరే
యీమునులుఁ సురోత్తములు ని ట్లని పల్కి రెగర్వసంపదన్?

తే. పలికిపోయితిగాక! నీ పలికినట్ల
మాయఁ బడకుండ వచ్చునే? మౌనినాథ!
నీవుబలెనె ప్రతిజ్ఞలు నెఱపి పలికి
సిగ్గుపడిన మునీంద్రులఁ జెప్ప వినవె? 81

—◆ చండదమనుని కథ. ◆—

వ. ఒక్కకథఁ జెప్పెద వినుము. తొల్లి చండదమనుం డనుమునివరేణ్యుం డయోధ్యానగరంబునకుం బోయి మాంధాతచేత నర్చితుం డై యతని నగరంబునఁ గరితురగస్యందనసుభటసన్నాహసామగ్రియుఁ, గనకపీఠశయ్యాందోళికాచ్ఛత్త్రచామరవ్యజనంబులును, మణిమయాభరణాంబరపరిమళద్రవ్యసంపదయును, రూపయౌవనలావణ్యగుణగణ్యాం బగువిలాసినీవర్గంబును గలుగు టాలోకించి దేవేంద్రలక్ష్మికిం బ్రతినిధి యైన యన్నరేంద్రుని యైశ్వర్యంబునకు నిచ్చమెచ్చి యివ్విధంబున రాజ్యసుఖం బనుభవింపవలయు నని కోరి మరలి నిజాశ్రమంబునకు వచ్చి గంగాతీరంబున సంకల్పపూర్వకంబుగాఁ బద్మాసనుం గూర్చి సమర్చితపంచాగ్నిమధ్యంబున నుగ్రతపంబు సేయుచుండె నతని తపోవహ్నిజ్వాలాకరాళధూమావళి ద్యావాపృథివ్యంతరాళంబునం బంభోళివిద్యుజ్జలధారాడంబరంబు గావింప నిలింపులు భయభ్రాంతు లగుచుండ నట్టి సమయంబున నొక్కనాఁడు సనత్కుమారుండు వచ్చి యమ్మహాతపోధనునిచేతం బూజితుం డై యి ట్లనియె. 32

ఆ. ఓమహాత్మ! యింత యుగ్రతపోనిష్ఠ
యేమికాంక్ష నయ్యె నెఱుఁగవలయు
ననుడుఁ జండదమనుఁ డా బ్రహ్మసుతునకు
ననియె మనసుకోర్కి కొనలు సాగ. 33

ఆ. ఒక్కనాఁడు నే నయోధ్యకుఁ బోయి మాం
ధాతృధరణినాథుచేతఁ బూజి
తుండ నై తదీయమండితసామ్రాజ్య
విలసనంబు లెల్ల వేడ్కఁ గంటి. 84

సీ. సూర్యవాజులకంటె సొబగైన యుత్తమ
హయములఁ గంటి వాహ్యాళిభూమి
దిక్కరీంద్రములను దెగడు మత్తద్విప
చయముల ద్వారదేశములఁ గంటిఁ
జామరచ్ఛత్త్ర వీజన దీపికాందోళి
కాదు లాస్థానహర్మ్యములఁ గంటి
బహువిధపరిమళాంబరభూషణశ్రేణిఁ
బ్రకటితధర్మపేటికలఁ గంటిఁ

తే. బువ్వతల్పంబులును బువ్వుఁబోండ్ల యొఱపుఁ
జంద్రశాలాగ్రవేదులఁ జాలఁ గంటిఁ
గంటి మాంధాతరాజ్యసుఖంబు లెల్ల
నిందిరాసామ్రాజ్యవిభవంబు నేల చాలు ? 85

చ. మృగమదచందనద్రవము మెత్తిన బిత్తరి గుబ్బచన్నులున్
నగవు దొలంకుమోములు, ననంగనిశాతశిలీముఖంబులం
దెగడు కటాక్షకోణములుఁ దేటలమాటలుఁగల్గుకామినుల్
తగవుల నమ్మహీధవునిదండఁ జరింపఁగఁ గంటి వేమరన్.

క. ఆ లీలాసామ్రాజ్య
శ్రీ లాత్మకు నింపుఁ జేసెఁ జేసిన నాభూ

పాలుని క్రియ సామ్రాజ్య
శ్రీలన్ విహరింపఁ దపము సేసెద ననఘా! 87

వ. అనిన విని యతని దుర్విషయాభిలాషంబునకు వగచి సనత్కు
మారుం డిట్లనియె. 88

క. హరిమాయామోహాబ్ధిం
దరంగ సంఘంబులైన ధరణీరాజ్యం
బర పరిమళ భూషా స్త్రీ
వరవాంఛల మునుఁగ కుండువాఁడుం గలఁడే? 89

సీ. పటుధైర్యబాడబోత్కటవహ్నికీలయు
నాశాపయోధిపై ల్లణఁపలేదు
పరమశాంతి త్విషాంపతి మహారశ్మియు
నీహారతమము విరియింపలేదు
రూఢసమాధిగారుడమంత్రకళయును
దృష్ణాహివిషమూర్ఛఁ దెలపలేదు
ఘనతరవిజ్ఞానకలితదంభోళియు
దృఢకామనగము భేదింపలేదు
తే. లేదు సంసారవిషయకేళీవిరక్తి
బ్రహ్మరుద్రాదులకు నైనఁ బద్మనాభు
చరణసేవాసుధారసాస్వాదజనిత
చిత్సుఖానందసంధానసిద్ధి లేక. 90

వ. అని సనత్కుమారుండు వెండియుఁ బండదమునున కిట్లనియె.

ఉ. ఓడక, శీతవాతదవహానోష్ణభరంబుల నాఁడునాఁటికిన్
వాడి కృశించి యీగతి నవారణఁ జేయుతపంబు వ్యర్థమై
బూడిదెలోనిహోమమయిపోయెఁగదా యిటులైననక్కటా!
చూడవె యోగమార్గపరిశుద్ధమునీంద్రతపఃపరికారముల్?
తే. తగిలి బ్రహ్మంబు ముట్టంగఁ దపము చేసి
బ్రహ్మపదసౌఖ్యసంసిద్ధిఁ బాముకొనక
పాపసాంకర్యజనితభూపాలరాజ్య
పదసుఖంబులు గోరుతపస్వి గలఁడె? 93
శా. ఈజాడం దప మాచరించి తుది నెంతే మూర్ఖచందంబునన్
రాజత్వంబున నల్పభోగములు చేరం గోరు నే మాని ని
ర్వ్యాజబ్రహ్మపదైకసౌఖ్యములుపోవంద్రోచి,నీవెన్నఁడుఁ
'రాజాంతే నరకం వ్రజే'త్తనెడు శాస్త్రంబుల్ పరీక్షింపవే! 
క. ఆరూఢపాతకౌఘము,
దూరీకృతసత్య, మనృతదుర్లోభదురా
చారాది కితవ కృత్యముఁ
గోరుదురే రాజ్యసుఖముఁ గోవిదవర్యుల్? 95
క. సురుచిరసాత్త్వికమార్గా
చరణంబునఁ దపము చేసి సమధిగతానం
దరసాబ్ధిఁ దేలుచుండెడు
విరజస్తము లైన మునుల వినవే ధాత్రిన్? 96
తే. ధన్యసాత్త్వికయోగంబు దక్క నితర
విపులకర్మానుభవములు విష్ణుమాయ

విష్ణుమాయకు వెలియైన విరతి విరతి
మాయఁ గడచిన ముక్తి సమాధిఁ గనును. 97

వ. అని చెప్పి సనత్కుమారుండు సత్యలోకంబునకుం జనియెఁ దదనంతరం బాచండదమనుం డాబ్రహ్మసుతుని బ్రహ్మబోధ సుధాధ్వారం గదుగంబడి మోహాకళంకనిర్ముక్తం బైన మనం బున భూలోకసామ్రాజ్యసుఖంబులు దుఃఖభాజనంబులుగాఁ దలంచి సంసారసుఖానుభవసారం బైనవిష్ణుమాయావికారం బునం బొరయక ముక్తిపడయుట యిది యెంత పెద్ద యని యవ్విష్ణుమాయం దిరస్కరించి రాజ్యకాంక్ష యుడిగి మో క్షాపేక్ష నక్షయతపోనియతినున్నం గొన్నాళ్లకు నలువ సన్నిధి యై వరంబు వేఁడు మనినఁ బ్రాంజలియై యతం డిట్లనియె.

క. అత్యంతవిష్ణుమాయా
కృత్యము లగు సుఖము లెల్లఁ గీడ్పఱచి ననున్
సత్య మగుమోక్షపదవికి
నిత్యునిగాఁ జేయవయ్య నీరజగర్భా ! 99

వ. అని వేఁడిన నవ్వరం బీరామి యెఱింగి మునీంద్రా ! యేమి గోరి యీయుగ్రతపంబు చేసితి, వేమి యడిగెదు, ప్రకృతం బున ననుభవింపఁ దగినది విష్ణుమాయావిలసనం బైనసంసా రంబు, దానికిం దోడు రాజ్యసుఖం బనుభవింపఁ గోరి తపంబు నేసిన నీకు నది యనుభవింపక మోక్షం బేచందంబునం బడయవచ్చు? నది మున్ను నీ వనుభవించి తదనంతరంబు నిర్విషయాభిలాషం బగు మనంబున శుద్ధసాత్త్వికజ్ఞానం బవ

లంబించి విష్ణుభక్తివలన మోక్షంబు వడసెదవుగాని యిప్పు డీరాజ్యసుఖంబు కోరినట్ల యిచ్చెదం గొను మనిన నిర్వే దించి నీ విచ్చు వరంబు నేనొల్లఁ బొమ్మనిన నతం డంత ర్హితుం డయ్యెఁ గ్రిమ్మఱ విరూపాక్షునింగూర్చి తపంబు సేసిన. 100

క. సరసిజగర్భుని యట్లనె
హరుఁడుం బ్రత్యక్షమైన నమ్ముని యడిగెన్
హరిమాయావిలసనసం
సరణము వెలి యైనమోక్షసంపద వెలయన్. 101

క. అడిగిన నవ్వర మీరా
దుడుగుము నీకోరినట్ల యుర్వీరాజ్యం
బడుగు మన నొల్లకుండిన
మృడుఁడును దన యిచ్చ నరిగె మిన్నక యంతన్. 102

క. అమ్మునినాథుం డుడుగక
నెమ్మనమున నచ్చలంబు నిగుడుచు నుండం
గ్రిమ్మఱ రవిఁగూర్చి తపం
బిమ్ములఁ గావించుచుండె నిల చలియింపన్. 103

క. గొనకొని తప మేభంగుల
నొనరించినఁ బూర్వకర్మ ముడుగునె తన చే
సిన యంతవట్టు గుడువక
వనజాసన ముఖ్యదివిజవర్యుల కైనన్? 104

వ. అంతఁ గొంతకాలంబునకు సూర్యనారాయణుండును నన్ని

ధియై "మోక్షం బడిగిన రాదు, నీవు మున్ను చేసిన తపంబున సంభూతంబు లైన రాజ్యవైభవంబులు తరతరంబ నిన్నుఁ జుట్టిముట్టికొనం గాచి, కాలంబు వేచి యున్నయవి, కైకొని తద్భోగంబులఁ బరితుష్టి నొంది మఱి సాత్త్వికతపోనియమంబున హరి నారాధించి తత్ప్రసాదంబున మోక్షంబు వడయు"మనిన నమ్ముని యిట్లనియె. 105

క. అవి యెల్ల విష్ణుమాయలు
వివరింపఁగ వాని ననుభవింపు మనిన నా
తివిరినపూనిక దప్పద
యవి గైకొన నమృతపదవి నందఁగ వలయున్. 106

క. నే నొల్ల రాజ్యసంపద
నానిశ్చయ మిదియ; వినుము నలినప్రియ ! నా
పూనికఁ దప్పింపఁగలం
డే నీరజనాభుఁ డైన నిఁక నెట్లు నన్? 107

వ. అనిన నమ్మహామునిప్రతిజ్ఞఁ దప్పింపలేక కర్మసాక్షియుం బోయె, నప్పారికాంక్షి మత్సరంబు పెచ్చుపెరుఁగు మనంబున నెవ్వరిం గోరక యేకావధానపరమయోగాధీనమానసుండై విష్ణుమాయం బడక ముక్తి వడసి, హరిహరబ్రహ్మాదుల నిగ్గువఱిచి నిరుపమానందంబున విహరింతు నని యున్న నతనిఘోరప్రతిజ్ఞాతపంబులకునద్భుతంబంది నిఖిలబృందారకమునీంద్రబృందంబులును "విష్ణుఁ డితని, నేపదంబు నొల్లని వాని, సామ్రాజ్యపదంబునకుందార్చి తదనురాగభోగ మగ్ను

నిం జేయునొకో" యని వితర్కించుచుండునంత, హరి తన
యంతర్గతంబున. 108

ఆ. నిష్కళంక దివ్యనిర్వికల్పబ్రహ్మ
తేజ మైన యస్మదీయమూర్తిఁ
దలఁచి చిన్ముదమునఁ దనియు ధన్యుఁడు గాక
ముక్తుఁ డగునె యితరమూఢజనుఁడు? 109

క. ముని దన యభిమతవరమున
నొనరినసామ్రాజ్యలక్ష్మి నొల్ల నటన్నం
జనునే భూషాస్రక్చం
దనవనితాద్యనుభవములఁ దనియక యెట్లున్? 110

ఆ. ఒల్ల నన్న నితనియుల్లంబు రాజ్యసం
పదల వెల్లిఁ గొలిపి ముద మొనర్చి
యవల మోక్ష మిత్తు నని దివ్యచిత్తంబు
నందుఁ దలఁచెఁ దలఁచినంతలోన. 111

క. ఏమని చెప్పుదు హరిమా
యామహిమఁ దదాశ్రమంబు హాటకరత్నో
ద్దామగృహసౌధలసదభి
రామం బగు నొక్కపురవరం బై యొప్పెన్. 112

సీ. మదమత్తవేదండమండలగ్రైవేయ
ఘంటికాఘణఘణాత్కారరవము
నన్యోన్యసముపాశ్రితావిర్భవత్పటు
జవనోత్తమాశ్వహేషారవంబుఁ

కేళీసంచారకవికీర్ణకాంచనపుష్ప
రథవిభ్రమచ్చక్రరాజిరవము
నుద్దామదర్పభారోత్కటభటబిరు
దప్రశంసాలాపతరళరవముఁ

తే. బటహాభేరీమృదంగశంఖధ్వనంబు
సౌధవీథీవిపంచికాచారురవముఁ
గామినీపాదమంజీరకలరవంబుఁ
బ్రమద మొనరించె నమ్మహాపట్టనమున. 113

క. కేళీసరోవరంబులుఁ
గేళీవనవాటికలును గేళీగిరులుం
జాలఁగఁ గన్నుల కింపై
యాలీలాపట్టనమున నలరెం జూడన్. 114

చ. సురుచిరకేళిశైలమణిసుందరకందరకేళిలోలకి
న్నరకలగానమేదురనినాదము లంగజుఁ బ్రోదిసేయఁగాఁ
గరలుచుఁ గూర్మిదంపతులు క్రీడ లొనర్తురు పుష్పడోలికో
త్కరరమణీయహర్మ్యతలకాంచనవేదుల నప్పురంబునన్.

క. అగరుఘనసారకుంకుమ
మృగమదగోరోచనాదిమేళనమున మే
లగుపూవుల నెత్తావుల
నగరాపణవీథు లింపొనర్చుం బ్రజకున్. 116

## —◆ రాజమందిర వర్ణనము ◆—

వ. ఇవ్విధంబున నమరావతికిం బ్రతియై "యతికంఠపాశం"బను పేరనొప్పు నప్పురమధ్యంబునఁ గనకప్రాకారగోపురసౌధ చంద్రశాలామండపమణికుట్టిమ మార్గతోరణ మంగళ రంగ వల్లీ సముల్లసితంబును, కుల్యాసరోవరకేళిదీర్ఘికాతరంగచక్ర వాకకలహంససారసక్రౌంచసంచయక్రేంకార సంకులంబును, సవిధోద్యానవాటికాశాఖోణకుటజ చూతపనసరంభా ఖర్జూర నారికేళకురవకాశోకమాధవీయూథికాజాతి లతాది పల్లవ సుమనఃఫలరసోల్లసిత కలకంఠమధురశుకనికరకలకలంబును, కనకమణిమయద్వారకవాటదేహళీ జాజ్వల్యమానంబును, దౌవారికవేత్రదండ తాడన నిరుద్ధ సకలసామంతభూకాంత సమ్మర్దదుర్గద్వారదేశంబును, ప్రధానదండనాయకదుర్గాధ్యక్ష వీరభటసహస్ర సంశ్రితాస్థాన మండప సామ్రాజ్య లక్ష్మీ విలాసంబును,గంధగజతురంగశతాంగసువర్ణాందోళికాపర్యంక ఛత్రచామరసింహాసనోపశోభితంబును,గవాక్షశలాకాజాల కాయాత మందమారుత చలాచలీకృతవితానపుష్పమాల్యా లంకృతంబును,సంగీతతాళవాద్యహృద్యానవద్యనాట్యశాలా ప్రవర్తిత నర్తకీకింకిణీకంకణఝుణఝుణత్కారమనోహరంబును, కుచకుచనితంబభారాలసవిలాసినీసహస్రసంచారశుద్ధాంతమం దిరంబును నగురాజభవనంబున నొక్కపుష్పసౌధాగ్రమండ పంబున. 117

క. కనకమణిపీఠికం దనుఁ
దనప్రియకామినులు గొలువ ధరణీపతియై
ముని యుండెఁ గనకభూషణ
కనదుజ్జ్వలమూర్తి తోడఁ గౌతుకలీలన్. 118

క. ఏకాగ్రనిష్ఠతోడ ని
రాకులమతిఁ దపము సేయు నమ్మునిచందం
బే కైవడి నడఁగెనో నాఁ
డాకస్మిక మేమిచెప్ప నాహరిమాయన్! 119

క. ఆల దండ కమండలు వ
ల్కల జపమాలాజినములు ఖడ్గ క్రీడా
జలరుహ చీనాంబర మణి
వలయ కనకకంబళముల వైఖరి నొప్పెన్. 120

తే. మఱచెఁ దన బ్రహ్మయోగంబు మౌనివరుఁడు
కపటసామ్రాజ్యమదిరావికావలీల
నమృతవిజ్ఞానసరసి నోలాడుతలఁపు
మోహసంసారజలరాశి మునిఁగె నపుడు. 121

ఆ. మోక్షలక్ష్మిఁ గోర్కి ముడివడుచిత్తంబు
రాజ్యలక్ష్మిపై విరాళిఁ బడియె
యోగి ననదు బుద్ధి యుడిగి యాతపసికి
భూవరుండ ననెడు బుద్ధి వొడమె. 122

సీ. అవధారు! దేవ! చక్రాద్రిపర్యంతభూ
పతిశిరోమకుటపూజితపదాబ్జ!

జయ! మహారాజ! యష్టాదశద్వీపసం
స్థాపితశాసనస్తంభయూప!
విన్నపం బీశ! గర్వితశత్రురాజన్య
దర్పాంధకారమార్తండబింబ!
శేఖరు! సర్వజ్ఞ! సుస్నిగ్ధశివజటా
జూటగంగాభ యశోవిహార!
తే. యనుచుఁ బ్రాంజలులై వేత్రహస్తవరులు
కదిసి యర్థోపచారవాక్యములు వలుక
మహిమఁ గొలువుండె నాస్థానమండపమునఁ
జండదమనావనీనాథచక్రవర్తి! 123
క. శరణాగతు లగు రాజుల,
నరుదుగ గజవాజిభూషణాంబరగంధో
త్కరములు కానుక లొసఁగెడు
నరనాథులఁ జూచి మునిజనప్రభుఁ డోలిన్. 124
క. అరిషడ్వర్గము మనమున
నురురాజనవిభవములకు నుబ్బానరింపం
బరమదయాసత్యోక్తుల
పరిచయు మది యుడిగి పరుషభాషలు నేర్చెన్. 125
క. కొందఱకు నలుగు, మఱియొక
కొందఱిఁ గృప నాదరించుఁ, గొందఱిఁ బ్రోచున్,
గొందఱిఁ జెఱచుఁ బ్రభుత్వము
వంది నిజాజ్ఞాబలమున నవనీజనులన్. 126

సీ. దివ్యవిమానంబు తేఱఁగునఁ దే రెక్కి
తిరుగుచునుండు నాదిత్యుభంగి
మదగర్వరేఖతో మత్తవేదండంబు
నెక్కి భూలోకదేవేంద్రుఁ డనఁగఁ
బసిఁడిపుత్త్రికల సొంపెసలారు రత్నాల
పాలకి నెక్కుఁ బ్రాభవము మీఱ
హాయరత్నముల నెక్కి యాడించు నగళుల
నంగనామణుల కాహ్లాద మొనఁగఁ
తే. కేళిగిరికందరంబులఁ గ్రీడసలుపు
నుపవనంబులఁ జరియించు నుత్సవమున
నాట్యశాలల నుండు నానంద మొదవఁ
దనకు నింపైన విధమున ధరణివిభుఁడు. 127
సీ. కలకంఠి యొక్కతె కర్పూరతాళవృం
తముఁ ద్రిప్పుఁ గలికి నేత్రావు లీనఁ
దరళాక్షి యొక్కతె తాంబూలఖండోత్క
రం బిచ్చు మందస్మితంబుతోడ
నలివేణి యొకతె పదాబ్జముల్ పట్టుఁ గం
కణకాచఘుళఘుళత్కార మలర
మగువ యొక్కతె దండమణిపీఠముననుండి
మదనోన్ముఖము లైన మాట లాడుఁ
తే. కేళిగృహమున నవపుష్పడోలికాగ్ర
శాయి యై యున్న యమ్మహీనాయకునకు

నింపు నింపుదు రనురాగ మిగురుకొల్పి
చారులీలల శుద్ధాంతచంద్రముఖులు. 127

క. సమధికరాజ్యాంభోజ
ప్రమదాక్రీడామరందపానసుఖశ్రీ
రమణీయమధుకరం బై
పరిమదమ్మున నమ్మునీంద్రపార్థివుఁ డలరెన్. 129

క. వలసిన తొడవులు తొడుగున్
వలసిన గంధములు పూయు వలసినపుష్పం
బులు ముడుచు, నింపు సొంపుల
వలసినకాంతల రమించు వలసినవేళన్. 130

క. తాపముల కెల్ల నిల్లగు
భూపత్వముఁ గాముకత్వమును బెట్టిద మై
యేపార నతని యోగము
ప్రోవతెఁ బోఁకొత్తులోనిపోఁకయుఁబోలెన్. 131

క. హరిమాయామారుతమునఁ
దిర మగునే బ్రహ్మబోధదీపకళిక, త
చ్చరణధ్యానఘటంబున
వెరవున నెలకొలుపకున్న వెడఁగుమునులకున్? 132

క. తనపూనికయును, దనతప
మును, దనదుమహామునిత్వమును, బ్రహ్మసుతుం
డొనరించినమార్గము మఱ
చినయాతనిఁ జూచి జగము చిత్రము నొందెన్. 133

క. హరిమాయ గడవరా దని
పరమాశ్చర్యంబు నొంది బ్రహ్మయు శివుఁడున్
సరసిజవనబాంధవుఁడును
గర మభివర్ణించి రధికకౌతుకలీలన్. 184

—♦ సనత్కుమారుండు తిరిగివచ్చి, చండదమనుని బోధించుట. ♦—

వ. అంత. 185

ఆ. మరల నా సనత్కుమారుండు చండద
మను విధమ్ము చూతమనుచు వచ్చి
రాజ్యమహిమతోడి రాజసంబున నీదు
రేఁగుదెంచి పూజ లిచ్చువాని. 186

ఆ. రాచబూమె నున్న వాచంయమశ్రేష్ఠుఁ
జూచిచూచి మిగులఁ జోద్య మంది
విష్ణుమాయపెంపు వినుతించి వినుతించి
యనియె బ్రహ్మసుతుఁడు నతనితోడ. 187

ఉ. ఏమి మహానుభావ ! నిను నించుక మైన నెఱుంగనేర్తువే?
నీమునుపంటి రూప మది నీహృదయంబునఁ దోఁచుచున్నదే?
భూమిపతిత్వరాజ్యసుఖముల్ కరమిష్టము లౌచునున్నవే?
నీమన సెట్టు లున్నయది నిక్కము నాకెఱిఁగింపు నావుడున్.

వ. విని వెఱఁగుపడి యిది యేమొకో నన్ను నే నెఱుంగకునికి
యెట్లు, నామునుపటి రూపం బెయ్యది, నాకు భూపతిత్వ
రాజ్యసుఖంబులు కరం బిష్టంబులు గాకుండుట యెట్లు.
దీనికిఁ బ్రత్యుత్తరం బేమనియిచ్చువాఁడ నిమ్మహాత్ముని

వచనంబు లత్యద్భుతంబులై తోఁచుచున్నవి యని భయం
పడి ప్రాంజలి యై రా జిట్లనియె. 139

క. దేవమునీశ్వర ! యిది యే
భావంబున నన్ను నిట్లు పలికితి, నాకే
భావంబును దోఁపదు, నీ
భావంబున నున్న యట్లు పలుకు మహాత్మా ! 140

వ. ఏను రాజ నగుటయు నీరూపంబుదక్క మఱియొండు రూపంబు
లేకుండుటయు నెల్లరాజులకుంబలెనే భూపతిత్వరాజ్యసుఖం
బులు కరం బిష్టంబులగుటయు నెఱుఁగుదు నింక నెద్దియు
నెఱుంగ, మీచిత్తంబునం గలతెఱంగు నా కానతిచ్చి నా
మనఃకళంకంబు వాయంజేయు మనవుడు నవ్వి యవ్విరించి
నందనుం డిట్లనియె. 141

తే. చండదమన మహామునీశ్వరుఁడ వీవు
రాజ్యకాంక్షఁ దపం బొనర్పంగ, నిన్ను
మాన్చిపోవుట మఱచితే మానసమున
నాతపఃఫల లీల లియ్యవియె కావొ. 142

క. హరిమాయ యిట్లెఱుంగక
నిరసించి విరించిముఖుల నెఱిఁ గూర్చి తప
స్స్ఫురణమున మెలఁగఁ దగునే?
దురహంకారమునఁ జేయుదురె తప? మనఘా! 143

వ. పరమేష్ఠిపశుపతిపద్మబాంధవుల యానతిఁ గై కొని సాత్త్విక
జ్ఞానంబున మోక్షప్రదాయకు నారాయణు నారాధించుచు

నతఁ డేకొలందిఁ గర్మబంధంబు లనుభవింపఁజేసె నట్ల యను
భవించుచు నప్పరమపురుషునకుం బ్రియన్నుండ వైన నింత
మూఢుండ వై నిస్సారసంసారపంకమగ్నుండ వై యుండు
దువే? యింక నయిన నిష్కళంకహృదయుండ వై యీ
సామ్రాజ్యవికారంబులు హరిమాయాకల్పితంబులుగా నెఱింగి
హరిం దలంచి కృతార్థుండ వగు మని సనత్కుమారుం
డొనర్చిన బ్రహ్మోపదేశంబున. 144

క. జ్ఞానోదయ మగుటయు న
క్ష్మానీంద్రుఁడు సంచలించి మనమున భక్తా
ధీనుఁ డగు హరిఁ దలంచి కృ
తావళియై భక్తిఁ బులక లంకూరింపన్. 145

క. కరుణానముద్ర! ముద్రిత
దురితోదయ! యుభయకర్మదూర! మునీంద్రో
త్కరవాంఛాఫలద! మహా
పురుష! పరబ్రహ్మమయ! విభుత్వమహాత్మా! 146

మ. గతదుష్కర్ములు సంగవర్జితులు రాగద్వేషదూరుల్ మహా
మతు లాత్మీయతపోధి దైవముగ సమ్మానించి నిన్నాత్మసం
స్థితుఁ గావించి భజించి మోక్షపదముం జేకొంద్రుగా కిట్లు దు
ర్మతికి న్నా కెటు లబ్బునే నాతరమె నీమర్మం బెఱుంగన్ హరీ!

క. అగణితదుఃఖనిదానం
బగు సంసారమున కోప కలఁబడిఁబడు నా

వగ లుడిపి కావవే నను !
జగదేకశరణ్య ! కృష్ణ ! జలరుహనేత్రా ! 148

క. అని భక్తిపరవశుండై
కనుఁగవ నశ్రులు దొరుఁగఁగాఁ దను వినుతిం
చిన, భక్తవత్సలుఁడు హరి
యనుకంపాయత్తచిత్తుఁడై యావేళన్. 149

సీ. పుష్పవృష్టియుఁ దనభువన రక్షాదక్ష
కారుణ్యదృష్టియుఁ గడలుకొనఁగ
నప్సరోనాట్యవిన్యాసంబుఁ దనవన
మాలావిలాసంబు లీల మెఱయ
ననుకూలగంధవాహంబును దనసహ
జాంగగంధప్రవాహంబు నొలయ
సహచర సురమునీశ్వర తరళత్వంబుఁ
దనభక్తవత్సలత్వంబు నొరయ

తే. వినుత గంధర్వగానంబుఁ దనమనోజ్ఞ
భాషణస్వనమును వేడ్కఁ బొదలఁజేయ
దివ్యమంగళమూర్తియై దివ్యతేజ
మలరఁ బ్రత్యక్షమయ్యె నారాయణుండు. 150

తే. అబ్జనేత్రుండు ప్రత్యక్షమైనఁ దెలివి
గలిగి తొల్లింటి యట్టులఁ గాంచె మాని,
పుర నరేంద్రత్వ సామ్రాజ్య పరికరములు
వన మునీంద్రత్వ తపములై వఱలు చునికి. 151

క. సాక్షాత్కరించిన సరో
జాక్షుని శ్రీపాదములకు నానతుఁ డగుచున్
లక్షవిధంబులఁ బొగడెం
జక్షుస్స్రవదంబుబిందు సందోహముతోన్. 152

క. హరియును నప్పుడు మానీ
శ్వరుతామసభావ ముడిపి సాత్త్వికవిజ్ఞా
నరతిన్ మతిఁ గూర్చి తప
శ్చరణమునకు నియ్యకొలిపె సద్గతికొఱకున్. 153

క. అంత ప్రతిజ్ఞావంతుని
పంతము వారించి కర్మఫలముఁ గుడిపి య
త్యంతజ్ఞానం బొసఁగి య
నంతుఁడు సురవరులు గొలువ నరిగె నిజేచ్ఛన్. 154

క. ఈవృత్తాంతము విను స
ద్భావవిధేయులకుఁ గలుగు బ్రహ్మజ్ఞాన
ప్రావీణ్యంబును హరిమా
యావరణవిముక్తియును గృతార్థత్వంబున్. 155

మ. అని యయ్యంబరవాణి పల్కుటకు నత్యాశ్చర్యముం బొందిర
మ్మునుల్; శ్రీనారదుఁ డేమి చెప్పెదు మహామాయాంధకారం
బునం దవచిత్తంబు భ్రమింపఁగాఁ దెలివిఁ జెందక లేక దుర్మానసం
జనితక్రోధమునన్ హసించి పలికెన్ సర్వంసహాధీశ్వరా!

తే. పట్టఁ బసలేని యీబట్టబయటిమాట
కకట! బ్రమసితి రేకదా యనఘులార!

యామునీంద్రునివంటి మోహాతురుఁడనె
యేను ? సాదృశ్య మెఱుఁగ ! శ్లిష్టుఁగాక ! 157

క. న న్నెఱుఁగు విష్ణుఁ, డావిభు
పన్నిక లే నెఱుఁగుదుం బ్రపంచవికార
క్లిన్నత నాకుం గలదే ?
యిన్నిచదువులేల? మీర లెఱిఁగెదరు తుదిన్ ! 158

వ. అని హరిమాయ యెన్నక గగనవాణి నసత్యవాణిగా దూషించి, తనవిజ్ఞానమహిమ యెఱుంగుటకు నిమ్మును లెంత వా రని నిరాకరించి,వీరిముందటఁ బంతంబు పలుక నేల యని తనలోనఁ దన్నుఁ దానే ప్రశంసించుకొనుచు, వీడుకొని పోవనుద్యోగించునతనితలంపు గని మాయామునివేషధారి యగు నవ్విష్ణుండు చిన్నినగవు దొలంక బలువలకెలంకులం జిక్కిన మెకంబయ్యెఁగాక తా నింక నెక్కడకుంబోవంగలవాఁ డని యతనిచిందిలిపాటు మందలించి, కొలంది యెఱుంగక యభ్రవాణి పలికెంగాక, చందదమునందు భవత్సమానుం డేని యంతబుద్ధిమంతుండు మాయం బడునే?యది యట్లుండ నిమ్ము, మమ్ము బహుమానంబునేసి యీవేళ మాయాశ్రమంబున భిక్షనేయ వలయు నని ప్రార్థించిన నట్టకేల కియ్యకొని. 159

—◆ మాయామునియైన విష్ణుమూర్తి నారదుని మోహపుచ్చుట. ◆—

క. తన చేతియక్షమాలయుఁ
గనకమంతలువివంచికలుఁ గుంచెయు న

ల్లన నచటి రావిఁ దగిలిచి
ముని తీర్థంబాడు నియమమునఁ జనుదెంచెన్. 160

క. తన విజ్ఞానము తనతప
మును దనవిరతియును దన యమోహత్వంబుం
దను రక్షింపఁగ నోపునె
వనజాక్షునికరుణ దప్పివచ్చినవేళన్? 161

సీ. నారాయణోచ్చారణశ్రీవ్యదివ్యనా
దము వీణెయంద యంతర్భవించెఁ
జిదమలానందసంపద నాడునాట్యవి
హారంబు కుంచియ నాశ్రయించెఁ
దత్త్వవిజ్ఞానసుధారసపూరంబు
దొలఁకియాడుట కమండలువుఁ జెందె
బీజాక్షరన్యాసపృథులాబ్జదృఙ్మంత్ర
కళ యక్షమాలికఁ గడలుకొనియె

తే. నారదుని చిత్తమున నహంకారజనిత
నిబిడమోహాంధకారంబు నిండుకొనియె
విష్ణుమాయాపరిభంజనవిహతిచే వి
వేకదీపంబు మలుగుట వే నరేంద్ర! 162

వ. అట్లు కొలనికి డిగ్గి దానిచెలువు పరికటించుచు నాచమన పూర్వకంబుగా జలంబు ప్రవేశించి నాభిదఘ్నపయఃపూరంబున నిలిచిమహాకాళరాత్రిసమయాంధతమసంబున మునుంగు చంద్రసూర్యాదిజ్యోతిర్మండలంబునుం బోలెఁ దన విజ్ఞాన

ప్రాకారంబు విష్ణుమాయాపటలంబున మునుంగ సంసార సముద్రంబున మునుంగుటకు నీళ్ల మునింగె నప్పుడు. 163

క. జననాథ ! యరిదిసుమిూ
వనజాక్షునిమాయ పెంపు వర్ణింప సిలిం
పనికాయ కాయజాంతక
వనజాసన దివ్యమౌనివరులకు నైనన్? 164

—♦ నారదుఁడు కొలనిలో మునింగి స్త్రీ యగుట. ♦—

ఆ. నీటుపాఱియ మయ్యె నృపవర ! తొల్లింటి
తపముకలిమి యెల్లఁ దక్షణంబ
మునిఁగి లేచి భువనమోహనమూర్తితో
నలిననేత్ర యయ్యె నారదుండు! 165

ఆ. ఆమునీంద్రవేష మాబ్రహ్మవర్చసం
బామహత్త్వ మామహావివేక
మెల్ల నణఁగె శౌరియింద్రజాలంబున
వినుము ధర్మతనయ ! విస్మితంబు. 166

క. పాలకడలి నుదయించిన
శ్రీలక్ష్మియుఁబోలెఁ గళలఁ జెలువారుచు లీ
లాలసగతి వెలువడెఁ గొల
నాలీలావతి పసిండియంచయపోలెన్. 167

వ. మఱియు నజ్జలాశయంబున నీరు గ్రోలి వ్రాలిన నీలజలధర ఖండంబు లన నొప్పుపెన్నెఱుల కొప్పును, నీలజలధరఖండం బుదండఁ గన్నులపండువై యెసంగు చంద్రరేఖ యన విూఱు

నెమ్మొదురును, జంద్రరేఖ చెలిమిని జెంగటం జెలువారునీలోత్ప లమ్ము లనం జెన్నారునిడువాలుంగనుదోయియు, నీలోత్పలం బులవలనం దొరంగు మకరందపూరం బన విలసిల్లుతియ్య కెమ్మోవియు, మకరందపూరంబు పూరింప నిడినకనకకలశంబు లన నుల్లసిల్లుగురుకుచకుంభంబులును, గనకకలశంబులుమూ యం దెచ్చినపసిండిమూంకుళ్ల నందనరుమ్మృదులబాహామూలం బులును, బసిండిమూంకుళుల నిగుడుమెఱుంగుందీంగె లనన్ మెఱయుచేతులును, మెఱుంగుందీంగెలతళ్కు నం బ్రిదీపించు గగనం బనం దోంచు చిన్నినెన్నడుమును, గగనంబునం దొలంకియాడువేల్పుటేటికలికితరంగంబులతోంకునం బొంతం బైన సువర్ణసైకతం బనవెలయుజఘనంబును, సువర్ణసైక తంబుకెలంకున మొలచిన పసిండియనంటికొదమలనం బొదలు నునుందొడలును, బసిండి యనంటి కొదమల పొ్రిపున నొప్పు చెఱకువిలుకాని పువ్వుటంపపొదు లన ముదం బొనర్చుచిఱు తొడలును, బువ్వుటంపపొదుల నలంకరించినముక్తాఫలంబు లనం దేజరిల్లు పదనఖంబులును, గ్రిమక్రమంబునం గనంబడ నప్పుడంతి గట్టున వచ్చి నిలిచె నప్పుడు. 168

క. జలకేళి సలిపి వచ్చిన
పొలుపున వేఱొక్కపట్టుపుట్టముం గైచే
సి లతాంగి యంగకంబుల
నలరులసొమ్ములు ధరించి యలరెం జాలన్. 169

క. వనజాకరలక్ష్మియొ యు
ద్యానలక్ష్మియొ మరుని నెనసి వచ్చినరతియో
యన నవయౌవనలీలల
వనిత సరస్తీరపుష్పవాటిక నొప్పెన్. 170

సీ. ఒకమాఱు తనచరణోద్గతద్యుతులచేఁ
జరమసంధ్యాచ్ఛాయ ధరణి ముంచు
నొకమాఱు తనమేనియుజ్జ్వలప్రభలచేఁ
దీఁగెమెఱుంగుల దిశలు ముంచు
నొకమాఱు తన ముద్దులొలుకునవ్వులచేత
వెన్నెలఁ గాయించు విపినవాటి
నొకమాఱు తన మంచి యొఱపుఁజూపులచేతఁ
గలువ తోరణములు గట్టు నెదుటఁ
తే. పాడుఁ బూఁజొంపములమీఁద నాడు గందుఁ
దుమ్మెదలమ్రోఁత శ్రుతి గాఁగఁ దోయజాక్షి
కలికి జవ్వనమున కలంకార మగుచు
మదనలీలావికారసంపద దనర్చు. 171

క. ఆకొలని కెలన నాశ్రియ
నాకలికిచకోరనేత్రి యంగజలీలా
శ్రీకిఁ గరాళింపుచుఁ దన
లోకం బై పువ్వుఁ దోఁటలో విహరింపన్. 172

సీ. చంద్రకేతుం డను జగతీతలేంద్రుకు
మారుండు మదనావతారమూర్తి

వీరరత్నము జగద్విఖ్యాతమై యొప్పు
బిరుదాంకపుర మేలు బిరుదరాజు
చతురంగబలమహా సన్నాహసంపద
వేటమైఁ జనుదెంచి వికటదుష్ట
మృగబాధ లణఁగించి మగిడి యవ్వనమున
విడిసి తరుచ్ఛాయ విశ్రమించి
తే. కేళిమై గొడ్గుపావల గిలుకు లడర
నొక్కబాలుండు కైదండ యొసఁగ వచ్చి
యలరుఁదీఁగెవిధంబున నలరుచున్న
యలరుఁబోఁడి విలోకించెఁ గొలనిదరిని. 173
క. కని బిట్టుకట్టెదుర నా
జననాథసుతుండు నిండుజవ్వనమునకుం
దనుసౌందర్యంబునకును
దనలో నాశ్చర్య మంది తలయూఁచి యనున్. 174
శా. ఔరా! చన్నులచెన్ను! కన్నుఁగవతీరాహా! బళీ! వేణికా
భారశ్రీ! ముఖచంద్రబింబరుచి! చెప్పన్ వచ్చునే? చిన్నికా
నేరీతిన్ సృజియించె బ్రహ్మ? కటిసొంపెట్లుండెఁ! జారూరుశృం
గారం బెవ్వఁడు మెచ్చనేర్చు? నిదె పో కంజాక్షి యన్నన్ భువిన్!
క. కలికినునుసోగవెన్నెల
తళుకు గులుకు నవ్వు, నవసుధారసధారం
జిలుకు నునుఁబలుకు, పూములు
కులకలికలు దీని కన్నుఁగొన లగ్గలికల్! 176

ఉ. కొండల కీడు, జక్కవలకున్ సరి, మారెడుపండ్ల జోడు, వే
దండపకుంభతుల్యము, లుదంచితహేమఘటాభముల్, సము
ద్దండపయోజకోరకవిధస్ఫుటముల్, శశటాంగమూర్తి లీ
ఖండశశాంకఫాల కుచకాంచనచంపకపుష్పగుచ్ఛముల్. 177

తే. ఇంచువిలుకాని కేళిరాయంచకొదమ—
కాదు, మరుఁ డెక్కుఁ బట్టిన కలికిచిలుక—
కాదు, వన్నెలబొమ్మ కొక్కట విరించి
జీవకళ నిచ్చి నిలిపిన చెలువ చెలువ. 178

ఆ. లలితనీలమణిశిలాక యూ నూఁగారు
నిలిపెఁగాక నలువ నిలుప కున్న
గురునితంబబింబకుచకుంభభరమున
వెలఁది యనదు నడుము విఱుగ కున్న. 179

తే. మానసీరాశరోన్మాథిమందరంబు,
ధైర్యకందనిశాతకుద్దాలధార,
మర్మకంచుకకర్తరి, మహితబోధ
వనజచంద్రిక, యీయింతివాలుఁజూపు. 180

సీ. అమృతాంశుఁ డెంత దానము తా నొనర్చెనో
పోలఁతినెమ్మోముతోఁ బోల్పఁబడియె
నళు లెట్టి పుణ్యాటవుల నిష్ఠ మెలఁగెనో
యింతిపెన్నెఱులకు నీడువచ్చెఁ
దమ్ము లెన్నెన్ని తీర్థంబులం దోఁగెనో
నతి కాల్గలుఁగన్నులసాటి నొందె

గజము లేక క్షేత్రమార్గముల వర్తించెనో
చెలి నడకకు సరి చెప్పవలసె.

తే. గాంచనము భూమి నేమేమి కర్మములకు
వచ్చెనో చానమైచాయ వన్నెకెక్కెఁ
జిలుక లేనత్యవాక్యముల్ పలికినవియొ
యబలమధురోక్తులకు నవ తయ్యె నిపుడు. 181

వ. అని బహుప్రకారంబుల దాని యభినవయౌవనసౌందర్య విలాసంబులు చూచి చూచి, చూపానిన నేచి, ధైర్యంబు తొలంగం ద్రోచి, యాచంచలాక్షిని డాయంబోయి, తన చక్కఁదనంబునకుఁ జిక్కిన తలంపుచూపు గని, యను రాగంబు నెరయ, నెఱజాణతనంబు గల తగవుమాటల నొడంబఱిచి, కైకొని తనపురంబునకుఁ గొనిపోయి యభిమత రతిక్రీడలం దేలుచుండె. 182

క. కొడుకుల నూర్వురఁ గనె న
వ్వడఁతుక సౌందర్యనిధుల బాహాబలులన్
గడిమి గలవారి; వారుం
గడఁగిరి వివిధాస్త్ర శస్త్ర కౌశలలీలన్. 183

క. పతిమేలు సుతులకలిమియు
నతులిత సామ్రాజ్య వైభవాభ్యుదయంబున్
సతి యైన నారదునకున్
బ్రతిదిన సంతోషసిద్ధి వరఁగఁగఁ జేసెన్. 184

క. శంసారిరచితమాయా
సంసారపయోధి మునిఁగె సన్ముని, భూపో
త్తంస! విను నీమఱందిఁ బ్ర
శంసింపఁగఁ దరమె పద్మజాతున కైనన్? 185

వ. ఇవ్విధంబున నపరిమితైశ్వర్యవిలసితంబు లగుసామ్రాజ్యవైభవంబులును, మన్మథావతారుం డగు ప్రాణేశ్వరుండును సుగుణవంతు లగుకోమాళ్లునూర్వురు, ననుఁగుంగోడం(డ్రు),ననుకూలదాసదాసీజనంబులును, మణిమయకనకవిభూషణాంబరసక్చందనతాంబూలచంద్రశాలావిహారపుష్పశయ్యాదులుఁగలిగి యప్పుడంతుక తనయభినవసౌందర్యంబునకుం దగినవైభవంబున నే వెలితియు లేని సంసారంబు సేయుచుం గొంతకాలంబు పరివర్తించు చుండె నంత. 186

—♦ చంద్రకేతునిమీఁదికి జ్ఞాతి దండెత్తి వచ్చుట. ♦—

మ. వినఁ జిత్రంబుగఁ జంద్రకేతుని భుజావీర్యంబు నైశ్వర్యమున్
గొనసాగం గని యోర్వఁజాలక మదిం గోపించి తద్జ్ఞాతినం
దనుఁ డొక్కండు ఫణీంద్రకేతుఁ డను భూనాథుండుదండెత్తి వ
చ్చె ననేకోద్భటవిక్రమక్రమనటత్సేనాసహస్రంబుతోన్.

ఉ. వచ్చినఁ జంద్రకేతుఁడు నవార్యబలంబులఁ గూర్చి పేర్చి కా
ర్చిచ్చు మిణుంగురుల్ సుతులు చేఁదఱ రేఁగి రథాధిరూఢులై
చెచ్చెర సంభ్రమించుటకుఁ జిత్తమునన్వికసింపమెచ్చుచున్
వచ్చెఁ బురంబు వెల్వడి పరివల్గదనర్గళధైర్యసంపదన్. 188

క. పతిఁ బాయలేదు సతియున్
సతిఁ బాయఁగ లేదు పతియు సమమమకార
స్థితిఁ గావునఁ బతిఁ బాయక
సతియును జనుదెంచె సమరసంపదఁ జూడన్. 189

వ. ఇట్లు ప్రాణేశ్వరీసమేతుం డై యుభయపార్శ్వంబులఁ బ్రతాప దీపితు లగు కొడుకులు ప్రచండకోదండభుజాదండు లై సంపూర్ణబాణతూణీరంబులతో రత్నకవచశిరస్త్రాణంబులు వెలుంగారఁ దేరు లెక్కి యొక్కతలంపున నుక్కుమీఱి యేతేర ననేకకనకరథకదంబంబులును, బహుకోటిఘోటక వ్రాతంబులును, బంధురమదాంధగంధసింధురబృందంబులును నేల యీనినట్లు వెల్లివిరిసిన కాలుబలంబులు నెడలేక నడువం బుడమి గంపింప వచ్చి మచ్చరంబునం దనపై నెత్తి వచ్చిన ఫణీంద్రకేతుండును, దానును సమయంబు చేసికొని సర్వవరక్షేత్రంబున నారీరూపంబున మున్ను నారదుం డుద యించినకొలంకు కెలంకున విడిసి రప్పుడు. 190

ఉ. సేనలు రెండు నిల్చి రథసింధురసైంధవసద్భటోద్భట
ధ్వానము దిక్కటాహముల వ్రక్కలు సేయ నుదగ్రహేతిసం
తానరుచుల్ వెలుంగ గగనంబునఁ గేతనపంక్తు లాడఁగాఁ
బూనిక నిల్చె మోహరము భూరిభయంకరలీలఁ గ్రాలఁగాన్.

ఉ. భేరులమ్రోఁతయున్, సుభటభీకరహుంకృతులుం గరీంద్రఘీం
కారతురంగహేషలు, నఖండరథోత్కటనేమిరావముల్

బోరుకలంగ దిగ్గగనముల్ గబళించె ధరాపరాగ మ
ప్పోరు గనంగ నచ్చెరువుపుట్టె వియచ్చరకోటి కత్తఱిన్.

వ. ఇట్లు రెండుబలంబులు మెఱసి చలంబునం బోరుచుండ నభో
మండలంబున నప్సరోంగనలు నిలిచి కన్నులపండువుగాఁ
జూచి వలసినవీరపురుషుని వరియింపం దివురుచుండి రప్పుడు.

ఉ. కొండలు వజ్రపాతమునఁ గూలుక్రియన్ రథికాళిచేత వే
దండము, లబ్ధిభంగముల తాఁకున నోడలువోలెఁ దేరులు
ద్దండమదేభ చండతరదంత హతిం బడఁ దుండెతుండెమై,
పాండుకులేశ ! యశ్వములపాటును గాల్వురచావు నేమనన్ ?

క. కొండలవలెనే వచ్చు న
ఖండగతిన్ మంచువలెనె కడపల విచ్చున్
రెండుబలంబులుఁ దమ వే
దండ తురంగమ సుభటరథప్రకరముతోన్. 195

వ. అట్టి సంకులసమరసమయంబునననమానశౌర్యదోర్వీర్యంబుల
నెదిరి, యెదిరి బలంబులం దఱిమి, ప్రతివీరయోధ
సముద్దామదారుణ బాణపాతంబులఁ గోఁడుకులు నూర్వురు
నొక్కపెట్టునంబడినఁ, గనుంగొని, పుత్రశోకంబునం దజ్జనని
రథంబుపైఁ బడి మూర్ఛిల్లిన నెట్టకేలకు మూర్ఛఁ దేర్చి
కార్చిచ్చు నిదాఘసమయంబునం గాఱడవుల దహించు
చందంబునఁ జంద్రకేతుండు ఫణీంద్రకేతుని యుగ్గరంబు
నుగ్గునూచ గావించిన. 196

తే. ఆడె నట్టలు పెక్కు, రక్తాంబునదులు
పాఱె, భూతంబు లార్చె, నభస్థ్సలమున
కెగసెఁ బెంధూళి యవ్వేళ; నేమి చెప్ప !
భువన సంక్షోభకర మయి పొల్చె రణము. 197

చ. కొడుకులు నూర్వురుం బడినఁ గోపముదుఃఖమునంకురింపఁ బె
ల్లడరుచు నాత్మసైన్యనివహంబుల నోర్చుచుచంద్రకేతునిం
దొడరి లయాంతకాకృతి నెదుర్కొని పేర్చి ఫణీంద్రకేతుఁ డా
యెడఁ దునుమాడెఁ దద్బలము నెల్ల నొకండును జిక్కకుండఁగన్.

క. బల మెల్ల నడఁచి యాతని
బల మెల్ల నడంచి సురలు ప్రస్తుతి సేయం
దలఁ దున్మెం చె నప్పరస లా
తలఁ బూవులు చల్లి పెల్లు తాండవమాడన్. 199

వ. ఇట్లు ఫణీంద్రకేతుండు చంద్రకేతు నింద్రనికేతనంబున కనిచి విజయశంఖంబు పూరించి చతురంగబలసహస్రంబులు గొలువ మహాసన్నాహంబునం జని యతని సామ్రాజ్యంబు గైకొని యేలుచుండెఁ దదనంతరంబ. 200

క. రణమండలహత గత దా
రుణవీరవ్యూహదేహరుధిరాసారో
ల్బణలతనుతఁ దీర్ఘమాడ న
రుణుఁడు సనియె నపరగిరి గుహింకెఁ బ్రొద్దపరాబ్ధిన్. 201

ఆ. ప్రొద్దు గ్రుంకుమున్ను పురుషుండు వడుటయే
ప్రొద్దు గ్రుంకినట్లు పొగులువతికిఁ

గదిరె భీకరాంధకారంబు దృష్టి, శో
కాంధకార మాత్మయందుఁ బోలె. 202

—♦ యుద్ధభూ వర్ణనము. ♦—

సీ. కలిన భీకర ఫేరు కంక గృధ్రి వ్రాత
కలహా పరస్పరకలకలంబు
భగ్నర థా యుధప్రకర కేతన వేణు
వీణా శకలచూర్ణవిషమతలము
రక్తప్రవాహా సంసిక్త శిరః కబం
ధ కరాంఘ్రి తనుఖండ దారుణంబు
కంఠగతప్రాణ కరటి ఘోటక భట
చటుల ఘూత్కార నిశ్వాసభరము

తే. నయిన రణమండలమున నయ్యబ్జవదన
కన్నకొడుకులపై నిజకాంతుపైఁ బ్ర
భూత దుఃఖార్తయై పడి పొరలి పొరలి
వేలుపులఁ దిట్టుచును బలవింపఁ దొడఁగె. 203

ఆ. ఎన్నిపాట్లఁ బడియె సీనారదుఁడు పద్మ
నేత్రు మహిమఁ గనక నీరసించి
ఘనుఁ దిరస్కరించు కలుషచిత్తుఁడు పుణ్య
ఫలము పొలిసి యెన్నిపాట్లఁ బడఁడు? 204

క. హరిమాయలోన నకలము
పరిమగ్నం బైన యట్లు బంధురతిమిర

స్ఫురణమున నడఁగె నఖిలము;
హరిభక్తులు వోలెఁ దార లడరుచు నుండన్. 205

—♦ చంద్రోదయవర్ణనము. ♦—

క. నారదముని యజ్ఞానము
దూరంబై పోవఁ దెలివి దూకొనుమదిలో
నీరీతి ననెదుపగిది న
పారతమం బడఁగ నమృతభానుఁడు పొడిచెన్. 206

ఉ. నారదమానికిన్ నలిననాభుఁడు సన్నిధి యైనఁ బైపయిన్
భూరికృపాసుధారసము పొంగెడు కైనడిఁ బొంగెఁ జంద్రికా
సారము తత్ప్రమోదమున సంయమికోటి చెలంగునట్లు చా
కోరకముం జెలంగె మదికోరిక లుల్లసిలంగ నెల్లెడన్. 207

—♦ సూర్యోదయవర్ణనము. ♦ —

వ. అంత. 208

చ. నలినవిలోచనుండు కరుణానిధి క్రమ్మఱ సుప్రసన్నుఁడై
నలినభవాంగజాతునిఘనం బగుతొల్లిటి బ్రహ్మవర్చసం
బలఘుతమం బడంచుదయ నంతయుఁగూడఁగఁజేసి తెచ్చెనా
నలినహితుండు దోఁచె నలినప్రకరోల్లసనంబు మీఱఁగన్.

వ. ఇట్లు సూర్యోదయం బయ్యె, నయ్యరుణకిరణపరంపరల
రక్తపంకపంకిలం బగు నమ్మహారణమండలంబు తేటచూడ
భయంకరంబై యుండె, (నట్టియెడ) నెండకాఁకున విరవిర
వోవుచు వాడఁబాఱు మైదీఁగెయు, ధారాకారంబున నెడ
తెగక చన్నులపయిం దొరంగు కన్నీరును,విరిసి కన్నీళ్లఁదడిసి

ముసుంగు పడిన పెన్నెఱులును, గ్రొవ్వేడి నిట్టూర్పులం గందిన కెందలిరాకుమోవియును, జేరుగడ లేక యేకాకులంబై కుందుడెందంబును గలిగి దైన్యంబు పెంపునం గంపించుచుం, దోడు లేమి నెద్దియుం జేయనేరక, పలవించుచుండి, చండ మరీచిమండలంబు నుప్పరంబున కెగసి నిప్పు లుమియం జెప్ప రానిదప్పియు నాఁకలియు నుప్పతిల్ల, నోర్వలేక యక్కలువ కంటి నలుదిక్కులుం గలయ నాలోకించి. 210

క. ఆ చేరువ హరికృప మా
యాచూతం బొకటి దట్టమై సొంపారం
జూచి బ్రతుకాస విడువక
యాచల్లని నీడ కేఁగి యత్తరుశాఖన్. 211

క. చేరువ ఫలమొకఁ డుండఁగఁ
గోరికతోఁ జేయిసాఁచి కోయుదు ననుచుం
జేరి యది యంద కించుక
దూరం బైయున్న యబల దుఃఖిత యయ్యెన్. 212

వ. ఇట్లు దుఃఖించి వెండియుఁ జేయిసాఁచి పండు గోయనుంకిం చుచు నేవిధంబునం గోయుదు నని తిరిగితిరిగిచూచుచుఁ, జెట్టెక్కి కోయనేరక యాఁకటిచి చ్చాగ్రహం జాలక చచ్చిన కొడుకులలో నొకని నీడ్చుకొనివచ్చి యచ్చట వైచి వాని పై నెక్కి, కోయంబోయి, యందక వ్రేలెఁడు గడమయైన, మఱియు నొక్కనిఁ దిగుచుకొనివచ్చి వానిపై వైచియెక్కి కోయంబోయిన, నప్పటియట్ల యందకున్న, మానక యా

క్రమంబున నూర్వురుకొడుకులం దెచ్చి దట్టిగాఁ జేర్చి యందఱపైని మగని వైచి మగని ఱొమ్మెక్కి కోయంబోయి యప్పటియట్ల యందఱ యమ్మాయాచూతఫలంబు నిర్ధాత ప్రియత్నంబైన నచ్చెరువంది కుందుచున్నసమయంబున, నొక్కవృద్ధబ్రాహ్మణుండై నారాయణుండు, నారాయణ! కృష్ణ! కృష్ణ! కృష్ణా! యనుచుఁ జెమ్మటలు దొరఁగ నలసిన వాఁడునుంబోలె వచ్చి, యాచెట్టునీడ నిలిచి, క్రొన్నెత్తురుల జొత్తిలులోకంబైనకోకతో నేకతంబ శవనివహంబు నెక్కి మృత్యుదేవతయుంబోలె నున్నయన్నీలవేణిం జూచి తల యూఁచి యాశ్చర్యంబునం బొందుచు దానితో నిట్లనియె.

క. ఇది యెక్కడి శవనివహం?
బిది యేటికిఁ గూడఁబెట్టి యెక్కితి? వీఁక నె
య్యది యాచరింపఁ దలఁచెదు?
సుదతీ! నినుఁ జూడ భయముఁ జోద్యము నయ్యెన్. 214

—● వృద్ధబ్రాహ్మణునితో స్త్రీ తన వృత్తాంతము చెప్పుట. ●—

తే. అనుచుఁ బలికిన నపుడు బ్రాహ్మణునిపలుకు
చెవులు సోఁకిన నొకకొంత సేదఁదేఱి
చెప్పె వృత్తాంత మెల్ల నాదిగురుఁబోణి
దైన్యసంభూత బాష్పాంబుధార దొరఁగ. 215

వ. అట్లు చెప్పిన. 216

క. విని నవ్వి ధర్మనందన!
వనరుహదళలోచనుండు వనరుహదళనం

జనితమరందము చాద్పునఁ
గనుఁగొనలం గరుణ దొరుఁగఁగా నిట్లనియెన్. 217

వ. అబలా! నీకు నీకర్మంబు పురాకృత కర్మంబునఁ బ్రాప్తించిన యది, యింక దీనికి వగవం బనిలేదు. పోరికలన నిట్టి పుత్ర రత్నంబులును మనోవల్లభుండును బుణ్యలోకంబునకుం బోవుట కన్నులారం జూచియు నెవ్వరిం జూచి ప్రాణంబులు నిలుపుకొని, క్రమ్మఱ బ్రతుక నాసపడితివి? పండు దిన నోరి కెల్లు చవియయ్యె? విడువు మీదురాశ, యిది శైవాహి తపోవనం బీ వనంబున ఫలం బశుచు లగు వారి కంట రాదు. తత్ఫలాపేక్ష యుడిగి పీరలకుం బరలోకసంస్కారంబు లొనర్చి యాత్మేశ్వరునికై దహనముఖంబున నీదేహంబు విసర్జించి భువనంబులు నుతింప దివ్యమూర్తి వగు మీచేరువ నొక్కకొలను చూపెదఁ దీర్థం బాడి నత్తువు గాని రమ్మనిన సమ్మతించి యమ్మగువ శవనిహంబు డిగ్గి డగ్గఱి డగ్గుత్తిక తోఁ బ్రాంజలియై యిట్లనియె. 218

తే. విప్రపుంగవ! ప్రత్యక్షవిష్ణునట్ల
నన్నుఁ గృపఁ బ్రోవ వచ్చితి, నాదుపూర్వ
పుణ్యమును నేఁడు ఫలియించె, బోయె దుఃఖ
మనఘ! నినుఁ జూచినపుడ శ్రీహరియ సాక్షి. 219

తే. మానవిభుఁడైన పెనిమిటి, మానధనులఁ
గొడుకులను గోలుపోయితిఁ బడితి నిడుమ

సరిగదా! యీఁడుజన్మంబు చాలు, నాఁడు
జన్మ మే నొల్ల నేడేడు జన్మములకు! 220

సీ. సకల సంపదలతో సామ్రాజ్య మేలితి
మనసార మగనితో మదనకేళి
సౌఖ్యంబు లెల్లను జలిపితిఁ గొడుకులఁ
గంటిఁ బెంచితిఁ గడు గారవమునఁ
గనుసన్నఁ గోడండ్రు పనిసేయ దాస దా
సీజనంబులు పనిసేయుచుండ
రాజసంబున నుంటిఁ గ్రిమ్మఱ నిటువంటి
సంసార మరనిమునంబులోన

తే. సమసెఁ గలగన్నగతి నింద్ర జాలమట్లు
వేసరితి నింక నీయాజ్ఞఁజేసి కడఁకఁ
దీర్ఘమాడి నావిభున కీదేహ మిచ్చి
దివ్యరూపంబు గై కొందు దివిజు లలర. 221

క. మోహము విడిచితి విను మీ
దేహముపై నాస విడిచితిని నీసత్య
వ్యాహారామృతపానో
త్సాహంబునఁ బరమధర్మతత్త్వజ్ఞమణీ! 222

వ. అని పలికిన, నమ్మహీసురేంద్రుండు తనవగ లుడుపుచుఁ
దోకొనివచ్చి సరోవరంబు చూపిన. 223

* తీర్థమా డాత్మవిభువకు—వ్రా. ప్ర.

క. వారిజలోచన గనియెన్
వారిజకహ్లారకైరవ శ్రీకరమున్
వారిరుహాకరము న్నవ
వారిరుహామోదగంధవాహోత్కరమున్. 224

క. దేవనదీ ముఖ్యమహా
పావనతటినీ సరః ప్రభావం బెల్లం
బోవిడినవాఁడుసుమ్మీ
యావనజాకరము గాఁగ నచ్యుతుఁ డధిపా! 225

ఉ. చల్లని మందమారుతము చల్ల, నిజాంగము చల్లనైన ను
త్ఫుల్లమనోంబుజాతయయిపూర్వకృతోత్కటదుష్కృతంబుల
ల్లల్లన జాఱ నీళ్లదరి క ల్లలనామణి చేరఁ బోయి శ్రీ
వల్లభుఁ డయ్యెడన్ విహగవల్లభు నెక్కఁబ్రసన్నుఁడౌటకున్.

చ. వనరుహ గర్భుఁడున్ శివుఁడు వారిజబంధుఁడు దేవబృందమున్
సనకసనందన ప్రముఖ సంయములున్ జనుదెంచి పద్మలో
చనుని భజించుచుండిరి బిసప్రసవాకరతీరభూమి మానినియ
యి యున్న నారదమునిం గని యవ్విభు మాయ మెచ్చుచున్.

తే. చిత్రతర కపటనాటక సూత్రధారి
శౌరి నాఁ డాకొలంకునఁ జానఁ జేసె
మగుడ నేఁ డీకొలంకున మానిఁ జేయు
నతని మాయకు నిది యెంత యద్భుతంబు? 228

వ. వెండియు నాపుణ్యసరోవరంబునఁ బూర్వకర్మనిర్ముక్తయై యొ
నర్చి దుఃఖమాలిన్యస్వరూపం బగు నాఁడురూపంబుమాన్పి

తొల్లింటియట్ల నారదునిఁ బరమయోగీంద్రునిం జేసి యతనికి సాత్త్వికబ్రహ్మోపదేశం బొసంగి కరుణించు నారాయణుని భక్తవత్సలత్వంబు చూడవలయు నని గరుడగంధర్వసిద్ధ విద్యాధరాదులు నంతరిక్షంబున శంఖకాహళమృదంగవేణు వీణాదివాద్యంబుల నాయితంబు చేసికొని వచ్చి పొడసూపి నిలిచిన నప్సరస్స్త్రీలు లీలాపుష్పకాధిరూఢలై తత్పార్శ్వంబులఁ బసిండిపళ్లెరంబుల నిడుకొని తెచ్చిన మందారపుష్ప మంజరులు సమయం బెఱింగి చల్ల నుండి రట్టియెడ నప్పంకజాక్షి కొలంకుఁ జొచ్చి కన్నీళ్లు దుడిచికొని పుక్కిలించి యుమిసి కట్టినచీర వదలిచి కలయం దడుపుకొని క్రమ్మఱఁ గట్టుకొని కుచకుంభప్రమాణపయఃపూరంబున నిలిచి నారాయణ నారాయణేతి వచనపూర్వకంబుగా మునింగిన. 229

క. హరిమాయ యేమి చెప్పుముఁ?
దరుణీమణి నీళ్ల మునిఁగి తత్క్షణమాత్రన్
సుర లచ్చెరుపడ లేచెన్
నరనాయక ! దివ్యమౌని నారదుఁ డగుచున్. 230

క. నారదుఁ డా సరసి మునుఁగ
వారిజదళనేత్ర వెడలె; వడి నీ సరసిన్
వారిజనేత్రి మునుంగఁగ
నారదుఁడై వెడలె! నిట్టినైపుణి గలదే ? 231

క. ఆకొలను పొలఁతిఁ జేసెను
నీకొలనుం బురుషుఁ జేసె నిరుగొలఁకులు లో

కై కాశ్చర్యకరంబులు
శ్రీకరములు వాంఛితార్థసిద్ధికరంబుల్. 232

క. పాండు కులేశ్వర ! విను మ
య్యండజపతిగమనుచేత నా సర్వపురీ
మండలిఁ దనరెన్ నారద
కుండిక యొకఁ, డొకటి ముక్తికుండిక యనఁగన్. 233

వ. అప్పుడు. 234

— నారదునకు నారాయణమూర్తి ప్రసన్నుఁడౌట. —

ఉ. మాయ యెడల్చి దివ్యమునిమండలముల్ దనుఁజేరికొల్వఁగాఁ
దోయదముక్తమైన దివిఁ దోఁచు సతారకచంద్రు నట్ల నా
రాయణుఁ డార్త రక్షణ పరాయణచిత్తుఁడు దోఁచె ధారణీ
నాయక ! దివ్యయోగి యగు నారదమౌనికి సుప్రసన్నుఁడై.

చ. కురిసిరి పుష్పవర్షములు గుంపులు గుంపులు గట్టి దేవతా
తరుణులు శంఖకాహళ మృదంగ ముఖధ్వను లుల్లసిల్ల నం
బరమునఁ దత్సరోవర సముంచిత కాంచన పద్మగంధ బం
ధుర మృదులోర్మిశీతల మనోహర వాయువు వీచె నింపుగన్.

క. పాడిరి గంధర్వాధిపు,
లాడిరి రంభాదు,లంబుజాసనసుతునిం
జేడియ రూ పుడిపి హరి
వ్రాడీశ్వరుఁ జేసినట్టివనజాక్షుకడన్. 237

శా. జేజే యంచుసురల్ భజింపఁగ,మునిశ్రేష్ఠుల్ నుదుళ్లం గరాం
భోజాతంబులు చేర్చుచుం బొగడ, నంభోజాస నేశాన పం

తేజాప్తుల్ పరమాత్ముఁడంచుమదిఁదర్శింపంగనాస్వామియా
తేజోరాశి మురారి కోటిరవిదీప్తిం బొల్చె భూవల్లభా! 238

సీ. పావనశ్రీపాదపంకజంబున మరం
దస్యందమై సురతటిని దొరుఁగ
నిర్మలతరదేహనీలమేఘంబునఁ
గ్రొమ్మెఱుంగై సిరి యెమ్మెచూప
ముఖచంద్రమండలంబునఁ జంద్రికానమం
బై సుధా సుమధురహాస మెసఁగ
పటుశిరః పూర్వాద్రిఁ బద్మాప్తబింబమై
పాటలరత్నకిరీట మొప్ప

తే. శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గముఖ్య
వివిధ దివ్యాయుధములు బాహువుల వెలుఁగఁ
జారుభూషణదీప్తిపుంజంబు దనరఁ
దేజరిల్లెడు హరిఁ గాంచి దివ్యమౌని. 239

క. ఆనిండుఁ గొలను వెలువడి
యానారదుఁ డేఁగుదెంచి హరిఁ గాంచి సుధాం
భోనిధి నుదయించు సుధా
భానునిక్రియ సురచకోర పంక్తులు చెలఁగన్. 240

సీ. నారాయణేతి నినాదామృతముఁ జల్లు
మహతీశె భుజముపై మనసు గరఁపఁ
నానందరసవీచికాకృతిఁ గుంచియ
మఱియొక్క భుజమున మరులుకొలుప

మోక్షలక్ష్మీహారముం బోనిపటికంపు
జపమాల కర్ణదేశమున వెలుఁగ
బ్రహ్మవిద్యా సుధాపరిపూర్ణకలశంబు
నాఁ గరంబునఁ గమండలువు దనర
తే. నమ్మహామాయ మెచ్చుచు నరిదిపడుచుఁ
దన్నుఁ దా నవ్వుకొనుచు సంతసముతోడ
నారదుఁడు వచ్చి వేవేల నతు లొనర్చె
గరుడవాహనుఁడైన శ్రీకాంతునకును. 241

ఉ. వేయువిధంబులం బొగడు,వీణియ మీటి నటించుఁ,బాడు,జే
జేయును,నవ్వు,నద్భుతముఁ జెందుచు నాఁదలయూచుఁజూచున
మ్మాయ సడల్చి దేవమునిమండలి గొల్వఁగ నున్నయాదినా
రాయణదేవు మోము దరహాసరసామృత సుప్రసన్నమున్.

వ. ఇట్లు తద్దర్శనానందసుధాసరసీతరంగంబుల నోలలాడుచు నభివందనసహస్రంబు లాచరించుచుఁ బ్రాంజలియై బ్రహ్మాది దేవముఖ్యులు దత్తకర్ణావధానులై విన నద్దేవదేవు నుద్దేశించి.

ఉ. మూఢులు నీచవాదముల మునఁగి వెన్కయుఁదోఁపకున్న దు
ర్గాఢతమోహతాత్ము లయి కానరు కానరు, బ్రహ్మయోగవ
త్ప్రౌఢులుశాస్త్రదృక్కులయిబ్రహ్మమయున్నినుఁగాన,రన్న
చోఁబ్రీతియులేదు నాకిఁక ధరిత్రి నినుం గనలేమి నచ్యుతా!

ఉ. జాతియు రూపు నామములు సంభవనాశనముల్ సుఖార్తిసం
భూత వికృత్యవస్థలును బొందక యెందునులేక యుంటయుఁ

నేతృత గల్గియుండుటయు నిత్యతఁబాయఁగలేక యొప్పు నిర్
జాతు లవిద్యఁ బాసిన విశుద్ధమతుల్ నిరతంబు నచ్యుతా!

చ. సమత భజింపనేర్చి విరజస్తములై నిజసాత్త్వికత్వమున్
శమమును గల్గి నిత్యమును సత్య మనంతము జ్ఞాన మాత్మ త
త్త్వము నని వేదశాస్త్ర విదితం బగు నీవిభుసుప్రసన్న తే
జముఁ గని చిత్సుఖామృతరసజ్ఞతఁ గాంతురు ధీరు లచ్యుతా!

సీ. పద్మయు విధియు నీపత్రికృతి పంకజరజః
పటలంబునను బ్రింగి బ్రమసినారు
మృత్యుంజయుండును మితిలేని నీమహా
మాయాతమోరాశి మగ్నుఁడయ్యె
వంయముల్ నీయింద్రజాల దుర్గాటవి
జాడ యెఱుంగక జాల్మలైరి
వేదవేత్తలు నీయవిద్యావిహారసం
గతికి నేమేరయుఁ గానలేరు

తే. మతవివాదులు త్వన్మోహహతులు; నిన్ను
ఘనుఁడు నీభక్తవర్యుఁ డొక్కరుఁడు దక్క-
నెఱుఁగువా రెవ్వరో యింక నెఱుఁగ వారి
తామరసనేత్ర! దివ్యతేజోమహాత్మ! 247

—♦ { నారాయణమూర్తి నారదునకు దివ్యదృష్టి దయచేసి శ్వేతద్వీపమునకుఁ బోవుట. } ♦—

చ. అని తనుఁ బ్రస్తుతింపఁగ దయానిధియై నిజదివ్యరూపముం
గనియెడు దివ్యదృష్టి యిడి కంజదళాక్షుఁడు దేవకోటితోఁ

జనియె సువర్ణ్యకామినులు చల్లెదు పువ్వుల సోనతోన యీ
మునియును గొల్చి రా, భువనమోహనసీఖికిఁ దెల్లదీవికిన్.

క. నా విని నారదుఁ డిట్లను
భూవర ! యింతయు నిజంబు భువనము లెఱుఁగున్
గోవిందశర్మ సాక్షా
ద్గోవిందుం డితనిఁ బొగడఁ గొలఁదియె మనకున్. 249

మ. హరికిం బ్రాణసఖుండుతత్ప్రియపయోజాక్షీమణుల్ వేడ్కతో
వరుసన్పూజలొనర్చుదైవము జగద్వంద్యుండు వేదాగమాం
తరతత్త్వజ్ఞుఁడు పూజసేయుమితనిన్ ధాత్రీశ!యీసంయమీ
శ్వరసాహస్రముపంపున న్మది సరోజాతాక్షుఁగాఁజూచుచున్.

ఆ. ఇతనిఁ బూజసేయు టిందిరానాథునిఁ
బూజసేసినట్లు బుద్ధిఁ దలఁపు
కువలయేశ ! వినుము ! గోవిందశర్మచే
నేఁడు ధన్యమయ్యె నీగృహంబు. 251

వ. అని పలికిన నమ్మహామునిపలుకు లంగీకరించి సభాసదు లగు బ్రహ్మమునుల యనుమతంబున ననేకమణిమయాభరణాదు లర్పించి పూజించిన ధర్మనందను నభినందించి, జగద్వంద్యుండును, జగదేకనాథుండును, జగదేకశరణ్యుండును, జతుర్విధ ముక్తిదాయకుండును,జతుర్వేదవేద్యుండును,నిగ్రహానుగ్రహ సమర్థుండును, భక్తవత్సలుండును నగు నీముద్దుమఱంది కృష్ణుండె స్వయంప్రకాశపరబ్రహ్మవస్తువిలసనంబుగా భావించి కృతార్థుఁడవు గ మ్మని బ్రహ్మోపదేశంబునేసిన, ధర్మనంద

నుండు, పరమవిజ్ఞానంబుతో నానందరసమయం బగు మనం
బున మాయామానుషవేషధారి యగు శ్రీకృష్ణుని జగన్మో
హనమదనగోపాలశ్రీరాధికామాధురీలోలలీలారూపంబు పర
బ్రహ్మస్వరూపంబై తోఁచిన రోమాంచకంచుకితదేహుం
డై మోదప్పొంగేలుదోయితో నిట్లని స్తుతించె. 252

దండకము.

జయజయ! నవకామగోపాల! శ్రీరాధికామాధురీలోల!
లీలాజగన్మోహనాకార! కారుణ్యపుణ్యోదయాధార!
దూరీకృతాత్మీయసద్భక్తనిస్సారసంసారసంతృష్ణ! శ్రీ
కృష్ణ! శ్రీదేవకీపుత్ర! లోకత్రయానందకందంబునందంబు
నై యొప్పు బృందావనీవీథి గోవర్ధనాద్రీంద్రవేదండ
గండస్థలీ నిస్సరద్దానధారాకళిందాత్మజాసింధు తీరంబునం
దత్తరంగావళీజాత మందానిలవ్రాతలోలప్రఫుల్ల ప్రసూన
భ్రమద్భృంగ సంగీతలీలా లసత్పారిజాతావనీజాతమూ
లోజ్జ్వలచ్చారుచింతామణీ వేదికామధ్య సంశోభిత స్వర్ణ
పద్మంబునం బద్మరాగోన్నమత్పాదుకాగ్రంబున న్నిల్చి
వ్యత్యస్తపాదారవిందంబుతోడం త్రిమూర్త్యాత్మకంబైన
మువ్వంకతో మూఁడువేదంబులు న్నివ్వమై మూఁడు
లోకంబులంగల్గుమేలెల్లను న్నివ్వమై చూపులం బుండరీక
చ్ఛదంబుల్ వెదల్ చల్లుచున్ బాలసూర్యాతి దేహప్రభల్
రత్నమంజీరకాంచీలతా ముద్రికాకంకణ వ్యక్తముక్తావళీ

కౌస్తుభస్వర్ణ కర్ణావతంసారవింద ద్వయీ కుండల స్థూల నాసాగ్ర ముక్తాఫలోద్యత్కలాపాది నానాపరిష్కార కాంతిచ్ఛటాశ్రీలతో మేళవింపంగ రంగత్కిరీటాగ్రి మాణిక్యకోణంబులన్ సాంద్రతేజోమిళచ్చంద్రికంబుల్ చలింపంగ సొంపారఁగా నొ్దలం జుట్టుకొన్నట్టి మాయూరపింఛంబు క్రొమ్మించుఁ దళ్కుల్ పిసాళింప, సర్వాంగ సంసక్త కాశ్మీర కర్పూర కస్తూరికాగంధసారాంగరాగంబు సౌరభ్య మాగుబ్బతిల్లన్, లసత్ఫాలభాగంబునం జిత్తజాతార్ధచంద్రాస్త్రముంబోని కస్రంపుఁ దిర్నామముం గ్రాల, నొయ్యార మై వన్నెమీఱం బదార్వన్నె బంగారు కెంబట్టుకట్టాణిముత్యాల ముంగొంగురింగుల్ కటిన్ జౌకళింపంగ, సంపెంగలున్ బైఁడిగేదంగులున్ మేలిచెంగల్వలున్ సజ్జకం బైన గొజ్జంగలున్ జాజులున్ మున్నుగాఁ గల్గు పూగుత్తులుం గ్రొత్తవన్నెల్ పచారింపఁగన్ శ్రీతులస్యాయత స్రగ్వితానంబుతోఁగూడఁ జూడాంఘ్రి పర్యంత సౌందర్య ధుర్యామరద్రూపమానోల్లస ద్దైవ జయంతీవిలాసంబు శోభిల్ల నుత్ఫుల్లవక్త్రాబ్జమందస్మిత శ్రీసుధాసారసారస్య మువ్పొంగ, శృంగార వారాన్నిధిన్ దేవదేవేంద్రముఖ్యామరానీక సేవ్యంబు భవ్యంబు నవ్యంబు దివ్యంబు నై యొప్పునీయొప్పు కందర్పసౌందర్యదర్పంబు గుప్పించి విప్పారు ; నీదివ్యతేజోలవం బబ్జమిత్త్రుండు, నీదీప్తిలేశంబు సప్తార్చి, నీమందహాసాంకురం బిందు

బింబంబుగా, భవదభినవరూపలావణ్యలీలావరోహంసిరైు కామకేళీరిరంసారతిక్రీడ నీతోడఁగూడున్న రాధావధూటీ లలామంబు రాకాసుధాధామ బింబంబునం జంద్రికారేఖ లేఖావనీజంబునం జిన్నిపూఁదీగె, మేఘంబునన్ లేమెఱుం గంబుజాతంబునం దేఁటి నా మిక్కిలిం జక్కనై కోర్కులం దేల నాలింగనప్రేమమై వామదోఃకంజ మంసప్రదేశంబునం జాఁచి మేలారు వాలారు కెంజాయకుం దావికిం జిందులాడంగఁ గ్రీడాపయోజాత మాడింపుచుం గెంపునింపుల్ప్రచారింప నింపారు నీచిన్నిమోవిన్ సుధాబిందునిష్యందముల్ జిందఁగా వేణునాళంబు పొందించి కేల్దమ్మి జోడొక్కచో నీడుగాఁ గూడఁగాఁ బట్టి సద్రత్నవన్ముద్రికాజాలలోలాంశువుల్ మోమునం దాండవింపంగ లీలాంగుళీపల్లవన్యాసవైచిత్రిఁ దద్రంధ్రమార్గంబులన్ మంద్రముఖ్యస్వరోదారమానంబులన్ వార్తి సప్తశ్రుతుల్ మేళవింపంగ నింపార వాయింప నీవేణునాదంబుపుట్టించు నుత్కంఠచేఁ గఃతనాదాభినందత్ప్రికల్ గోపికల్ పార్శ్వభాగంబులంజోకగా మక్కువన్ జొక్కుచున్ సోలుచున్ వ్రాలుచుండంగ, నొండొండ నీకేళిగోపాలకుల్, మించి వాయించు నీపిల్లఁగ్రోల్నేర్పు లేర్పాటు గావించు నానాదానుమోదంబునం గ్రీడమై నాడునాగంబులుం బోలెఁ బూర్ణానురాగంబునం జంచలత్పింఛభరింఛోళికాశ్రీవెలార్పం దలల్ ద్రిప్పుచున్ దత్ప్ర[illegible]తంబుఁ దా రభ్యసింపంగ,

నన్యోన్యచిత్తాభిలాష క్రియల్ చెప్పుకొంచుండఁ, బశ్చా
త్ప్రదేశంబునఁ డాసి రోమంథముల్ మాని ప్రేమాను
బంధోత్కటత్కర్ణమై స్వర్ణభూషా మిళద్బిందువచ్ఛృంగ
కోణాగ్రమై దివ్యమాణిక్యపుష్పస్రగాబద్ధమై కామధు
గ్ధేనుబృందంబు గానామృతస్యంద మానందముం బొందు
చుఁ గ్రోల, నుర్వీనుహాశ్మైలపాషాణమాణిక్యజాలంబు
లుం జాలువాఱంగఁ దాఁ బాడుటల్ దక్కనిక్కంపుఁ
బ్రేమంబునందొట్టి పెన్నీటినీటై ముదం బంది కాళింది
మందానిలాందోళ నోత్తుంగ రంగ త్తరంగై కహస్తంబు
లం దత్పదాంభోజముల్ కౌఁగిలింప న్మృగంబుల్ ఖగం
బుల్ నిజగ్రాస కాంక్షన్విసర్జించి మోదింప వైరాగ్య
చిత్తాదృతశ్రీ వనశ్రీ చలత్పల్లవోష్ఠంబునం గోరకోల్లాస
హాసంబు భాసిల్లఁ బూగుత్తి పాలిండ్లపైఁ దత్పరాగోత్త
రీయంబు జాఱన్ భ్రమద్భృంగదృగ్జాలకంబుల్ నివాళిం
ప, నవనవమణికాంతిమ త్పుష్పకారూఢ లింద్రాది
దిక్పాల నాళీకనేత్రల్ సురస్త్రీలు గంధర్వకాంతామ
ణుల్ నాగకన్యల్ మహాసిద్ధ విద్యాధరాబ్జాననల్ దేవ
వారాంగనల్ వేణువీణామృదంగాదివాద్యధ్వనుల్ తాళ
మానంబులన్ మ్రోయఁగాఁ దావకీనస్ఫురద్వంశసంపూర్ణ
సంగీత జాతస్మరస్ఫీత చేతోవికారంబులన్ బాడుచున్
మేఘపంక్తిన్ దటిద్వల్లికల్ వోలెఁ జెల్లాడుచు న్మేఁ గగు
ర్పాటు మ్రాన్పాటు వాటిల్లఁగా నుబ్బు నాగుబ్బుగాఁ

బుష్కలాంభోద మామోదవత్పుష్పవృష్టుల్ ప్రవర్షింప
హర్షంబునం బంచభూతంబులుం బొంగ నాకాశగంగానదీ
పంకజాతాక్షి దా నంతరిక్షంబునం జక్షురుత్సాహ మే
పారఁ బ్రిత్యక్షమై నిల్చి యందంద బంగారుకెందమ్మి
పుష్పాళ్లుపైఁ జల్లఁగా జల్లనై మెల్లనై గందపుంగొండ
మందానిలాంకూరముల్ మీఁదఁ బాఱాడ నల్లాడు
పూదండలు న్వేణుదండంబునన్ వ్రేలుపూగుత్తులు న్మె
చ్చుపుట్టింప సొంపారు నీయాకృతి శ్రీసముద్దామ సీమంత
సిందూర రంజ త్పదాంభోజ మందాకినీ సన్మరందావగా
హాకుల బ్రిహ్మయోగీశ్వ రేందిందిరవ్రాత సంప్రీతి యా
దివ్య తేజోమయఖ్యాతి యానంత తానందలీలాసుధాం
భోధిసంరంభకృద్వక్త్రిచంద్రోదయం బామహానిత్య
సత్యాకృతి శ్రీనయం బాజగద్రక్షణోత్ఫుల్ల వేల్లత్కృపా
దృష్టి యావేణుదండ స్ఫుటోష్ఠ ప్రసవన్మాధురీవృష్టి యా
యా నవారంభ మావిభ్రిమాడంబరం బామహారాజసం
బా రసజ్ఞత్వ మాభవ్యమాయామను ష్యావతార క్రి
యాలీల లాలించినర్ లోనఁ గీలించిన న్వాంఛితార్థంబు
సిద్ధించునంచుం దగ న్వేదవేదాంతవేదుల్ పరబ్రిహ్మ
విద్యావివాదుల్ ఘనుల్, సరసిజభవరుద్రి దేవేంద్రిము
ఖ్యుల్ సుఖప్రాప్తికై నీకు వాక్పుష్పపూజల్ సమర్పించి
నీవే పరబ్రహ్మయోగీంద్ర హృద్ధ్యేయచిద్వస్తువిస్తార మం
చుం బ్రశంసింతు రంచున్ శ్రుతుల్ చెప్పఁగా విందు

గోవింద నీ కేళిబృందావనక్రీడ త్రైలోక్యసామ్రాజ్యలక్ష్మీ కళాప్రాప్తి కిం జాడ, నీవేణునాదంబు బ్రహ్మైక నాదంబు, నీభద్రకందర్పగోపాలరూపంబు సద్భక్తహృచ్చంద్రశాలా ప్రదీపంబు; నీరూపలావణ్యలీలావిలాసంబు నీమందహాసంబు నీవక్త్రచంద్రప్రసాదంబు నీయాశ్రితాయత్త చిత్త ప్రమోదంబు నీవేణువిద్యావిశేషంబు (నీగోప) గోపాల నారీ మనోహారివేషంబు నీచొప్పు నీయొప్పు డెందంబులం (బెక్కుచందంబులం) దోఁచు వారే కదా (ధన్యులున్ బుణ్యులున్ గణ్యులున్?) శ్రీశుక బ్రహ్మయోగీంద్రుఁ డాత్మ ప్రకాశ ప్రమోదంబుఁ(గా నీదు రూపంబుఁ) బ్రేమంబుతో (నాత్మలో)నిల్పి యూహించు (మోహించు) నుంకించు (నంకించు) భావించు (సేవించు నెల్లప్పుడున్;) నీవు "నే నీవు" గానట్లుగాఁ గోరికల్ చేరికల్ సేయ లీలా వనీ (కేళులన్ గోపికల్ గోపకుల్ దేవ) దేవు న్నినున్ గూర్చి (తా రాత్మఁబ్రేమించి భావించి సేవించి) లోకైకసంపత్కళాభోగభాగ్యంబులం (గాంచి మోదించి; రత్యంతసద్భక్తితో రక్తితో నెమ్మి) నిన్నాత్మ భావించు నీవారి కెవ్వారి కేమేమి నీ వీవు? నీవంటి కారుణ్య సంపాది, నీవంటి దాక్షిణ్య సంమోది, నీవంటి భక్తావనాయత్త చిత్తుండు, నీవంటి యిష్టార్థదానప్రవృత్తుండు, నీవంటి నిత్యుండు, (నీవంటి సత్యుండు,) నీవంటి సంసారతాపత్రయాభీలరుగ్దివ్యవైద్యుండు, నీ వం టి

వేదాంతవేద్యుండు, నీవంటిమాయాజగన్నాటకప్రక్రియా
సూత్రధారుండు, నీవంటి విశ్వైకదృగ్జన్మహానాకారరేఖా
విహారుండు, లేఁ డాదిమధ్యాంతపర్యాయకాలంబులుం
గాలమును గాల చక్రక్రియాకృన్మహాపూరుషుండు న్మహా
మాయయుఁ సృష్టియుఁ నీవ నీయింద్రజాలంబు విశ్వ
ప్రపంచంబు పంచాస్త్రగోపాలకృష్ణా ననుంబ్రోవుమీ
భక్తిముక్తిప్రదా మాధవా రాధికామాధవా దేవదేవా
నమస్తే నమస్తే నమస్తే నమః. 253

వ. అని సన్నుతించిన నమ్మహామునిమండలమధ్యంబున నున్నట్ల
యప్పుడప్పుండరీకాక్షుం డదృశ్యగోచరం బైనయట్లయిన నందఱు
జయజయధ్వానంబు లొనర్చిరి. దివిజపుష్పవర్షంబులు గురిసె
నంత నతనియందలి భక్తి కభినందించి (ధర్మనందనుండు)
గోవిందశర్మను వీడ్కొలిపిన (నతండును) ద్వారకానగరంబు
నకుం బోయి శార్ఙ్గపాణియాలింగనాది సంభావనలు గైకొని
యుండెఁ; నారదాది యోగీంద్రులును, నమ్మహామునీంద్రులు
ను ధర్మనందను దీవించి యాతనికి గోవిందశర్మ యుపదే
శించినబ్రహ్మోపదేశంబు తమతమక యుపదేశించుటగాఁ
దలంచి హరిని సంస్మరింపుచుఁ దమతమనెలవులకుంబోయిరి.
ధర్మపుత్రుండును సహోదరబంధుమిత్రవ్రాతంబుతో హరి
నారాధించుచు సమస్తసామ్రాజ్య లక్ష్మీవిభవంబు లనుభ
వించుచు సుఖంబున నుండెఁ నని పరీక్షిన్నరేంద్రునకు శుక
బ్రహ్మ చెప్పుటయును. 254

మ. నలినోద్భూతసుతోల్లస త్కనకవీణా బ్రహ్మనాదామృతో
చ్ఛలవీచీప్రకర ప్రఫుల్లహృదయాబ్జాత స్రవత్సత్కృపా
*కలనామందమరందపారణమిళత్కౌతూహలాక్రాంత ని
శ్చల భావోజ్జ్వలనిత్యముక్త మధులిట్చక్రోపకంఠక్షమా! †

స్రగ్విణి. సామజప్రస్తుతా! సన్మునీంద్రార్చితా!
హైమపీతాంబరా! స్వాంఘ్రిపీతాంబరా!
కామలీలాకృతీ! కౌస్తుభాలంకృతీ!
కోమలాస్యాంబుజా! కుందదంతవ్రజా! 256

క. వేదాంతతత్త్వనిశ్చయ
వేదిమనోవేద్య! మదన విద్యాలీలా
మోదితరాధాముఖకమ
లోదరతాంబూలరస సముత్సుక హృదయా! 257

ఇది శ్రీమదన గోపాలచరణకమల సేవాధురీణ సత్కళాపారీణ
కృష్ణభట్టారకపౌత్ర చింతలపూఁడి కామయప్రభుసుపుత్ర
సుకవివర్య రాధామాధవ యెల్లనార్య ప్రణీతంబైన
విష్ణుమాయానాటకంబునందు సర్వంబును
పంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



* కలనాచారుమరందపోషితమిళత్కౌతూహలక్రాంతిచే
వలనొప్పం నినుఁగొల్చి భక్తజనులున్ వర్ణింత్రు నిన్నెప్పుడున్. వ్రా. ప్ర.

† శ్రోతల్చక్రోపకంఠక్షమా. వ్రా. పా.